# భూతగ్రహము

( మొదటి భాగము )

శ్రీ గుంటి సుబ్రహ్మణ్య శర్మ
గ్రంధ రచన

కవిరాజహంస - కవికులాలంకార
శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు
గ్రంధ సంపాదకులు

పు న ర్ము ద్ర ణ
15 జ న వ రి 1956

ము ఖ చి త్ర ము
(శ్రీ) వడ్డాది పాపయ్య

అ చ్చు : : : : :
రా జే శ్వ రి ప్రె స్.
రా జ మ ం డ్రి.

# భూతగృహము

## ప్రథమ భాగము—మొదటి ప్రకరణము

### చంద్రికారాత్రి

రవీంద్రున కిప్పుడు నలువది
వర్షముల ప్రాయము, ఆతఁడొక సుప్రసిద్ధుఁడగు పత్తేదారు. ఈ వృత్తిచే విశేషధనము నార్జించి పావన భాగీరథీప్రాంతమున నొకయుపవనంబును తన్మధ్యభాగమున మనోజ్ఞ భవనరాజంబును నిర్మించుకొనెను. అతని నిలయమున కానుకొని కొన్ని ధనికులసౌధపంక్తులు గూడఁ గలవు. రవీంద్రుఁ డనవరతంబును పూతగంగాప్రవాహ సంజనితతరంగసుస్వనముల నాలకించుచు, నా ప్రకృతి విలాససౌందర్యములఁ దిలకించుచు మందానందమునఁ గాలము నెట్టుచుండును. తన జీవితావధియం ...కముం జిన్నఁడు నెట్టిగందరగోళము నందును బ్రవేశింపక పోయిగ ...ంటిపట్టుననే భార్యాసమేతముగ సుఖముగఁ గాలముఁ గడుపుచు ...సాగరమును దరింపవలెనని యాతని కోరిక. కాని యాతని ...యపరాధరహస్యభేదనశక్తి యద్వితీయ[illegible]యుండుటచే నట్టి శాంత ...వనమున కవకాశము దొరకకుండెను. ఎప్పుడు నేదియో యొక్క

నేరము వచ్చి యాతని పాలఁ బడుచునే యుండును. నెల దినములకుఁ బూర్వము రవీంద్రుఁడు కలకత్తాయం దిరువురు శిశువుల హత్యఁ గావించిన యొక స్త్రీపిశాచి యొక్క నివాసమును గనిపెట్టి మిగుల విఖ్యాతి నార్జించెను. నాఁటినుండి నుత్తెట్టి పనియును లేక ఇంటివద్దనే యానందముగఁ దిరుగాడు చుండెను. అట్టి విశ్రాంతినే యాతఁడు సదా వాంఛించుట. కాని దాని నిచ్చువా రెవ్వరు?

రాత్రి— అకళంక చంద్రికాలంకృత రాత్రి —నిశ్శబ్దయుతముగఁ దరలిపోవు చుండెను. అనంతభువన నాటకరంగమున నేఁడు నిశాంక మతి మాధుర్యయుక్తముగ నుండెను. నాటకభవనమునందలి విద్యుద్దీపికవోలె సుధాంశుఁడు షోడశకళావిర్భూతుఁడై వెలుఁగొందు చుండెను. ఆకాశ వీధి యందలి తారకానిచయ పంక్తులు తన్నాటక ప్రేక్షకులు వోలె మెఱయు చుండెను. ప్రథమాంకమునఁ గాలపురుషుఁ డనివార్యుఁడై జంతుసముదాయములపైఁ దన సమ్మోహనాస్త్రమును బ్రయోగించి తిరుగాడు చుండెను. శస్త్రబద్ధములై ప్రాణికోటులు భూతలమునకుఁ బడిపోవు చుండుటఁ గాంచి నిద్రాదేవి తన యొక్క వాళిని వానిని జేర్చుకొని జో కొట్టుచుండెను. ప్రకృతి కాంత నిశ్శబ్ద గేవలిని నీ చిత్రమును గాంచుచు విలాస విహారమును సల్పుచుండెను. అత్తఱి మందమలయానిలుఁడు మాటిమాటికి నాపైపై చేయి వైచి తట్టుచు తనస్త్రీత్వము గావించు చుండెను. సురనదీ జలములందు నమృత కిరణుఁడు కిల కిల నగుచు దాగుడుమూఁత లాడుకొను చుండెను. ఆ రాత్రిని—ఆ కోమల సుధావసు సమాశ్రితమంజుల దేదీప్యమానమైన యా రాత్రిని—ఎంతని వర్ణింతుము? అంతయు నయనానందకరము!! అవాచ్యభావసంపూరితము!!!

ఆ నిశీథమున జా[illegible]తీరమున నిరువురు పురుషులు కూర్చుండి [illegible] ముచ్చటించు కొనుచుండిరి. అందులో నొకఁడు [illegible]

రవీంద్రుఁడు. రెండవవాఁడాతని బావమఱఁది యగు రామనాథుఁడు. ఆతని కిప్పు డిరువది వత్సరములు. తన బావ యొద్ద నీ రహస్యాపరాధ పరిశోధక విద్య నభ్యసించు చుండెను. ఎప్పుడో విషయములందు రవీంద్రున కాతఁడు కుడిచేయి వోలె పనిచేయు చుండెను.

ఆ రాత్రి వా రిరువురు నిద్దుర రామిచే విలాసార్థముగ వచ్చి యటఁ గూర్చుండిరి. వారిపాదములు ప్రవాహజలమున మునిఁగి గలగల మని శబ్దమును చేయుచుండెను. ఆ సైకతస్థలమున మందమారుత స్పర్శ బ్రహ్మానందమును దలఁపించు చుండెను. రామనాథుఁడిట్లను చుండెను, "బావా! మొన్నటి నేరము కడుంగడు నద్భుతముగ నుండెను కాదా! అబ్బా! నారీపిశాచి యగు యామినీ కృత్యము లత్యంత భయావహములు!"

రవీం : రామనాథా! దాని చేష్టలఁ దలఁచుకొన్న నా కిప్పటికిని మేను పులకరించును. ఈ నేరమున నేఁ జూపినంతటి సాహసమును మఱెందును జూపి యుండ లేదు. అప్పటి నా శక్తిని దలఁచుకొన్న నాకే యాశ్చర్య మగుచున్నది.

రామ : దాని మాయలోఁ బడి మనము చాలదినముల వఱకు గత్యంతరమును గానక మిగుల వందురుచుంటిమి కాదా? అనాఁడరణ్యమునకు మన మేఁగక యుండిన నీ విశాల భూవలయమున నిఁకముందు దాని యునికిని గాంచ నేరకపోయి యుందుము.

రవీం : అవును. ఇప్పుడు దాని ప్రశంస యేఁటికి లెమ్ము. ఇటు చూడుము, రామనాథా! ఈ చిత్రప్రపంచసృష్టిలో సర్వేశ్వరుని యాశయ మేదియో చెప్పుము చూతము.

రామనాథుఁ డది విని పక్కున నగెను. రవీంద్రుఁడు కూడ హాసించెను. "బావా! దీని నెవరు చెప్పఁగలరు?" అని రామనాథుఁ డనెను.

రవీంద్రుఁడు మాటాడ లేదు. బాలకుఁడు మరల నదే ప్రశ్నమును వైచెను, కాని, యెట్టి ప్రత్యుత్తరమును బడయ లేదు. అంతలో నాకస్మికముగ రామనాథుడు, రవీంద్రుఁ డేదియో దూరముగ నదియందుండు వస్తువునందు దృష్టి నుంచి చూచుచున్నట్లు గ్రహించెను. తాను సయితమా వైపునకుఁ దిరిగి చూచెను. ఏదియో యొక గొప్ప వస్తువు జలప్రవాహమున తమ వైపునకే కొట్టుకొని వచ్చుచున్నట్లు గ్రహించెను. వారట్లే దాని నిదానించి పరిశీలించి పరికించుచుండిరి

అది యొక పెట్టె; తేలిక యగు పలకచే మిగుల దృఢముగ నిర్మింపఁబడి యుండెను. వారిరువురు మిగుల నాశ్చర్యముతో దానిని డాసి కడు ప్రయాసతో బయటికిఁ దీసిరి. అందులకు మిగుల భద్రముగ నొక తాళము వేయఁబడి యుండెను. రవీంద్రుఁడు చాలవఱకు దాని నట్లే సంశయ వీక్షణములతోఁ దిలకించి తుద కొకమాఱు మంద హాసముఁ జేసి యిట్లనెను. "అన్నా! రామనాథా! మనకు తిరిగి ఘోర తరమగు పని కలుగనున్నది." రామనాథున కా మాట లర్థము కాకుండెను. ఊరక రిక్తవీక్షణములతో నా పేటిక వైపు చూచుచుండెను. అప్పుడు రవీంద్రుఁడు మరల నవ్వి "గ్రహింపఁ జాలవైతివా! ఇందేదియో చిత్ర మున్నట్లు గోచరించుచున్నది. మరల నొకమారు పత్తేదారుల వృత్తి నవలంబింపవలసి వచ్చునని తోఁచుచున్నది" అనెను. రామనాథుఁ డాతని ముఖము వైపు తేఱిచూచి యప్రయత్నముగ "దేవుఁ డట్టి చిక్కులను మరల గలుగఁజేయకుండుఁగాక" అనెను.

ఈ లోపల రవీంద్రుఁ డా పెట్టె నాలుగుభాగములను పరీక్షించి చూచెను. అది మిగుల భద్రముగ నిర్మింపఁబడి యుండెను.—దృఢమగు బీగము వేయఁబడి యుండెను. కాన నతఁడు తత్క్షణమే దాపున నుంచిన తన యింటికిఁ బోయి కొన్ని పనిముట్లను దెచ్చి దానిమూఁతను

తీయ యత్నించెను. చాలసేపటివఱకుఁ బ్రయత్నించుసరి కందుఁ గృతార్థుఁ డయ్యెను. అంత నా స్పష్టచంద్రికావలోకనమున నందొక మృతదేహమును గాంచి రామనాథుఁ డాశ్చర్యచకితుఁడై చీత్కారముఁ జేసెను. రవీంద్రుఁ డొక యట్టహాసమును గావించి "నేనూహించినట్లే యైనది" అనెను.

రవీం : రామనాథా! మనకీక బ్రతికియున్నంతకాలము విశ్రాంతి దొరకదు. మన మీ యసాధారణ పరోపకారపరాయణత యందే కృశించి నశించిపోవలయును సుమా.

రామ : బావా! ఇదియేమి! ఈ మృతదేహ మెవ్వరిది! దీనితో మన కేమిపని? దీనిని మన మేల చూడవలయును? మరల యథాప్రకారముగ బీగమును దగిలించి ప్రవాహమునఁ బాఱవైతము. పట్టుఁడు. పట్టుఁడు.

రవీం : (నగుచు) బాబూ! నే నూరకుండుట దేవున కిష్టము లేదు. ఒక నేరము గడచినపిదప మఱియొకదానిని సిద్ధముచేసి నావద్ద కనుపుచున్నాఁడు. దూరపు క్రూరకార్యములందే నా వినీలకుంతలములు వెండితీగలు కావలయునని యాతని యాశయము.

రామ : (ముఖముచిట్లించుకొని) చాలు. చాలు. ఇదివఱకు నీ పత్తేదారివృత్తివల్ల గలిగిన కష్టములే చాలును. మరల నివియేల? గోటనగుదానికి గొడ్డలి నుపయోగింపనేల? పట్టుఁడు, బావా! దీనిని నీటిలో వేతము.

ఆతని యాతురతను గాంచి రవీంద్రుఁడు నగుచుండెను. "అన్నా! బాల్యచాపల్యమున నీవట్లన్నను వయోవృద్ధుఁడును ప్రపంచానుభవపరిపూర్ణుఁడు నగు నే నట్లు చేయఁజాల. చూచిచూచి దీనిని వదలు టెట్లు? ఇది నేఁ డీపట నాకుఁ గానిపించుటలో దేవుని

యుద్దేశము ప్రాయశః నేనే యీ రహస్యాను సంధానంబునకు గడంగ వలయునని యున్నట్లున్నది. ఏమైన నేమి ? ప్రథమదర్శనముననే నే నీతత్త్వమును గనుఁగొన నిశ్చయించితిని. రామనాథా ! నే నిదివఱకుఁ గనుఁగొన్న నేరములలో నిదియొక లెక్కా ?" యనెను. రామనాథుఁడు మరల మాటాడలేదు. తదేకదృష్టితో నాకాశావలోకనముఁ గావించుచుండెను.

రాత్రి చాలభాగము దాఁటిపోయెను. తెల్లవాఱుట కిఁక నెంతయో ప్రొద్దులేదు. తొలుదిక్కున నరుణప్రభ లలముకొనుచుండెను. దాపుననుండిన కలకత్తానగరమునందుండు కుక్కుటారావములు వైతాళికవృత్తి నవలంబించుచుండెను. విశాలవిశ్వమందిరమున నిప్పుడు దివాంకము ప్రారంభించుచున్నది. బాలహంసుఁ డుదయగిరి శిఖరారోహణముం గావించి నిజకోమలారుణరాగరంజితవసూత్కరనికరంబుచే విశ్వస్థానమును దుర్వారసంతోష తరంగ మధ్యభాగమునఁ దేల్చివైచెను.

# రెండవ ప్రకరణము

## అవ్యక్త ప్రేతము

ఉదయమున రవీంద్రుఁడు తాను రాత్రిచూచిన విషయము నంతటిని బోలీసువారికిఁ దెలుప నిశ్చయించుకొనెను. వెంటనే రామనాథుని రావించి యాతని కాసంగతిని దెల్పు నొకసేవకుని బమ్మెను. వాఁడు వచ్చినపిదప నా పేటికను వానిశిరమున నుంచి వానితోను రామనాథునితోను ఠాణాకు నడువ నారంభించెను.

ఉదయరాగముచే కలకత్తాయందలి సౌధోపరిభాగములు సువర్ణ మండితములై మెఱయుచుండెను. విహంగసంతానముల కలకలారావములచే దిక్కులు పిక్కటిల్లుచుండెను. గంధవాహుఁడు సుమపరిమళముల సేకరించుకొని వచ్చి పథికుల హృదయకుహరంబులందు పమ్మదాంబుధిని నెలకొల్పుచుండెను. అత్తఱి రవీంద్రుఁడు తన యనుచరులతో నొకబండినెక్కి శీఘ్రగమనమున స్టేషనువైపునకు సాగిపోవుచుండెను. అతఁడు గమ్యస్థానమును జేరునరికి నంశుమంతుఁ డాకాశగోళమున బాఁరెడెత్తున వెలుఁగుచుండెను.

పోలీసు ఇన్‌స్పెక్టరగు దివాకరుఁడును, రవీంద్రుఁడు బాల్యస్నేహితులై యుండిరి; మొదటినుండియు నొకపాఠశాలయందే విద్యాభ్యాసమును గావించిరి; చాలకాల మొకతావుననే నివసించిరి. ఒండొరులఁ గన్నవారి కెంతో యానందము. రవీంద్రునిరాక నాలకించిన వెంటనే దివాకరుఁ డాతని నెదుర్కొనివచ్చి "మిత్రమా! రవీంద్రా!

ఏలయింతటి వేకువజామున నే తాణా కరుదెంచితివి ! ఎనిమిదిరోజుల నుండి నీ దర్శనమే యపురూపమై పోయినది " అనెను. " నా కించుక నాయాసముగ నుండుటచే రానైతిని. ఇప్పటికి సంపూర్ణముగు నారోగ్యము——" అని రవీంద్రుఁడు చెప్పుచుండఁగనే యంతలో దివాకరునిదృష్టి బండిలోనుండిన పెట్టెపైఁబడెను. తోడనే యాతఁడు చీత్కారముఁజేసి " రవీంద్రా ! ఇది యేమిపెట్టె ? ఇంతపెద్దదిగనున్నది?" అనెను.

రవీం : (నవ్వి) నేఁ డిన్స్పెక్టరుగారికిఁ జూపుటకై యొక విచిత్ర వస్తువు నందుకొని వచ్చినాను.

దివా : అదెట్టి విచిత్రవస్తువు ? దానివల్ల మన కేదైన ప్రయోజనముండునా ?

రవీం : లేకేమి ? మిత్రమా ! ఆ వస్తువు సునకిష్టము లేకున్నను మఱియొకమాఱు మమ్మపరాధరహస్యభేదకుల యుద్యోగమును బూనుమనుచున్నది.

దివా : (విస్మితుఁడై) రవీంద్రా ! నీవనున దేదియో నాకర్థము కాదు.

రవీం : అర్థమగులెమ్ము. మన మూరక యింటిపట్టున హాయిగఁ గాలముఁ గడపుట దేవున కిష్టము లేదు.

అని చెప్పుచు నాతఁడచటివారి నెల్లను యా చేరువగదిలోనికిఁ గొంపోయెను. పెట్టెకూడ నటకుఁ దేఁబడెను. అంత రవీంద్రుఁడు తాను రాత్రి రామనాథునితోఁ గాంచిన చిత్రోదంతమును దెలియఁజెప్పి యుండఁజాలమితో నా పేటికమూఁతను దీసివైచెను. ఆ భయంకర దృశ్యమును గాంచి ప్రేక్షకులెల్లరు భయవిస్మయావృతులై తూలి పోయిరి. చాలసేపటివఱకు నెవరును మాటాడలేదు. తుదకు రవీంద్రుఁడు దానిని యథాగతియుందుంచి దివాకరునితో నిట్లనెను. " అయ్యా !

ఇది చిచ్చుపాటునకుఁ గాలము కాదు. కార్యములు కడుంగడు భయంకరములుగ నున్నవి. ఇప్పుడు తత్క్షణమే సూపరింటెండెంటుదొరగారికి వర్తమానమంపుట యుక్తము. అతనితో నొక వైద్యుఁడుకూడ రావలసి యున్నది "—తోడనే వారిరువురకుఁ గబురంపఁబడెను.

దివా : పత్తేదారున కీవాఁ జేబులలోనో యుండిన యీ నేరమును తెచ్చి తలపై నిడుకొనునంతటి యవసరమేముండెను !

రవీం : అయ్యో ! ఇది తనంతకుతాను వచ్చినపాలఁబడినది. అట్టిదానిని కన్నారఁ గాంచి వదలుటెట్లు !

దివా : రవీంద్రా ! ఇది హత్యయని యెంతువా !

రవీం : ఆ విషయము నాకింకను బాగుగ బోధపడలేదు. శవ పరీక్షచే నాకట్లే యనుమానము తోఁచుచున్నది.

దివా : ఈ అమృతదేహ మెవ్వరిదో తెలియునా ?

రవీం : లేదు. నాకించుకంతయును దెలియదు. ప్రేతరూపము చాలవఱకు మాఱిపోయినది. గుర్తిపుట కవకాశము లేదు.

ఇంతలో దొరగారు డాక్టరుతో వచ్చిరి. దివాకర రవీంద్రులు వారి నెదుర్కొని లోపలికిఁ గొనిపోయిరి. వారియెదుటనే రవీంద్రుండు పెట్టెపైభాగమును దీసి యెల్లవిషయములను దెల్లముగావించెను. అంత దొర నగుచు " ఇంతశీఘ్రముగ మఱల నింతటి ఘోరకార్యము తటస్థించునని నే ననుకొననైతిని " అని సందేహనివారణార్థ మెన్నియో ప్రశ్నలవైచెను. రవీంద్రుఁ డన్నిటికిని ప్రత్యుత్తరము లొసఁగెను. అంత వైద్యుఁడు బహుకాల మా నిర్జీవకళేబరమును పరిశీలించి మృతునకు నాల్గుదినములక్రింద భోజనమైన రెండుగంటలకు విషప్రయోగ మైనదని చెప్పెను.

సూప : ఈశవ మెవ్వరిదై యుండును ?

రవీం : అదియే ప్రస్తుతము తెలిసికొనఁదగినది. నాల్గుదినముల క్రిందనే శవము ప్రవాహమునఁ బారవైవఁబడినది. ముఖము చాలవఱకు వికృతమైయుండినది. ఆనవాలున కవకాశము లేదు. దీనితత్వమేమియో నాకింకను దెలియదు.

దొర : మన మిప్పు డేమిచేయుదము? ఈ హత్యాపరాధ మెవ్వరిచేఁ గావింపఁబడినదో, యీ పురుషుఁ డెవ్వఁడో, యీతని వాసస్థలమెద్దియో, మనకుఁ దెలియకున్నది. దీనితత్వ మేరీతి కనుఁగొనఁదగును. మీరీకార్యమును సాధింపఁదలంచితిరా!

రవీం : అవును. ప్రథమసందర్శమునవే యట్లని సంకల్పించుకొంటిని.

దొర : ఇది మీ చేతిలోఁబడుటచే త్వరలో దీనిచరిత్ర వెల్లడియగునని నా నమ్మకము.

రవీం : మీబోఁటి పెద్దల యనుగ్రహముండిన దీనిని సాధించుటెంతపని! నా సాహససామర్థ్యముల నన్నిటిని వ్యయపఱిచి రహస్యభేదన గావింతును. అమీనాకృత్యములకన్న నిది ఘోరతరము కాదని నా నమ్మకము.

దొర : (బొమ్మ బాదుకొని)—అబ్బబ్బా! అమీనాక్రూరదానవి. అసాధారణప్రజ్ఞానిధి. అట్టివారలీభూలోకమున నరుదుగఁ గాన్పించుచుందురు.

"ఈ నేరము నేరీతిఁ గనుఁగొనఁగునా" యని రవీంద్రుఁడు చాలసేపటివఱకు యోజించి తుదకిట్లనెను "మృతుఁడు మిగుల ధనాఢ్యునివలెఁ జూపట్టుచున్నాఁడు. హత్య చోరులచేఁ గావింపఁబడలేదు. ఏలనన వారు ధనలోభులగు తస్కరులై యుండిన నీతనిహస్తములందీ పయిడికంకణములు కాని. వ్రేలియందలి వజ్రపుటుంగరము కాని

యీ యమూల్యచేలాంచలములుగాని యుండుట యసంభవము. ఇది కేవల మీతని యీ ప్రవర్గములోనివారో, లేక మఱెట్టివిరోధులో చేసిన భయంకరసంఘటనము. ఈ యుంగుళీయకము నవరత్నఖచితమై యీతఁడొక మహాధనికుఁడని నొక్కిచెక్కాణించుచున్నది" అని చెప్పుచు నాతఁడు దొర యనుమతిపై నా ప్రేతము వ్రేలిలోనుండిన యుంగరమును దీసి పరీక్షింపసాగెను.

అంత రవీంద్రున కాయుంగుళీయకముపై "చ-కీ" యని రెండక్షరములు ప్రస్ఫుటముగ చెక్కఁబడియుండుట కాన్పించెను. తోడనే యాతఁడు దాని నందఱకును జూపించెను. ఎవరును దానియర్థమును విశదీకరింపలేకపోయిరి. రవీంద్రుఁడుసహితము కొంతకాలమువఱకు యోచనాపరవశుఁడై యుండి మఱేమియు మాటాడలేదు. అతనికిఁగూడ నేమియు బోధపడలేదు.

దొర : ఈ కళేబరముపై నెట్టిరక్తచిహ్నములు లేకున్నవి. వ్యక్తి ఖడ్గప్రహారమునఁగాని తుపాకివ్రేటునఁగాని మడిసినట్లు గాన్పింపదు. బాగుగ యోజించిచూడ మన డాక్టరు తెల్పినదే యథార్థమని గోచరించుచున్నది. ఇతని దేహమందందు నుబ్బియున్నది. ఇది విషప్రయోగలక్షణమే కాని యన్యముకాదు.

దివా : ఈతఁడు కలకత్తాపురవాస్తవ్యుఁడై యుండునా ?

రవీం : అదెట్లు చెప్పనగును ? అయ్యా! దొరగారు! నేనీరహస్యవిప్లవమగువఱకు వదలువాఁడనుకాను. హంతకుఁ డెట్టియసాధారణుఁడైననేమి. నాకు భయములేదు. అయిన ముందుగ మన మీవిషయములను వార్తాపత్రికలలో ప్రకటించుట మేలని తోఁచుచున్నది. అందున శవ మెవరిదై యుండునది తెలిసిన కొంతవఱకుఁ దెలియవచ్చును.

దొర : అవును. అట్లుచేయుట మంచిది. సులభముగనే మన కార్యములు ఫలోన్ముఖములు గావచ్చును......ఓహో! బాబూ! ఈ

పెట్టెకు వేసినబీగమును చూడుండు ! ఎంత చిత్రముగ నున్నది! మొదట దాని నొక మానవచిత్రప్రతిమ యనుకొంటిని.

అనుచు దాని నాతఁడు చేతికిఁ దీసికొనెను. దాని విచిత్రనిర్మాణమును గాంచి యందఱు విస్మితులైరి. అంత నాకస్మికముగ వారి చూపులు దానిపైనుండు కొన్నియక్షరములపైఁ బడెను. అది మిగుల నూతనముగ చేయఁబడియుండెను. దానిపైనుండిన యక్కరములఁ గడకీ తీరున వెడలింపఁగలిగిరి. "శ్రీపతి అంబుకో, బాగ్ బజారు, చంద్రనగరు" ఆతాళము మిగుల విలువగలదని తెలియుచుండెను.

దొర : అయ్యా ! రవీంద్రా ! ఈయుంగరమును, బీగమును వలయునేని దాపున నుంచుకొనుము. ముందు నీకార్యమున కివి తోడ్పడునని నాభావము.

రవీం : అవును. బాగుగఁ దెల్పితిరి. వీనిని నాకైవసముఁ గావింపుఁడు.

దొర : కానిమ్ము. అయిన, రవీంద్రా ! ఈవిషయము మతినిగూఢమైనదిసుమా ! నీ శక్తి సామర్థ్యములన్నిఁటిని వ్యయ పఱుపవలసి యుండును.

రవీం : మొదటనే తెల్పితినికాదా ? ఈ యగాధరహస్యమును బయల్పఱుచువఱకు నేను నిద్రాహారములనైన సరిగ నాశించుటలేదని ప్రతినగొంటిని.

దొర : ఏమైననేమి ? ఇది నీచేతిలోఁబడుటచే శీఘ్రకాలముననే లోకమునకు సత్యావార్త యి వెల్లడింపఁబడునని నా నమ్మకము.

అని చెప్పి సూపరింటెండెంటు వారియొద్ద సెలవు గైకొని వెడలిపోయెను. రవీంద్రుఁడు బీగమును, యుంగరమును గైకొని రామనాథునితో నింటికి పోయెను. మఱునాఁడీవృత్తాంతమంతయు వృత్తాంత పత్రికలయందు ప్రకటింపఁబడెను.

# మూఁడవ ప్రకరణము

## ప్రకటన

## "అనాథప్రేతము"

"జూన్ నెల ౧౪ వ తేది శనివారము రాత్రి మూఁడుగంటల సమయమున కలకత్తాయందలి సుప్రసిద్ధుఁడగు పత్తేదారు రవీంద్రుఁడును, యాతని బావమఱఁదియగు రామనాథుఁడును, గంగాప్రవాహాతీరమున వినోదార్థము విహరించుచుండ నీటివఱదలో వారివైపున నొక పెద్దపెట్టె కొట్టుకొనివచ్చినది. తోడనే వారిరువురు దానిని గట్టువకుఁ దెచ్చి మూఁతను సడలించి చూడ నందు సువర్ణ మణిభూషితుఁడును, యమూల్య వస్త్రాలంకృతుఁడు నగు నొకధనాఢ్యుని మృతదేహము కాన్పించినది. ఆ యుదయముననే వారా పేటికను లాలాబజారునందలి పోలీసుఠాణాకుఁ దెచ్చి సూపరింటెండెంటు దొర మొదలగువారి కీయుదంతమును తెలియఁజేసిరి. వైద్యుఁడు శవపరీక్షానంతరము వ్యక్తి భోజనముచేసినపిమ్మట రెండుగంటలకు విషప్రయోగముచే గతించెనని చెప్పెను. వేషభూషణములఁ గాంచ నానిర్జీవుఁడు కలకత్తా పరిసర పట్టణవాస్తవ్యుఁడని సందేహమొదవుచున్నది. ఏమైననేమి, పోలీసువారీ రహస్యభేదనకై యహోరాత్రము లన్నపానీయముల విసర్జించి పాటుపడుచున్నారు.

* * * * * *

మఱియునా డీవిధముగ వార్తాపత్రికలందు ముద్రింపఁబడెను. పూర్వపు టమానుషాకృత్యముల నాలకించినజను లింకను ఆశ్చర్యాంబుధిని

వీడి వెలువడియుండలేదు. అంతలోనే హా దారుణవార్తాప్రచురము! దానిని జదివి యెల్లరు విస్మయశోకభయాక్రాంతులైపోయిరి. "ఇదియేమి యీ తీరున హత్యలు జరుగుచున్నవి. సురక్షితమగు నాంగ్లరాజ్యమున నింతటి దౌర్జన్యములా!" యని చెప్పుకొనసాగిరి. మృతుండే నిర్భాగ్యుడైనది యెవరికిని తెలియలేదు. దేశమున చాలదూరమువఱకు నీవార్త తెలిసిపోయినది. కాని, యెవరును వచ్చి యది ఫలానివారి శవమని చెప్పరైరి.

రవీంద్రుడు తన యాఫీసుకట్టడమున నొక మృదుతల్పమునం బడి యేదియో యోజించుచుండెను. ఆతనికి దాపుననే వేఱొక సోఫాపై రామనాథుడు సహితమాలోచనానిమగ్నుడై కూర్చుండియుండెను. గది యంత విశాలభూయిష్ఠము కాకపోయినను నేత్రానందకరముగ నలంకరింపబడి యుండెను. భూతలమున మృదుమసృణమగు తివాసీలు పఱువబడి యుండెను. ఒకమూల రెండద్దపుటలమారులలో గొప్ప గొప్ప పుస్తకములు సువర్ణాక్షరలిఖితశీర్షికానిచయముతో వెలుగొందుచుండెను. సుస్నిగ్ధముకురప్రాయములగు కుడ్యభాగములు సుప్రసిద్ధపురుషచ్ఛాయాచిత్రములచేతను, రవీంద్రుని కుటుంబయుక్తఛాయాపటములచేతను కడు మనోజ్ఞమై వెలుగొందుచుండెను. ఆమందిరమధ్యభాగమున నొక సువిశాలదంతభాగనిర్మిత చిత్రప్రతిమావిలసితమగు బల్ల యుండెను. దానిపై నవ్యరక్తపేటికాంగుళీయకము, ఆపేటికకు పైవంబడియుండిన చిత్రతాళమును పడియుండెను.

"ఈతడు చంద్రనగరనివాసియా? అట్లయిన యాతనికిట బంధువులెవరును లేకుండురా? ఉన్న యీదారుణవార్త నాలకించి సందేహనివారణార్థమైన నిటకు రాకుందురా? వారిగాని మొదలగు దూరభూములకు దెలిసిపోయిన యీయుదంతము చంద్రనగరున తెలియ

కుండునా?—అసంభవము! అయిన నెవరును రాలేదే? ఏమో, యీతని కెట్టి బంధుత్వమును లేదుకాఁబోలు. ఎట్లు చెప్పనగును? ఈయుంగరముపై "చ-కీ" యను నక్షరములు చెక్కఁబడియున్నవి. వీనియర్థమేమి? ఇవి యెవరిపేరునకు సంకేతాక్షరములై యుండును? ఈయుంగర విషయమును పత్రికలో ముద్రించియుండిన బాగుండెను. ఈహత్య ధనాశాపీడితులచే జరిగినట్లు లేదు. అట్లు తలంచుట కవకాశము లేదు. అంతయు మహాంధకారపూరితమై యున్నదికదా! అయిన, నీదుస్తరమార్గాయాసమున నీ బీగము నాకొంతయు సాయపడఁగలదని తోఁచుచున్నది. దానితో నిట్లు చేయుట మంచిది. దానిపై ఆ వస్తునిర్మాణాగార విలాసము చెక్కఁబడియున్నది. ఇది చంద్రనగరముననే చేయఁబడినట్లు దానిమూలముననే తెలియవచ్చుచున్నది. ఇది కముంగదు చిత్రనిర్మాణము. ఇట్టివింతవస్తువుల నమ్మువారు సాధారణముగ వానిని కొనువారి విలాసములను వ్రాసి యుంచుకొనియుందురు. దానిసహాయము మన కీసమయమున నమూల్యమైయున్నది. హంతకుఁ డెంత మేధావియైన నేమి, పోలీసువారికన్నుల సంపూర్ణముగ దుమ్ము చిమ్మ కేలపోయెను." అని రవీంద్రుఁ డాలోచించుకొనుచుండెను. కొంత కాలమువఱకు తాతఁ డెద్దియు మాటాడక తిన్నగ నా తాళముపైఁ జూడ్కులు నిగిడ్చియుండెను. అప్పుడిదివఱకు మౌనముద్రాంకితుఁడై యున్న రామనాథుఁ డిట్లనెను. "బావా! ఏమి యోజించుచుంటిరి, ఏమైన మార్గము కాన్పించినదా?"

రవీం: లేదు, బాబూ! అంతయు మహామాయాంధకారపూరితమైపోయినది. దీనియుందెట్టి యుక్తమార్గమును గోచరింపకున్నది.

రామ: అయిన, దీని నెట్లు కనిపెట్టఁ దలంచితిరి?

రవీం: రామనాథా! ఈయవ్యక్తమాయామార్గమున నీబీగము మనకొక యమోఘమార్గదర్శకము కాఁగలదని నేనూహించెదను.

ఎట్లన, దీనిపై నీవస్తునిర్మాణశాలావిలాస మున్నదికదా రేపాస్థలమున కేగి యిట్టివాని నెవరైన కొనియుండిరేమో విచారింపవలయును. సాధారణముగ కంపెనీఅధికారు లిట్టిఅమూల్యవస్తువులను విక్రయించుతఱి నాకొనువారి చిరునామాను వ్రాసి యుంచుకొందురు.

రామ : వారేల యట్లు వ్రాసికొనవలయును ? అందువలన వారికేమిలాభము ?

రహీం: అందువలన లాభమేమన, నావిక్రయులు, మఱియెవరైన నిట్టి తాళముకావలయునని వచ్చి ప్రశ్నించి బేరమాడిన, పూర్వము వానిని కొనినవారిపేరులను జూపి క్రయమును గుదుర్తురు. చూడుము. బాబూ ! దీనిపై "56" అని సంఖ్యకలదు. ప్రాయశః యీ కంపెనీ ప్రారంభింపఁబడినదాదిగ నిట్టివి 56 మాత్రమందు విక్రయింపఁబడి యుండును. ఇదియే కడపటిదని చెప్పవలనుపడదు, కాని, తాళసంగ్రహకుని అడ్రస్సుమాత్రము మనకు దొరకఁగలదని నాయంతరాత్మ చెప్పుచున్నది. చూడు మిదెంతవిలువగలదో. అందందు వెండికట్లమర్పఁబడి చిత్రచిత్రపు నగిషీపనులు చేయఁబడియున్నవి. వెలసుమా రిరువది రూప్యములకు తక్కువకాకుండును.

రామ : హంతకుఁ డింతటివెలగల బీగము నాతుచ్ఛశవపేటిక కేల దగిలించియుండును ? సాధారణబీగమైన చాలియుండదా ?

రహీం : హంతకుఁ డీసమయమున మిగుల బీదయై పరితపించు చుండవచ్చును. ఇట్టి వస్తువులను భాగ్యవంతులు కొననోపుదురే కాని నిరుపేదల కది సాధ్యముకాదు; ఈవిషయము నాలోచించి యూహ్యకొం నుఁడు లోకమున కొకవేళ నీప్రేతవిషయము వెల్లడియై పట్టుదొరకిన, నీబీగమును చూచినతత్క్షణమే జను లాహత్య నెవరో ధనికులు చేసిరి కాని నిప్పుచ్చరముచే తహతహపడువారు చేయలేదని నమ్మకమును

పొందవలయునని యిట్లు చేసియుందురు. తానిప్పుడు నిక్కముగ బీద యైన తన్నెవ్వరనుమానింతురు? నిందనుండి సురిగిపోవుట కిదియొక యుపాయము.

రామ : అయిన, నీ యుంగరమువిషయము మేమాలోచించితిరి?

రవీం : అది యిప్పుడు మనకార్యమున కెంతయు నుపయోగకారి కాదని నా నమ్మకము. దాని విషయమై మున్ముందు తెలియరాఁగలదు.

ఇంతలో నెదుట గోడకుండిన పెద్దగడియారము పండ్రెండు గంటలు కొట్టెను. తోడనే వారిరువురు ప్రసంగము నంతటితో నాపి భోజనార్థము లేచిరి. ఆ సమయమునకు సరిగ తపాలాబంట్రౌతొకఁడు వచ్చి రవీంద్రున కొకయుత్తరమునిచ్చి సలాముచేసిపోయెను. రవీంద్రుఁడు దానిని విప్పిచూచెను. అదియొక తంతివార్త. అందిట్లున్నది.

"వార్తాపత్రికయందు ప్రకటించిన శవవిషయమును చూచితిని. నెలదినములక్రిందట మా మామగారు కనఁబడకుండ పోయినారు. వారి విషయమై మాకు చాల భయముగనున్నది. సందేహనివారణార్థము రేపుసాయంకాల మచ్చటికి వచ్చెదను."

ఆనందసాగరుఁడు,
ముత్యాలవీథి,
చంద్రనగరు.

ఈ వార్తను చదివి ముగించుసరికి రవీంద్రునిహృదయ మానందాశ్చర్యపూరితమై పోయెను. రామనాథునిఁజూచి "అన్నా! చూడుము. ఈ లేఖకునివల్ల మన కాశవ మెవ్వరిదై యుండునది తెలిసిన తెలియఁగలదు." అని చెప్పుచు నా కాగితము నాతనికిచ్చెను. రామనాథుఁడు సహితము దానిని చదువుకొనెను. అతఁడు కూడ నా సమయమున సంతోషస్వాంతుఁడై "అయిన, బావా!

ఈతని మూలమున మనకింకఁ గొన్నిరహస్యములు తెలియరావచ్చును. అప్పుడు హంతకునిఁ బట్టనంత శ్రమపడవలసియుండదు లెండు" అనెను.

రవీ : అవును. పరమేశ్వరుఁడు కరుణించి యీ యగాధ రహస్యరూపమైన నించుక సుఖమార్గమును జూపుచున్నాఁడు. ఈ యానందసాగరుఁడు వచ్చినతోడనే సంగతులనుగురించి ముచ్చటింతమురమ్మి.

అని రామనాథునితో నాగది వదలి లోపలికిఁ బోయెను.

# నాల్గవ ప్రకరణము

ప్రేత మెవరిది?

గోధూళికా సమయమున రవీంద్రుఁడు వార్తాపత్రిక నొకదానిని చదువుచు నాఫీసుకట్టడమున నటునిటు పచారుచేయుచుండెను. సాయంకాల మేడుగంటలకు సరిగ చంద్రనగరమునుండి కలకత్తాకు మెయిలుబండి రాఁగలదు. అందులోనే యానందసాగరుఁడు రాఁగలఁడని రవీంద్రుఁడు కాచియుండెను.

ఏడుగంటలు తిరిగిపోయినవి. పట్టణమున నందందు పురపాలక సంఘమువా రుంచిన దీపకళికలు మినుకుమినుకు మని యంధకారావృత మార్గములం దించుక వెలుఁగును వెదచల్లుచుండెను. నేఁటివలె నాఁడు విద్యుద్దీపములు లేవు. అంతటను కెరసినుదీపములే. రవీంద్రుఁడు సహితము తనగది నొక్క-శుభ్రదీపముచే వెలిఁగించెను. ఇంతలో వెలుపల నెవరో తన్నుగుఱించి మాటాడుచున్నట్లాతనికిఁ దెలియ వచ్చెను. అప్పు డాతఁ డచటికిఁబోయి చూడ విదేశీయుఁడుగనున్న యొక యువ్వోగి సేవకునిఁ గాంచి యిట్లనుచుండెను.

విదే : పత్రికారు రవీంద్రనాథుగారి గృహమిదేనా?

సేవ : అవును, తమ దేయూరు?

విదే : నాది చంద్రనగరు. వారితో నించుక పనియున్నది.

సేవ : తమ పేరేమి?

విదే : న న్నానందసాగరుఁ డందురు. నేనొక బ్యారిష్టరు.

రవీంద్రుఁడు ఎదురుచూచుచుండిన దీపురుషునికొఱకే. తోడనే యాతఁడు డిఁక నాలసింపక అచటి కరుదెంచి "అయ్యా! రండు. నేనే రవీంద్రుఁడను నపరాధపరిశోధకుఁడను. రండు. లోపలికిరండు" అని యానందుని గృహములోనికిఁ దోడ్కొనిపోయెను. పిదప నాతని నొక చిత్రాసనముపైఁ గూర్చుండఁబెట్టి తాను నొకచోఁ గూర్చుండెను. అంత వారిరువు రీరీతి మాటాడ మొదలిడిరి.

రవీం: అయ్యా! తామేకదా చంద్రనగరపుబ్యారిష్టరానందముగారు?

ఆనం: అవును. నేనే. నేఁడు మీకు తంతివార్త నంపినవాఁడను కూడ నేనే.

రవీం: సంతోషము. మీ లేఖవల్ల మీ యాగమనకారణము మాకుఁ గొంతవఱకు బోధపడినది.

ఆనం: మీరు వార్తాపత్రికయందు ముద్రించిన విషయమును తెలిసికొనవలయునని యిచ్చటికి వచ్చితిని.

రవీం: అందువలన, మీకేమి ప్రయోజనము?

ఆనం: ప్రయోజనమేమన నెలదినములనుండి మాశ్వశురుఁడగు కేశవపాలుఁడుగా రాకస్మికముగఁ గానుపించకున్నారు. ఎందేఁగినది, యేమైనది మా కింకను తెలియరాకున్నది ఎట్టిసంగతులును తెలియఁబడలేదు.

విద్యుల్లతవోలె యుంగరముపైనుండిన "చ-కే" యనునక్షరోదంత మా రవీంద్రుని మస్తిష్కభాగమున చలించిపోయెను. అవి "చంద్రనగరపు కేశవపాలుఁడనుటకు సంకేతాక్షరములై యుండునా!" యని యాతని కనుమానము వొడమెను.

రవీం : అయిన నా ప్రేతమును మీరు చూడనంతురు కాఁబోలు. కాని యది యిప్పుడే దగ్ధముకాఁబడినది. దాదాపుగ నొక నెలవఱకు వేచియుంటిమి. ఎట్టివార్తలు తెలియరాలేదు. అప్పటికే శవము క్రుళ్లి దుర్గంధపూరితమై పోవుచుండుటను గాంచి యింక నెంత కాలమువఱకైన నట్లుంచ వలనుపడదని సర్కారువారి యనుమతిపై పదిదినముల క్రిందన కాల్చివేసితిమి.

ఆనందసాగరుఁడు కొంతసేపటివఱకు నేమియు మాటాడలేదు, తుదకిట్లనెను. "అయ్యా! అయిన నే వచ్చినకార్యము వృథాయై పోవలసినదేనా?"

రవీం : ఇప్పుడు మృతదేహమును గాంచి యానవాలిడుట శక్యము లేదు. కాని, యీ యుంగరమొకటికలదు. ఇది యా ప్రేతము యొక్క వ్రేలియందు మెఱయుచుండెను. దీనిమూలమున నెవరైన గుర్తిడ బాగుండునని దీనిని దాఁచియుంచితిమి.

అని చెప్పచు నా యంగుళీయకము నానందసాగరున కందించెను. ఆతఁడు చాలవఱకు దానిని నిదానించిచూచి, యందలి యక్షర యుగళమును గాంచి చకితుఁడై లేచి "అయ్యా! రవీంద్రా! రవీంద్రా! ఇఁక నేమున్నది బాబూ! ఇది మా మామ దేసుమా. "చ-కే" యన "చంద్రనగరపు కేశవపాలుఁడనియే" యర్థము. ఇది నాకు బాగుగఁ దెలియును. ఆ మృతుఁ డాతఁడేయనుట కెట్టిసందియమును లేదు. ఈ యుంగరము నెన్నిమోటాటు లాతనిచేతియందు నేఁగాంచి యుంటిని." అని చెప్పచు వ్యాకులహృదయాక్షిప్తతచే నచ్చటి యాసనముపైఁ గూలఁబడెను. ఆ సమయమున నాతని కనుఁదమ్ముల నుండి యొకటి—రెండశ్రుకణములు రాలినవి. అదిగాంచి రవీంద్రుఁడు "అయ్యా! అయిన మీరు నిక్కముగ మృతుఁడు కేశవపాలుఁడని నిర్ధరించితిరా!" అనెను.

ఆనం : ఇంకను సందేహమేటికి ? ఇది నే చూచినయుంగరమే, దీని నాతఁడు ధరించియుండెను. మృతుఁ డాతఁడుకాకున్న పగులచేతి కిదెట్లుపోవును ? నే నొకనాఁ డాతని నీయమూల్యాభరణవిషయ మడుగ దీని నొక మిత్రుఁడు తనవాత్సల్యరూపమున చేయించి తనచేతియం దుంచి మరణించెననికూడ చెప్పెను. అయ్యో ! ఇఁక ననుమానము లేదు, మామామగారు హత్యగావింపఁబడిరి. హా—

అని చాలసేపటివఱకు నేమియు మాటాడక హస్తములచే ముఖాచ్ఛాదనము గావించుకొని కూర్చుండెను. రవీంద్రుఁడును మాటాడక ఆనందుని వాగ్ధోరణిపై పూర్వపక్షసిద్ధాంతముల సలుపుకొనసాగెను, తుదకా మానభావములు విచ్ఛిన్నములై కోపసంభాషణ మారంభ మయ్యెను.

రవీం : అయ్యా! ఇది చింతించుటకు తగిన సమయముకాదు. మీశ్వశురుఁడు పాషాణప్రయోగముచే మరణించెనని వైద్యుఁడు చెప్పినాఁడు. ఇట్లగుట కేదేని ప్రబలకారణ ముండకపోదు. హంతకుఁడు సాధారణకృత్యమును గావింపలేదు. తన క్రూరకృత్యము నంతటిని మహాంధకారమున కలిపివైచినాఁడు. మాకీ కేశవపాలునివిషయమై నేమియుఁ దెలియకున్నది. అంతయు సవిస్తరముగఁ దెల్పిన నీయభియోగమును గైకొని మాయావచ్ఛక్తుల నుపయోగించి రహస్యభేదన గావింప యత్నింతుము.

ఆనందుఁడు తుదకు మనస్సును సమాధానపఱచుకొని యిట్లు చెప్పెను. రవీంద్రా ! ఈతనికాపుర మాదినుండి చంద్రనగరముననే యుండెను. ఇప్పటి కీతనికిఁ బదునెనిమిదియేఁడుల యీడుగల తనయ గలదు. అంతేకాని పుత్త్రసంతతి లేదు. అందందు బంధువులుకూడ గలరు. కేశవపాలుఁడును నాప్రియజనకుఁ డగుమానవదత్తుఁడును ప్రాణమిత్రులుగ మెలంగినవారు. ఒకరొకరు లన్యోన్యానురాగమున సోదరులు

వోలె మెలఁగుచుండిరి. నేను దశవర్షప్రాయుఁడనై యుండుకాలముననే నాతండ్రి పరలోకయాత్ర కేఁగెను. అప్పటినుండియు నాతని యాత్మమిత్రుఁడగు నీకేశవపాలుఁడే నన్నుఁ దనప్రాపునఁ జేర్చుకొని తండ్రిలేనిలోప మారునట్లు పోషించెను. నే నప్పుడప్పు డాగతపితస్మరణదుఃఖాతిరేకమున ఖిన్నుఁడైన నీతఁ డపారదయావృతుఁడై వచ్చి నన్నాసంతాపసాగరమునుండి యీవలికిఁ దెచ్చుచుండెను. ఈతని తనయ కప్పటికి రెండుసంవత్సరముల ప్రాయముమాత్రమే. అప్పటి కప్పుడే యామె దౌర్భాగ్యవశమున తల్లి గతించిపోవుటచే తండ్రియే తల్లిలేని లోపము దీఱునట్లు సకలము దానయై కాపాడుచుండెను. నాకు తండ్రిపోయిన దుఃఖ మొక్కటే. సరళకు తల్లిపోయిన లోప మొక్కటే. కాని సర్వమును కేశవపాలునికృపాతిరేకమున నానందమయమై పోయెను. మాయిరువురి ప్రవర్ధమాన దశను గాంచి యాతఁ డెంతయు మురియుచుండెనువాఁడు. నాకు విద్య నభ్యసింపఁజేసి నాచే సరళకు సహితము విద్యాప్రాప్తి యగునట్లు చేసెను. ఇంతలో నే నిచట పట్టపరీక్షయం దుత్తీర్ణుఁడనై యాంగ్లదేశమున బ్యారిష్టరు పరీక్షకు చదివి యందుసహితము కృతార్థుఁడ నైతిని. కొన్నిమాసముల క్రిందటనే నేను స్వదేశమునకు మరలి వచ్చితిని. నే వచ్చునరికి సరళ సంప్రాప్తయౌవనయై ప్రేక్షణాకర్షితమై యుండుటచే నప్పుడే కేశవపాలుఁ డామెను నాకిచ్చి వివాహమును జరిపెను. నేను బ్యారిష్టరు వృత్తియుండే కాలమును గడుపుచునుండే జీవయాత్రను గడుపసాగితిని. మామగారికి దాదాపుగ నిరువది లక్షల రూప్యములు యాస్తి యున్నది. ఇట్లుండ నెల దినముల క్రిందట నొకరాత్రి భోజనానంతరము పరుండఁ బోతిమి. కేశవపాలుఁడు మందిరమునకు దాపున నుండిన తన శయ్యాగృహమున కేగెను. కాని మరల నాతనిని జూడలేదు. ఉదయమున నాతఁ డింటికి

రాఁడయ్యెను. అతని శయనమందిరమునకుఁ బోయి చూడ నందుకూడఁ గాన్పింపఁడయ్యెను. మందిరముతలుపు లూరక మూయఁబడి యుండెను, అతఁ డాదినమంతయు నింటికి రాకపోవుటచేతను, ఎట్టిసంగతి తటస్థమయ్యెనో తెలియకుండుటచేతను మాకు మిగుల భయము కలిగెను. తుదకు నిన్నటివఱకు చూచినను ఆ విషయమే తెలియరా లేదు. ఏదియో యనర్థకము సంభవించియుండు నని నే ననుకొంటిని. ఆకస్మికముగ నిన్నటి దినమున మీ వార్తాపత్రికయందలి వృత్తాంతమును జూచుట తటస్థమయ్యెను. అప్పుడు నా హృదయ మనుమానపూరిత మగుడు, వెంటనే మీకీతంతివార్త నంపితిని. అయ్యా! సమక్షమున సంగతు లెల్లను తెల్లమైపోయినవి. ఆ మృతుఁడు నా మామ యనుటకు సందియము లేదు. ఈ యుంగరమే చాలదా దానిని నిర్ధరించుటకుఁ దగిన ప్రబలనిదర్శనము? అకటా! రవీంద్రా! ఇంతటి మహామహునకు, నింతటి యుదారగుణ భూయిష్ఠునకు, నింతటి మహాపురుషున కెంతటి లేకి దుర్మరణము సంఘటించినది! హా! దైవమాయ! కడుంగడు దుస్తరము! ఎట్టికట్టిఁడు లీదుష్కార్యమును గావించియుండురో కదా?" అని యింక మాటాడనేరక రుద్ధకంఠుఁడై బాష్పాకులితలోచనుఁడై ముఖాచ్ఛాదన గావించుకొని చాలసేపటివఱకు విషాదపూరిత హృదయముతో మాటాడనేరకపోయెను. అతని దుస్థితిని గాంచి రవీంద్రుఁడు కూడ పలుకనేరక ముగ్ధభావతి వహించి కూర్చుండెను. అప్పుడే తొమ్మిదిగంటలు కొట్టినది.

అప్పుడు రవీంద్రుఁడు "అయ్యా! ఆనందా! చాలప్రొద్దయినది. లెమ్ము. భోజనానంతరము విశేషములను గుఱించి ముచ్చటించుకొందము." అని చెప్పుచు నాతనిఁ దోడ్కొని లోపలికిఁబోయెను. ఆపూట యానందున కన్నము రుచింపదయ్యెను. ఎంగిలిపడి లేచి

రవీంద్రునితో మరల వచ్చి పూర్వపుగదియం దుపవిష్టుఁ డయ్యెను. అప్పుడు పత్తేదారిట్లనియెను. "అట్లయిన బారిష్టరుగారు ! మృతి మీా కేశవపాలుఁడుగారి దనియే సత్యమింతురా ?

ఆనం : అయ్యా ! ఇంకను ఏల యిట్లు ప్రశ్నించుచుంటిరి ? ఇంకను నీయనుమానమేటికి ? ఈయొక్క యుంగరమే చాలదా నాకు నమ్మకమును కలిగించుటకు.

రవీం : ఇదివఱ కామృతదేహ మెవరిదై యుండినది. మాకెఱుక పడి యుండలేదు, అందుచే నింతకాల మాలసించితిమి. నేటి కాసందియముకూడఁ దీఱిపోయినది. ఇఁక నే నడుగు ప్రశ్నలకు సదుత్తరము లిచ్చిన నేరస్థుని బట్టుటలో నా సర్వశక్తుల నుపయోగించెదను.

ఆనం : ఇందు దాఁపఱిక మేల ? నాకుఁ దెలిసినంతమట్టుకు తెలిపెద నడుగుఁడు.

రవీం : కేశవపాలున కెవ్వరైనను శత్రువు లుండిరనుమాట వాస్తవమా ?

ఆనం : లేదు. లేదు. నాకుఁ దెలిసినంతమట్టు కట్టివా రెవ్వరును లేరనియే నాభావన. అతఁడు కేవల మజాతిశత్రు వని తలంతును.

రవీం : మంచిది. అయిన నానాఁ డుదయమున కేశవపాలుఁడు శయ్యాగారమునఁ గాన్పింపలేదనియు, తలుపులు బీగములు వేయఁబడక యుండెననియుఁ జెప్పితిరికదా, అచట నారేయియంతయు సేవకు లెవరు నుండలేదా ?

ఆనం : ఆసంగతి యంతగఁ దెలియదు. అతనియొద్ద నెప్పటికిని నంబుఁ డనునొకభక్తివిశ్వాసములుగల సేవకుఁ డుండెడువాఁడు. యజమానుఁడు పోయిననాఁటినుండి వాఁడును మాకంటి కగపడలేదు.

వానియింటివారి నఱుగ వారుసహితము మిగుల దిగులొంది తమబంధు వారీతి యాకస్మికముగ నదృశ్యత నొందినందులకు చాల దుఃఖించుచున్నారు. కాని, వానియాగడ వారికిని తెలియును. అందులకుఁ గారణము నూహింపఁజాలరు.

రవీం : ఆ నంబూఁద్రి మీయింట నెన్నిదినములుగ నున్నాఁడు?

ఆనం : సుమారిరువది వత్సరములుగ మా కుటుంబమున నెంతో భక్తిశ్రద్ధలు గలిగి కొలువు చేయుచున్నాఁడు. నే నణుమాత్రమైన వానిపై ననుమానించుట లేదు. నాకు వానిగుణగణాదులు బాగుగఁ దెలియును. నాకు చూడ, తనయజమానునివలె వాఁడుకూడ మోసగింపఁబడి యుండునని తోఁచుచున్నది.

రవీం : అయిన, కేశవపాలునకు విషప్రయోగ మెట్లయ్యెను! నంబునిచే నాతఁ డేమైన తెప్పించుకొని తినుట వాడుక గలదా?

ఆనం : కలదు. ఇంట సేవకులున్నను వలయుసామగ్రిని వాఁడు తెచ్చి యివ్వకున్న నింకెవ్వరు తెచ్చియిత్తురు?

రవీం : అయిన, వాఁడే యాతని విరోధులకు లొంగి ధనాశాపీడితుఁడై తా నారాత్రియం దేదియో విషోక్తమగు నొకవస్తువు నాతని కిచ్చి యీ ఘోరము నాచరించి యుండకూడదా? అట్లు గావించి కడకు తన కెట్టిసంకటములు చిక్కులు తటస్థమగునో యని భీతిలి యెందేని పరుగిడిపోయి యుండవచ్చును.

ఆనం : అయ్యా! నా కావిషయమున నుమ్మాటికిని నమ్మకము కుదురదు. వాఁ డంతటిస్వామిద్రోహి కాఁడు, కుటిలాత్ముఁడు కాఁడు, దురంత పాపాత్ముఁడు కాఁడు. వాని సద్గుణములను నే నెఱుఁగుదును, వాఁడట్టి నృశంసకృత్యము చేయఁజాలఁడు. ఇది నిక్కము వానిపై నా కెట్టి యనుమానము పొడముట లేదు,

రహీం : అయ్యో ! ఆనందా ! అట్లనుటకు వీలుండదు సుమా ! ఈ ప్రపంచమున నెంతటి చిత్రపురుషు లుందురో తెలిసికొనుట బహు దుస్తరము. ఇంతకు ధన మెవరి నేమి చేయఁజాలదు ! ఎంతటి సద్గుణ ధాముసైన నొక్క త్రుటికాలమున ప్రబల భీకర దోషాకరునిఁ జేసి వైచును. ఎంతటి సత్కుల సంజాతులనైన హీన కార్యావలంబులఁ గావించును. మీ సంబుని కెవరో విశేషముగ రొక్క మొసఁగుటచే వాఁడు వారికి లోఁబడి యీ కార్యమును గావించి యుండును. లేకున్న పాషాణ ప్రయోగమునకు వీలెచ్చట నున్నది ? అది పోనిమ్ము. కేశవ పాలుఁ డా రాత్రి యెచ్చట భుజించెను.

ఆనం : మా యింటనే. ఆనాఁడు మఱెచ్చటికిని బోలేదు. ఏమి మా యింటనే యీ ఘోరకృత్య మైనదని తలంతురా ?

రహీం : అది యెట్లు చెప్పఁదగును ? "ఇంటిదొంగ నీశ్వరుఁడైన బట్టలేఁ" డన్నట్టు మీ సంసారముననే పయోముఖ విషకుంభముల వంటివా రుండఁగూడదా ?

ఆనం : అయ్యో ! ఇంటియం దట్టివా రెవ్వరును లేరు. నేను నా భార్య, పాచకుఁడు దప్ప భోజన విషయములందు నాలుగవ ప్రాణి యచటి కడుగిడుట లేదు. వంటలవాఁడైన మిగుల మంచివాఁడు. శాంతశీలుఁడు. వాని వర్తనము నే నెఱుఁగుదును. ప్రపంచపట్టాభిషేకము నాశించియైన నింతటి కలుషపూరిత కార్యమును జేయఁడు.

రహీంద్రునకు ముందెట్టి ప్రశ్నలు వేయవలెనో తోఁచకుండెను. ఆనందుని వాక్సరణి ననుసరించి చూడ కేశవపాలునికి సంబుని వలన కాని, యింట భోజన సమయమున కాని, విషప్రయోగము కాలేదు. ఇఁక దీనికి మార్గ మెద్ది ! ఊరః నేమియుఁ దినక యింటనే కూర్చున్న నాతని కీ ఘోర పరిణామ మెట్లు కలుగును ? అని యోచించుకొని

మరల నిట్లు ప్రశ్నించెను. " అయ్యా ! ఆనందం ! కేశవపాలుఁడు నాఁటిరేయి భోజనానంతరము శయ్యాగృహమున కేఁగినపిదప నీవాతనిని మరల చూడనే లేదా ?

ఆనం : లేదు. లేదు. భోజనసమయమునఁ జూచినదే యంత్య దర్శనలాభము.

రవీం : ఆతఁడానిశీథముకాలమున మఱెచ్చటికైన పోయి యుండెనా ?

ఆనం : ఆసంగతి నాకుఁ దెలియదు. నే నొకరి నడిగియైన విచారించుకొనలేదు. రవీంద్రా! ఇట్లగునని తెలిసియుండిన నూరకుండి యుందుమా ! తగిన కాఁపుదలతో మేనెల్ల కన్నులు గలిగి ప్రవర్తించి యుందుము కాదా !

రవీం : అవును. పాప మెట్లు తెలియఁగలదు ? అది పోనిమ్ము. ఆనందా ! కేశవపాలున కిప్పటి కాప్తమిత్రు లనువారెవ్వరైన నున్నారా ?

ఆనం : ( యోచించి ) ఆతనికి ప్రవాళుఁడను నచ్చొలి కలఁడు. ఆతనియెడ మామామగారికి మిగుల నమ్మకము, విశ్వాస ముండెడిది. ఏమి, మీరాతని ననుమానింతురా ?

రవీం : నే నెవరిని సందేహించుటలేదు. ముందు కార్యాలోచన గావింపవలదా ? నీ కాప్రవాళునివిషయ మేమి తెలియునో చెప్పుము చూతము.

ఆనం : వానిజన్మభూమి చందనగిరము కాదు. వానిది యుత్తర హిందూస్థానమున ప్రయాగప్రాంతమందున్న [illegible]కపట్టణమఁట. కొన్ని వత్సరముల క్రిందట నిచ్చటికి వచ్చి కేశవపాలునివంటి గొప్పవారితో నేస్తము వర్చుకొని వారి యనుగ్రహపాత్రుఁడై దినములు నెట్టుచుండెను.

వానిని మా మామయ్య మిగుల నాదరించుచుండెను. వానితో నాతనికి స్నేహవాత్సల్య మగాధ మైపోయెను. వారొండొరులను వదలి యుండఁజాలకుండిరి. అయిన నాకుమాత్ర మా నీచునితో నాఁతఁ డంత స్వేచ్ఛావిహారము సలుపుచుండుట సరియని తోఁచలేదు. ఈవిషయమై పలుమాఱు కేశవపాలుని హెచ్చరించియు విఫల మనోరథుఁడ నైపోతిని.

రవీం : ఆ ప్రవాళుఁ డిపు డెచట నున్నాఁడు ?

ఆనం : చంద్రనగరముననే. అప్పుడప్పుడు మా యింటి కింకను వచ్చుచునే యుండును.

ఈ సంభాషణ వల్ల రవీంద్రున కెట్టిరహస్యములు తెలిసెనో మేము చెప్పఁజాలము. ఆతఁడు దీర్ఘాలోచన గావించి తుద కిట్లనెను. "అయ్యా ! నే నిపుడు చంద్రనగరమున కరుదెంచి యీ నేరమును విచారించి హంతకులకై అనుసంధానమును గావింప నిశ్చయించితిని. ఇందుకు మీ రేమందురు ? "

ఆనం : అనుట కేమున్నది ? మిమ్ముఁ దోడ్కొనిపోవుటకే కదా నే నిచటికి వచ్చుట !

మఱునాఁడు చంద్రనగరమునకుఁ బ్రయాణము నిశ్చయింపఁబడెను. రాత్రి చాల ప్రొద్దుమీఱి యుండుటచే యప్పటికి వారు పరుండఁ బోయిరి.

# అయిదవ ప్రకరణము

"శ్రీ ప తి క ం పె ని."

మఱునాఁ డుషఃకాలమున రవీంద్రుఁ డానందరామనాథులతోఁ బొగబండిపైఁ జంద్రనగరమునకుఁ బ్రయాణమయ్యెను.

ప్రభాతము—కోమలకిసలయకుసుమ సంశోభిత వసంతకాల ప్రభాతము. దినమణి కోమలారుణదీర్ఘ నమూత్కరసంస్పర్శచే విశ్వమానందావృతమై చలించుచుండెను. ఆ కాంతి వృక్షపాదాగ్రములపైఁ బడి యొక వింతకాంతి నొసంగుచుండెను. ఆ మనోజ్ఞ సమయంబున విహంగ సంతాన మంజుల కుహూస్వనంబులు దిగంత వ్యాపితము లగుచుండెను. వసంతకోకిల సహకార తరుపల్లవ నేపథ్యమునుండి మధుర వీణాగానంబును విస్తరించుచు కర్ణానందమును సల్పుచుండెను. భాగీరథీ పావనతోయసంజనితసుస్వనము లయప్రాయమై యుండెను.

ధూమశకటము యథాసమయమున నే చంద్రనగరమునకు వచ్చి నిలిచెను. రవీంద్రాదులు బండిని దిగివచ్చి తమకై సిద్ధముగ నుండిన చలనహేతుకశకటముపై (Motor car) పట్టణమున కేగిరి. బ్యారిష్టరు తన యతిథిద్వయమునకు సుచితగృహముల నియమించి యందు సకల సదుపాయములఁ గల్పించి మిగుల నాదరించెను. రవీంద్ర రామనాథు లిరువురును తమ నిర్ణితమందిరములఁ బ్రవేశించిరి. ఆనందుఁడు సరళను [illegible]బోయెను.

పతి యాగమనవార్త నాలకించి సరళ యాతురతచే నెదు రేగు దెంచెను. ఆమెను గాంచి యానందుఁ డోకవేఁడి నిట్టూర్పును బుచ్చి దాపున నుండిన సోఫాపైఁ బడిపోయెను. కారణము తెలియమి యా ముగ్ధ కాతరమనస్కయై ప్రాణనాథుని దాపునఁ గూర్చుండి "ఏమి! ఏమైనది?" అనెను. ఆమె వికచేందీవరసదృశ నయన యుగళముల నుండి ముక్తాఫలములు వోలె బాష్పకణములు దొరఁగ నారంభించెను. అది గాంచి యానందుఁడు మఱింత యధఃపతితుఁడై పోయెను. ఆ సరళ కోమల హృదయమును దండ్రి మరణవార్తచే నొప్పింప నాతని కిష్టము లేకుండెను. అది తలంచినప్పుడెల్ల నాతని హృదయపీఠము దుఃఖాతిరేకముచే విదళిత మగుచుండెను. సరళ మాటిమాటికిని గారణమును జెప్ప బతిమాలుచు నేయుండెను. ఆనందుఁ డిఁక నూరకుండ నేరఁ డయ్యెను. అతఁ డొకమాఱు సరళను బిగ్గ కౌఁగిలించుకొని "సరళా! మన తండ్రి మన కిఁక లేడు." అని కన్నీరు గార్ప నారంభించెను. ఈ దారుణాదేశము నాలకించి యానవశిరీష సుకుమారి వాతాహతిం బ్రచలితంబగు కుసుమహంసి వోలె చలించి "హా తండ్రీ!" యని ప్రాణేశ్వరుని బాహుపంజరమున పరవశయై పడిపోయెను.

సరళ దుఃఖమునకు మేరయే లేదు. ఆమె మూర్ఛనుండి మేల్కొనుసరి కానందుఁ డచ్చటఁ గాన్పింపలేదు. తా నాతని హస్తద్వయమున లేదు. తల్పమునఁ బరుండియుండెను. దాపున నిరువురు దాసీజనము పరిచరించుచు నాశ్వాసించుచుండిరి. ఎన్నియో విధములనో దుఃఖము శాంతమగునట్లు మాటాడిరి. పలువిధముల ధైర్యమును జెప్పుచుండిరి. కాని యందున లాభము లేకపోయెను. సరళ దుఃఖ మారకుండెను. ఇంతలో యానందుఁ డచ్చటికి వచ్చుటచే నామె శోకము శతాధికమయ్యెను. దాసు లా సంతాపమును గాంచఁజాలకయో-ఆనందుఁడుండఁ దమ కేమిపని యనియో-యటనుండి వెడలిపోయిరి. అతఁ డెంతయో

నేపామె నూటాడిరచెను. చాలకాలమువఱ కా ముఖపయోరుహాముపై యవిరళరంబుగ చుంబనవర్షము గురిసినది. అందుచే సరళ హృదయగత శోకాగ్ని చాలవఱ కుపశమించె నని మేము దృఢముగఁ జెప్పగలము. సతీ తిలకమునకు పతి ముద్దుకన్న పరమౌషధము కలదా ?

ఆనందుఁ డంతట సర్వవిషయముల నామెకుఁ జెప్పి రవీంద్ర రామనాథుల యాగమనమును దెల్పెను. "ప్రియా ! నాకుఁ దోచి నంతవఱకు నేను హంతకు నూహింపనేరకున్నాను. మామయ్య నింతటి ఘోరముగ హత్య గావింపఁ దగిన ప్రబలశత్రువు లెవరుండిరో నాకుఁ దెలియదు." అనెను.

సరళ : అయిన నా పత్తేదారు లీనేరమును కనిపెట్టఁ గలుగుదురా ?

ఆనం : నా కా విషయమున గట్టి నమ్మకము గలదు. ఆతఁడు ఖిగుల నేతికెక్కిన యపరాధ పరిశోధకుఁడు.

తానువచ్చి చాలసేపై యుండుటచే రవీంద్రునియొద్ద కానందుఁడు లేచిపోయెను. భోజనానంతర మందఱుఁ జేరి మాటాడఁ దొడంగిరి.

ఆనం : అయ్యా ! రవీంద్రా ! మీ రిప్పు డేమి చేయఁ దలంచితిరి ?

రవీం : ఆ పేటికకు వేసిన తాళముపై శ్రీపతికంపెనీవారి విలాస మున్నది. అట్టి నిర్మాణాగార మొకటి యీ యూరఁ గలదా ?

ఆనం : అవును. ఆ కంపెనీ బాగుబజారునం దున్నది అందులో తమ రేమి విశేషములను తెలిసికొనెదరు ?

రవీం : క్షమింపవలయును. నే నీ విషయమునఁ దలఁచిన కార్యసిద్ధియగువఱకు పరులు నా రహస్యవర్తనము లెఱుంగరాదు.

ఇంతలో నాకస్మికముగ నా గదిలోని కొకపురుషవ్యక్తి ప్రవేశించుటచే రవీంద్రుఁడు మఱుమాటాడక తీక్ష్ణావలోకమున నా యాగంతునివైపు దిరిగెను. నూతనుఁడు కడు దీర్ఘకాయుఁడు. ముఖమతిగంభీరముగనుండి ప్రేక్షక హృదయాకర్షిత భావపూరితమై యుండెను. ముఖ మండలి నల్లని మీస లాసహజగంభీరాకారమునకు వన్నె వెట్టుచుండెను. ఆతఁడు మిగుల దృఢకాయుఁడుకూడ నగును. ఆనందుఁ డాతనినిగాంచి "ప్రవాళా! కూర్చుండుము. ఇతఁడే కలకత్తాపుర వాస్తవ్యుఁడగు పత్తేదారు—రవీంద్రబాబు" అనెను. "ఓహో! అయిన నీ యసాధారణ మేధానిధులమూలమున హంతకులజాడ శీఘ్రముగ వెలువడఁగలదని నా నమ్మకము" అనుచుఁ బ్రవాళుఁ డొకయాసనముపైఁ గూర్చుండెను. రవీంద్రుఁడు నిజవీక్షణముల నాతని నుండి మరలింపలేదు. అందంతయు నవ్యక్తభావోదయ మగుచుండెను. ఆతని మస్తిష్కభాగమున వివిధములైనయూహాలు దాఁటిపోవు చుండెను. ప్రవాళుని ప్రథమసందర్శనముననే రవీంద్రుని కీమనోవికార మేల జనించినది? నిక్కమునకు రవీంద్రున కాతనిముఖముపై నేవియో యక్షరములు వ్రాసినట్లు తోఁచుచుండెను. వానిని గాంచి రవీంద్రుఁ డాతనిహృదయమునను చదివెను. ఫలితమిది. ప్రవాళుఁడు సందేహాస్పదుఁడఁట! రవీంద్రుని హృదయఫలకమున నీ భావము గాఢలిఖితమై పోయెను.

ఆనం : అయ్యా! రవీంద్ర! మీయిష్టమువచ్చినట్లు మీరు కార్యములను జరుపుకొనవచ్చును. నే నేమియు నభ్యంతరమును గల్పింపఁజాలను. ఏ విధముగనైనను తామీరహస్యమును వెల్లడించి హంతకుని బంధించినఁ జాలును. మే మామరణంబుఁ గృతజ్ఞులమై యుందుము.

రవీం : మీరీవిషయమై నింతదూరము చెప్పనవసరమేమియు లేదు. నేను నా సాహసశక్తులను వృథాపోనివ్వనులెండు. అయ్యా! నే నీకార్యమును కేవల పరోపకారార్థము చేయఁదలపెట్టితినికాని కేవల ప్రతిఫలాపేక్షచే కాదు.

ప్రహ : భేష్ ! ఇదికదా సజ్జనసంప్రదాయము ! అయ్యా ! పత్తేదారుగారు ! మా మిత్రుండగు కేశవపాలుని మీరు గాంచియుండ లేదు కాని, శాంతనిధులు సుగుణమండితు లీభూలోకమునఁ గాన్పింపరు. అట్టి సచ్చరిత్రుల కొసంగిన మీ యుపకారము వృథా పోదుసుమా.

రవీంద్రుఁడు డాలసిక: ప్రత్యుత్తర మియ్యఁదలంచుకొనలేదు. అప్పటికే చాలమధ్యాహ్నమై యుండినటుచేత వాఁడు రామనాథునితో శ్రీపతికొఱకై యన్వేషించుచు వెడలిపోయెను. వారచ్చటి కరుదెంచు సరికి సాయంకాలము నాల్గుగంట లయ్యెను.

అది యొకగొప్పసౌధము. అందు పలుతావులయందు పలు విధములగు చిత్రవస్తునిర్మాణములు జరిగిపోవుచుండెను. మన పత్తేదారు లదికాంచి మిగుల నాశ్చర్యచకితులై పోయిరి. ఆ వస్తుదర్శనిమగ్నులై చాల కాలమువఱకు తమ యాగమనకారణమునే మఱచిపోయిరి. ఆవల రవీంద్రుఁడు తటాలున దానిని స్మరించుకొని దాపున నిలుచుండి యుండిన యొకసేవకునిఁ గాంచి "శ్రీపతిగా రెచ్చటనున్నార" ని యడిగెను. "ఈగదియందున్నారు" అని చెప్పి వాఁడా యిరువురి నొకసుందరమగు గదియొద్దకుఁ దోడ్తెచ్చెను. వారు లోపలఁ బ్రవేశించి వృద్ధుఁడగు శ్రీపతికి నమస్కరించిరి. ప్రతినమస్కారప్రత్యుత్థానములచే నా బేహారి వారి నాదరపురస్సరంబుగ నచటియాసనములపైఁ గూర్చుండఁజేసెను.

శ్రీపతి యఱువదియేండ్లవయస్కుఁడు. వృద్ధాప్యముచేఁ గలిగిన నేత్రపాటవహీనతవల్ల కన్నులకు సులోచనములఁ దగిలించుకొని యేదియో వ్రాయుచుండెను. అతఁ డించుక లలాటమును కుంచితముచేసి చూచి "అయ్యా! మీరెవరు ?" అనెను.

రవీం : మాది కలకత్తానగరము. నన్ను రవీంద్రుఁడందురు. నేనొక యపరాధ రహస్యపరిశోధకుండను. ఇతఁడు నా బావమఱఁది.

శ్రీపతి : ఓహో! మీరేనా రవీంద్రులవారు! మీ పేరు ఇది వఱకు వినియుంటిని కాని, మిమ్మెప్పుడును చూచియుండలేదు. అయిన, పత్తేదారు లింతదూరము మా కంపెనీ కరుదెంచుటకుఁ గారణమేమి? ఏమైన చిత్రవస్తువులను కొననెంచితిరా?

రవీం : లేదు. మే మట్టియుద్దేశముతో రాలేదు. ఒకహత్యాపరాధవిషయమై మిమ్ముఁ గొన్నిప్రశ్న లడుగవచ్చితిమి.

శ్రీపతి ( భయాశ్చర్యములతో ) — ఏమంటిరి! హత్యయా! ఎవరిని హత్యచేసిరి? మాకును దానికిని యేమియు సంబంధము లేదు బాబు!

రవీం : అయ్యా! మీకు దానితో సంబంధమున్నదని చెప్పుటకు రాలేదు. ఈ చంద్రనగరమునందుండిన కేశవపాలుని మీ రెఱిఁగియే యుందురు. ఆతఁడు హత్యగావింపఁబడినాఁడు. నెలక్రిందట నాతని శవము మాకు దొరకినది——

శ్రీపతి : ఆ! ఆ! ఏమనుచుంటిరి! కేశవపాలుఁడుగారు చంపఁబడిరా? అయ్యయ్యో! ఎంతఘోరము! ఆతఁ డెంతటిసుగుణవంతుఁడు! ఎంతటి యుదారశీలుఁడు! అతనిఁ జంపిన పాపి యెవఁడండీ?

రవీం : అదియే మాకిప్పుడు తెలిసికొనఁదగిన విషయము. ఈ విషయమునఁ దాము దయచేసి నా ప్రశ్నల కుత్తరమిచ్చిన నాకు—కాదు—గతించిన కేశవపాలునికి చాల మేలు చేసినవారగుదురు.

శ్రీప : మాపై మీ కనుమానము లేదుకదా?

రవీం : లేదు. పెద్దమనుష్యులగు మిమ్ము సంశయించునంతటి మూఢులము కాము.

శ్రీపతి : అయిన నదుగుఁడు. నాకు తెలిసినదానినంతటిఁ దాఁచక చెప్పివైతును.

అప్పుడు రవీంద్రుఁడు జేబునందుండిన బీగమును దీసి చూపి, "అయ్యా! ఇట్టిబీగములు మీ కంపెనీ యందు చేయఁబడునా?" యనెను. ఆ వర్తకుఁడు దానిని గైకొని పరిశీలించి చూచి "ఓహో! ఇందు మా కంపెనీవిలాస మున్నదికదా. ఇది మేము చేయించినదే. దీనిపైని 56 అనుసంబరున్నది. ఇప్పటి కిట్టివి యేబదియాఱు విక్రితమై పోయినవి. దీనినే నేను తుదకమ్మినది.........ఓహో! జ్ఞాపకమునకు వచ్చుచున్నది. నెలక్రిందట నొక గొప్పమనుష్యుఁడు దీనిని నాయొద్ద కొనిపోయెను,

రవీం : ఆ పెద్దమనుష్యుఁడు మీకు స్మృతియందున్నాఁడా? అతని చిరునామాను ప్రాయశః మీరు వ్రాసికొనియుందురని నేఁ దలంచెదను.

శ్రీపతి : బాగుగఁజెప్పితిరి. ఇట్టి యమూల్యచిత్రవస్తువుల నమ్మి నపుడు మేము తఱచుగ విక్రయమునకుఁ గొన్నవారి విలాసముల వ్రాసికొనుట వాడుక.

రవీం : అయినఁదాము దయచేసి యా కొన్నవారి విలాసమును దెలిపిన జాల బాగుగనుండును.

రవీంద్రుఁ డొకమాఱు హాసప్రఫుల్లవదనముతో బొమ లదరించి రామనాథునివైపు చూచెను. అతఁడు "మీరన్నట్లు జరిగినది. మీ ప్రతిభ యమోఘము" మన్నట్లు సంజ్ఞఁజేసెను. శ్రీపతి చిన్నగ రాగాలాపన గావించుచు దాపునఁ గట్టగాఁబడియున్న పుస్తకములనెత్తి వెదక నారంభించెను. అంత నందులో నొక చిన్నపొత్తమును మాత్రము గైకొని యుందలిపుటలఁ దిరుగవైచుచు మిగుల విసుఁ గొందినవానివలె చూపట్టుచుండెను. తుదకు తనకుఁ గావలసినదానినిఁ

గాంచి "అయ్యా! ఆతని పేరున్నది చూడుఁడు-వినుఁడు-"56 వ నంబరు కేతకీబీగంటును కొన్నవాఁడు-మాధవలాలు, చక్రవర్తివీథి. 1032 నం, ఇల్లు. చంద్రనగరము" అనెను.

రవీంద్రుఁ డేమియు మాటాడక యూరక యా లిఖితమును గాంచుచుండెను. ఆతని చిత్తమయి తదేకాలోచనపరంపర లవిరళము లయ్యెను. అంత శ్రీపతి యాతనిఁగాంచి "అయ్యా! యోచించెద రేమి? దీనిని నోటుబుక్కున వ్రాసికొందురా?" అనెను. రవీంద్రుఁ డవునని దానినెత్తి డైరీయందు భద్రపఱచుకొని "శ్రీపతి! మీ రొకమాఱు మా వెంబడి శ్రమయనక విశ్వసించి మేము చెప్పు కార్యమును పరికించి చూచిన బాగుగనుండును" అనెను. చాలసేపటి కాతఁడు "వల్లె" యని సమ్మతించెను. అంత నా మువ్వురును కంపెనీ వదలి యావలకు వచ్చిరి.

# ఆఱవ ప్రకరణము

సందేహము

రవీంద్రుఁడు శ్రీపతి రామనాథులతో నా మధ్యాహ్నసమయమున కళింగబజారున నడచి పోవుచుండెను. ఆ తపతాపము విశేషముగ మాడ్చుచున్నను సరకుచేయక చకచక నడచు వృద్ధుఁడగు శ్రీపతిని మాత్ర మప్పుడప్పుడు గాంచి "మీకు చాల తొందరపనిని గల్పించితి" ననుచుండెను. ఆతఁ డందుల కది కష్టము కాదనియు, పెద్దమనుష్యుఁడు కేశవపాలుని విషయమున నీక నంతకన్నఁ గష్టతరమగు కార్యమును జేయ సాహసింతు ననియుఁ జెప్పుచుండెను. పత్తేదారు లాతని మనోదార్ఢ్యమును కేశవపాలుని సత్కీర్తిని గాంచి మిగుల వింత నొందు చుండిరి.

వారిప్పుడు ప్రవాళ గృహాభిముఖులై చనుచుండిరి. రవీంద్రుఁ డొకమా ఱప్పుడే యానందుని సహాయమున ప్రవాళునకుఁ దెలియ రాకుండ వాని నివాసస్థలమును జూచి వచ్చియుండెను. అందుచే దానిని వెదకుటలో నెట్టికష్టమును లేకపోయినది. ప్రవాళుఁ డా వీథియందే యొక పెద్ద మిద్దె నద్దెకుఁ దీసికొని యుండుఁ గాపుర ముండెను. రవీంద్రుఁడు తన సహచరులతో లోపలికిఁ బోయెను. ఎట్టయెదుట హాలు నందు ప్రవాళుఁ డొంటరిగ నొక పడకకుర్చీపైఁ గూర్చుండి యేదియో యాలోచించు కొనుచుండెను. ఆకస్మికముగ మన యాగంతుకులఁ గాంచి యాతఁడత్యంతాశ్చర్యచకితుఁడై లేచెను. అతనికి మాటాడుటకు

సహితము తోఁపదయ్యెను. ముఖమంతయు పాండుచ్ఛాయా పూరిత మయ్యెను. కాని మేధావి యగు ప్రవాళుఁ డొక త్రుటికాల ములో భావగోపనము గావించుకొని ముఖమునందు విలాపరసమును గనఁబరచెను. రవీంద్రుఁ డింతయును గ్రహింపక పోలేదు. అతం డేమియుఁ దెలియనివానివలె శ్రీపతి రామనాథులతో ప్రవాళుఁడు చూపిన యాసనముపైఁ గూర్చుండెను. అంత వారి కీవిధముగ సంభాషణ మారంభ మయ్యెను.

ప్రవా : అయ్యా! రవీంద్రా! మీరీపట్టణమునకు కేవలముఁ గొత్తవా రని చెప్పితిరే; ఇంతటి గృహమహార్ణవమున నాయిల్లెట్లాన వాలిడితిరి!

రవీం : అయ్యా! వలసినపు డింతయూరిలో నెవరినడిగిన దారి చూపకుందురు? మీరిచ్చట మిగుల పేరొందినవారు. కావుననే శీఘ్రముగ పథికులు చూపిన చిహ్నములను గుర్తిడి వచ్చి చేరితిమి.

ప్రవా : మీరింత యాకస్మికముగ వచ్చుటకుఁ గారణ మేది హంతకుని విషయ మేమైనఁ దెలిసినదా!

రవీం : అందులకే వచ్చియుంటిని. ప్రవాళా! చిరకాలమునుండి నీపీపురమునఁ గాపురముండుటవలన చాలవఱకు నీ స్థలవార్తవృత్తులు నీకు పరిచితులై యుండును. కాన నిటు చూడుము. ఈ పెద్దమనుష్యుఁ డెవఁడో, యెచ్చట నుండునో తెలుపఁగలవా! అందుకై యింత శీఘ్రముగ రాఁదటస్థించినది.

అనుచు శ్రీపతి చెప్పిన తాళసంగ్రహాకుని విలాసమును జూపెను. ప్రవాళుఁడు దానిని జదువుకొనెను. తోడనే యాతఁడు హృదయమున రాయిపడినవానివోలె వెనుకకు తూలిపోయి యొకమూల దాపున నుండిన శ్రీపతిపై తీక్ష్ణదృష్టులఁ బఱపెను. అతని మోము వెలవెలఁబోవు చుండెను. రవీంద్రరామనాథు లతిజాగరూకతతో వాని

ముఖభావముల నుపలక్షించుచుండిరి. కాని, ప్రవాళుఁ డెంతకాలమో యిట్లుండలేదు. కనురెప్పపాటు కాలమునఁ దన హృదయభావమును దాఁచి "ఏమి, మాధవలాలా? నా కీతని సంగతి యంతగఁ దెలియదు. ఒకమాఱుమాత్రము నా మిత్రుఁడు కేశవపాలుని యొద్ద నీతనిఁ జూచి యుంటిని. అంతేకాని మరలఁ గాంచలేదు. ఏమి! ఈతనిపై మీ కనుమానమా?" యనెను. రవీంద్రుఁడు యుక్తియుక్తముగ సంభాషణను మార్చి "ప్రవాళా! నీకును కేశవపాలునకు స్నేహము కుదిరి యెన్నేండ్లైనది?" అనెను.

ప్రవా : దాదాపుగ నాలుగుసంవత్సరము లైనది. అది యేల?

రవీం : ఈతని కెవ్వరైనఁ బగతు రున్నా రని నీకుఁ దెలియునా

ప్రవా : లేదు. నాకు తెలిసినంతవఱకు శత్రువులు లేరు.

రవీం : పోనీ, నీ వాతనికి మిగులఁ గూర్చు చెలికాఁడవు కదా! ఆతఁ డదృశ్యుఁడైన రాత్రి నీ వెందు పరుండి యుంటివి?

ప్రవా : ఏమీ, నా గృహమునందే యుంటిని. రవీంద్రా! ఏల యిట్లడుగుచుంటివి?

రవీం : ఏమియును లేదు. ఆనాఁడు నీవైన దాపున నుండఁ గూడదా యెతా! అట్లుండిన నా దౌర్భాగ్యుఁ డీయకాలమృత్యువాతఁ బడకుండ సురక్షితుఁడై యుండియుండునేమో.

ప్రవా : అయ్యో! ఇంతటి ఘోరకృత్యము జరుగు నని నాకేమి కలవచ్చెనా? అట్లైయుండిన నా ప్రాణసమానుఁ డగు నాతని నే మరక కాచియుండనా?

ప్రవాళ రవీంద్రుల కీ విధముగ సంభాషణ జరుగుచున్నంత కాలము సూక్ష్మబుద్ధి యగు రామనాథుఁ డూరక ప్రుక్కలు మ్రింగుచు నుండలేదు. అతితీక్ష్ణదృష్టులతో ప్రవాళునికిఁ దెలియరాకుండ తా మున్న గది నాలుగుభాగములను పరీక్షించుచుండెను. ఆ భవనము కడు

విశాలమై చిత్రవిచిత్ర చిత్రపటశోభితమై వెలుఁగొందుచుండెను. దేవతలయొక్క, మహాపురుషుల యొక్క, నారీవతంసములయొక్క రూపపటము లందందు మెఱయుచుండెను. అంతఁ గటాలున రామనాథుని దృష్టి రామరావణ యుద్ధపటపరోక్షభాగమున నుండిన రెండు తాళపు చెవులపైఁ బడెను. అతఁడు ఒకకాలమువఱకు వాని నట్లే వీక్షింప సాగెను. కొంతసేపటివఱ కాతనికి బాహ్యలోక మంతయు శూన్యమైనట్లు తోఁచెను. పరి పరి విధముల నూహాసమితిచే నాతఁడు స్తబ్ధభావుఁడై యుండెను. ఇంతలో ప్రవాళుని కేకల వల్ల రామనాథునకు తన యూహాప్రపంచమునుండి మేలుకువ గలిగెను. ప్రవాళుఁడు రవీంద్రునితో నించుక ఫలాహారమును జేసి పోవలసినదని వేఁడుకొనుచుండెను. తన కప్పటి కించుకయు లేశమాత్రమైన నాఁకలి లేకుండుటచే వలదని రవీంద్రుఁడు నిరాకరించుచుండెను. "మీ వంటి పెద్ద లీతీరుగ విశేష శ్రమ నొంది బడలి వచ్చియుండ నేను సత్కరింపకుండుట బాగుకాదు" అని చెప్పుచుఁ బ్రవాళుఁడు ఫలాహారపుపెట్టెను దెచ్చుటకై మెట్లెక్కి సౌధోపరిభాగమునకుఁ బోయెను.

రామనాథున కించుక యవకాశము దొరకినట్లయినది. అతఁ డంత శరవేగమునఁ బోయి పటపరోక్షభాగమున గుప్తముగ నుంపఁబడిన తాళపుచెవులను దెచ్చి తన బావకుఁ జూపెను. రవీంద్రుఁ డది గాంచి విస్మితుఁడై "వీని నేల దెచ్చితివి?" అనెను. "శవపేటికకు వేసిన బీగమున కివి సరిపోవునని నా యూహ" అని చెప్పుచు వానిని శ్రీపతికి జూపెను. అతఁడు వాని నందుకొని పరిశీలించిచూచి సంతోషప్రపుల్లుఁడై "అయ్యా! రవీంద్రా! ఇవి నీవు నాకుఁ జూపిన తాళమునకు సరిపోవును. వీని నా బీగముతో నీతని కమ్మితిని. బాగుగ జ్ఞాపకమున్నది" అనెను. అనుటయు నత్యంత విస్మయ విస్ఫారితనయనుఁడై

రవీంద్రుఁడు "అయ్యా! ఏమనుచుంటిరి? ఈ ప్రవాళునకేనా మీరు తాళము నమ్మినది?" అనెను.

శ్రీప : నాకీతనిని చూడఁగనే యనుమాన మగుచున్నది. ఆ దినము కృత్రిమరూపమున నన్ను మోసగించి శవ పేరు మాధవలాలని చెప్పిన దీతఁడే యగును. మీఁదుగ నీతని కంఠనాదమును విన నా సంశయావస్థ దూరమై పోవుచున్నది.

ఒక్కక్షణములో రవీంద్రునకు ప్రబలమగు ననుమానము ప్రవాళునిపై జనించెను. శవపేటికకు వైచిన తాళపుచెవు లీతనియింట దొరకుట, మాధవలా లనుకుమానాభిధానమున శ్రీపతియొద్ద వానిని గొనుట, వీనివల్ల నాతని కీహత్యాపరాధమునం దెట్టిదో సంబంధ మున్నదని తెలియఁజేయుచుండెను. లేకున్న నీరీతి నాతఁడావృద్ధ వర్తకుని మోసగించుటకుఁ గారణ మేమి? తాళపుచెవు లేల యతని యింట నున్నవి? ఇంతలో శ్రీపతి రవీంద్రునిమూపుపైఁ దట్టుచు 'అయ్యా! పత్తేదారుగారు! ఇటు చూడుఁడు. ఇవి 56 వ నంబరు బీగము చెవులు. వీనిపైని గూడ నా సంఖ్యయు మాకంపెనీ పేరును నున్నవి చూడుఁడు" అనెను అది గాంచి రవీంద్రుఁ డవాచ్యభావో దయమున నొకనిట్టూర్పు పుచ్చి "ఇఁక నాకీదుస్తర ఘోరమార్గము సుఖంకర రాజమార్గమైనది" అనెను. అనేకములగు యోచనలఁ జేసి రవీంద్రుఁడు ప్రవాళునిపై గభీరమగు సందేహమును నిలిపెను.

ఇంతలో మెట్లపై చప్పుడు వినవచ్చెను. ప్రవాళుఁడు వచ్చుచుండెనని వారు తలఁచి తమప్రసంగము నాపివైచిరి. అతని శీఘ్ర గమనమును గాంచి వారెంతయు వింత నొందిరి. ప్రవాళుఁడు మధుర పదార్థపూరిత మైయున్న యొకచిన్నపళ్లెరమును దెచ్చి రవీంద్రుని ప్రోలనున్న యొకచిరుబల్లపై నునిచి దాని తినుమని యెలరను

బ్రతిమాలు కొనెను. కాని వారొక్కరును వానిని ముట్టలేదు. ఇందులకుఁ గారణ మేమన నిదివఱకే వారి కాతనిపై దృఢతరమగు సందేహము కలిగి పోయినది. కాన నట్టియనుమాన మగుస్థలమునఁ దిండి తినుట సమంజసము కాదని వారి యాశయము. తమ కాకలి లేదనియు, నిప్పుడే భుజించి యిచ్చటికి వచ్చితి మనియు, మఱి యొకప్పుడు వచ్చి తిందుమనియు వారు చెప్పిరి. ప్రవాళుఁ డెంత ప్రార్థించినను ప్రయోజనము లేకపోయినది. తుద కాతనికి వారి మాటలకు సమ్మతించుటకన్న గత్యంతరము లేకపోయెను. పిదప కొంత కాలమువఱకు లోకాభిరామాయణమును ముచ్చటించి రవీంద్రాదులు ప్రవాళునియొద్ద సెలవుగైకొని వెడలిపోయిరి. ప్రవాళుఁడు కొంతసేపటి వఱకు ద్వారమున నిలుచుండి వారు దృష్టిపథమునుండి దాఁటిపోవు వఱకును జూచుచుండెను. పిదప నాతఁడు తట్టను గైకొని సౌధముపై కేగుచు "కాలము క్రూర మగుచున్నది" అనుకొనెను.

రవీంద్రాదులు మార్గమధ్యమున తాము ప్రవాళుని విషయమై మాటాడుకొనుచుఁ బోవుచుండిరి.

రవీం. అయ్యా! మీకు బాగుగ తెలిసిపోయినదా? ప్రవాళుఁడును, మాధవలాలు నొకరే యని నిశ్చయించితిరా?

శ్రీప : నా కావిషయమున సందేహ మణుమాత్రమును లేదు. ఈతఁడే నెలదినముల క్రిందట నాకుఁ బెనిమిటిం దాబీగఁ గొనెను.

రవీం : మీరిమ్మాట విషయమున నమ్ముచున్నాను. మీరింతదూర మరుదెంచి మా కమూల్య మగు సహాయమును జేసి మాకృతజ్ఞతాభివందనములకుఁ బాత్రులైతిరి.

రాము : బావా! బీగము చెవులను, నీతని మాటలను తలంచి చూడ నిక్కముగ నీ ప్రవాళునిపై నాకు ప్రబలసందేహ మొదవుచున్నది. ఈతనికి హత్యాపరాధమున సంబంధ ముండి తీరవలయును.

రహీం : నాకు మొదటినుండియు నాతనిపై నే యనుమానము కలిగినది. నా కప్పు డా స్థితికి తగిన కారణములు తెలియరావయ్యెను. శ్రీపతిగారియొద్ద నీ తాళమును గురించిన విశేషములు నాలకించి యొక పక్షమున నీ ప్రవాళుఁడే యా తాళసంగ్రహకుఁడై యుండునా యని సంశయించి, వాని నీ బేహారికిఁ జూపిన నా సందేహము నిజమగునేమో యని యెంచి యీతనిని మనవెంటఁ గొనివచ్చితిని. నా యాశ నిరాశ కాలేదు. అమోఘముగఁ బరిణమించినది. నిష్కారణముగ నాకు మొదటినుండియుఁ బ్రవాళునిపై నున్న యనుమాన మిప్పుడు దృఢ కారణములచే ప్రబలపడిపోయినది. బాబూ! రామనాథా! నీవు మిగుల బుద్ధిమంతుఁడవు సుమా! ఈ తాళపుచెవులను గనుఁగొనుటలో మన కార్యము నత్యంత సులభము గావించితివి.

రాము : బావా! మీ శక్తియుక్తుల మ్రోల నే నెంత? చండప్రచండకిరణ భాస్కరుని యెదుట హీనప్రభాలంకృత ఖద్యోత మెంత?

శ్రీప : అయ్యో! ఇది యెంతటి వింత! ఎంతటి కృతఘ్నత! ఎంతటి క్రూరము! తన్నుఁ బ్రాణస్నేహితునిగ నమ్మి, నిజప్రాణమున కన్న నెక్కువగఁ బ్రేమించుచున్న కేశవపాలు నింతనృశంసుఁడై ప్రవాళుఁ డీరీని సమయించుట చూడ నేమిచెప్పుటకును దోఁచకున్నది. ఇఁక లోకమున న్యాయ మెచ్చట నున్నది? వాత్సల్య మెచ్చట నున్నది? అంతయు మాయావృతము—జగ మంతయు హీనజన సంయుతము.

వారిప్పు డొక విశాలమగు మైదానమునందు నడచి పోవుచుండిరి. ఆ స్థల మంతయు నందందు మృదుశీతలతృణాలంకృతమై శిలాశూన్యమై

మిగుల మనోమాధుర్యముగ నుండెను. కొంతదూరము మాత్ర మిండ్లు లేవు కాని పిదప నా బయలునకు రెండువైపులయందును సమున్నతసౌధపంక్తి యుండెను. ఆ విశాలభూమియందు భిక్షుకులపట కుటీరములు కొన్నితప్ప తక్కిననిలయములు లేవు. రవీంద్రుఁడు తానాదినమునఁ దెలిసికొన్న గూఢవిషయమును దలంచుకొని యోజించుచు నమునన నడచు శ్రీపతి యనుగువాని కుత్తరము లిచ్చుచు రామనాథుని సూక్ష్మబుద్ధిని గొనియాడుచుఁ బోవుచుండెను. ఆ సమయమున నేమూలనుండియో యొక భయంకరశునకము మొఱగుచు వారిపైఁ బడవచ్చెను. దాని యుగ్రాకారమును గాంచి యది తమ కెట్టియుపాయమునైనఁ గలిగించకపోదని యెంచి యా మార్గస్థులు దాని నదలింప యత్నించిరి. వారియొద్ద నెట్టి యాయుధమును లేకుండెను. ఆ యఱపుల నాలకించి యది యొకపిచ్చిజంతువని వారు నిశ్చయించుకొనిరి. దాని నదలించుట సాధ్యమా! ప్రళయదంష్ట్రా పూరిత రక్తవక్త్రభాగమును గాంచినంతనే యెట్టివారికైన నధైర్య మొదవక మానదు. వారు చేయునది లేక యది సమీపమునకు రాకుండునటుల శిలావర్షమును గురిపించిరి. ఏమిచేసినను దాని బాధ వదలదయ్యెను; మువ్వు రొకరీతిగఁ దోలినను వెనుదిరిగి పోకుండెను; పటుతరాగ్రహచిత్తముతో వారువైచినరాళ్లను గొఱుకుచుండెను—బొబ్బరించుచుండెను—ముంగాళ్లనెత్తి వారిపై దూఁక నెగురుచుండెను — నయనగోళములు కషాయితములై పోయెను. అంత రామనాథుఁ డిఁక రాలను రువ్వక తన చొక్కాజేబునం దుండిన యొకవస్తువును దీసి దానిపై విసరివైచెను. పూర్వపద్ధతి ననుసరించి యా కుక్క తనపై రువ్వఁబడిన యా వస్తువును పండ్లమధ్యఁ గఱచుకొని మహాకోపమున నమలి మ్రింగివైచెను—ఆశ్చర్యమాశ్చర్యము!! తోడనే యది కిక్కురుమనకుండ క్రింద పడిపోయెను. అది గాంచి

రామనాథుఁ డొక యుట్టహాసమును గావించెను. రవీంద్ర శ్రీపతులు ఆశ్చర్యాంత చేతస్కులై నిలువఁబడిపోయిరి.

రవీం : బాబూ ! ఇది యెట్లు వచ్చినది ?

రామ : ఇదిగో ! ఈ క్రింద నింకను బడియున్న శకలములను జూడుఁడు. సంగతులు తెల్లమగును.

రవీంద్రుఁడు వానిని జాగరూకతతో నెత్తి చూచెను. అది మిఠాయి ముక్క.

రవీం : ఇది మిఠాయి ముక్క. ఎక్కడనుండి తెచ్చి యుంటివి ?

రామ : ఇది నేఁడు ప్రవాళుఁడు మన కర్పింపఁ దెచ్చియుండిన పళ్ళెరము లోనిది.

ఆ మాటల నాలకించిన తోడనే రవీంద్ర శ్రీపతు లాశ్చర్య చకితులై నిలుచుండిరి. కొంతసేపటివఱకు వారినోట నెట్టి మాటలును వెలువడ వయ్యెను.

రవీం : ఇది విషాక్తమా ? లేకున్న దీనిని తినినంతనే కుక్క యేల గతించును ?

రామ : బావా ! విషలిప్తమైనది, కానిది విస్పష్టముగఁ దెలియుచున్నది కాదా ! ఇట్టి భయంకర పాషాణ భోజనానంతర మెట్టి ప్రాణి భూమిపై నిలుచును ?

శ్రీపతి : అహాహా ! ప్రవాళుఁడు మమ్ము విషప్రయోగముచే సంహరింప నెంచెను గదా ! మన యాయువులు గట్టిగ నుండుటం బట్టి నిరాకరించి వచ్చితిమి. లేకున్న ముగ్గుర మొక్కరీతిగ—నొక్కక్షణము ననే—జగమున కెఱుక లేకుండఁగనే—పరలోకమున కేగి యుందుము.

రవీం : రామనాథా! నీ విట్లు దీనిని తెచ్చుట మిక్కిలి యుప యుక్తమైనది సుమా! నే ననన్నట్లు నీ బుద్ధి కుశలత యద్వితీయము—

రామ : బావా! అసమాన మేధావంతు లగు మీరీ స్వల్ప విషయమును దెలిసి కొనకుండుట మిగుల చిత్రముగ నున్నది. అవును. ఎట్టివారి కైన నొకొక్కప్పుడు మఱపుండుటయును గలదు గదా! అట్లని తలఁచి మీ ముగ్గురకుం దెలియకుండ నప్పు డొక మిఠాయి తునుకను దీసి దాఁచుకొంటిని. నాకు దాని యాకారమును గాంచి ప్రథమముననే యనుమాన మొదవినందున నట్లు చేసితిని. దానిని బరీక్షింపఁ దగినతఱికై కాచి యుండిన నా యాశ సఫలీకృత మయ్యెను.

రవీం : అన్నా! నీవు మిగుల బుద్ధిమంతుఁడవు. నినుబోటి సహకారు లుండుట చేతనే నా కార్యము లన్నియు నిరాఘాటముగ నెఱవేఱు చున్నవి. (అని కౌఁగిలించు కొనెను.)

శ్రీప : అబ్బా! ఈ విష మెంత దారుణమైనది! అత్యంత బలాక్రమైయున్న యీ శునక మొక నిమిషకాలమునఁ బ్రాణములను దొరఁగెను కాదా!

రామ : బావా! ఈ విషయమై మీ కేమి తోఁచు చున్నది! మనుష్యు విషమిడి చంపుటచే ప్రవాళిన కెట్టి లాభ ముండును! ఆతఁడీ హంతకవర్గము లోనివాఁ డనుటకు సందియము లేదు—

రవీం : ఆ సంగతులను యోజించుట కిది యుక్తస్థలము గాదు. ఇంటికి పోయి కావలసినంత మాటాడుదము రమ్ము ... ... ... ... ...
అయ్యా! శ్రీపతిగారు! దయయుంచి మీరు చూచిన యీ చిత్రములలో నొక్కదానినైన నిప్పుడు పురమున వెల్లడింపకుఁడు. అంత్యసమయము వఱకు వేచి యుండిన సత్యము యదృచ్ఛారీతిగ లోకమునఁ బ్రకటింపఁ బడును.

శ్రీపతి మంచిదని చెప్పి వారివద్ద సెలవు గైకొని తనగృహాభిముఖుఁడై చనెను. రవీంద్రరామనాథు లీకనా ప్రసంగమును దారిలో నుత్తరకతిన్నగ నింటి కేగిరి. అప్పుడీదినమణి యస్తాద్రిశిఖరారోహణముం గావించి రాగరంజిత వసూత్కరకర సహస్రంబులతో లోకములను హెచ్చరించుచు చరమసముద్రంబున నంతరించుచుండెను!!!

# ఏడవ ప్రకరణము

## హంతకుఁడు

రాత్రి భోజనానంతరము రవీంద్ర రామనాథు లొకయేకాంతస్థలమునఁ గూర్చుండి యిట్లు ముచ్చటించుచుండిరి.

రవీం : రామనాథా ! ఆ తాళపుచెవు లేవి ?

రామ : ఇచ్చటనే యున్నవి, బావా ! ఇఁక సందేహ మేల ? ప్రవాళుఁడే శ్రీపతి చెప్పిన మాధవలాలు, మాధవలాలే ప్రవాళుఁడు.

“ నాకు మొదటినుండియు నదియే యనుమానము. ” అని చెప్పుచు రవీంద్రుఁడు తనయొద్దనుండిన బీగమున నా చెవు లమర్చి చూచెను__అంతయు సరిపోయినది ! ఇఁక ననుమాన మేల !! ముంజేతి కంకణమున కద్దమా !!!

రవీం : రామనాథా ! ఇఁక మనము పొరఁబడుట కవకాశము లేదు. అంతయుఁ దెల్లమైపోయినది. ప్రవాళుఁడు నేరగాఁడు కాకున్నఁ బత్తేదారులకుఁ బాషాణప్రయోగ మేల చేయ యత్నించును ? మన మిదివఱకు వానితో నెట్టిపరిచయమును గలిగించుకొని యుండలేదు కదా ? ఒండొరుల ముఖావలోకనమునైనఁ జేసికొనలేదు. ఇఁక విరోధ మెద్ది ? నాకు చూడ నపరాధులకును తద్రహస్యభేదకులకు నుండునట్టి ద్వేషమే నేఁడు ప్రవాళునకును మనకును గలిగినది. ఇందు నీయభిప్రాయమెట్లున్నదో చెప్పుము చూతము.

రామ : బావా! ఇఁక నా యభిప్రాయము నప్పుడే తెల్పితిని గాదా? ప్రవాళుఁడు హంతకులలో నొకఁడు.

రహీం : అయిన బహుకాలమునుండి తనపై నమ్మిక ముంచి యత్యంత వాత్సల్యమును జూపుచుండిన కేశవపాలు నీరీతిని చంపుటలో హంతకుని యుద్దేశ మతి ఘోరతరమై యుండవలయును. ప్రస్తుత విమర్శాలోచన వల్ల నా రహస్య మేదియో మనకు మాత్రము తెలియకున్నది. ఆ నాఁ డీ దురాత్ముఁడు రాత్రి భోజనానంతర మేవిధముగనో కేశవపాలునిఁ దన గృహమునకు రప్పించుకొని నేఁడు మన కొసంగిన మిఠాయి వంటిదాని నొసంగి కడతేర్చి యుండును. అహా! ఎంతటి ప్రవృద్ధ ఘోరాపకారము! ఎంతటి దురాశయము! ప్రాణాధికుం డగు నెచ్చెలిని నమ్మించి సమయించిన యీ దుర్జాతి ప్రవాళుఁ డిహలోకమున నిఁకెంతటి ప్రబలాసురుఁడై యుండును! రామనాథా! ఇఁక యోచించుట వలన ప్రయోజనము లేదు. కావలసిన భావికార్యముల శీఘ్రముగ నెఱవేర్త్రము.

రామ : ఏమి, మీ రాతని నిప్పుడపరాధిగ బంధింతురా?

రహీం : ఇఁక నందుల కేల సంశయింపవలయును? తగిన నిదర్శనములు గలవు కదా! ఆలసించిన మన చర్యల ననుమానించి యీ దురాత్ముఁ డెందేని బరుగిడి పోయిన గతి యేమి! చేతఁ జిక్కిన పిట్టను తామసించి వదలఁదగునా? నేఁడే యర్ధరాత్రమున వానిగృహము నాకస్మికముగ ముట్టడించి తీరవలయును. నీ వీ క్షణముననే పోయి పోలీసు ఉద్యోగస్థ నడిగ యిరువురు రక్షకభటులను దోడ్కొని రమ్ము.

రామ : బావా! మీ యోచనల కన్యథా యుండునే! అవి యమోఘములు కావా! మీ యాజ్ఞ నెఱవేర్చ వచ్చెదను.

అని చెప్పుచు రామనాథుఁడు వెడలి పోయెను. రవీంద్రుఁడు తన వెంట నుండిన సేవకుని గాంచి "కుశాలవా! నీ వీ యింటియొద్ద నీ రాత్రి కావలి కాచి యుండవలయును. చిన్న బాబయ్యతో నే నిప్పు డూరిలోనికి హంతకుల జాడఁ దెలియఁగఁ బోయెదను. బహుశః వచ్చుటకు చాల కాలము పట్టును." అనెను. వాఁడును వల్లె యని యచటనే పరుండెను. రవీంద్రుఁడు చాలసేపటి వఱకు నేదియో యోచించు కొనుచునే యుండెను. ఇంతలో నానందసాగరుఁ డట కరుదెంచుటచే నాతని యేకాంతమున కంతరాయము గలిగెను. వా రిరువురు నొకచోటఁ గూర్చుండి యిట్లు ప్రసంగించు చుండిరి.

ఆనం : అయ్యా! రవీంద్రా! శ్రీపతి కంపెనీకి వెడలినందున విశేషము లేవైనఁ దెలియ వచ్చినవా?

రవీం : మిక్కిలి యమూల్య విషయములు తెలిసినవి.

ఆనం : అయిన నేరమున నెంతవఱకుఁ జని గావించితిరి?

రవీం : ఎంతవఱ కన నేల? సాంతముగనే. ఇఁకఁ గొన్ని దినములలో హంతకుల నెల్లఁ బట్టి న్యాయస్థానమున నిలుచుండఁ బెట్టఁగలము.

ఆనం : (ఆశ్చర్యమున) ఏమి, హంతకు లెవరని తెలిసినది? వా రెందున్నారు?

రవీం : ఆనందసాగరా! నేను చెప్పిన నీవు నమ్మవు కాబోలును. ఆ పాపి, మీ యింటఁ గుడిచి మీ కత్యంతాప్తుఁడుగ నటించి గోముఖ వ్యాఘ్రమై ప్రవర్తించెడి సుమా!

ఆకాశమునుండి పిడుగు పడినట్లనిపించి కొంతవఱ కానందుని భావోదయ ప్రాణముల బడచియై డెను. అత్యంతాశ్చర్యముచే తల తిరిగిపోవు చుండెను. అతనికి రవీంద్రుఁ డనుచున్నది నిక్కమా యబద్ధమా యని సంశయ మొదవెను. తుద కా సంభ్రమావస్థ నడఁచుకొనలేక లేచి

"అయ్యో! ఏమనుచుంటిరి? ప్రవాళుఁడు మామగారగు కేశవపాలుని హత్య గావించెనా? మీరు పొరఁబడలేదుకదా?" అనెను. రవీంద్రుఁడు నగుచు "మీరీవిషయమున నంతగ ఆశ్చర్యపాటొంద వలసినదే. నిరంతరసహచరప్రాణతుల్యు నెవరగాఢక్రూరహృదయునిఁగ నెఱుంగుదురు! వెన్నెల వేఁడియగునని తలంతురా? ప్రవాళుఁడు మీరనుకొన్నట్లు విశ్వసనీయుఁడు కాఁడు. భీకరస్వరభీకరభుజంగము! వానికి నాలుక తీపు; లోన విషము. అట్టివానిని దఱిఁజేర్చుకొన్నందు కే యట్టియనర్థకము సంఘటిల్లినది. ఇట్టిమిత్రద్రోహులను నేనెందును కని విని యెఱుంగను. ఆనందా! ప్రస్తుతము కొన్నిబలమగుకారణ ములవల్ల వానిని బంధింప నీ రాత్రియే పోయెదము." అని తాము చందనగరమునకు వచ్చిననాఁటినుండి నాఁటివఱకు జరిగినవిశేషముల నన్నిఁటిని జెప్పెను. రవీంద్రుఁ డీవిషయమును దెలుపుచున్నంతవఱ కానందుని హృదయభాండమున నుష్ణరక్త ముడికిపోవుచుండెను. అగ్రహపూరితములై నయనగోళములు రక్తరాగరంజితములై యగ్ని స్ఫులింగములఁ జిమ్ముచుండెను. భయంకరప్రహతభూరుహమువలె నాతనిమేను నఖశిఖపర్యంత మగాధకోపానలమున ప్రచలిత మగు చుండెను. అవాచ్యభావ ఘూర్ణితహృదయములో నాతఁడు దంత సంఘట్టనఁ గావించి "ఔరా! ప్రవాళపాతకా! దుర్జాత! చండాలా! ఎంతపని గావించితివి? నీవంటిదుర్భరదురూహ దురాత్మునిఁ దెలియ మైతిమికదా! కాలకాకోదరంబు నునిచినట్లు నిన్నింతకాల మింట నుంచుకొని రక్షించితిమి, ఆ మహోపకారంబున కిది ఫలమా? ఇది ఫలమా? ఓరీ! రాక్షసాధమా! నీ పాపంబునకుఁ బరిమాణంబులేదు, నీకు స్వర్గంబునఁ దావులేదు. నీ శిరస్సును వేయివక్కలుగఁ గొట్టినను నాకసి తీఱదు, ఆహా! దుర్విదగ్ధా! ఘోరపాతకా! కఠోరహృదయా!"

అని నేలఁ దన్నుచు రవీంద్రుని గాంచి "అయ్యా! మీరింతవఱ కేల యాలసింపవలయును? మీకనుమానము జనించిన యుత్తరక్షణముననే యాశతసహస్రపాపపంకిల శిరమును చూర్ణీభూతముగఁ జేయలేక పోయితిరా? అయినది పోనిండు. ఇప్పుడు నడువుఁడు. ఎట్టివిచారణయును వలదు. ఈ నిమిషముననే వానిహృదయము నీ పిస్తోలున కెరగావించె దను" అని గర్జింప నారంభించెను. రవీంద్రుఁ డాతనిని శాంతింపఁజేసి "ఆనందా! అట్లు చేయరాదు. అట్లు చేసిన మా ప్రయత్నము లన్నియు భస్మాహుతులగును. నీకీపనియం దెట్టిజోక్యమును వలదు. ఆఘోరా ఘునిపాప రక్తముచే నీ హస్తముల నపవిత్రముగఁ జేసికొనకుము. ఇందుకు చేయవలసినదానిని నెఱవేర్చుకొనుటకు మేముంటిమి కాదా! ఏమియుఁ దెలియనివానివలె నంతయు సహింపుము. మేమీరాత్రియే వానిని బంధింతుము." అనెను. చాలకాలమువఱకైనను ఆనందుఁడు శాంతహృదయుఁడు కాఁడయ్యెను. అదెట్లు జరుగును? ఎవ్వఁడు నిష్కపట హృదయునివలె దరిఁ జేరి తమయింట బ్రతికి యత్యంత విశ్వసనీయుఁడని నమ్మఁబడియుండెనో, యెవ్వనికుహనాగుణ ప్రవర్త నము లెల్లర హృదయముల నాశ్రయించి యుండెనో, యెవ్వనిగాంభీర్య యుక్తియుక్తప్రసంగము లగాధప్రేమప్రబోధములై లోకము నంధత్వ మున ముంచెనో, యట్టిప్రవాళుఁ డిప్పు డధమాధమ ప్రవర్తన దుర్జనాధికుం డైపోయెను. ఆనందుఁడు కలనైన నొకనాఁడు నిట్లగునని యెంచి యుండలేదు. తుద కాతఁ డేదోయొకవిధముగ హృదయశాంతి నొంది "అయ్యా! రవీంద్రా! ఇట్లగునని తలంచియుండలేదు. ఏమైన మీరు త్వరగ నా ద్రోహిమరణవార్తను నాకుఁ దెల్పినఁగాని నాహృద యము చల్లపడదు. మీరు మా విషయమై విశేషశ్రమ నొందు

చున్నారు, మే మెంతయుఁ గృతజ్ఞులము, ఇఁక నే సెలవుఁ గైకొందును” అని చెప్పుచు వ్యత్యస్తభావహృదయముతో నాగది వదలిపోయెను.

అప్పుడు రామనాథుఁ డరుదెంచి పోలీసువారివల్ల నెంతటి సహాయము కావలసియుండునో దానిని సరిచేసి వచ్చితి నని చెప్పెను. రవీంద్రుఁ డందులకు సంతసించి హంతకునిఁ బట్టఁదగినవస్తువులను సేకరించుకొని ప్రళయభయంకరంబగు నాయుద్ధము రేయికై వేచి యుండెను.

# ఎనిమిదవ ప్రకరణము

## ని శీ థ ము

రాత్రి గాఢనిశ్శబ్దయుతమై తరలిపోవుచుండెను. ఘోరాంధకారమున ధారుణీచక్రమునకే తనసహజ చలనమార్గము గోచరింపకుండెను. ప్రాణికోటులు నిద్రాదేవియంక పాళిని జేరి యా యనంతసుషుప్త్యవస్థయం దనూనానందరసమును గ్రోలుచుండిరి. ప్రబలసాంద్ర జలదపటలముచే నింగి నిబిడీకృతమై యంతయు నేకాకార మగు కారుమబ్బువలె గోచరించుచుండెను.

ప్రవాళుని గృహమునుండి 3-4 ఫర్లాంగులవఱకు నెట్టిగృహము లును లేవు. ఆ యింటిముందుభాగమున సాంద్రతమ మగు నొకచిన్న యుపవనము కలదు, తక్కినభాగములందు సహిత మతిమాధుర్య సౌరభసంయుక్త మగు నుద్యానవన మొకటి యుండెను. గృహమేధి కానాఁటి రాత్రి నిద్దుర యబ్బినది కాదు. అందులకుఁ గారణ మేమి? అతఁ డొకవిశాల మగుగదిముందు కూర్చుండి యనన్యచింతావృతుఁడై యేదియో యోచించుకొనుచుండెను. హృదయ మత్యంతము గండరగోళమున కధీనమైన ట్లప్పుడు మూలుగుచుండెను. ఆ మందిరమున విశేషముగ నెట్టివస్తువులును లేవు. రెండు—మూఁడు—కుర్చీలును, యెంతకొట్టినను శబ్దోత్పన్నము కానంతటిమృదు మేదుర మగు మఖమల్ గుడ్డతో చేయఁబడిన పెట్టియును, నొకబల్లయును దప్ప మఱేమియు లేదు. ప్రవాళుఁ డా పేటికసమీపమున నొకయాసనముపైఁ

గూర్చుండి జేసెడు చుట్ట నొకదానికి నిప్పు నంటించి పొగఁ బీల్చు చుండెను. ఒక మూలయందొక కాచపాత్రమున మిగుల మలినమగు నొక దీపము వెలుఁగు చుండెను. ద్వారము లన్నియు బంధింపఁబడి యున్నవి. వెలుపల నిశ్శబ్దదేవత నిరాఘాటముగ సంచరించు చుండెను.

ప్రవాళునకు మనస్స్థిమితము లేకుండెను. అతఁ డొకమాఱు తలుపులను దెఱచుకొని వెలుపలికి వచ్చి చూచెను. ప్రకృతి యాతని హృదయాంతరాళము వోలె నిర్మలము గాక కటికిచీఁకటిచే నిండి యుండెను. చావడియం దాతని సేవకుఁ డగు మాధవుఁడు గుఱకలు పెట్టి నిద్రించు చుండెను. ప్రవాళుఁ డటునిటు చూచి మాధవుని తన్ని లేపి చాలవఱకు వాని చెవిలో దేనినో యుపదేశించి తన చేత నున్న యొక చిన్న సందూకమును వాని చేతి కిచ్చెను. వాఁ డగాధనిద్రాదేవికి సెలవిచ్చి తానా పెనుచీఁకటి సంద్రమున నిమగ్నుఁడై యా యెదుట నుండిన వనములోనికిఁ బోయెను. ప్రవాళుఁడు మరల ద్వారబంధన గావించుకొని వచ్చి పూర్వాసనముననే కూర్చుండెను. ఆతని యూహ లేవియో, యామనోమార్గమున తిరలుచుండు యోచన లేవియో యెవ్వరు చెప్పఁగలరు?—అప్పుడే యూరి యందలి పెద్ద గంట యొంటిగంటను కొట్టినది.

ప్రవాళుని యూహా సమితిలో నొక్కదానికైనను స్థిరప్రకృతి లేకపోవు చుండెను. అన్నియు నవాచ్య జవగతిని దాఁటి పోవుచున్నవి. ఆతని కింత యోచన లేల? రవీంద్రాదులు తన్ను బంధింప వత్తురని యాతనికిఁ దెలియునా? ఏమో, యెవరు చెప్పఁగలరు? అపరాధి కవయవములం దంతటను గన్నులే—ఎందు చూచినను ననుమాన పరంపరలే—ఎప్పుడును భయావేశములే. ప్రవాళుఁ డసాధారణుఁడు.

అద్వితీయ బలశాలి—అసమాన మేధావంతుఁడు. అతఁ డెట్టి దుస్తర కార్యము నైన నవలీల నెఱవేర్చు చుండును.

నిముసములు గడచి పోవుచుండెను. ఇంతలో గదితలుపుల నెవరో చఱచిన ట్లయ్యెను; ప్రవాళుఁడు దిగ్గున లేచి పోయి తలుపులను తెఱచి చూచెను. ఎవ్వరును గాన్పింపరైరి. అతఁ డటు నిటు చూచెను.—"ఎవరు వారు!" అని ప్రశ్నించెను—అవియు నిరర్థకము లయ్యెను. తుద కది తన మనోవైకల్యసంజనిత భావోదయ మని తలంచి మరల కవాట బంధనము గావించి యథాస్థానమునకు వచ్చెను—మరల ద్వారమున చప్పుడు!!! ప్రవాళునకు చాల కోపము, విసుగు జనించెను. అతఁడు "ఎవరా పంద? మాటాడ రాదా?" యని గర్జించుచు వచ్చి మరల ద్వారమును తెఱచెను. ఎదుట రవీంద్ర రామనాథులు పోలీసు దుస్తులతో వచ్చి నిలుచుండి యుండిరి!! అది గాంచి ప్రవాళుఁడు నిర్విణ్ణుడై నిలుచుండెను!!!

రవీంద్రుఁ డొకమాఱు మిద్దె విరుగున ట్లట్టహాసము జేసి "ఓహో, ప్రవాళా! నీ కీ యపరరాత్రి యందీగతి నిద్రాభంగమును గావింపను. కొంచెము పని యుండుటచే నిట్లు చేయవలసి వచ్చెను" అనెను. ప్రవాళుని ముఖ మత్యంత భయావేశమున నల్లఁబడినట్లుండెను. రవీంద్రుఁ డన్నది యాతనికి బాగుగ వినఁబడ లేదు. అప్రయత్నముగ "ఏమి పని?" యని యొకమా ఱనెనే కాని తానేమన్నది పిదప తనకే తెలియక పోయెను. "నీ పేర నొక కాగితము వచ్చియున్నది. కైగొనుము" అని చెప్పుచు పత్తేదా రొక కాగితమును దీసి యాతని చేతి కిచ్చెను. ప్రవాళుఁడు దాని నామూలాగ్రముగ చదివి భయాకులుఁడై చీత్కారముచే తూలిపోవుచు "ఏమిది? రవీంద్రా! నా పేర నీ వారంటుపత్ర మేమి?" యని యాతఁడు శరీరము ప్రచలిత

మనుచుండ, భీతచిత్తముతో వచ్చి యథాస్థానముపైఁ బడిపోయెను. తన హృదయభావము నెంతగుప్తముగ నుంప యత్నించినను సూక్ష్మగ్రాహియగు రవీంద్రుఁడు వాని చర్యలను గమనించుచునే యుండెను. పత్తేదారులును వచ్చి [illegible] లునుండిరి. వారి చేతులయం దతికాంతి[illegible] రెండు [illegible]కోవులు మెఱయుచుండెను. ఇంతయును గాంచి ప్రవాళుని హృదయము క్రుంగిపోవుచుండెను.

"ప్రవాళా! కేశవపా[illegible] హత్యా[illegible]నకై నిన్ను బంధించుచున్నాము" అను[illegible] రవీంద్రుని ముఖమార్గమున వెడలఁగనే ప్రవాళుని హృదయము వెలవెలఁబోయెను. ఏప్రేతమునకు నట్టివిస్ఫార తేజ ముండదు!! హృదయము దడదడ కొట్టుకొనిపోవుచుండెను; రవీంద్రున కెట్లుత్తర మొసంగవలయునో తోఁచినది కాదు. కాని, నిరుపమధైర్యోద్రిక్తుఁ డగు ప్రవాళుఁ డెంతకాలమో యిట్లుండ లేదు. ఇంతయుఁ గొన్నినిముసములవఱకే. పిదప నా పూర్వపరిచిత కల్మషాక్త భీకరాట్టహాసములు — భయంకర రాక్షసనిభగభీర తేజోభావము — హృదయదందహ్యమాన రూక్షతీక్ష్ణవీక్షణములు దృశ్యమైనవి. ఆతఁ డప్పుడు తన మనోభావమును వెలిపుచ్చక విస్మయ విస్ఫారితలోచనములతో "రవీంద్రా! ఏమనుచుంటివి? నా ప్రాణమిత్రుఁ డగు కేశవపాలుని నేను జంపితినా! హా! ఎంతటి మోసము! నీకీయనృతమును చెప్పినవా రెవ్వరు?" అనెను.

రవీం: ప్రవాళా! నీవు దాఁచిన నీ క్రూరకృత్యములు దాఁగునను కొంటివా? లోకము నంత ధీరతతో మోసగింపఁజాలవుసుమా. నీవు హంతకుఁడవు—కాకున్న నీ హత్యాపరాధములలో నొకఁడవు. దీని నొకరు చెప్పనేల? అంతయు నా యనుభవము చేతనే గ్రహించితిని.

ప్రవా: ఎట్లు గ్రహించితివి? ఈ కుపరిబుద్ధి నేర్పినవా రెవ్వరు!

ప్రవా : మోసము ! అంతయు మోసము ! రవీంద్రా ! నాకు నా శ్రీపతికి పూర్వ మొకానొక భయంకరమగు విరోధము కలిగి యుండెను. అది నేటివఱకు మా హృదయములందు ప్రజ్వలించుచునే యున్నది. నాపై కసి దీర్చుకొనుటకు వాఁడిట్టి పన్నుగడ పన్ని నన్ను మోసగించి నా కొంప దీయ యత్నించెను కాఁబోలు. మోసము ! రవీంద్రా ! మోసము. నమ్మకుము.

రవీం : (నగుచు) ప్రవాళా ! నీకథ లత్యంత చిత్రముగ నున్నవి. నీ వెన్ని బొంకులు బొంకిన నేమి ? నేను నమ్మను. నే నంతయు యోచించియే యున్నాను. మఱి యొకటి. నేఁడు నీ యింట దొరకిన తాళపుచెవు లా శవపేటిక తాళమునకు సంబంధించినవి. అవి నీ యొద్ద కెట్లు వచ్చినవి ?

అని చెప్పుచుఁ దనయొద్ద నుండిన బీగము చెవులను దీసి చూపెను. వానిని బరిశీలించి చూచి ప్రవాళుఁడు కొంతసే పూరకుండి మరల నిట్లనియెను. "రవీంద్రా ! నీ వింత మేధావి వయ్యును నెంత శీఘ్రముగ గోతియందు పడిపోవు చుంటివి ! ఇంతయు నీకు మోస మని తెలియక పోయెనా ? నా విరోధులు పన్నిన గూఢతంత్రములచే నీవి ట్లమాయకుఁడ వగు నన్ననుమానింతువా ? ఈ బీగము చెవులు నా యింటివి కావు. ఒకవేళ నున్నను నేను బుద్ధిపూర్వకముగఁ దెచ్చి కొన్నవి కావు. ఎవరో యింట పాఱవైచి యుందురు." అనెను.

రవీం : అయ్యా ! నీ చాతుర్యమును చాలింపుము. పరులు వీనిని నీయింటఁ బడవైవ లేదు. ఈ దినము మధ్యాహ్నమున నీయింటికి నేను రామనాథుఁడును వచ్చినపుడు మమ్మాదరించువానివలె నీవు ఫలాహారములను తేఁబోయినపు డా రామరావణ యుద్ధపటమునకు

వెనుక నివి తగిలింపఁబడియుండుటను చూచితిమి. అప్పుడే రామనాథుఁ డనుమానించి వానిని దెచ్చి నాకిచ్చెను. నీవింట నుండుతఱి నెట్టి శత్రువు వచ్చి యంతధైర్యముతో నీకు తెలియరాకుండ నిట్టిపనిని జేసిపోవును ! నీ సమక్షమునఁ జేసియుండిన నుండవచ్చును గాని పరోక్షమున పరులు చేసినది కాదు. ఇదంతయు నీ మాయాకృత్యము. నీవు మహామారీచుఁడవు. కపటతంత్రకుశలుఁడవు. అది యుండనిమ్ము ! ప్రవాళా ! ఈ ప్రశ్న కుత్తర మొసంగుము. అన్నిటియందును బొంకినట్లు దీనియందు చేయఁజాలవు. నీ ధూర్తత బట్టబయలై పోయినది. నేఁడు మాకుపహారముగ నర్పించినమిఠాయిముక్క లెక్కడివి ?

ప్రవా : నా యింటియందు నేను తయారుచేసి ప్రతిదినము నే నుపయోగించునవి.

రవీం : కాదు, అది కల్ల. నీవు మా కొసంగినవి విషపూరితములు. వాని మూలమున నించుకంతయు జడియక మువ్వురు ప్రాణముల నపహరింప యత్నించితివి, ఇంతియే చాలదా నీ పెద్దమనుష్యుని గుణమును వెలిపుచ్చుటకు ? ఇట్టి సద్గుణవంతునకు కేశవపాలునిహత్య విషయమున సంబంధము లేదన్న నెట్లు నమ్మఁదగును ? మమ్ము నిరాఘాటముగఁ జంప సాహసించినధీరుఁడ వాయమాయకుని నమ్మించి రప్పించి విషమిడి పరలోకమున కంపితి వన్న నిందు విశేష మేమున్నది. నీవిఁక తప్పించుకొనఁజాలవు. నాచేఁ జిక్కితివి. నీ యత్నములు నిరర్థకములు. ప్రవాళా ! నీ దుష్కార్యముల విషయ మొకరు వచ్చి నాకుఁ జెప్పుటటుండ నీ ముఖభావమే ప్రత్యక్షసాక్షిగ నున్నది.

రవీంద్రుఁ డన్నట్లు ప్రవాళుని మోము భయోత్పాతమున వికారము నొందెను. అందెట్టి మానవకళయు గోచరించుట లేదు. ఆతఁడు నిర్జీవప్రతిమ యైపోయెను. హృదయ మతిభయంకర కల్పనా

దేశమున నసాధారణముగ శబ్దించుచుండెను. తనగుట్టంతయు బట్టబయలైపోయినది. దాఁచుట కవకాశము లేదు. బొంకులు నిరర్థకములు సురిగి పోవుట యసాధ్యము. ఇఁకఁ బ్రవాళుఁ డేమి చేయఁగలఁడు? తాను పత్తేదారులకు విషప్రయోగముచేయ సాహసించుట నిక్కము. దానిని వారేవిధముగనో కనుఁగొనిరి. ఇఁక తనకు దారి యేది? దాని నెట్లు కప్పిపుచ్చఁగలఁడు? తుదకు ప్రవాళుఁడు మనోధైర్యమును జిక్కఁబట్టి యిట్లనెను. "రవీంద్రా! నీకు వృథా వయసు మీఱి పోయినదే కాని బుద్ధి రాదయ్యెను. నీవు నన్ను హంతకునిగ నిశ్చయించుటలో నెంత పొరఁబడుచుంటివో నీకింకను తెలియరాదయ్యెనా? ఇన్నికృత్రిమములను శ్రీపతి చేసినవి. నాపైనుండువిరోధమునకు వాఁడీవిధముగఁ బగసాధించుచున్నాఁడు—" అని చెప్పుచుండఁగనే రవీంద్రుఁ డడ్డువచ్చి "ప్రవాళా! నీవాచాలత చాలింపుము. కనులార నేఁ గాంచినదానిని కాదని నిరూపించెదవా? నీవీరవీంద్రు నొకనాఁటికిని మోసగింపనేరవు. నీ యబద్ధపుఁగూతల నాలకించి వానిని నమ్మి నిన్ను వదలిపోదు ననుకొంటివా?" అనెను.

ప్రవా: అయిన నీవిప్పుడు నన్నపరాధిగ బంధింతువా?

రవీం: అవును కరపాదబంధనములతో కారాగారమునకు తీసికొనిపోవుటకే యిట కరుదెంచితిని. నీవిఁక పాఱిపోనేరవు.

ప్రవా: రవీంద్రా! నేను కేశవపాలుని సంహరించితి నని నమ్మితివా?

రవీం: నమ్మితిని. మనోవాక్కాయకర్మములసాక్షిగ నమ్మి యీపని చేయుచుంటిని. నీవన్నరీతి నే నవివేకిని గాను. నీకు వివేకమును గఱపనేర్చిన వివేకిని. ఒక్కయడుగైనఁ గదల్పకుము. జాగ్రత్త.

అని చెప్పుచు నాతఁడు రామనాథునితో మఱింతదాపున నిలు చుండెను. ప్రవాళున కింక గత్యంతరము లేకపోయినది. ఆతని కేమి చేయుటకును దోఁపకుండెను. ఎట్టును దన్నిఁక రవీంద్రుఁడు బంధింపక పోఁడనియు, తానే హంతకుఁడని నిశ్చయించె ననియు యోచించు కొనెను. అట్టిసమయమున నధైర్యపడుట ధీరోదాత్తులగుణము కాదు. ప్రవాళుఁ డది గ్రహించెను. తోడనే యాతఁడు తనకుర్చీనుండి లేచి భయంకరముగ నొకయట్టహాసమును గావించి "రవీంద్రా! మూర్ఖాగ్రేసరా! నన్ను పట్టుకొనిపోదువా ? అది నీనుదుట వ్రాయఁబడలేదు. నీ వెట్టివివేకివో నాకుఁ దెలియకపోలేదు. ఈ నిరుపమశక్తిసమన్విత ధీరోత్తముఁ డగుప్రవాళుఁడు నీచే నతిసులభముగఁ జిక్కుటకు కుందేటి పిల్ల ననుకొంటివా ? గోరువంక ననుకొంటివా ? నీ సంగతులన్నియు నాకుఁ దెలియును. నా కన్నులఁ గప్పి పని చేయనేరవు. నీవీయూరికి వచ్చినదాదిగ నీ క్షణమువఱకు నెందెం దెట్టిపనులను గావించినది నే నెఱుఁగుదును. నేను సర్వాంతర్యామిని. అసమానుఁడను. నీవు వెలుపల నిరువురు పోలీసువారిని గాపుంచి యుండుట నాకుఁ దెలియక పోలేదు. చూడుము. నామాట వినుము. కార్యాలోచనఁ గావించి వచ్చినదారిని నూరక మరలి పొమ్ము. నన్ను బంధింపఁజాలవు.

రవీం: నీ వెట్టి యద్వితీయుఁడవైన నేమి ? నాచేఁ జిక్కినపిదప నురిగిపోనేరవు. అది నీ వనుకొన్నంత సులభకార్యము కాదు. బెబ్బులి యెదుటనా గొఱ్ఱెపిల్లపౌరుషము ?

ప్రవా: (నగుచు) ఓహో! నీవింతటి విక్రమపురుషుఁడవా ? అయిన నీ కన్నుల యెదుటనే—నీకంట దుమ్ము చిమ్మి—నాయిష్టము వచ్చినతావున కేగెదను చూడుము.

రవీం: ఒక్కయడుగైనఁ గదల్పకుము. నీతలను తునియలు తునియలు గావించెదను. జాగ్రత్త.

అని తన హస్తమందలి పిస్తోలు నెత్తి రోహితని శిరస్సునకు సరిగ గుఱినుంచి పట్టుకొనెను.

ప్రవా : రవీంద్రా ! నే నపరాధినే యగుదును. కాని, నీకీ విషయమున నింత శ్రమ మేల? అంభోతుల పోరున జంబుక మేల దూఱ వలయును? తగవున జంతుద్వయ దేహము నుండి పడు రక్తమాంసముల కాసించి వచ్చి వాని కాళ్ళక్రింద పడి నిక్కముగ చిదిగిపోవును. నీవు ధనాపేక్షచేఁ గదా యిట్టి పనిని గావించు చున్నావు? అతిసులభముగ నేను నీకు విశేషద్రవ్యము నిచ్చెదను. కైకొని పొమ్ము. నీ పురమున కేఁగి సుఖముగ నుండుము. నిష్కారణముగ నిందు చేయి కలిపికొని నశింతువు! నీవు నన్నుఁ బట్టుట యటుండ నా వైపు కన్నెత్తి చూడఁ జాల వనుకొనుము. ఊరక నీ ముద్దు మఱఁదితో పరదేశముల—నవ్యక్త స్థలముల—దుర్మరణము నొందకుము. రవీంద్రా ! ఇంతయుఁ గాలసర్పముతో చెరలాటము వలదని చెప్పుచుంటిని గాని నీకు జడిసి కాదు. ఊరక చెడిపోకుము.

రవీం : ఓరీ ! నీ మాటల వల్లనే నీ గౌరవము తెల్లమై పోయినది. నీవు నాకు లంచము లొసంగుదువా? నీ యుదారబుద్ధి యత్యంత శ్లాఘాపాత్రము. అయిన నేను కేవల ధనోపార్జనచే నీ కార్యమునకుఁ దలపెట్టి యుండిన నీ యుపాయమున కొప్పుకొని యుందును. కాని నా కార్యములు కేవల పరోపకారార్థము కావింపఁ బడుచున్నవి. ప్రతిష్ఠ కొఱకు—తుచ్ఛ ద్రవ్యోపార్జనకు కాదు. నీ విచ్చు రొక్కము నా కేల? నీ బోంటి పాషండులు వేవురు వచ్చి నా యింట పడినను సంరక్షింపఁజాలిన నేను నీ బహుమానము నంగీకరింతునా? నా ధనమున కేమి, మొదట నీగతిని విచారించుకొనుము. నీపాపములకుఁ బరిణామము నాలోచించుకొనుము. నీకుఁ బుణ్యలోకములయందు చొచ్చుటకు వీలులేదు. మిత్రద్రోహివి, పలుగాకివి, అనంతదుష్కృతకల్మషహృదయుఁడవు.

ప్రవా : హా ! హా ! నా మాటలు నుది కెక్కవా, రవీంద్రా ! "అయిన నీ యిష్టము. బ్రతుకు తెరువు ను జెప్ప నోటికి వచ్చినట్లెల్లఁ బ్రల్లదములు కూసెదవా ! మృగేంద్రముతో నీచకిటిశాబకమునకు వైరము వలదంటిని. భయంకర విషజ్వాలాభూయిష్ఠ కాలకాకోదరముతో చెరలాట వలదంటిని. ప్రళయజ్వాలాభీ కీలకీలికలో నిద్ర వలదంటిని. నీకు మతి పోయినట్లున్నది. నీ యోగక్షేమముల నరసికొను శక్తి నీ కున్నట్లు లేదు. ఇట్టి యధముఁడవు—ఇట్టి నీచుఁడవు—పత్తేదారివృత్తి నెట్లవలంభించితివో నాకు తెలియ కున్నది.

రవీం : ప్రవాళా ! నీ బెడిదముల కడలును నని తలంపకుము. ఒక్క మాటను చెప్పెదను వినుము. ఈ పనులందు నీ వైనను లేక నేనైనను నిహలోక ఋణమును చాలించు కొనవలయును. నీవు నాకుఁ దగిన ప్రతిద్వంద్వివి.

ప్రవా : ఆహా ! బాగుగ చెప్పుచుంటివి. కాని యందణుమాత్ర మైన బుద్ధిబలము నుపయోగించు చున్నట్లు లేదు. ఓరీ ! మరల మరల హెచ్చరించెదను. ఈ నిర్ఘాత్రప్రాయుఁ డగు రక్కసుని దెబ్బలచే నీవు నశించి పోదువు. జాగ్రత్త.

రవీం : ఉండిన నుండవచ్చును. ఒకమారు నీకు సరియైనవాఁడ నౌదునో కానో పరీక్షించి చూడనిమ్ము. ఇందు నష్ట మేమి ?

అని జేబునుండి యినుప సంకెలఁ దీసి ఝళిపించెను. అది గాంచి గుండె లదరురీతిని ప్రవాళుఁడు ప్రళయాట్టహాసమును గావించెను— ఆ నవ్వే ! నిర్జల దనిర్ఘోష కాశనిపాత మే ! ! !

ప్రవా : రవీంద్రా ! నీసంకెలను గాంచి భీతిలుదు నను కొంటివా ? ఇట్టి గొలుసులతో నేవురు పత్తేదారులు వచ్చినను నన్నుఁ బట్టనేర రని తలంపుము.

రవీం : ఊరక కాలహరణ మేల? రామనాథా? ఈ పాపి హస్తముల నీ సంకెలలతో బంధింపుము.

రామనాథుఁడు ముందటికి వచ్చెను. ప్రవాళుని నిష్ఠుర పరిహాసములచే నా గృహ మెల్ల కంపించుచుండెను. వాఁడు మిగుల బిగ్గరగ కరతాళధ్వనిని జేయుచు రామనాథు నవ్వలి కేఁగుమని యాజ్ఞాపించెను. ఇంతలో నాకస్మికముగ వెలుపలి తోఁటలో శతసహస్ర నిర్ఘాతధ్వని వోలె నొక భయంకర నినాదము వినఁబడెను. అత్యంత ధీరులగు రవీంద్ర రామనాథులు సహిత మా దారుణారవము నాలకించి యించుక జడిసి కొంకుచూ ఇరువురును వచ్చి ద్వారమునుండి వెలుపలకు తొంగి చూచిరి—అంతయు సూచికాభేద్యమస్తర సాంద్రాంధకారము!—నిశ్శబ్దము!

వా రంత యథాస్థానముల వైపు తిరిగిరి. తోడనే పత్తేదారులనూనభయసంభ్రమ విస్మయ విస్ఫారిత నయనములతో తూలిపోయిరి! ప్రవాళుఁ డచట లేఁడు!! అంతర్ధాన మొందెను!!!

# తొమ్మిదవ ప్రకరణము

## రసాతల మార్గము

రవీంద్ర రామనాథు లిరువు రత్యంతాశ్చర్య నిమగ్నులై నిశ్చేష్టితులై నిలుచుండిరి. వారు తమ దృష్టిని నమ్మకుండిరి. ఎంతటి చిత్రము! ఎంతటి యసాధారణము!!! ఎంతటి యమానుషము!!! వా రెంతసేపు చోద్య మందినను దాని కంతము లేకపోయినది. ప్రవాళుం డెందేగినదియు వారికి బోధపడ దయ్యెను. ఏ మార్గమున పాఱిపోయి యుండును? తక్కిన మార్గము లన్నియు బంధింపఁబడి తాళములు వైవఁబడి యుండెను. తాము నిలుచుండి యుండిన ద్వారము తప్ప నిఁకఁ బరుగిడి పోవుటకు వేరొక బిలమైన లేదు. ప్రవాళుఁడు మాంత్రికుఁడు కాఁడు. వానికి మంత్ర తంత్రములు తెలియవు. ఇఁక వాఁ డేగతి తప్పించుకొనిపోయెను? తుదకు వా రా గదియం దొకగుప్తమార్గ ముండవలయు నని నిశ్చయించుకొనిరి. లేకున్నఁ బ్రవాళు నంతటి మానిసి దూఱిపోవలయు నన్న సాధారణబల ముండిన జాలునా! ఆ మందిరము నంతటిని జుట్టివచ్చిరి. అందునఁ బ్రయోజనము లేకపోయెను. ప్రవాళుఁ డేమూలయందును దాగికొని యుండ లేదు. ఒక్కమారుగ — వారిని మోసగించి — యదృశ్యుఁ డయ్యెను. ఆ గదియం దెంత వెదకినను వానిని దాచఁగలిగినది—యొక ముఖమల్ పేటిక తప్ప - వేఱొక వస్తువు లేదు. ప్రవాళుం డేమి చలి చీమయా—లేక గడ్డిపోచా! ఏవిధమైన వారిలక్ష్యము నుండి దాటిపోనేర వయ్యెను. అది యుండ నిఁక వెలుపల నంతశబ్దమగుటకుఁ గారణమేమి!

అది యశనిపాతమా? కాదు—కాదు. వర్షము లేదు. తుపాకి పేల్చినదా?—అంతకన్నను గభీరమైనది. పర్వతిసమ్మేళనమా? ఏమో, యెవ రెఱుంగుదురు? వారిరువు రత్యధికవిస్మితాననులైరి.

అప్పుడు రవీంద్రునకచ్చటిపెట్టెను దెఱచి చూడవలయు నని కుతూహలము జనించెను. అందేమైనఁ బ్రవాళుఁడు దాఁగియుండు నేమో యని యాతనియూహ. అతఁడు తటాలున వచ్చి దానిని తెఱచెను—అదియే గుప్తమార్గము—రసాతలమార్గము! క్రింద పాతాళమునకు సోపానపంక్తి కలదు — అగాధబిలము — దుర్భేద్యనిబిడాంధకార భయంకరము!!

రవీంద్రుఁ డొకత్రుటికాలమున సర్వమును దెలిసికొని "రామనాథా! అంతయుఁ దెలిసినది. నేననుకొన్నట్లైనది. హంతకుఁ డన్నంతపనిని జేసి పోయెను. వాఁడంతనిర్భీతిగా మాటాడుటను గాంచి మొదటనే యనుమానించితిని. కాని, యీరీతిగ మోసగించి పోవునని తెలిసికొననైతిని. వెలుపల నెవరితోడనో కృత్రిమశబ్దమును గలిగించి మమ్ము వంచించి మేమించుక కాలుజరపఁగనే యింతపనిని జేసి పోయెను." అని చెప్పుచుండఁగనే వెలుపల నేదియో గందరగోళము వినవచ్చెను. తోడనే వారిరువురు నచటికే వచ్చి చూచిరి. తాము ప్రవాళునకు తెలియరాకుండ దాఁచియుంప యత్నించిన యిరువురు రక్షకభటులు లాచిమ్మచీఁకటిలో నొకపురుషవ్యక్తిని బట్టుకొని పెనగులాడుచుండిరి. వాఁడు వారివెంట వచ్చుటకు జడిసి క్రింద పడియుండెను—పోలీసువారు గద్దించి లేపుచుండిరి. వాఁడే మాధవుఁడు—ప్రవాళునిబంటు.

రవీంద్రుఁడు పోలీసువారిని గాంచి "ఈ మనుష్యుఁ డెవఁడు?" అని యడిగెను. అందులో నొకఁ డిట్లనెను. "స్వామీ! మేము మీరు చెప్పినమేర కీతరుప్రకాండమువద్ద పొంచుండి కాచియుండఁగా వీఁడు

దూరమున నా చెట్టెక్కి యేమో చేయుచుండెను. మేము వీనిని గాంచి యీరాత్రి యంధకారమున నేమి చేయుచుండునా యని యోజించి వానిపై నొకకన్నుంచి కాచి యుంచితిమి. కాని కొంపసేపటికి వీఁ డూరకుండ నేరక దేనితోడనో బ్రహ్మాండము బ్రద్దలగునట్లు మిగుల గొప్పధ్వనిని చేసెను. బహుశః మీకుకూడ నది వినఁబడియుండును. మేమప్పు డనుమానించి వీనిని క్రింది కీడ్చి సంగతి యేమని యడుగ నేమియుఁ జెప్పక యూరకున్నాఁడు. వీనిని మీయొద్ద కీడ్చుకొని వచ్చుచున్నాము" అనెను. రవీంద్రుఁడు కనుతెప్పపాటుకాలములో వాఁడు ప్రవాళునిబంటనియు, తనయజమానునియాజ్ఞానుసారముగా నట్లు చేసెననియు గ్రహించెను. అప్పు డాతఁడు మాధవునిఁ గాంచి "ఓరీ! నీవెవ్వఁడవు? నీవారీతి నా చెట్టునఁ గూర్చుండి యాశబ్దము నేల చేసితివి? చెప్పుము" అనెను. కాని వాఁడు మాటాడక యూరక యాతనిముఖమును దేఱి చూచుచుండెను. భయావేశముచే వాని కేమిచేయుటకును దోఁచలేదు. ఏమియును మాటాడకుండుటను గాంచి రవీంద్రుఁడు తన సీరాంగముచే వానిమూపున చఱిచి "పందా! మాటాడుము. నీవు మూగకాదు. నాయొద్ద నీమాటలు సాగుట లేదు. నీవెవ్వండవో మొదట చెప్పుము" అని గద్దించి పల్కెను. మాధవుఁడు గద్గదికుఁడై చేతులు జోడించి "స్వామి—చెప్పెదను—కొట్టకుఁడు" అనెను.

రవీం : అయిన సర్వమును జెప్పుము. కొట్టుటలేదు. నీవిచ్చట నేమిచేయుచుంటివి? నీవెవరు? ఆ సవ్వడిని గలిగించుటకుఁ గారణమేమి?"

మాధ : అయ్యా! నేనూరక యిచ్చటికి వచ్చియుంటిని. నేను దొంగనుకాను బాబూ!

రవీం : నీవు దొంగవు కాకున్న చెట్టు నేల యెక్కితివి?

మాధ : అందు కొన్ని యాకులను తీసికొనివచ్చుటకు.

రవీం : ఇంత రాత్రివేళ నీ కాయాకులతో నేమిపని ? అచ్చట నా శబ్దము నేలచేసితివి ?

మాధ : అయ్యా ! శబ్దమును—నే—నే—నేను చేయ లే—దు. నే—నే—ను చెట్టెక్కగా—అచ్చట—ఒ—ఒక—బ్రహ్మరాక్షసి—వచ్చి—యి—ట్లు—చేసిపోయినది.

అందఱు వానిమాటలను విని నవ్విరి. రవీంద్రుఁ డది నమ్మలేదు. తాను చెప్పినకారణము సమయోచితము కాదని మాధవునకుఁ దెలిసిపోయెను. వారికి వానిపై విశ్వాస మొదవదయ్యెను. దానిని సరిదిద్దుకొనుటకు వాఁడు మరల నిట్లని ప్రేలఁదొడంగెను. “ బా-బు ! రాక్షసి—కా-దు—పిశాచి—ఉ-ఊ—అది కాదు—పెద్దపులి. శబ్దము చేసి నన్ను—మ్రింగ—వ—వ—చ్చెను ; దానిని—కొట్ట—పోతిని కాదు—కాదు—బాబూ ! అది క్రింద—పడెను—చెప్పెదను—లే-లేదు. అది శబ్దము చేసెను ” రవీంద్రుఁ డుగ్రుఁడై బెదరించుటకు “ఓరీ! వీఁడెవఁడో దొంగవలె నున్నాఁడు. వీఁడు తనతప్పు నొప్పుకొనఁడు. అట్లు చేసియుండిన వీనిని వదలియుందును. కాని యూపని సాగునట్లు లేదు. మీకత్తులతో వీనికనుగ్రుడ్లు పెకలించి కుడిచేతిని కోసి వేయుఁడు. వీని కిదే శాస్తి ” అనెను. పోలీసువారు కత్తులను వెలుపలకుఁ దీసిరి. అది గాంచి మాధవుఁడు భీతచేతస్కుఁడై కేక వైచి “ హా—హా—చెప్పెదబాబూ ! చెప్పెద—చెప్పెద—వలదు—వలదు—ఈ పని వలదు—” అని యేడ్వఁదొడంగెను. రవీంద్రుఁ డది గాంచి నవ్వి “ చెప్పుము. నిన్ను బాధించుట లేదు ” అనెను. తుదకు తనస్థితిని జెప్పకొనకున్న విధిలేదని ధైర్యమును వహించి తుదకు మాధవుఁ డిట్లు చెప్పెను.

"అయ్యా ! నేనీగృహయజమానుఁ డగు ప్రవాళుని సేవకుఁడను. నన్ను మాధవుఁ డందురు. పంపుకొనుటకుఁ బూర్వము నాయజమానుఁడు నాకు మందుచే కూరినయొక చిన్నసందూకము నిచ్చి తాను లోపలినుండి నగుచు చప్పటలు చఱచినపుడు దానికి నిప్పంటించు మని చెప్పెను. నేనట్లు చేసితిని. తోడనే యాశబ్దము గలిగినది. ఇంతయే బాబూ ! నా చరిత్ర" అనెను. రవీంద్రుఁడు మాటాడక దేనినో యోచించుకొనుచుండెను. తక్కినవారెల్ల నామోసము నాలకించి యాశ్చర్య పడుచుండిరి. అప్పుడు మరల రవీంద్రుఁడు వానితో నిట్లనెను. "ఓరీ ! నేనడుగు ప్రశ్నలకు సదుత్తరముల నిచ్చిన నిన్నేమియు చేయుట లేదు. లేకున్న నీరక్షకభటులు నిన్ను చిదుకఁగొట్టి మంటలో వైతురు. ఏమందువు ? చెప్పెదవా ?" అనెను. తనకు బ్రతికిపోవుమార్గమిఁక లేదని నమ్మి మాధవుఁ డందుల కియ్యకొనెను.

రవీం : నీవీ ప్రవాళునియొద్ద నెన్నిదినములుగ సేవకవృత్తిని చేయుచున్నావు ?

మాధ : అయ్యా ! నేనితనియొద్ద చేరి పదిదినములుమాత్ర మైనది.

రవీం : నీవింతకుఁబూర్వ మెందుంటివి ?

మాధ : పనిపాటులు లేక యూరిలో బిచ్చమెత్తుకొనుచుంటిని.

రవీం : నీవు వచ్చుటకుముందు ప్రవాళునియొద్ద నుండినసేవకు లెవ్వరు ?

మాధ : వాఁడు జ్వరముచే చచ్చిపోయెను.

రవీం : ఎన్నిదినము లైనది ?

మాధ : సుమారు నాల్గునెల లైనది. అప్పటినుండి యీయింటి యొద్ద సేవకులే లేరు. ఒకనాఁ డాకస్మికముగ నేనీయింటికి భిక్షమ్ము

నకు రాఁగ నన్ను చూచి ప్రవాళుఁడు తనయొద్దనుండిన నన్నము పెట్టుచుండెద నని చెప్పఁగ నందుల కొప్పుకొని యిప్పటినుండి యిచటనే నిలిచిపోయితిని.

రవీం : ప్రవాళునకు భార్యాపుత్త్రులు లేరా ?

మాధ : లేరు. ఆతఁ డొకఁడే యిందు నివసించుచున్నాఁడు.

రవీం : ఇప్పుడు ప్రవాళుఁ డింట లేకున్నాఁడు. వాఁడు పాతి పోయెఁగాఁబోలు. నీకు వాఁడెందు దాఁగియుండునది తెలియునా ?

బాబు ! తెలియదు. నన్నూరక శబ్దము చేయకుమని చెప్పెనే కాని తానెందుండునదియు నేమి చేయుచుండునదియు తెలుపలేదు.

ఇఁక వానివద్ద నెట్టిరహస్యములు తెలియవని యెంచి రవీంద్రుఁడు పోలీసువారితో నేదియో రహస్యముగ ముచ్చటించి మాధవుని వారివెంటఁ బొమ్మనెను. వాఁడు మూర్ఖతను వహింప భటులు బంధించి కొనిపోయిరి. పోవునపుడు వానితో రవీంద్రుఁ డిట్లనెను. "మాధవా ! భీతిల్లకుము. నీకపాయము రాదు లెమ్ము. రెండుదినములు మాత్రము మాయధీనమున నుండుము. అనెను. వాఁడు రక్షకభటులతో వెడలిపోయెను.

రవీంద్ర రామనాథు లిరువురు నాగదిని ప్రవేశించిరి. వారి కిప్పుడు మాధవునిమూలమున ప్రవాళుని హృదయము కొంచెమువఱకు తెలిసిపోయెను. తమచర్యల నేరీతిగనో వాఁడు గ్రహించి తనకిఁక ముందు కారాగృహవాసము తప్పదనియు, నాఁటిరాత్రి పోలీసువారు తనయింటికి వత్తురనియు తెలిసికొని మున్ముందు జాగ్రత్తగ సర్వసన్నాహములతో నుండి రక్షకోద్యోగుల మోసగించి పాతిపోదలంచియున్నట్లు గ్రహించిరి. వానిమాట చెల్లినది. తన ప్రతిభ నొకించుక పత్తేదారులకుఁ జూపించెను. అందుచే వాఁడు తనకీయుదంతములు ముందుగ

తెలిసియున్నను రాత్రివఱకు — వారు వచ్చువఱకు — పాఱిపోవఁ దయ్యెను. నవీంద్రుఁడప్పుడు తన బావనుద్దేశించి యిట్లనియెను. "అన్నా! ఇట్టిసమయములం దధైర్యులు కాఁగూడదు. ద్విగుణితమగుపట్టుదలతో పనులఁ గావింపవలయును. వెనుకంజ వైచి నిరుత్సాహులైన కార్యసాఫల్యము కానేరదు. ప్రవాళుఁ డాబిలమార్గమునుండి తప్పించుకొని పాఱిపోయెననుటకు సందియము లేదు. ఇంతలాఘవముగ మన మెఱుఁగకుండ దాఁటిపోయిన వాని నైపుణ్యమత్యద్భుతము. అయినను నేను వానికేమాత్రమును దీసిపోవు వాఁడను గాను. ఇప్పుడే వానిని వెన్నంటి యీమార్గమునఁ బోయి వానిజాడల నెఱింగి వత్తును. నీవు భీతిలక యిందే నిలిచియుండుము. మిగుల జాగరూకతతో కాచి యుండుము." అని హెచ్చరించుచు నా పాతాళమార్గమునుండి దిగిపోయెను.

రామనాథున కింకను నిరువదియేఁడులు — ఇంకను బాలుఁడు. చాలసేపటివఱకుఁ దన బావ వెడలిపోయినబిలమార్గమును సందర్శించుచు నిలుచుండెను. పిదప ద్వారమును బంధించి వచ్చి యాగదియం దటు నిటు పచారు చేయ మొదలిడెను. కొన్ని నిముసములు దాటిపోయినవి. రామనాథుఁ డొకకుర్చీపైఁ జతికిలఁబడి కూర్చుండెను.

అపు డాతనికి వెలుపల నెవరో ద్వారమును దట్టుచుఁ బిలుచుచున్నట్లు దోఁచెను. తోడనే యందుండి లేచి "ఎవరువారు?" అని కేకవైచెను. అంత వెలుపలనుండి యొకహీనకంఠస్వరమున "అయ్యా! ముసలివాఁడను, చలి కోర్వలేక చచ్చిపోవుచున్నాను. తలుపును దీసి లోనికి రానియ్యరాదా?" యని విన్నవించెను. రామనాథుఁడు చటాలునఁ బోయి ద్వారమును దెఱచెను. ఎట్టయెదుట నొకమూఁడుకాళ్ల ముదుసలివాఁడు కన్నులకు సులోచనములఁ దగిలించుకొని చలి కోర్వ

లేక వణఁకుచుండెను. అతఁడు ధరించిన యుడుపులు మలినములై యుండఁడు జీర్ణమై యుండెను. రామనాథుఁ డాతనిని గాంచి జాలినొంది "తాతా! నీ వెవ్వరివాఁడవు? నీ పేరేమి?" అని యడిగెను. అంతట నావృద్ధుఁడు కీచుగొంతుక నిట్లనెను. "నాయనా! నాది పశ్చిమదేశము. విదేశములకు వచ్చి మిగుల బాధపడుచున్నాను. నాకించుక యీరాత్రి పరుండఁ దావియ్యఁగలవా?"

రామ : తాతా! ఇది నా యిల్లు కాదు. ఇది పరులది. గృహ యజమానుఁ డెందో పోయినాఁడు. అతని యనుమతి లేనిదే నేనితరులకు బస యియ్యరాదు.

ముస : అబ్బా! ఎంతటి న్యాయవంతుఁడవురా నాయనా! చలికి చచ్చిపోవుచున్నాను. రెండుదినములనుండి కూడు లేదు. రాత్రి చాల భాగమైపోయినది. దేహము మిగుల బలహీనముగ నున్నది. ఇప్పుడే చేరువపల్లెనుండి వచ్చుచు నీ యింటిని గాంచి యిందింత తావు దొరకునని కొంటిని. ఇప్పుడు నేనెచ్చటికిఁ బోదును. ఇంతస్థలమున్నదే! నెత్తిని బెట్టుకొనిపోదువా? గృహయజమానుఁడు లేఁడని బొంకులు బొంకుచున్నావే. అతఁడు లేకున్న నింతరాత్రివేళ నిందేమిచేయుచున్నావు? నీవేమి దొంగవా?

రామ : దాదా! నేను దొంగను కాను. అతనితో కొంచెము పనియుండి వచ్చి యుంటిని. కాని యతఁడు నాతోఁ జెప్పకయే యెందో వెడలిపోయెను. ఇప్పు డతనికై నిరీక్షించుచున్నాను.

ముస : మంచివాఁడవురా నాయనా! ఆకలిచే ప్రాణములు పోవుచున్నవి. ఏదైన నింత యాహారమున్నఁ దెచ్చి యియ్యఁగలవా!

రామ : లోపలఁ బోయి చూచి వచ్చెదను. ఏమైనఁ దినుబండము లున్నఁ దెచ్చి యియ్యఁగలను. ఇందే యుండుము.

అని యాతఁడు వెనుదిరిగి పోయి గదియంతటిని చుట్టి వచ్చెను. ఒకచోమాత్ర మొకయుపహారముఁ గొన్నిరొట్టెముక్కలుండుటను గాంచి వానిని బట్టుకొని కవాటమునొద్ద కరుదెంచెను. ఏమని వ్రాయుదును !! తోడనే రామనాథుఁ డపారవిస్మయభయావేశమున నొక్కకేక వైచి నిశ్చేష్టితుండై పోయెను. ఏల? ఎదుట నా వృద్ధుఁడు లేఁడు. తత్ప్రదేశమున నా ఢకఁ ప్రవాళుఁ డట్టహాసముఁ జేయుచు నిలుచుండి యుండెను.

రామనాథుఁ డింకను నాయాశ్చర్యప్రవాహము నీఁది రాలేదు. అతని కెట్టియవకాశమును లేకపోయినది. శరవేగమున వచ్చి ప్రవాళుఁ డాతని కాలుసేతులు బంధించివైచెను. పిదప నాయభీతుఁ డచ్చటి చిరుబల్లను డాసి యందుండిన యొకవార్తాపత్రికను వెలుపలకుఁ దీసి దానిలో నొక భాగమును మాత్రము చించుకొని మిగిలినదాని నందే పారవైచెను. " రామనాథా! ముసలివాని వేషమున వచ్చిన దీప్రవాళుఁడే యని నమ్మితివా? నీవును నీ బావయును వేయిసంవత్సరములు కష్టపడినను నన్నుఁ బట్టనేరరు. ఇప్పటి కింతమట్టుకు నా ప్రతాపమును చూపితిని. ఇఁక ముందు నన్ను చెనకిన నా సంపూర్ణపౌరుషజ్వాల కిరువు రొక్కసారిగ నాహుతి కావలసివచ్చును జాగ్రత్త. నీయట్టిపసిబాలుని జంప నిష్టము లేదు. నేను వెడలి పోయెదను నీవైన నీ బావకు బుద్ధి చెప్పి యీ సాహసకార్యమును డి మరలించుకొనిపొమ్ము. పడుండియున్న బెబ్బులి నదలించి చచ్చుటేల? నీయింటిబస యొల్ల — నిద్రయొల్ల "
అని చెప్పుచు ప్రవాళుఁ డావినిలగాఢతమమున లీనమైపోయెను.

రామనాథుఁడు చేయునది లేక గుక్కిళ్లు మింగుచు ద్వారము వంక చూచుచుండెను. అది యంతయు నాతనికి స్వప్నప్రాయమై యుండెను. ప్రవాళునిమోసమునకు లోఁబడి యెంతమందమతి

నైతినని చాల చింతించెను. ఇంతయు నొకయరగంటలో జరిగిపోయినది. ఇది మఱియు నాశ్చర్యము. అప్పుడు భూమార్గమున మెట్లపై చప్పుడు వినవచ్చుచుండెను. రామనాథు డావైపు తిరిగి చూచెను. అప్పుడే రవీంద్రుఁడు పాతాళలోకము నుండి భూలోకమునకు లేచి వచ్చుచుండెను.

రవీంద్రుఁడు జరిగినయుదంతము నాలకించి ఆశ్చర్యపడి నిలుచుండెను; పిదప రామనాథుని దుస్స్థితికై వగచి యాతనిబంధనములను విప్పివైచెను. రవీంద్రుఁడు ప్రాయశః ప్రవాళినిం గాంచి వచ్చియుండు నని రామనాథుఁడు తలఁచి "బావా! మీరు వెడలినపని యేమాయెను?" అనెను.

రవీం : నేను మెట్లు దిగి పోయినపిదప నాకు దారియే గోచరింపదయ్యెను. అంతయును దిమ్మచీఁకటి. కన్నులు కానరావు. ఎందు చూచినను చిన్నచిన్నబొఱియలు కలవు. మార్గము సురక్షితముకాదు. మిగుల నిఱుకుగ నున్నది. నేనట్లే ప్రాకుచుం బోయి కడకొకత్రోవకొన కేగితిని. కాని యది పెద్దబండరాతిచే మూయఁబడి యుండెను. నేనంత దాని నతిసాహసముతో నవ్వలకుఁ ద్రోసివైచి చూడ నావలపల నొక శిథిలమందిరము మాత్రము గోచరించినది. అప్పటికే యా దురాత్ముఁడు పరుగిడిపోయి చాలకాలమై యుండెను. ఇఁక వాని వెన్నంటి పోవుట శ్రేయస్కరము కాదని యట్లే తిరిగివచ్చితిని. ఆ పాడింటిని బరీక్షించుట కింకొకమాఱు రావచ్చును లెమ్ము. ఇప్పటికింతయైనది.

రామ : అబ్బా! ఎంతవింతగ నున్నది!

రవీం : ఇచ్చటిది యంతకన్న వింతగ నున్నది. హంతకుఁడు మనల ననునిమిషమందును మూఢులుగఁ జేసివైచుచున్నాఁడు. ఇఁక మీఁద నతిజాగరూకతతో కాచియుండవలయు. ఏదీ, యా పాఱవేయఁబడిన వార్తాపత్రిక!

రామనాథుఁ డా పత్రిక నందిచ్చెను. అది నాలుగైదునెలల నాఁటిది. అందులో నాలుగవపుటయందు సగముకాగితమును ప్రవాళుఁడు చించుకొని పోయియుండెను. "దానిని చించుటలో వాని యుద్దేశ మేమి? అందెట్టివిశేషము లున్నవి? దానివల్ల వాని కేమైనఁ బ్రయోజనము కలదా? దానికిని, హత్యాపరాధమున కేమైన సంబంధ మున్నదా?" అని రవీంద్రుఁడు వితర్కించుకొని తుదకు తన కది మహోపకారి యగు నని తలఁచి దాని నందు పాఱవైచి పోవుటలో ప్రవాళుని యవివేకమును గాంచి నవ్వుకొనెను—ఇట్లే యెట్టివారికైన లోపము లుండును కదా! అవి యనర్థకములకు మూలము.

అప్పటి కప్పుడే మూఁడవజాము కోడికూఁతలు వినఁబడుచుండెను. తెలతెలవాఱుట కిఁక నొకటి రెండు — గంటలకాలము మాత్రము మిగిలి యున్నది. అప్పుడు రవీంద్రుఁడు "అన్నా! రామనాథా! ప్రస్తుత మిఁక మన కిచట నేమియుఁ బని లేదు. ఈ యింటికి బీగములను వేయుము. ఈ సంగతులను రక్షకోద్యోగుల కెఱిఁగించి దీసిని వారి యధీనము చేసివైతము. చాలరాత్రి యైనది. ఇంటికిఁ బోదము లెమ్ము" అని యాతనిచే నా యింటికి తమసొంతబీగమును వేయించి యిరువురును గృహాభిముఖులై వెడలిపోయిరి.

# పదియవ ప్రకరణము

## అ ను సం ధా న ము

మఱునాఁ డుదయమున రవీంద్రుఁడు తనకుఁ బ్రవాళుని యింట దొరకిన వృత్తాంతపత్రికవంటి దాని నొకటిని బంపుఁడని దానిపై లిఖింపఁబడియున్న కంపెనీకి వ్రాసెను. ఈ విషయమై యాతఁ డానందునితో ముచ్చటింపలేదు. అందులో నెట్టివిషయ మున్నదో తెలిసికొని దాని నావశ్యకమైనఁ గడవఱకు గూఢముగ నుంపవలయు నని యాతని కోరిక.

ఆ దినము మధ్యాహ్నమున నాతఁడు భోజనానంతరము తనగది యందొక పడకకుర్చీపైఁ గూర్చుండి దేనినో యోచించుకొనుచుండ నొకబాలకుఁడు వచ్చి కాగితము నొకదానిని దెచ్చి యిచ్చెను. దానిని బ్రవాళుఁడు వ్రాసియుండెను. రవీంద్రుఁ డాబాలునిఁ గాంచి తనకా లేఖ నిచ్చినవానినిగుఱించి యనేక విషయము లడిగెను. కాని యందుచే నెట్టియుపయోగమును లేకపోవుటచే వానిని బంపివైచెను. ఆ యుత్తరమునందంతట నా మొదటిభీకరసంబోధనవాక్యము లే—ఆ బెదరింపు లే—ఆ స్వబలోత్ప్రేక్షాసూచకము లే—రవీంద్రుఁడు దానిని గాంచి నవ్వుకొనెను. దాని నొకచో దాచి మరల తనయూహాప్రపంచమున దిగెను.

ప్రవాళుఁడు—ఒకగజదొంగ — రవీంద్రునంతటివాని నొక్క క్షణకాలమున మూఢునిఁ జేసి తప్పించుకొని పోయెను. అదియే

రవీంద్రుని యోచనలకుఁ గారణము. మరల వాని నేరీతిగ నైనఁ బట్టవలయు ననియే యాతనికోరిక.

రాత్రి భోజనానంతర మాతఁడు మఱఁదిని బిలిచి యిట్లనెను. "వత్సా! రామనాథా! నిన్నటిదిన మా దురాత్ముఁడు ప్రవాహుఁడంత సులువుగ మనబారినుండి తప్పించుకొని పోవుటచే మనకీర్తిసి కొంచెము కుందు వాటిల్లినది. అప్పటినుండి యీ కార్యమున నా పట్టుదల ద్విగుణిత మయ్యెను. వాఁడెందో యొకచోట నివసించుచు ప్రచ్ఛన్న రూపములతో మనచర్యలను గనుపెట్టుచుండును. వాఁడు మిగుల గట్టి వాఁడు—యుక్తిశాలి, మన కవలీలగ లొంగువాఁడు కాఁడు. వాని నెట్లైనఁ బట్టియే తీరవలయును. దినములు గడచిన నీపట్టణము విడిచి పాఱిపోవునేమో, అప్పుడు మనయత్నము లన్నియు విఫలము లగును. కాన నేఁటిరాత్రియే మనమిరువురము కుహనారూపములతో బయలు దేఱి నిన్న నేను చూచిన శిథిలమందిరము నొకమాఱు పరిశీలించి రావలయును. వాఁడింకను రెండుమూఁడుదినము లిందే యుండును. వాఁడెంతమాత్రమును భీతిలువాఁడు కాఁడు. తగినసన్నాహములతో పాఱిపోవునే కాని పరిజ్ఞానశూన్యుఁడై కదలఁడు. ఈలోపలనే కార్యము నెఱవేర్చుకొనవలయును." అనియెను. రామనాథుఁ డంగీకార సూచకముగఁ దల నల్లాడించెను.

రామనాథుఁడు తత్క్షణమే బావయనుమతి ననుసరించి యొకబీద కూలివాని వేషమును వైచుకొనెను. రవీంద్రుఁడు నల్లనిదీర్ఘము లగు గడ్డము మీసములు ధరించి యొకపార్సీపెద్దమనుష్యుఁ డయ్యెను. వారి యాకారములు లోకవంచకములు; అమోఘములు, వా రంత తగిన యాయుధములతో నిలువెడలి చనిరి.

చంద్రనగరమున కీశాన్యభాగమునఁ గొంతదూరమున నొక చిట్టడవికలదు. అందలివృక్షలతాదులు గుబురుగఁ బెరిగి చోరకిరాతకుల కాశ్రయభూములై యుండును. సాధారణముగఁ బురజను లాతావున కేగుటకే జడియుచుందురు. సాహసించి వెళ్లిన నపాయము లేక రారు. ఆ యడవి సుమారు 4-5 చదరపుమైళ్ల వైశాల్యము గలిగి యుండును. మనకథాసమయమున నా కాంతారమధ్యమున నొకగొప్ప సౌధముండెను. కాని యది యందందు శిథిలమై యుండెను. దాని చుట్టుకొలత సుమారు అరమైలునకు మీఱి యుండును. పూర్వకాలమున నందొకసంపన్నుఁ డగుజమీందారుఁ డుండె ననియు, దానికి చతుర్భాగములందును వివిధకుసుమ శోభితవనరాజము లుండె ననియు, నప్పు డది యనంత సంతోషదాయకమై, జనసమ్మర్దశోభితమై యుండె ననియు నా వీటివృద్ధు లనుకొనుచుండిరి. కాని యిప్పు డాభాగ్యవంతుఁ డగు గృహమేధి లేఁడు—ఆతోఁటిసొబగు లేదు. అందందు గోడలు పడిపోయి చెదలు పట్టి యుండెను. అందెన్నియో రహస్యద్వారములు కలవు. గూఢమందిరములు గలవు. ఏతత్ప్రాంగణమున నిప్పుడాగీమున నిరంతరము చోరహంతకకిరాతులు తిరుగాడుచుందురు. అందుచే నది సాధారణముగఁ బురమువారిచే "విభీతమందిర" మని చెప్పఁబడుచుండెను.

రాత్రియం దపరభాగము దాఁటుచుండెను. చంద్రనగరమున నెచ్చటచూచిన నిశ్శబ్దదేవత కాళరాత్రితోఁ గూడి విహరించుచుండెను. పవనము మందగమనమున ప్రకృతికిఁ దెలియకుండ నాకును డాయుచుండెను. రోదసీగహ్వర మంతయు నల్లగ మసిపూసినట్లుండెను. ఆ సమయమున రవీంద్రరామనాథు లిరువురు నొకవీథిలో తిన్నగ నడచి పోవుచుండిరి. వారొండొరులతో మాటాడుట లేదు. రవీంద్రుఁడు చేత నొక బెత్తమును బట్టుకొని ముందు నడచుచుండెను— వెనుకనే రామనాథుఁడు.

వారిప్పుడు "జావా" బజారున నడచి పోవుచుండిరి. కొన్ని నిముసములకే వారా మార్గమునగున్న యొకగాఢతిమిరశోభిత మగునొక వనమును బ్రవేశించిరి అందలి పైన చీకటికి మఱి తక్కువకాంతి కలిగి యుండెను. ఎదుట నుండు వస్తువులే గోచరించుట కష్టము. అట్టిచో రవీంద్రునిచూపు లతి శితములై పట్టును కనుగొనుచుండెను. అప్పు డాకస్మికముగ నాతఁ డచ్చట నెవరిదో సంభాషణ నాలకించి లటాలున నాఁగిపోయెను—రామనాథుఁడును నిలుచుండెను. రవీంద్రుని కామాట లంతవిస్పష్టముగ వినఁబడకున్నను నాగిపోఁ ముందున కేగ సాహసింపఁడయ్యెను. రామనాథునితో నొకవృక్షమూలమున దాఁగుకొని నిలుచుండెను. ప్రకృతి ననుసరించి యాసమయమున వారిదుస్తులు సహితము కప్పుకాంతితో నొప్పుచుండుటచే వారిని గనుఁగొనుట కష్టముగ నుండెను. వారట నిలుచుండి దూరమున మాటాడుచున్న యిరు పురువ్యక్తులను గనుఁగొనిరి. వేషభాషణములఁబట్టి రవీంద్రుఁడు తత్క్షణమే యందులో నొకనిని బ్రవాళునిఁగ నానవాలిడెను. తోడనే యాతనిహృదయ మవాచ్యభావమున ముబికిపోవుచుండెను. రెండవవాఁ డెవ్వఁడో వారికిఁ దెలియుటలేదు. వాఁడించుక పొట్టివాఁడు, దృఢగాత్రుఁడు. వాని దేహవర్ణమున్నతో సమానముగ నల్లనిబొగ్గుకాని సరితూగ నేరదు. ఏనుపందిముండ్లవలె వాని శిరోజములు నిక్కఁబొడుచుకొని కడుభయంకరముగ నుండెను. వారెంతయోసేపు మాటాడిరి. ఒకమాటు గట్టిగ—ఒకమాటు మెల్లగ—పత్తేదారులకు వినఁబడినది మాత్ర మీక్రిందిసంభాషణమే.

ప్రవా : కరాళా ! మిగులజాగరూకుఁడవై మెలంగవలయును సుమా.

కరా : నాయుద్యమమును వారు తెలిసికొన్న మనపనులన్నియు వ్యర్థము లగును. అదియే నాభయము.

ప్రవా : నీ వావిషయమునై చింతింపకుము. ఆరవీంద్రరామనాథు లిరువురు నాకాలిక్రింది చలిచీమ లని నమ్ముకొనుము. వారిని నేను దలఁచినప్పుడే సమయింపఁగలను. వారిపై నొకకన్నుంచియుండును తెమ్ము.

కరా : మంచిది. బాబూ! నాకు వారివిషయమునసే మీరారు చెప్పినప్పటినుండి చాల భయముగ నుండెను. కాని, యిప్పుడదికూడ తీఱిపోయినది. ఇపు డామందభాగ్యు నేమి చేయుమందువు?

ప్రవా : ఛీ మూఢుఁడా! ఆ పాపిసంగతిని చెప్పుచుంటినను కొంటివా? మొదట నేను చెప్పినరీతి నాసుశీల నెత్తుకొనిపోయి నేఁజెప్పినట్లు చేసి రమ్ము. నేనంతకును దెనంచితిని. నాహృదయమున కరుణారస మించుకంతయు లేదు. నేఁజెప్పినట్లు చేయుము. లేకున్న నేనొక కాన్సైన నియ్యనని తలంపుము.

కరా : అయ్యా! మీయాజ్ఞకు నన్యథా చరింతునా! ఇప్పుడే పోయి యాకార్యమును నెఱవేర్చి వచ్చెదను.

కరాళుఁ డటనుండి వెడలిపోయెను. ప్రవాళుఁడుకూడ కొంత వఱకట నిలుచుండియుండి పిదపఁ దానొకదారిఁ బట్టెను.

వీ రేమందభాగ్యునిగుఱించి మాటాడిరి! ఆ సుశీల యెవరు! ఇందేదియో యగాధరహస్య మున్నదని రవీంద్రుఁడు గ్రహించెను. కార్యక్రమము తామెంచినదానికన్న భయప్రదముగ నున్నదని తోఁచుచుండెను. అతనికి వారిసంభాషణమందలి రహస్యము బోధపడ దయ్యెను. అతఁడు రామనాథుని దగ్గఱకుఁ బిలిచి చెవిలో "నీవీక్షణమున కరాళునివెన్నంటి వానికిఁ దెలియకుండఁ బోయి యా సుశీల యెవ్వరో, వాఁడామె నేమిచేయునో కనుఁగొనుము. నేను ప్రవాళు

ననుసరించి పోయెదను. బాబూ! కడుజాగ్రత్త సుమా! వారు నిన్నను మానించిన నపాయము రాఁగలదు. మరల నెట్టిదేని హత్య జరుగునట్లు తోఁచిన నీశక్తిసామర్థ్యముల నన్నిటిని వ్యయపఱచి దానికి భంగము కలిగింపుము. పొమ్ము. హెచ్చరికతో వర్తింపుము" అని చెప్పి యాతని నంపి తాను ప్రవాళుని కెఱుకపడకుండ నాయుద్ధమురేయి వాని వెన్నంటి పోయెను.

# పదునొకండవ ప్రకరణము

## వి భీ త మ ం ది ర ము

ఆనాటివిభావరియందు రజనీ తరుణీమణిభయంకరాకార మతి క్రూరముగఁ దోఁచుచుండెను. నక్షత్ర కాంతియైనను గాన్పించుట లేదు. అట్టిరేతిరి కుక్కలు నక్కలు సహితము భయపడి తమనివాసముల వీడి రాఁజాలకుండెను. ప్రవాళుఁ డాకాలు ముబ్బులను సరకుగొనక యవలీలగ నడచి పోవుచుండెను. ఆమార్గమంతయు వానికి చిరపరిచితమైనట్లుండెను. పాపము రవీంద్రున కాప్రయాణ మెంతయో హృదయవేదన గలిగించెను. ముండ్లు రాళ్లు తీగలు నాతని పాదములఁ జీలుకొనిపోవుచుండెను. ఆ మహాంధకారమున దారి తోఁప కుండెను. ప్రవాళుఁ డెందేగినదియు నాతని కిప్పుడు బాగుగ తెలియ లేదు. వాఁ డప్పుడే చాలదూర మేఁగి యుండెను. అయినను నాతఁడు వానిని లక్ష్యము సేయక నిశ్శబ్దముగ సాగిపోవుచుండెను.

ఇంతలో నాతని కెదుట కొంతదూరమునఁ జిన్నగ నొకయీల వినఁబడెను. రవీంద్రుఁడు మఱింతమందగమనముతో నాదిక్కు ననుసరించి నడచెను. చాలసేపటినుండి చీకటియందే యుల్లాడుచుండుటచే నాతని కిప్పుడిప్పు డాపెనుమబ్బుననే యస్పష్టముగ వస్తుగోచర మగు చుండెను. తుద కాతఁ డొకభూరుహమువెనుక నిలుచుండి ముందు నకు దృష్టులు సారించి చూచెను. అనతిదూరమున నప్పు డాతని కొక విశాలమందిరము గాన్పించెను — అదియే జను లనుకొనుచుండిన

విభీతమందిరము. దానియాకార మా సమయమున నొక పెనుభూతమును బోలి యుండెను. రవీంద్రుఁ డాస్థలము నంతటిని బాగుగఁ బరీక్షించి చూచెను. ఆ గృహప్రాంగణమున నెవరో నిలుచుండి యీల వేయుచుండిరి. ఆతఁ డెవరికొఱకో నిరీక్షించుచుండెను. కాని యెంతకాలమునకు నా నిర్ణీతవ్యక్తి రాలేదు. అప్పు డామొదటివ్యక్తి విసుగుచే "గాడిద. ఎందు కింకను రాకుండును!" అని గొణుగుచు నింటిలోని కేగెను—రవీంద్రుఁడు గ్రహించెను. వాఁడు ప్రవాళుఁడే!

ప్రవాళుఁడు తలుపులను దీసికొని లోపలఁ బ్రవేశించెను. అచ్చటకూడ కాఱుమబ్బు లాక్రమించుకొని సూచికాభేద్యమై యుండెను. వాఁడెప్పటి లె కవాటమును బంధించివైచి లోపలికి నడచి పోయెను. ఆ యంధకారమున నా భీకరుఁ డతిసులువుగ రాక్షసునివలె గదులవెంట గదులు దాటిపోవుచుండెను. వాని కాగృహమునం దెట్టిచోట నెట్టివస్తు వుండునదియు బాగుగఁ దెలియును. అనేకములగుకొట్లనుజుట్టి తుద కొకబంధితకవాట మగుగదియొద్ద నిలుచుండి లోపలకుఁ దొంగిచూచెను. కవాటరంధ్రములనుండి వచ్చుదీపకిరణములు దాని ముఖముపై సరిగ పడుచుండెను. తోడనే వాఁడు తన యొద్దనుండిన తాళపుచెవిచే నాబీగమును దీసి లోపలికిఁ బోయి మరల మూసివైచెను. అచ్చట నొకమూల నొకమలినదీప ముండెను. దాని చెంతగ నొకవృద్ధుఁ డేదియో చింతించుచుఁ గూర్చుండియుండెను. ఇదివఱకుఁ బ్రవాళునకుఁ దెలియరాకుండ—వాని ననుసరించియే వేఱొకఁడు వచ్చుచుండెను—ఆతఁడు రవీంద్రుఁడు.

ప్రవాళుఁ డిలుప్రవేశించివచ్చునపుడు కవాటబంధన గావించుకొని యుండుటను గనిపెట్టి రవీంద్రుఁ డతిలాఘవముగ నొకశిథిల ప్రాకారము నెక్కి యందుమూలమున రహస్యముగ నిలుసొచ్చెను. కాని

యూహాంతకుఁ డాతనిని గనిపెట్టనేరఁడయ్యెను. వాఁడాగదిలోఁ దూఱి తలుపులు మూయఁగనే దానినంతటిని బొంచుండి చూచుచుండిన రవీంద్రుఁడు తిన్నగ నావాకిలియొద్దకువచ్చి యుందలి కన్నములనుండి లోపలజరుగుచర్యలను బరీక్షింప మొదలిడెను.

అందరువురువ్యక్తులు కూర్చుండి యుండిరి. ఒకఁడు ప్రవాళుఁడు—మఱియొకఁ డపరిచితుఁడగు నొకవృద్ధుఁడు. అతని కేశదామములు తెల్లనై శరీరము చాలకృశించిపోయి యుండెను. ప్రవాళుఁడు తన్నడుగువానికెల్ల నాతఁడు హీనకంఠస్వరంబున బదులొసంగుచుండెను. రవీంద్రుఁడు కడుజాగ్రత్తగ నాసంభాషణల నాలకించుచుండెను.

ప్ర : నామాట విందువా లేదా ?

వృ : (గద్గదికుఁడై) నాయనా ! నీకింత కాఠిన్యమేల ! నన్నీ వార్ధక్యమున నేల సంకటపెట్టెదవు ? నీవాడుమాట కెట్లియ్యకొందును? నాకు నీవొకటియు నాతనయు లొకటియునా ?

ప్ర : శాంతినాథా ! నీవింకను నీమూర్ఖ్యమును వదలవుకదా ? అయిన నీయావజ్జన్మ మీయంధకారమునందే గడపి తుద కన్నపానాదుల కఱచియఱచి మరణింపవలయును.

శా : బాబూ ! చిన్ననాటినుండి తెచ్చి యింటనుంచుకొని కన్నకుమారునికన్న నెక్కుడుగఁ బ్రేమించినందులకిదియా నీకృతజ్ఞత? నీకుఁ జేసినయుపకార మంతయుఁ బామునకుఁ బోసినపాలవ్యాగా ? నే నిప్పుడేమియుఁ జేయఁజాలను. నేను జేయఁగలిగినదాని నంతటిని నప్పుడే చేసివైచితిని. ఇఁకఁ గడచినదానిని మఱలింప నాతరముగాదు.

ప్ర : బాగుగ యోజించుకొనుము. ఏమి యాటాడుచుంటివో చూడుము. పిదప దుఃఖింపకుము. మరల్పవలయునన్న నీచేతియం దున్నది. నీవు తలఁచుకొన్న నతిసులభముగ నెఱవేర్పఁగలవు. నామాట వినుము ఊరక చెడిపోకుము.

శాంతి : చాలు. చాలు. నీబెడిదములు. నేను చావునకు భయపడువాఁడను గాను. ఏండ్లు గడచినవాఁడను. ఎప్పుడైనను చావ వలసినదే. ఇఁకఁ బ్రాణములతో నుండి నేనొందుసుఖ మేమి! కన్న పిల్ల లాగతి పట్టిరి. నమ్మినవాఁడ వింతవైతివి! నాకీజన్మముతో నేమి పని? ఉండి ఎవరినిజూచి యానందింతును? నన్నీసమయముననే శిరశ్ఛేదన గావించిన మఱియు నుపకారి వగుదువు.

అని యాతఁడు కన్నీరు గార్చుచు మోము వాంచెను.

ప్రవా : అయిన నీవింకను నీపట్టు వదలవుగదా? శాంతినాథా! ఒకమాటను జెప్పెదను. నీకుమారుని బ్రతికించుకొన నెంచితివేని నా మాటలను ద్రోసివైవకుము.

శాంతి : (ససంభ్రమముతో) ఏమి! ఏమి! నాకుమారుఁ డింకను జీవించి యున్నాఁడా? వాఁడు వానిపినతండ్రిజాడ ననుసరించి పోలేదా? హా! హా! దేవుఁ డెంతకరుణామయుఁడు. భైరవపాలా! నీకాళ్లంటి వేఁడెదను. వాని నేమియు ననకుము. వాని నొక్కనిని బ్రదికి యుండనిమ్ము. వాఁడింకను బసిబాలుఁడు. నీకెట్టియపచారమును జేసి యెఱుఁగఁడు. వానిని సుఖముగ నూరుఁ జేర్పుమా.

ప్రవా : ఆవిషయమే నేఁజెప్పునది. నీకుమారుఁడు నీవును సురక్షితముగ నూరు చేరఁగోరుదువేని నామాట కంగీకరింపుము. లేకున్న నీకన్నులయెదుటనే వానిరక్తసిక్తశిరము పొరలుచుండుటఁ గాంచగలవు.

శాంతి : హా! హా! హరీ! హరీ! ఎంతటిమాట వినవయ్యెను! నారాయణా! నాపై దయచూపుమా! మేము నీకెట్టివిష మిడితిమి! నాయాస్తినంతటి నప్పుడే సర్కారులో దానియుత్తరాధికారులకుఁ జెందునట్లు రిజిస్టరు చేసివైచితిని. నేనిప్పు డేమిచేయఁగలను? నాకుమారుని

మూత్రము చంపకుము. వానిబదులు నన్నుఁ జంపుము—నాభార్యను జంపుము. అప్పుడు సుఖింపుము.

ప్రవా : నీవు చేయఁదలఁచుకొన్న దంతయు సులువుగ నెఱవేఱఁగలదు. పూర్వపురిజిస్టరుపత్రమునుండి యాయుత్తరాధికారుల పేరుల తొలఁగించి యందు నా పేరును వ్రాయుము. అంతయును నిమ్మళించునుగదా ? మీరెల్లరును బ్రతుకుదురుకదా ?

శాంతి : అది సాధ్యము కాదు నాయనా, ఆ పనిని నేనెట్లు నెఱవేర్తును ? అట్లు చేయుటకు నాయంతిరాత్మ యొప్పకున్నది.

ప్రవా : అయిన నీతనయుని రక్తప్లుతభిన్నదేహమును జూడ సిద్ధుఁడవై యుండుము.

శాంతి : అయ్యో ! నేనీదుఃఖము నెట్లు సైరింతును ? నన్ను కాపాడువారు లేరా ! నా కన్నులయెదుటనా నా కుమారునిశిరశ్ఛేదన ? కటకటా ? చూడఁజాల-సహింపజాల-వినఁజాల, బాబూ ! భైరవపాలా! నీ కరుణను జూపుము ? నన్నుఁ గష్టపెట్టకుము. అది నీకు శ్రేయస్కరము కాదు. నన్ను మొదట చంపి నీ యిష్టమువచ్చినట్లు చేయుము.

అని బాలకునివలె ప్రవాళునికాళ్లపైఁబడి యేడ్వ నారంభించెను. కఠోరశిలాహృదయుఁ డగుప్రవాళు డా దీనాలాపములు కరుణామయుని చేయ నేరకపోయెను. అమృతకిరణములయుఃపర్వతమును నీరు చేయునా ? అది కరఁగునా ?

ప్రవాళుఁ డటనుండి లేచెను. ఇదివఱకు తలుపులచాటున దాఁగి వారిసంభాషణ నాలకించుచుండిన రవీంద్రుఁ డప్పుడు ప్రవాళుఁడింక వెలుపలికి వచ్చునని తలఁచి త్వరగ నా చేరువనుండిన యొకచీఁకటిగదియందుఁ బ్రవేశించెనుఁ అచ్చట నాన... —

చర్యల నన్నిటిని బాగుగ చూడఁగలిగి యుండెను. కాని, తాను మాత్ర మొరులకు దృగ్గోచరుఁడు కాకుండెను. ప్రవాళుఁ డప్పుడు తలుపులను దెఱచుకొని బయటికి వచ్చి యెచ్చటికో నడచెను. రవీంద్రుఁ డప్పుడు వాని ననుసరించి పోఁదలఁచెను కాని యది యంత శ్రేయస్కరము కాదని తనయుద్యమమును మానుకొనెను. వాఁడిప్పుడు ప్రాయశః శాంతినాథుని పుత్రుఁ డగు నాబాలకుని దెచ్చుటకుఁ బోవుచుండవచ్చు ననికూడ నాతఁడు దలంపకపోలేదు.

రవీంద్రుని యూహ వ్యర్థము కాలేదు. కొంతసేపటి కా మ్రుచ్చు పదియేఁడుల యీడు బాలుని వెంటఁబెట్టుకొని వచ్చి మరల శాంతినాథుని గృహమునందు చొచ్చి తలుపులను బంధించుకొనెను. రవీంద్రుఁడు మరలఁ దనగుప్తస్థానము వదలి యీవలికి వచ్చి తలుపుచాటున నిలుచుండి లోపలివారి ప్రసంగము నాలకింప మొదలిడెను.

ఆ యర్భకునిఁ గాంచినంతనే శాంతినాథుఁ డానందవశమున నున్మత్తునివలె పరుగిడి వచ్చి వాని నాలింగనము చేసికొని "హా! నాయనా!" యని కొంతవఱకు నిశ్చేష్టితుఁడై పోయెను. ఆబాలకుఁ డాతని పుత్రుఁడు. కఠోరుఁ డగు ప్రవాళుని మూలమున నా జనకసుతులకు చాలకాలము క్రిందట వియోగము సంఘటిల్లినట్లు తెలియవచ్చుచుండెను. తనపుత్రుఁడు గతించిపోయె నని శాంతినాథుఁడు గ్రహించి యుండెను. కాని యట్లు జరిగినది కాదు. డింభకుఁడు జీవములతో వచ్చి యాతని మ్రోల నిలుచుండి యున్నాఁడు. అప్పుడు వారిరువురి సంతోషాతిశయముల నెవ్వరు వర్ణింపఁగలరు? ఊహింపుఁడు. మాకలమున కంతటి శక్తి లేదు.

ప్రవాళుఁడే యా యానందలహరి కడ్డువిలిచెను. ఆబాలుని తండ్రి యొడినుండి యీవలి కీడ్చుకొని "శాంతినాథా! ఇప్పు డేమందువు?"

నడచుకొన్న నింత యనర్థకము జరుగునుకదా? నిన్నూరక బెదరించుచుంటి ననుకొనకుము. నీవిట్లుకొన్న పని; లేకున్న నీక్షణమున నీహత్య జరుగుట నిక్కము" అనెను.

శాంతినాథుఁడు మాటాడ నేరఁడయ్యెను. చాలసేపటి కాతఁడట్టి కుమారునిదిక్కు నలుముఖముల గాంచుచు నిర్విణ్ణుఁడై నిలుచుండెను, తుద కిట్లనెను. "అయ్యో! నా మొఱ నాలకింపవైతివి కదా! నేనేమి చేయఁగల్గుదును? దైవమే యిట్టి దూరమైనప్పుఁడు దొరలను దూఱ నేల. అయిన నీవిషయమై యోజించుటకు నాకు వారముదినములుమాత్రము మేర నొసంగుము. అంతలో నాయంతరాత్మను దారికిఁ దెచ్చుకొని నీకోరికను నెఱవేర్తును. ఇప్పటికి నాతనయుఁడు జీవించినఁజాలును. వాని కేమియు నక్కఱలేదు. లెమ్ము. ఎందైన బీదయైనను సరే. ప్రాణములతో నున్న చాలును" అని శాంతచిత్తముతోఁ బలికెను, శాంతినాథుని యప్పటివాక్యసరణి నాలకించినవా రెవ్వరైన నేమి కరుణాప్రవాహమునఁ గొట్టుకొనిపోవలసినదే. వారిహృదయగతంబగు క్రూరాగ్ని చల్లఁబడియే యుండును. కాని ప్రవాళుఁడు ప్రకృతి కన్యథా జనించినవాఁడు. వానిశిలాహృదయమును దయాప్రవాహము భేదింపలేకపోయెను. వెలుపల రవీంద్రుఁడు వీని వంతను గాంచి మిగుల వగనొంది యాక్షణముననే లోపలఁ దూఱి ప్రవాళునిఁ బట్టి నేలకుఁ గొట్టి యాయనాథుల రక్షింపఁదలంచెను. కాని, యంతలో నది మూర్ఖభావమనియు, అట్లు గావించిన తనభావికార్యపథము నిర్మూలమగుననియుఁ దలంచి శాంతహృదయముతో నాయూహను మరల్చుకొనెను. ప్రవాళుఁడు యోజించుకొని "అయిన వారముదినములలో నీపనిని దప్పక నెఱవేర్తువా?" అనెను. శాంతినాథుఁడు "నిశ్చయముగఁ జేసెద. ఇఁక నేనెందు బోఁగలను? నీయధీనముననే యుంటిని కాదా" అని బాసచేసి చెప్పెను.

వారముదినములు! అనఁగా నెంత? ఏఁడుదినములు మాత్రమే. ఒకటి—రెండు—ఏఁడు దినములే. త్వరలో రాఁగలవు. అంతలో ఘట్టి మునిఁగిన దేమి? ప్రవాళుఁడు తుద కాతనిసమయమున కియ్యకొనెను. "సరి, అంతవఱకు గడువొసంగితిని. యోజించుకొనుము. నేనిఁకఁ బోయివత్తును" అనెను. అప్పుడు "అన్నా! ఇంకొక చిన్నమనవి. నా కుమారుని నాయొద్దనే యుండనిమ్ము. వానిముఖమును గాంచియైన నాదుఃఖమును మఱచిపోదును" అని శాంతినాథుఁడు ప్రార్థించెను. ప్రవాళుఁ డించుక యోజించి "లేదు. లేదు. అట్లెన్నఁటికేని జరుగఁ గూడదు. వీఁడు యథాస్థానముననే యుండవలయును. నాపని పూర్తి యయినపిదప మిమ్మిరువురనే కాదు—అందఱను గలిపెదను" అని చెప్పుచు నాబాలకునితో నాతావు వదలెను. రవీంద్రుఁడు మరల వచ్చి తనరహస్యస్థానమున దాఁగుకొనెను. పాపము శాంతినాథుఁడు హతాశుఁడై వారు వెడలిపోవుదిక్కునకు ముఖమై చూచుచు విషణ్ణుఁడై పోయెను.

# పంద్రెండవ ప్రకరణము

## దుస్థితి

ఆకస్మికముగఁ బ్రవాళుఁడు తలుపు దెఱచుటయు—రవీంద్రుఁడు చేరువగదిలోపలికిఁ బాఱిపోవుటయు నొక్కమాఱు జరిగిపోయెను. హంతకునిదృష్టిని పడకుండ నుండవలయు నని పత్తేదారునియూహ. కాని దూరదృష్టి యగు ప్రవాళునిదృష్టినుండి యాతఁడు దాఁటిపోఁజాలకుండెను. బాలుని నాస్థలమునుండి కొనిపోవు సమయమున నెవరో దాపున గదిలోనికిఁ బోయినట్లు ఛాయామాత్రమున ప్రవాళుఁ డూహించెను. అనుమానసంకీర్ణహృదయముతో వాఁడాదిశను కటుతీక్ష్ణ దృష్టిపాత మొనర్చి చూచెను. రవీంద్రుఁ డాయంధకారమున నొదిఁగి కూర్చుండియుండెను. అది గ్రహించినవెంటనే యా నృశంసుఁ డపార కోపభయఘూర్ణితుఁడై యొకసహజాట్టహాసమును గావించెను. విలేఖనాతీతభావోదయమున వానిమానస మాతటి వ్యత్యస్తమగు చుండెను. తోడనే ప్రవాళుఁడు "ఓహో! పత్తేదారులవా రింతటివేళలో నీచీకటికొట్టున నేమిచేయుచున్నారు?" అనెను. అది విని రవీంద్రుని గుండె గుభిల్లుమనెను—ఏల? అది వర్ణనాతీతభావోన్నతి!! తా నెంత ప్రచ్ఛన్నముగ సంచరించుచుండినను వాఁడేవిధముగనో తనగుట్టంతయుఁ దెలిసికొనె నని మిగుల పరితపింపసాగెను. ఇఁక నూరకుండిన బాగుగ నుండదని యప్పు డాతఁడు ప్రస్తుతధైర్యరూపముతో "ప్రవాళా! ఇంత రాత్రివేళ నీబోఁటిహంతకాధము లీకొట్టుస్థలములం దేమిచేయుచుందురో చూతమని వచ్చియుంటిని" అనెను.

అది వినఁగనే ప్రవాళుఁడు క్రుద్ధవ్యాఘ్రమువలె రవీంద్రునిపై లంఘించెను. ఆతనిహస్తమునం దింకను నా దీర్ఘకృపాణము వెలయుచుండెను. అపరాధశోధకోద్యోగి యా విషయమును గ్రహింపక పోలేదు ; వాఁడారీతి తనపైకి వచ్చుచుండుటను గాంచి యాతమఃపుంజమున నించుక ప్రక్క కొదిఁగి నిలుచుండెను. అంతటను చీఁకటి. ప్రవాళుని కచట నాకస్మికముగ కన్నులు గానరాకుండఁబోయెను. తనయభియాతి యేమూల నుండెనో వానికిఁ దెలియకపోయెను. కొంత సేపు మందచేష్టుఁడై నిలుచుండి యతిగంభీరముగ "గజేంద్రా!" అని కేక వైచెను. ఆక్షణముననే రవీంద్రుఁడు డేగుఱుపాటున తటిల్లతవలె వచ్చి ప్రవాళుని నతిగాఢముగఁ గౌఁగిలించి పట్టుకొనెను. ఆపట్టునుండి ప్రవాళుఁడు విడిపించుకొనుటకై మిగుల శ్రమ పడెను. కాని రవీంద్రుని పట్టంతటిహీనశక్తి సమన్వితము కాదు. ఆ బిగువుచే వానియవయవములు నిశ్చలములై పోయెను. ఆతని బాహుబలమును దలఁచి ప్రవాళుఁడు మిగుల ఆశ్చర్యపడియెను. అంతలోపల రవీంద్రుఁ డుపాయముగ వాని చేతనుండినయసిపుత్రికను గైకొని దూరముగ పాఱవైచెను. ప్రవాళుని యొద్ద నింకెట్టియాయుధమును లేదు. అప్పు డాయిరువురి కాభయంకర ప్రదేశమున—నా పెనుచీఁకటిసంద్రమున—తుములయుద్ధ మతిఘోరముగఁ బ్రారంభమయ్యెను.

ఈ చిత్రమును గాంచి యచ్చటిబాలుఁ డత్యంతాశ్చర్యముతో దూరముగ పోయి నిలుచుండెను. వెలుపల గడబిడ నాలకించి శాంతినాథుఁ డేదియో ప్రమాదము సంభవించుచున్న దని భయపడి వెలుపలికి రాయత్నించెను. కాని ద్వారము వెలుపల బంధింపఁబడి యుండెను ; లోపలినుండియే నానావిధములుగ నూహించుచు భీతిలసాగెను.

రవీంద్ర ప్రవాళులద్వంద్వయుద్ధ మత్యంతభయంకరముగఁ బరిణమించుచుండెను. ఇరువురును సమవయస్కులు — అసమానభుజబల విక్రములు — అతియుక్తిపరులు — ఒకరి కొకరు లొంగరు. అంతయు చాలగందరగోళముగ నుండెను. నిముసములు దాటినకొలఁది వారి రోషచిహ్నములు చెలరేఁగిపోవుచుండెను. వారిముష్టిఘాతములచే నా మందిర మంతయుఁ బ్రతిధ్వనిత మగుచుండెను. అనవుమఁ ప్రవాళుఁడు పిడికిలి బిగపట్టి మిగులబలముతో రవీంద్రుని వెన్నుపై గ్రుద్దెను. సాధారణులపై నా దెబ్బ పడియుండిన వారు వెన్నువిఱిగి చూర్ణీభూతులు కావలసినదే. కాని రవీంద్రుఁ డించుకంతయు జంకలేదు. అతని కప్పు డాగ్రహ మతిశయించిపోయెను. చాలసేపటివఱ కట్లు పోరుచుండిన బాగుగ నుండదని పదాఘాతమును దిన్న ఘోరకంఠీరవముభంగి రోఁజుచు తనముష్టిచే తనసర్వశక్తి నుపయోగించి ప్రవాళుని తలపైఁ దన్నెను. అది సాధారణమా! అశనిపాతము! పర్వతపతనము!! రోదసీగహ్వరములమధ్య చూర్ణీభూతము!!!

ఆ దెబ్బచే ప్రవాళునిశరీర మాద్యంతము సంచలితమై పోయెను. శిర మొక్కమాఱుగ భిన్నమైనట్లు దోఁచెను. కన్నులు గిఱ్ఱున తిరిగిపోఁదొడఁగెను. మస్తక మదరిపోయెను. ప్రవాళుఁ డిఁక నిలుచుండనేరక పోయెను. తోడనే వాఁ డవశుఁడై భూమిపైఁ బడిపోయెను.

ఇఁకఁ దడయుట లెస్సగాదని తలఁచి రవీంద్రుఁ డీవలకు వచ్చెను. అప్పుడు వెలుపల నెవరో తలుపులఁ దీయుచున్నట్లు సవ్వడి వినవచ్చెను. అది విని "ఇఁకఁ దాళరాదు. శాంతినాథుని వదలించుట కవకాశము లేదు. ఇప్పు డీబాలునిమట్టున కిచటినుండి సాగించుకొని పోయినఁ జాలును." అని రవీంద్రుఁ డాలోచించి యాపిల్లవానిని డాసి "నీవేమియు గందరగోళము చేయకు. నిన్ను కాపాడెదను." అని

వాని నెత్తుకొని యొక్కక్షణకాలములో నాయిలు విడిచి వేఱుమార్గమున పాఱిపోయెను. అతని నెవరు నాసమయమునఁ గనిపెట్టలేదు.

ఆసమయముననే యాసౌధమున నొకపురుషవ్యక్తి చీఁకటియందు తడవాడుచుఁ బ్రవేశించెను. వాఁడు సమున్నతశరీరుఁడు, మిగులఁ బలసంపన్నుఁడు. అట్లేతెంచుచు వాఁడు పలుమాఱు "ప్రవాళా ప్రవాళా!" యని పిలిచెను. కాని యెట్టి ప్రత్యుత్తరమును రాదయ్యెను. మరలమరలఁ బిలుచుచునే యుండెను. ఏమిప్రయోజనము ?

ఆ నిబిడాంధకారమున దృష్టిమాంద్యమైపోవుచుండెను. ఎదుట నుండువస్తువులే కాన్పించుటలేదు. గృహమున కాయాగంతుకుఁ డించుకనూతనునివలె గన్పట్టుచుండెను. ప్రవాళునకువలె కాక వాని కందుఁ జీఁకటులయందు తిరుగాడు ననుభవము తక్కువ. ఏతత్కారణమున పాప మాపురుషుఁ డెన్నియోమారులు తలుపుపై దొర్లిపడుచుండెను—రాళ్ల నెక్కి క్రింద కూలఁబడుచుండెను—స్తంభప్రహారములచే తలను నొప్పించుకొనుచుండెను. వాని కంతయు మనోవ్యథగ నుండెను. చేత దీపికయైన లేదు. మధ్యమధ్య నేమేమియో గొణుఁగుకొను చుండెను. ఆసమయమునకు సరిగ వానిపాదమునకు మరల నేదియో బరువగువస్తువు తగులుటచే పాపమావ్యక్తి హాహాకారములఁ జేయుచు క్రిందపడెను. అతఁడు తిన్నగ లేచి చూచెను. వస్తువు మిగుల మృదువుగ నుండెను. తారసింహుఁడు దానిని పరిశీలించి చూచెను. అది యొకమానవదేహము. వ్యక్తి స్తంభీభూతుఁడై భయపడిపోయెను. "ఇదెక్కడిది ? ఎవరిహత్య ?" అని గొణుగుకొనుచు చటాలున దాపుననుండినశాంతినాథునిగదిలోని కేఁగి దీపమును దెచ్చి పరికించి కనుఁగొనెను—అది ప్రవాళునిదేహమే !!!

తారసింహుఁ డది గాంచి యాశ్చర్యచకితుఁడై భయసంభ్రమములతో చీత్కారమును జేసెను. అది గాంచి శాంతినాథుఁ [illegible]

పరుగిడి వచ్చి చూచెను. ఆనగ్న స్వరూపము భీభత్సదర్శనముచే దడదడ కొట్టుకొనపోవుచుండెను. ఈ ప్రాణి నెవరీగతి కొట్టినది? ఎవరికిఁ దెలియదు! తనపుత్త్రుఁడేఁడీ? కానరాకున్నాఁడే? శాంతి నాథుఁ డంతయు వెదకెను. బాలకుఁ డగుపడఁడయ్యెను. తోడనే యాతనిమానస మహాచ్ఛ్యభావద్వాసమ్మోళనమున తత్తరిల్లపోయెను. "ఎవరైనఁ దనవారు తనయుఁ డంతఁటనున్న దెలిసికొని వచ్చి యేమైన నాగతి ప్రవాళునిఁ దన్ని తనకుమారుని విడిపించుకొనిపోయియుందురా?" యని యనుకొనెను. మరుక్షణముననే "నాఁటి వేదొంగయును రాలేదు కదా" అని తలపోసెను. ఇట్టి యాలోచన లెన్నియో దాఁటిపోయెను. హృదయావేగ మొక్కొక్కమారు శోకాతీతభయసంభ్రమములతో నుప్పతిలుచుండెను. నఁటివెుక్క మా జాలహారియంతరించి శాంత వాయువు వీచుచుండెను. తుద కాతఁడేమి యనుకొనుటకును వీలులేక పోయెను. తుదకు తారసింహుఁ డాతనిని గాంచి "శాంతినాథా! యేమిది! ఈతని కెవ్వ రీగతిపట్టించినది!" అనెను. అవృద్ధుఁడు తనకును ప్రవాళు నకు జరిగినసంభాషణలను చెప్పి యాతఁడు గదివెడలివచ్చినపిదప నెవరో వచ్చి నాతనితో పోరినట్లు చెప్పెను. తారసింహుఁ డది విని యోచింప మొదలిడెను. అతని కిదివఱకే ప్రవాళుఁడు రవీంద్రాదులసంగతులను జెప్పియుండెను. అందుచే తారసింహున కాసమయమున నాపత్తేదారుల విషయమై యనుమాన మొదవెను. తోడనే వాఁడు గద్దించి శాంతి నాథుని యథాస్థానమునఁ జేర్చి తలుపు బంధించి వచ్చి తనమిత్రుని దేహపార్శ్వమునఁ గూర్చుండెను. అది చల్లఁబడి యుండలేదు కాని కొయ్యవాఱి యుండెను. శిరమునుండి రక్తధారలు ప్రవించుచుండెను. నోటఁగూడ కీలాలప్రవాహము గోచరించెను. తారసింహుని మేను భయముచే వణఁక మొదలిడెను. ఎన్నిమారులో "ప్రవాళా! ప్రవాళా!"

యని పిలిచెను. కార్యసాఫల్యము చే పోయినది. "ఆహా! ఈతఁడు గతించిపోయెనా? హా! మిత్రమా!" యని గ్రుడ్ల నీరు గ్రుక్కుకొనుచు "ఆహా! ఇంతయు నా పత్తేదారీవిద్యయే యొనరించెను. లేకున్న వారు లెవ్వ రింత రాత్రివేళ నిచ్చటికి వచ్చి యింతఘోరమును గావింతురు! హా! రవీంద్రా!" అని చాలసేపటి వఱకు కన్నీరు గార్చుచుండి తుదకట నాలసింపక నాయిలు వెడలిపోవ నిశ్చయించెను. కోపఘూర్ణిత మానసముతో తారసింహుఁ డూరక యు ప్రవాళుని ముఖదర్శనము చేసెను. మధ్యమధ్య నున్మత్తుఁ డగుచుండెను. ఎట్టిభావములతో నాతఁడు బాధపడుచుండెనో మాకుఁ దెలియదు. వానిని వాఁడు వెలిపుచ్చుటలేదు. తుద కాభయంకర వీక్షణములతో నలుదిక్కులు పరికించి వచ్చి ప్రవాళుని దేహమును భుజములపై వైచుకొని దానవుని వలె నా దారిని వెడలిపోయెను.

## ప్రవాళుఁడు నిక్కముగ గతించిపోయెనా?

# పదుమూఁడవ ప్రకరణము

## శేషరాత్రి

రామనాథుఁడు రవీంద్రుని యనుమతి ననుసరించి కరాళు ననుసరించి వెడలి పోయెను. ఆ కరాళుఁ డిప్పుడు వేగముగ శ్రీమతివీథియందు నడచి పోవుచుండెను. మార్గమంతయు నిశ్శబ్దనిబిడాంధకార బంధురమై యుండెను. అచ్చటచ్చట వీరిని గాంచి కుక్కలు కూయుచుండెను. ప్రభంజనవశమున వీథులందలి దీపము లన్నియు శాంతించి యుండెను. రామనాథుఁ డతిజాగరూకతతో తనపరిపంథి కెఱుకపడకుండ నడచుచుండెను. ప్రాయశః వీఁడు కూడ నా యపరాధులలో నొకఁడై యుండు నని యాతఁ డప్పుడే యనుమానించెను. అందుకే యింతటి యనుసంధానము.

కరాళుఁ డావీథిచివరవఱకు వచ్చి యచటికి కొంతదూరమున నున్న యొకగొప్ప సౌధముసమీపమున నాఁగిపోయెను. అది మిగుల సుందరహర్మ్యమే కాని మిగుల పురాతనపుఁగట్టడము. దానిచుట్టును గొప్పపుష్పవన మొకటి కలదు. వాఁడంతతిన్నగ నాయింటిద్వారమును సమీపించెను. గృహోపరిభాగమున నింకను దీపకాంతులు గాన్పించుచుండెను. రామనాథుఁడు వాని చర్యలను బాగుగనే లక్షించుచుండెను. వానికిఁ దెలియరాకుండ నచ్చటనుండిన యొకలతాభవనమును బ్రవేశించి యచ్చట జరుగువింతను జూతమని యెంచి తిన్నగ నచ్చటికి వచ్చెను. అప్పు డాతనిపాదచలనముచే నచ్చట పడియుండిన యెండు

టాకులలో నించుక గలగల మని శబ్దము గలిగెను. కరాళుఁడు గృహకవాటమునొద్దనుండి యొకమాఱావైపునకు తిరిగి చూచెను. అంధకారముమాత్రము ఘనీభవించుచుండెను. కొంతసేపటివఱ కట్లు చూచి పదంపడి మెల్లఁగ తలుపుపై చఱచెను. అట్లు తాను శుష్క-పత్రములందు సవ్వడి కలుగఁజేసిన సమయమున కరాళుఁడు తన్ను చూచెనేమో యని రామనాథుఁ డనుమానించెను. కాని, వెనుకంజ వైవక దీమసముతో మరల నాధ్వనిని గలుగఁజేయక యాహాంసీమందిరమునఁ గూర్చుండి వానిపై కన్నుంచి చూడసాగెను. అచ్చటినుండి యాతని కాస్థల మంతయు స్పష్టముగ గోచరించుచుండెను.

వెలుపల తలుపుచప్పుడు నాలకించి లోపలినుండి యొకపురుషుఁడు వచ్చి తలుపుదీసెను. అతఁ డించుకస్థూలకాయుఁడు, వయసు సుమారు ముప్పదివర్షము లుండును. అతిదీర్ఘదేహుఁడు. అతఁ డాకరాళునిఁ గాంచి "ఏమి, యింతకాలములో వచ్చితివేల?" అని యడిగెను. అందు కాచోరాధముఁడు హస్తసంజ్ఞలచే నాతనినీవలకుఁ బిలిచి చాల కాలమువఱకు నేమియో రహస్యముగఁ జెప్పెను. అందొక్కమాటయైనను రామనాథునకు వినఁబడదయ్యెను. పిదప వాఁడు గట్టిగా ననెను. "దాసుగారూ! మీయుద్యానవనములోని పుష్పములు గొన్ని కావలయును. అచ్చటికి పోదము రండు. వాని నతిశీఘ్రముగఁ దీసికొనిపోవుటకే వచ్చియుంటిని" అనియెను. అప్పు డిరువురును వనమువైపు నడువఁదొడఁగిరి.

అట్లు వారిరువురును తనవైపునకే వచ్చుచుండుటను గాంచి రామనాథుఁడు చేయునది లేక మఱింత భద్రముగ నడఁగి కూర్చుండెను. వారింకను దన్ను చూడలేదని నిశ్చయించుకొనెను. వారు తనపార్శ్వమునను నడచుచున్నట్లు కనుఁగొనెను. వారు దూరము సాగిపోక

యాతనికతిసమీపమున నిలుచుండి యచ్చట మరల తమప్రసంగమును సాగించిరి.

కరా : అయ్యా! ఈసంవత్సరము మీతోఁటయందు మంచి మంచిపూలమొక్కలను దెచ్చి నాటించినా రని మాయజమానుఁడు చెప్పుచుండెడివాఁడు.

వ్యక్తి : అవును. ఆతని కీకుసుమములంగొన్నిటి నరిపియుంటిని. అవి యీాద్యేఁడు కాచినవి. అవి చాల మనోహరమైనవి. ఇదివఱ కట్టివి నాతోఁటయం దుండలేదు. ఏమైన నేమి. విదేశీయులము. పూల నమ్మి జీవించుటలో నాకు గొప్పనేర్పుగలదు.

కరా : అవునండీ, మీరీయూరికి వచ్చినపిదప మాయజమానుఁ డితరులవద్ద కుసుమములఁ గొనుట మాని మిమ్మే నమ్మి మీయొద్దకు వచ్చుచుండును. ఇందుకు మీశ్రేష్ఠతరమగుపూలు, మీన్యాయప్రవర్తనము కారణములు కాని యన్యము కాదు.

వ్యక్తి : ఏమో, మీబోఁటివాండ్లకు దయ కలిగిన మేమొకరీతిగ జీవింపఁగలుగుదుముకదయ్యా.

వారిసంభాషణమును రామనాథుఁ డాలకించెను. కాని యందున నెట్టిరహస్యమును గోచరింపలేదు. వారిఁక పూఁదోఁటలోనికి వెడలి పోదు రనియు, నప్పుడు తాను వేఱొకచోటికిపోయి దాఁగుకొనవచ్చు ననియు నిశ్చయించెను. కాని యెంతసేపటికిని వారాస్థలమును వదలి కదలకుండిరి. "ఈపుష్పలావికునకుసహిత మీహత్యాపరాధమున సంబంధ ముండునా. బహుశః ప్రవాళుఁడు చెప్పినసుశీల యీాయింటి యందే యున్నదేమొ" అని రామనాథుఁడు కొంతవఱకు యోజించు కొనెను. ఇంతలో నాకస్మికముగ నాయిరువురును వచ్చి యాతనిపైఁ బడి గట్టిగ పట్టుకొనిరి. రామనాథుఁడు భయవిస్మయసంభ్రమములోఁడై

పోయెను. ఇట్లగు నని యాతఁ డెంచియుండలేదు. వారిదివఱకుఁదన్ను చూచియుండలేదని తలంచుచుండెనే కాని యిప్పుడు వారు తనయునికిని ముందుగనే కనిపెట్టి యుండిరని గ్రహించెను. పాప మాతఁడు నిస్సహాయుఁడై వారిచేతులలోఁ బడిపోయెను. తన కార్యక్రమ మంత హటాత్తుగ భగ్నమైనందు కెంతయు చింతించెను. అంతయు నట్టి పాటున జరగిపోయినది. ఏమి చేయుటకును దోఁచలేదు. నోట మాట వెడలకుండెను. అతఁ డింకను బాలుఁడు. బలసత్వ లగునిరువురితోఁ బోరి జయింపఁగలఁడా? ఇఁకఁ జేయునదేమి? రామనాథుఁడు దళితదంతంబగు భుజంగమువోలె వారిచే బంధితుఁడై పోయెను.

కరాళుఁ డంత నా పురుషునిఁ గాంచి "అయ్యా! సోమనాథదాసు! వీఁడెవ్వఁడో దొంగవలె కన్పట్టుచున్నది. కాన వదలవద్దు. మేము వీనినిగుఱించి విచారింతము. వీని నిప్పటికి నీ గృహమునం దొక రహస్యస్థానమున పడవైచి యుండుము" అనెను. ఆ పురుషుఁడు మిగులకుపితుఁడై "వీఁడెవ్వఁడో కూలివానివలెఁ గన్పట్టుచున్నాఁడు. వీఁడు నీవన్నట్లు దొంగ" అనుచు పాపము రామనాథుని వీపుపైని రెండు గుద్దులు గుద్దెను.

అంత వారిరువురును మఱేమియు మాటాడక యాతనికన్నులను బంధించివైచిరి. వానిని మోసికొని యాయింటఁ బ్రవేశించిరి. అతనికి వారు తన్నెందు గొంపోవుచుండినది బోధపడదయ్యెను. వారట్లే చాల దూరమున నడచి పోయి తుద కాతని నొకచోఁ బడవైచి కన్నుల ముసుఁగును దీసిపోయిరి. అది యొకపాడిల్లు. అంతయు చీఁకటి. దుర్గంధపూరితము. రామనాథున కది ప్రత్యక్షనరకమువలె మిగుల బాధాకరముగ నుండెను.

# పదునాలుగవ ప్రకరణము

రహస్యము

తెల్లవాఱుచున్నది. రామనాథుఁ డింకను నింటికి రాలేదు, కారణ మేమి చెప్పుమా?

రవీంద్రున కేమియుఁ దోఁచకుండెను. అతఁ డేల యింకను రాకుండును! తనకార్యము నింకను నెఱవేర్చి రాలేదా! లేక యాతని కెట్టి యాపదయైనను సంభవించినదా! ఏమో! ఎట్లు తెలియఁగలదు! పత్తేదారుని హృదయమున భయము కలుగుచుండెను. మస్తిష్క మధ్యమున నానావిధకల్పనాతరంగసమితి తరలిపోవుచుండెను. పాపమాతఁ డత్యంతచింతాకుల మానసముతో నాశేషరాత్రిని వేగించివైచెను.

ఉదయమున నాతఁడు తాను రాత్రి విభీతిమందిరమునుండి కొని తెచ్చినబాలకునితో నానందుని జూడఁబోయెను. వానిని జూడఁగనే యానందుఁడు సంతోషాశ్చర్యసంభ్రమయుఁడై పరుగిడి వచ్చి యెత్తుకొనెను. రవీంద్రున కది బోధపడదయ్యెను. అతఁడు కొంతవడికు దిచ్చ వడి యూరకుండి "అయ్యా! ఈ పిల్లవాఁడు మీ కేమి కావలయును!" అనెను. "రవీంద్రా! మాకు వీనితో నుండు బంధుత్వమును కనుఁగొనకయే యెట్లు వీని నిటకుఁ దోడ్తెచ్చితివి! వీఁడు మా పెద్దమామ గారి కుమారుఁడు. వీరిది భరతపురము, ఇచ్చటి కెట్లు వచ్చెను! ఒకఁడే వచ్చెనా లేక వీరితల్లికూడ వచ్చినదా!" యని విస్మయవీక్షణములతోఁ బ్రశ్నించెను. రవీంద్రున కేమి చెప్పుటకును దోఁచలేదు.

రహస్య మంతకంత కగాధమైపోవుచుండెను. "ఆనందుఁడు చెప్పిన దేమి? ఆ బాలకుఁడు తన పెద్దమామకుమారుఁడఁట. కాపురము భరతపురమఁట. అయిన శాంతినాథుఁడును బహుశః ఆనందునకుఁ బ్రియ బంధువై యుండును." అని యాలోచించుకొనెను. కాని యాతనికిఁ దాను రాత్రికాంచిన విచిత్రములను జెప్పక ప్రస్తుత మా విషయముల నడుగకు మని యానందుని వేఁడుకొనెను. అతఁ డంతటితో నూరకుండక నా బాలుని గాంచి "అన్నా! నీవిచ్చటి కెట్లు వచ్చితివి? ఈతని నెచట చూచితివి? భరతపురమునుండి మీతల్లి రాలేదా? నిన్ను దొంగ లెత్తుకొనిపోయియుండి రని మీతల్లి తెలిపియుండెనే. ఎట్లు తప్పించుకొని వచ్చితివి? సుశీల యెచ్చట నున్నది?" అని యనేక విధములఁ బ్రశ్నలువైచెను. ఆ డింభకుఁ డేదియో చెప్పఁబోవు చుండఁగ రవీంద్రుఁ డడ్డువచ్చి "అయ్యా! ఆనందా! ఈ పిల్లవానినే దొంగలెత్తుకొనిపోయిరా? వీరిసంగతి యేమి?" అని యడిగెను.

ఆనం: భరతపురమున కేశవపాలునకు జ్యేష్ఠభ్రాతయైన శాంతి నాథుఁ డున్నాఁడు. అతనితనయుఁ డీబాలకుఁడు. సుశీల వీని చెల్లెలు. కొంతకాలముక్రిందట నెవరో దొంగ లీపసిపాపల నిరువురను తలి దండ్రులనుండి తస్కరించుకొని పోయిరి. పిదపఁ గొంతకాలమునకే శాంతి నాథుఁడుకూడ చోరులచే నపహృతుఁడై పోయెను. అప్పటినుండి వీరిసంగతులే మాకుఁ దెలియకుండెను. వీరితల్లి శ్యామలాంబ, పాపము భరతపురమున నొంటిగ పడి యహోరాత్రములు వీరికై దుఃఖించు చుండెను. ఆకస్మికముగ నేఁడు మాబాలకుఁ డెందుండి వచ్చెనో నాకుఁ దెలియకున్నది." అని చెప్పెను.

రవీంద్రుఁడు క్షణకాలములో నానందుఁడు చెప్పినదానిని రాత్రి తాను కని వినినదానిని సరిపోల్చుకొని చూచెను. ఆ శాంతినాథుఁడే

యానందుని పెద్దకూమా. ప్రవాళుఁడే చోరుఁడు. ఈ బాలుఁడు శాంతి నాథుని తనయుఁడు. ఆహా! యగాధరహస్యము తెలిసిపోయినది! రవీంద్రుఁడు కొంతకాలమువఱకు నాలోచించుకొని తుద కాతనికి సర్వమును నివేదించివైచెను. అది వినఁగనే యానందుఁ డపారవిస్మ యానంద విస్ఫారితుఁడై తూలిపోయెను. ఎంతటి యానందవార్త! ఎంతచిత్రసంఘటనము! తనబంధు లిదివఱ కారీతిఁ బ్రవాళునిచే బాధింపఁబడుచుండిరని యాతనికిఁ దెలిసియుండలేదు. చోరు లన నెవరో క్రూరులని యెంచి యుండెను. శాంతినాథుఁ డింకను జీవములతో నుండుట నాలకించి యానందుఁ డానందపరవశతచే గంతులువైచెను. ఆతని స్థితిని "తూచ" తప్పకుండ నెట్లు వర్ణింపఁగలము? ఒకవైపున సమున్నత తరంగఘూర్ణితసమ్మదసాగరము—వేఱొకప్రక్క పటుతర కోపఘూర్ణితభీకర ప్రవాహము—మఱియొకచోట దురంతచింతాగ్ని! వీనిసమ్మేళనముచే నానందుఁ డున్మత్తుఁడై పోవుచుండెను. తనచేష్టలను లక్షింప నేరఁడయ్యెను. పలుమాఱు బాలునెత్తి ముద్దుగొనును. రవీంద్రుని పొగడును. భగవంతుని ధ్యానించును. రోషకషాయిత లోచనములతో ప్రవాళుని శపించును. అప్పుడు రవీంద్రుఁ డాతనిని గాంచి యిట్లనెను. "అయ్యా! ప్రవాళుఁ డేల వీరి నెత్తుకొనివచ్చి యుండెనో తెలియునా?"

ఆనం: ఆ సంగతి తెలియదు. లోకమునకుఁ దండ్రియుఁ బిల్లలును నపహరింపఁబడిరని మాత్రము తెలిసి యుండెను. కాని యా చోరు లెవరు; వీరేల తస్కరింపఁబడిరి; వారెందున్నారు; అనువిషయము లొక్కరికిని దెలియఁబడకుండెను.

రవీం: అయిన, నానందా! నీవిప్పటి కీవార్తను రహస్యముగ నుంపుము. కొలఁదిదినములలో శాంతినాథుని బంధవిముక్తునిఁ జేసి యాతని తనయయగుసుశీల యెందున్నదో కనుఁగొనెదను. అంతదనుక

నీ యుదంతము ప్రపంచమునకుఁ దెలియకుండుట మంచిది. వారి కెట్టి యుపాయమును కలుగదులెమ్ము. సుశీలవిషయమై తెలిసికొని వచ్చుటకై రామనాథుఁ డేఁగియున్నాఁడు. త్వరలో నాసంగతియును దెలియఁ గలదు. నాకిదివఱకు నీ రహస్యములు తెలిసియుండలేదు. నీ మూలమున తెలిసినవి. రాత్రి సంభాషణవశమున శాంతినాథుఁడు మీమామయగు కేశవపాలుని నామోచ్చారణ గావించెను. కాని, నాకప్పుడేమియు బోధపడదయ్యెను. ఇట్లని తెలిసియుండిన నేనప్పుడే తగిన సన్నాహముతోఁ బోయి యాతనిని వదలించుకొని వచ్చియుండుదును. అయినను చింతింపకుము. శాంతినాథుని త్వరలో తెచ్చి నీయింట నుంచెదను. ప్రస్తుతము నేనిఁక సెలవుగైకొందును. ఈ విషయముల నెవరితోడను చెప్పకసుమా!

అని యాతఁడు వెడలిపోయెను.

రవీంద్రుని హృదయభాగమున నింతటిగొప్పరహస్యమును విన్న దాదిగ నానందలహరి కునిసియాడుచున్నది; మఱుక్షణముననే రామనాథుఁ డింటికి రాకపోవుటచే మహాకల్లోలమయమై పోవుచున్నది. అతనికి హృదయస్థిమితము లేకపోవుచుండెను. మాటిమాటికి మనస్సు మఱిదిపైకి మరలిపోయినను, అతఁ డాతని నెంతో ప్రేమించుచుండెను. రవీంద్రుఁ డేదోయొక విధముగఁ దనబస కేతెంచి యొక కుర్చీపైఁ గూలఁబడి తనచింతాసాగరమున మునిఁగిపోయెను. ఒకవేళ రామనాథున కేదైన నాపద కలిగియున్న నెట్లు? ఆ విషయమై తలఁచుకొన్నప్పుడు రవీంద్రుని దేహము ప్రచలితమై కన్నులు గిఱ్ఱున తిరుగుచుండెను.

ఇంతలో వెలుపల ద్వారమునొద్ద నెవరో తను పిలుచుచున్నట్లు వినవచ్చెను రవీంద్రుఁడు చటాలున లేచి యచ్చటికి వచ్చెను. అచట టపాలా బంట్రౌతాతనిని గాంచి సలాము చేసి యొకపత్రిక నిచ్చి పోయెను. అదియే రవీంద్రుఁడు నిరీక్షించుచుండిన వార్తాపత్రిక :!

అతఁడు దానిని గాంచి యించుక హర్షప్రఫుల్లవదనముతో యథాస్థానమునకు వచ్చి కూర్చుండెను; దానిని చదువవలయు నని మిగుల నాతురుఁడై యుండెను; విప్పిచూచెను —అందు విదేశ వార్తలు—మహాపురుషుల యుపన్యాసములు —లోకవిచిత్రములు— కాన్పించినవి. అతఁడు వానిలో నొక్కదానినైన చూడలేదు. ఇదివఱకు నతఁ డట్టిపత్రికను జూచియైన నుండలేదనుమాట వాస్తవమే. చంద్ర నగరమునఁగూడఁ గానరాదు. తనకుఁ గావలసినభాగమున్ను తుద కతఁ డొకచోట కనుఁగొనెను. అట్టిభాగమునే ప్రవాళుఁ డానాఁడు ప్రచురించు కొనిపోయియుండెను. దానినాతఁ డాద్యంతములవఱకుఁ బఠించి సంతోషసంభ్రమముతో నొకగంతు వైచెను. అం దిట్లున్నది.

“ భరతపురమునందలిధనికులలో శాంతినాథుఁ డగ్రగణ్యుఁడు. ఈతనియాస్తి యించుమించుగ నిరువదిలక్షలుండును. అతని కిప్పు డఱువదియేండ్లు. అతనికి యౌవనమునందే యొకపుత్రిక జనించెను. కాని కొన్నిదినములకే భార్యావియోగము నొంద[illegible]యుండుటచే నాతనిభార్య పరలోకమున కేఁగెను. బాలిక మాతృవిహీనురాలై పోయెను. శాంతినాథుఁడు మిక్కిలి దుఃఖించి యాశిశువు నత్యంతము గారాబముతోఁ బెంచుచుండెను. అతని కిప్పటికి బుత్రసంతానము లేకుండెను. ఉన్న దొక్కకూఁతురే. అందుచే నతఁడు పుత్రసంతతి నాసించి ద్వితీయవివాహప్రయత్నములఁ జేసి కడ కొకచక్కనిపడుచును వివాహ మాడెను. కొన్నిసంవత్సరముల కొకపుత్రుఁడును,

ఒకపుత్రికయు జనించిరి. శాంతినాథుఁ డాసంతానమును గాంచి మిగుల మురియుచుండెను.

కాని, యీ సంతానోత్పత్తికిఁ బూర్వ మొకచిత్రము నడచినది. తన ద్వితీయవివాహమునకు రెండేండ్లకుఁబూర్వము శాంతినాథుఁడు తన మిత్రపుత్త్రు నొకనిని దెచ్చి తన యింటియందే యుంచుకొనెను. అప్పటికి వానికి పదునెన్మిదివర్షములయినవి. వాని పేరు వీరబాలుఁడు. వాని నా గృహమేధి కన్నకుమారునింబోలెఁ బ్రేమించుచుండెను. అతని జ్యేష్ఠపుత్త్రిక (ప్రథమభార్యసంతానము) యగు కమలసహితము వీరబలుని చాలఁ బ్రేమించుచుండెను. ఇంతలో శాంతినాథుఁడు శ్యామలాంబను వివాహమాడుట తటస్థించెను. సచ్చరిత్ర యగు నామెయెడ నెట్టికళంకను లేదు. ఆమె పతిహితాభిలాషిణి. అనవరత మాతనిని తన శుశ్రూషచే మెప్పించుచుండును. ఇట్టిజాయాసంగమ మయిన శాంతినాథుఁ డపారానందపారావార నిమగ్నుఁడై యుండెను.

ఒకనాఁడు శాంతినాథుఁ డూర లేనిసమయమున యౌవనమదముచే వీరబలుఁ డొంటరిగనున్న శ్యామలాంబను దుర్జాతియై కామించి బలాత్కారము చేయఁబూనెను. కాని సుగుణవతి యగునాపతివ్రత వానిని దూషించి యెట్టెటో యప్పటి కామహావిపత్తునుండి తప్పించుకొనెను. తరువాత పెనిమిటి యింటికి వచ్చినపిదప నీ సంగతిని జెప్పివేసెను. శాంతినాథుఁ డది విని మిగుల రోషించి వీరబలుని రావించి యానాఁడే తనయిల్లు వదలిపోవలయు నని యాజ్ఞాపించెను. వీరబలుఁడు తన నిర్దోషత్వమును స్థాపింప నెంతప్రయత్నించినను శాంతినాథుఁడది నమ్మక కసరివైచెను. కడకుచ్చాటన తప్పదయ్యెను. తాను వానిని చిన్ననాఁటినుండి పెంచుచుండుటచే నప్పుడించుక దయకలిగి యాతఁడు వాని కింతధన మొసంగి వేఱొకచో నుండుమనెను.

కాని కొన్నిదినములమీఁదట నాకృతఘ్నుఁడగు వీరబలుఁడెందో పరుగిడిపోయెను. వానివెంట మహాపాతకియై — పాపి మగునమలసహితము పాఱిపోయెను.

శాంతినాథుఁడది గాంచి దుఃఖించి యావార్తను బహిరంగమునకుఁ దెచ్చుట కిష్టము లేక దాచియే యుంచెను; అదివఱకపుడే యాతనికి ద్వితీయభార్యయందు సంతానము కలిగియుండుటచే నాపుత్త్రపుత్త్రికలను గాంచి యూరటనందెను. కాని యొకనాఁటిపండుగదినమున నాపుణ్యదంపతు లిరువురును తమపాపల నిరువురను ముచ్చటతో నలంకరించి యాడుకొన వీధిలోనికిఁ బోవిడిచిరి. కా[illegible] మరల గృహమును చేరనేలేదు, భరతపురము నంతటను కను వెదకించిరి. [illegible] డాపుననుండుస్థలములకు సేవకుల నంపి వెదకించిరి. కాని యెట్టిలాభమును లేక పోయినది. ఆ తలిదండ్రులదుఃఖములకు మేర లేదు. ఇది చూడ నాపని నెవరో ముచ్చులు చేసినట్లు గాన్పించుచున్నది. ఆనాఁటిరాత్రియే దైవదుర్విపాకంబున వారియింట దొంగలుపడి యెంతో గందరగోళము నుద్భవింపఁజేసి శాంతినాథుని నెత్తుకొని పాఱిపోయిరి. అంతయు చాలభయంకరముగ నున్నది. పిల్లల నపహరించినవారే యాతనిని గూడఁ గొంపోయియుందురు. అందుచే మొదటియభిప్రాయమునకు విరోధముగా నిప్పుడా దురాత్ములు శాంతినాథుశత్రువులైనట్లు తోఁచుచున్నది. పోయినవారిలో నొకజాడయైనను తెలియరాకున్నది. సర్కారువారు వారికై వెదకించుచు నహోరాత్రములు కష్టించుచున్నారు. సాధ్వీశిరోమణి యగుశ్యామలశోకము దురంతమైపోయినది. ఆమె యిఁక చిరకాలము జీవించునట్లు లేదు. ఆమె వేఁడికోలులపై నీవార్త నీగతి వార్తాపత్త్రికలయందు ప్రకటించుచున్నాము.

శాంతినాథుఁ డారీతి నెత్తుకొనిపోఁబడుటకు పూర్వము తన యాస్తి విషయమై యొకయేర్పాటును గావించియుండెను. అదేమన, తనద్రవ్యమువంతటిని నాలుగుభాగములుగ భాగించి మూఁడుభాగములు తనభార్యకును నామెవలనఁగలిగిన యిరువురుపిల్లలకు పంచి యిచ్చెను. తక్కిన నాల్గవభాగమును తనకత్యంత ప్రియసోదరుఁ డగు కేశవపాలున కిచ్చెను. ఈతఁ డిప్పుడు చంద్రనగరమున ధనాధికుఁడై పేరొందినాఁడు. తనమరణానంతర మీరీతి జరుగునటుల శాంతినాథుఁడు సర్కారులో రిజిష్టరు చేయించెను ... ... ... ... ...

# పదునేనవ ప్రకరణము

## వి భీ త మం త్రీ శ్వ రు

దానిని చదివి ముగింపఁగనే పత్తేదారుని కనుఁదమ్ములనుండి యానందాశ్రువులు రాల మొదలిడెను. ఆ పత్రికవలన నాతని కెంతో యుపకారము కలిగినది. ఆ ఘనకార్యమునందిదివఱకుఁ గన్నులేనట్లు చరింప యత్నించెను. ఇప్పు డించుక చేయూఁత దొరకినది. నాఁటి ప్రొద్దుస నానందసాగరుఁడు సూక్ష్మముగఁ జెప్పిన శాంతినాథుని చరిత్ర యిపుడామూలాగ్రముగ—విశదముగ—తెలిసిపోయినది. "ఇఁక శాంతినాథునిఁ జూడ లేదన్నట్ల కనుమానము లేదు. వారు దొంగలు కారు. భయంకరనృశంసు లగు హంతకాధములు. అయిన నీ వీరబలుఁడెందున్నాఁడు? ప్రవాళుఁడే వాఁడనుట కెన్నియో సందియము లున్నవి. వాఁడీవ్యాపారముఁ జేరియుండునా? శాంతినాథుని ద్వితీయపుత్రిక యాయమల యెందున్నది? ఒకపక్షమున ప్రవాళుఁడే వీరబలుఁడై యున్న వాని యొద్ద యమల లేదే. ఆ యింట వాఁడొకఁడే నివసించుచుండెను. కాని వీరబలుఁ డిందు లేఁడనియే చెప్పవచ్చును. ఇంకను రహస్యము పూర్తిగ భేదింపఁబడలేదు. కదా! కేశవపాలుని హత్యాపరాధకులఁ బట్ట యత్నించుచుండ నను నీయొక నేరమును దేవుఁడు నాపాలఁ ద్రోసివైచెను. పాప మాదీనులశ్రమ లాలకించిన నిముసమునుండి నా హృదయమున నవ్యాజకరుణ యుప్పతిల్లుచున్నది ఏమైన నేమి! కేశవపాలునిఁ జంపిన ప్రవాళుఁగే శాంతినాథాదులను బట్టి తెచ్చి బాధించుచున్నాఁడు. ఆ క్రూరునిఁ బట్టి బంధించిన కెందు వైవులను ప్రసరించి

యుండురహస్యములు తెలిసిపోవును. "ఏకక్రియా ద్వ్యర్థకరీ" యున్నట్లీ దొక్కపనిచే రెండులాభములు గలుగును" అని రవీంద్రుఁడు కొంత సేపటివఱకు నాలోచించుకొనెను.

కాని, యింతలో సంపాదీప్తివలె రవీంద్రుని మానసవీథియందు రామనాథుని విషయమగు నూహాశకటము పఱుగిడి పోయెను. ఇదివఱకుఁ దనకుఁగలిగిన యానందములో నాచింతను కొంతవఱకు మఱచియుండెను. ఇప్పు డది ద్విగుణీకృతమగుబలముతో వచ్చి యాస్థానమున నిలిచెను. తోడనే యాతఁడు "మఱది యేల రాకుండెను? చాల ప్రొద్దెక్కిపోయినది. అతని కేదైన నాపద సంభవించి యుండునా?" అని యాలోచించుకొని కొంతవఱకు మూఢచేష్టుఁడై తల వంచుకొనెను. ఏమి చేయుటకును తోఁచక యటునిటు పచారు చేయ మొదలిడెను.

క్రమక్రమముగ విశ్వస్థానమంతయు నస్తంగతభానుబింబారుణ కిరణజాలావృత మైయెను.

నేఁటిప్రభాతమునుండి రవీంద్రుఁడు శాంతచిత్తుఁడుగా నేర్పడయెను. రామనాథుఁ డింటికి రామిచే మిగుల చింతించుచుండెను. అతని కేమిచేయుటకు దోఁచకుండెను. తుదకు కాతఁ డించుక ధైర్యమును వహించి గూఢవేషముతో నారాత్రియందు పట్టణములోనికి నాతనిజాడల నెఱుఁగుటకై వెడలిపోయెను.

అప్పుడే చంద్రదవమునం దేమూలఁజూచిన నిశ్శబ్దమూర్తి తిరుగాడుచుండెను. వీథు లన్నియు నిర్మానుష్యములై యుండెను. పక్షుల కూజితము లప్పుడు వినఁబడుటలేదు. అంధకారవనితమాత్రము నిరాటంకముగ ప్రపంచమున స్వేచ్ఛావిహారముల సల్పుచుండెను. రవీంద్రుఁడు నక్షత్రకాంతిని దిలకించుట లేదు. అతనిహృదయము ననంతభావ

ప్రపూర్ణమైయుండెను. అతఁడు మిగుల ప్రమత్తుఁడై పోయెను. ఆతని కాయేకాంతచింతయే! రామనాథునిక్షేమోదంతము తెలియువఱ కాతనికి హృదయశాంతి చేకూరదు.

అట్లు పోవుచుండ నంతలో నాతనికి కొంచెముదూరములో మహోర్భాటముతో కొన్నికుక్కలు మొఱుగుచుండుట వినఁబడెను. రవీంద్రుఁడచటనే నిలిచి యావైపునకుఁ దిరిగిచూచెను. మనుష్యు లెవ్వరును లేరు. నిజముగ నప్పటిరవీంద్రుని తీక్ష్ణదృష్టినుండి యెవరైన నుండిన తప్పించుకొనిపోనేరకుందురు. కేవలము కొన్నిశునకములు మాత్రము జగడమాడుచుండెను. చిత్ర మేమన, నొక పెద్దనల్లకుక్క యొక్కటే యతిసాహసముతో నిలిచి నాలుగైదు [illegible] తో భయం కరముగ పోరాటము సల్పుచుండెను. అది మిగుల నా[illegible] కరమగు [illegible] ఘోరుఁ [illegible] లజగడమును రవీంద్రుఁడావైపునకు వెడలిపోయెను. అతఁడు [illegible] యందు—తన చూచుటకు పోవుచుండెనా! అంతరాత్రివేళ—న[illegible] కొనెనో! అప కింకెట్టిపనియును లేదా? ఏమో? అతఁడేమి త[illegible]! అజ్ఞాతము!! మానప్రజ్ఞానిధి యగు రవీంద్రునిహృదయ మగాధ[illegible]

కుక్కలన్నియు గలిసి యానల్లకుక్క [illegible] రింపఁజాలకుండెను. ఆ శ్వాన మొక్కటే బెబ్బులివలె వానియన్ని[illegible] లంఘించి కఱచు చుండెను. దానియాకారము మిగులభయో[illegible] ము. ఆకప్పువర్ణము గల దానిముఖమధ్యమున నేత్రద్వయము [illegible] రీతి మెఱయుచుం డెను. ఇంతగందరగోళము జరుగుచున్నను జన[illegible] వ్వరును రానందుకుఁ గారణ మేమన నదియొకపాడైదానము. దానికి [illegible] కొంతదూరమువఱకు జననివాసయోగ్యంబు లగుగృహములు లేవు [illegible] దూరమున నున్నవారి నిద్ర కీగడబిడ యంత యంతరాయమును [illegible] ంత లేదు. రవీంద్రుఁ

జాళునకము యొక్క పౌరుషమును విలోకించి యత్యాశ్చర్యనిమగ్నుడై పోయెను.

చాలసేపటివఱకు నా పోరాటము సాగిపోయినదికాదు. పిదప నంతయు నిలిచిపోయినది. పెద్దపులి యొక్కటి తప్ప తక్కిన వన్నియు బలాయితములై పోయెను. [illegible] విశాలభూమియందు గంభీరముగ నిలుచుండి తన [illegible] వీక్షణముల నొకమారు చుట్టును బఱపెను. [illegible] సుఖముగ నడచిపోయెను. రవీంద్రున కిప్పుడేలనో దాని ననుసరించి పోవలయును అని యాశ వొడమెను "ఇంతరాత్రివేళ నిది యెచ్చటికి పోవుచున్నది. ఇది సాధారణజంతువు కాదు దీని దేహాకృతి మహాద్భుతమైనది. దీనికంఠము నందలి పట్టికన్ను చూచినచో దీని నెవరో ధనికులు పెంచుచున్నట్లున్నది. ఇది యెక్కడో యుదమాననిగృహమును వీడి పాఱిపోవుటకు చున్నది. [illegible] దీని ననుసరించిపోవుటకై తహతహపడు కడుగిడెను [illegible] కేగునో చూతము" అని యనుకొని ముందున

మైదానమునందు ననుసరించి పోవలయునన్న నా పోరాటముజరిగిన [illegible] టిపోవలసియుండెను. ఆవిధ మట్లు నడచుచుండ నక్షత్రముల [illegible] గుప నచ్చట రవీంద్రున కొకచిన్న కాగితము గాన్పించెను. [illegible] దాని నాత్రమున గైకొని చూచెను. అది మిగుల నలిగిన [illegible] చూరు. దాని కాగితమునో నేమిపని ? పత్తేదాగుల పనియే యింత, [illegible] సమమాన [illegible] కంటికి గాన్పించుకాచి వుల్లను గూడ వా[illegible] రక్షింపకమానరు.

ఆ కాగితమ[illegible] యం దొకదారము కట్టబడి యుండెను. అది తెగినది. రవీంద్రుడ[illegible] కాగితమున కంటియున్న సుమ్మను తుడిచి చేతి లాంతరును వెలిగించి [illegible] చూచెను. ఆ దీపకాంతియం దప్పు డాతనికందు కొన్ని యక్షరపంక్తు[illegible] గాన్పించెను. వానియం దిట్లున్నది.

"అమలా! కార్యమతిభయంకరముగ మించిపోయినది. ప్రవాళుఁడు గతించిపోయెను. పను లన్నియు మనపై నాధారపడి యున్నవి. ప్రేతము నీ రేయి నీ యింటికిఁ దెత్తును."

ఇట్లు
తారసింహుఁడు.

"ఆశ్చర్యమాశ్చర్యము! ప్రవాళుఁడు మరణించెనా? కల్ల. కారణములేనిదే యాతఁ డంతశీఘ్రముగఁ జచ్చునన్న నమ్మఁజాల. అంతయు మోసము. వాఁడెట్టిరోగముచేతను బాధపడుచుండ లేదే. నిన్నటి రేయియేకదా నేను వానితో ద్వంద్వయుద్ధము చేసినది? అప్పుడు నే వేసినప్రేటున కేమైన జచ్చియుండునా? అసంభవము. ఒక్కదెబ్బచే గతించుటకు వాఁడేమి యంతటిదుర్బలుఁడా? ఏమో, యా దెబ్బ యెట్టిస్థలమునఁ దగిలినదో! అంతయు నంత వైపరీత్యముగ సంఘటిల్లినది! ఎంతటి ప్రమాదము! నా కార్యము లెల్ల నీరీతి నిరర్థకములై పోవునని యొకనాఁటికిని దలంపనైతిని గదా? ఈ రాత్రి శవము నమలయింటికిఁ దెత్తునని లేఖకుఁడు వ్రాసియున్నాఁడు కదా? ఈ పిశాచియే కాఁబోలు శాంతినాథుని జ్యేష్ఠపుత్త్రి. అయిన నీ తారసింహుఁ డెవఁడు? వీనికీపనులయం దెంతో సంబంధమున్నదని తోఁచుచున్నది. పనులన్నియుఁ దమపైని వేయఁబడినవఁట. ఇఁకను నెంతెంతటి ఘోరకార్యములు చేయ యత్నించుచున్నారో. ఈ దురాత్ములను శీఘ్రముగఁ బట్టినఁ గాని దేశమున శాంతి చేకూరదు. అయిన నీ యమలగృహ మెచ్చట నున్నది? ఆ తారసింహుఁడే కాఁబోలు నీ లేఖ నీ శునకము మెడయందు బంధించి దాని నమలయొద్ద కనుపుచుండెను. ఈ కుక్కసహితము హంతకులకుఁ దగినట్లుండె. అయిన

నీజంతు విప్పటికే చాలదూరము పోయినది. ఇఁక నేనట్లుమలయింటిని గుర్తిడనేర్తును—" అని రవీంద్రుఁ డీవిధముగ తనయోచనాపరంపరలయందు నిమగ్నుఁడై నిలుచుండి యుండు సమయమున దూరమున నేదియో శబ్దమగుచున్నట్లు వినఁబడెను. తోడనే యాతఁ డటు తిరిగి చూచెను—పటుతరరోషముతో గర్జించుచు నాపెద్దకుక యాతని వైపునకుఁ బరుగిడి వచ్చుచుండెను !!!

# పదునాఱవ ప్రకరణము

## అ మ ల గృ హ ము

పత్తేదారు విస్మయచిత్తుఁడై "ఇది యేమి! మరల నిది యీ వైపునకే పరుగిడి వచ్చుచున్నది! తన మెడయందు పత్త్రిక లేదని తెలిసికొని యిటు వచ్చుచున్నదా యేమి! లేఖ నాయొద్ద నున్నది. కనుఁగొనుచున్న నిది నన్నూరక పోనియ్యదు. నేను జాగరూకతతో నుండుటే మంచిది" అని తనజేబు నందలి పిస్తోలును దీసి చేతఁ బట్టుకొని నిలుచుండెను.

రవీంద్రుఁడు తలఁచినంతపని యయ్యెను. తనకంఠమున లేఖ లేకుండుట గ్రహించి యాశ్వానము తనకు తక్కినకుక్కలతో పోరాటమైన స్థలమునఁ బడియుండునేమోయని తలఁచి యచ్చటికి వచ్చుచుండెను. అచ్చట నిలుచుండి కాగితమును జేతధరించియున్న రవీంద్రుని గాంచినంతనే దానికి రోష మతిశయించెను. ఒక్కమా టాతనిపైఁ బడి మెడ కొఱికి కాగితమును గైకొని పోవలయు నని వచ్చుచుండెను. అది యట్లు దాపునకు వచ్చుచుండుటను గాంచి రవీంద్రుఁ డదలింప యత్నించెను. అందువలన నెట్టిలాభమును లేకపోయినది. సమీపమున నుండిన యొకటిరెండురాలను సహితము దానిపై విసరివైచెను. కాని, యది యాతని నంత సులువుగ వదలిపోవలయు నని రాలేదు. ఆ కాగిత మాతనిహస్తమునఁ గాంచినకొలఁది దానియుత్సాహ మతిశయించుచుండెను; దాని నేవిధముగ నైనఁ గైకొని పోవలయునని

యత్నించుచుండెను. ఇఁక నాతనికి ప్రాణరక్షణార్థము రెండేమార్గములు మిగిలి యున్నవి. ఒకటి—యీ లేఖను పాఱవైచుట. రెండు—దానిచే తానై వఁ గీడొందుట. అతఁడు తుదకు కాగితమును పాఱవైచెను. చటాలున దానిని నా భయంకరజంతువు తీసి నోటఁ గఱచుకొనెను. కాని, యంతటితోఁ బోదయ్యెను. అతనిపైఁ బడుటకై కాళ్లెత్తుకొని వచ్చుచుండెను. భయంకరముగ గర్జించుచుండెను. పాప మాసమయమున రవీంద్రుఁడు ప్రాణాపాయదశయం దుండె ననియే చెప్పఁదగును. దానితో చెలలాట మపాయకర మని యాతనికిఁ దెలియును. అప్పటి కప్పుడే దానినఖక్షతములచే తనశరీరముపై నొకటి రెండుచిన్నగాయము లేర్పడినవి. ఇఁక విధిలేదు. ఆలసించిన నా పాపిజంతువు మీఁద పడి ముక్కలుముక్కలుగఁ జీల్చివైచునేమో— అనన్యగతికుఁ డగురవీంద్రుఁ డప్పుడు దానిపై ధాంమని తన యాయుధమును ప్రేల్చెను. ఆ నిశ్శబ్ద నిశీథసమయమున నా మహానాదము చాలదూరమువఱకు వినఁబడియెను.

కాని పుణ్యవశమున దాని నాలకించి యెవరు నాతావునకు రారైరి. కుక్కకు గుండుదెబ్బచే గొప్పగాయము తగిలినది. దానినుండి రక్తము స్రవింప నారంభించెను. ప్రాణము లెగిరిపోవున ట్లుండెను. పాప మప్పు డది కీచుకీచుమని యఱచుచు వెనుదిరిగి పోయెను.

రవీంద్రుఁ డప్పుడు దానివెన్నంటి నడవనారంభించెను. అది యమలగృహమునకుఁ బోవుచున్న దని యాతఁ డనుకొనెను. దానికి దారినడుమ బాధ యతిశయించుచుండెను. గుండు గాఢముగ హృదయమున దూసికొనిపోయినది. అది నడువఁజాలక పాప మందందు పడుచుండెను. మాటిమాటికి వేదనాసూచకంబుగ మూల్గుచుండుటను గాంచి రవీంద్రునికిఁ గడుఁ జాల జాలివొడమెను. దానిని సమీపించి

చికిత్స చేయ యత్నించెను ; కాని కుక్క యాతనిని దాపునకు రానీయ కుండెను. కఱచుదానివోలె నోరు తెఱచుకొని మీఁదికి వచ్చుచుండెను; ఆతఁ డింక నేమియుఁ జేయఁజాలక యూరక దాని ననుసరించి కదలి పోయెను.

ముందు శునకము — వెనుక రవీంద్రుఁడు. వారిప్పుడు నడుచుచుండున దొకసంకుమార్గము; ఆత్రోవ దుర్గంధపూరితమై యుండెను; అయినను నా సాహసుఁడు దాని నోపికతో సహించెను. కొంత సేపటికిఁ గుక్క సోలి పడుచు, లేచుచు వచ్చి యొకవిశాలభవన ప్రాంగణమున దబ్బున పడిపోయెను. రవీంద్రుఁడు తిరిగి చూచెను. చంద్రనగరున కామందిర మొకఫర్లాంగుదూరమున నున్నది. మిగుల గొప్ప మేడ.

ఆతఁ డాజంతువుచర్యల నన్నిటిని గాంచి "ఆహా! కుక్కలెంత విశ్వాసార్హ జంతువులు! యజమానునకై తమప్రాణములనైన ధారవోయునుకదా. మనుష్యులగు మాకుసహిత మింతటి కృతజ్ఞతా సూచక బుద్ధి దుర్లభము." అని యనుకొనెను. అప్పు డాతఁ డదియే యమల గృహమై యుండునని నిశ్చయించుకొనెను. ఇఁక ముందచట నేమిజరుగునో చూడవలయునని కుతూహలుఁడై రవీంద్రుఁ డంత నతిసమీపమున నెదురుగ నుండినయొక గొప్పవటవృక్షము నెక్కి దానియందు దుచితస్థలము నేర్పఱుకొని యొరులకుఁ గాన్పింపకుండఁ గూర్చుండెను. చాలసేపటివఱకు నెవ్వరు నాతనికి గోచరింపలేదు; కుక్కమట్టుకు ప్రాణసంకటముచే పడి కొట్టుకొనుచుండెను.

అర్ధరాత్రముమీఁదట నెదుటివీథియందు శకటఘోషము విననయ్యెను. రవీంద్రుఁడు జాగరూకతతో కాచి చూచుచుండెను. కొంత సేపటి కొకయశ్వశకట మతివేగముగ వచ్చి యా యింటిముందు నిల్చె

పోయెను. అందుండి యొకదీర్ఘకాయుఁ డగుపురుషుఁడును, నొకపొట్టి వాఁడును, నొకస్థూలకాయుఁడును దిగిరి. అందులో నూడిన యానిమ్నత దేహుఁ డప్పు డాకుక్కమూల్గులను విని యదరిపడి "ఆహా! ఇది యేమి?" యనుచు దానియొద్దకు వచ్చెను. తక్కినవారు నట్లే చేసిరి. నక్షత్రకాంతి కొంతవఱకు విస్పష్టముగ నున్నది. గుర్తిడఁగలిగితిమి. దీర్ఘదేహుఁడు తారసింహుఁడు—పొట్టివాఁడు కరాళుఁడు—స్థూలరూపుఁడు పూలవర్తకుఁ డగుసోమనాథదాసు. రవీంద్రుఁడు పాపము కరాళు నొక్కనినే యానవాలిడఁగలిగెను. తక్కినవా రపరిచితులు, అపరాధులై యుందు రనిమాత్ర మూహించెను.

తారసింహునిఁగాంచి కుక్క మఱింతగట్టిగ మూల్గుచు పైకి లేవ యత్నించెను. కాని దుర్బలముచే వెంటనే క్రింద పడిపోయెను. అప్పు డది తనబాధను మఱచి సంతోషాతిశయముతో తోఁక నల్లాడించెను. వారాప్రదర్శనమును గాంచి "దీని నెవరు చంపిరి. అయ్యో!" అని విచారించిరి. తారసింహుఁడు దానిపై చేయి వైచి దేహమును తడవెను. అది యిఁక చాలసేపు జీవించున ట్లగపడలేదు. క్రమక్రమముగ దాని కాలుసేతు లవసన్నములై పోయెను. దానికప్పుడే శాశ్వతనిద్ర యబ్బినది. అందఱు నాసంతాపమును గాంచి సహింపఁజాలరైరి.

ఆహా! కుక్క లెంతటినమ్మకమైనబంటులు! యజమానిరహస్యమును లాతిపురుషుఁ డగురవీంద్రుఁడు కనుఁగొనె నని కోపగించుకొని యాతనితో పోరి, అంతటితోనే యారహస్య మితరులకు తెలియరాకుండ నాఁగిపోవున ట్లాతనిని జంప యత్నించి కడకు తానే ప్రాణములు గోల్పోయెను. దానిగుణ మెంతశ్లాఘనీయము!!!

ఆ సమయమున వెలుపలి సందడి నాలకించి యాగృహాంతరాళ భాగమునుండి యెవరో తలుపు తెఱచుకొని వచ్చిరి. రవీంద్రుఁడు

బాగుగ తీక్ష్ణదృష్టిపాతము గావించి చూచెను. అట్లు వచ్చినది నవనవోన్మేషవిలాససౌందర్యవతియగు నొక్కతరుణీమణి. ఆమె ధరించియుండిన శ్వేతచీనాంబర మస్పష్టతారకాకాంతియందుకూడ తళతళ మెఱయుచు సంపూర్ణ రామణీయకమును వెదచల్లుచుండెను. కర్ణయుగళము నందలి వజ్రపుటంటుకమ్మ లనూనప్రభాతిరేకమున నాసుందరి సుస్నిగ్ధకపోలభాగంబునఁ బ్రతిబింబించుచుండెను. ఆమెవయస్సు సుమారిరువదియైదువత్సరము లుండనోపు. రవీంద్రుఁడు తనగుప్తస్థలమునుండి యా జవ్వని ముఖమండలమును తేఱిపాఱఁజూచెను. అది సౌందర్యలావణ్యయుక్తము—ఇంచుక రౌద్రరసపూరితము. బహుశః ఆమెయే యమలయైయుండెనని పత్తేదారుఁ డూహించెను.

ఆగంతకు లాస్త్రీని డాసిరి. ఆమె వారి నానవాలిడి "ఓహో! ఏమిది. ఇంతరాత్రివేళ నెచ్చటినుండిమీరు? విశేషము లేమి!" అని యడిగెను. అప్పుడు తారసింహుఁ డాశ్చర్యముతో "ఇదేమి, అమలా! ఇట్లడుగుచుంటివి? నా కాగితమును నీవు చూడలేదా!" అనెను.

అమల : నా కాగితమా! నీదా! ఎవ్వరి కెప్పుడు పంపితివి?

తార : ఈ శునకము వెంబడి కొన్నిగంటలక్రిందనే కదా నీయొద్ద కనిపినది. దానిని నీవు చూడలేదా?

అమల : లేదు. లేదు. నీ కాగితమును గాని, కుక్కనుగాని చూడలేదు. ఏది యా శ్వానము?

తార : (జంతువునుజూపి) ఇదిగో, చూడుమిది నీ యింటి వాకిటఁ బడి ప్రాణములు దొఱఁగినది.

అమల : (విస్మయమున) అదేల ప్రాణములను దొఱఁగెను! దాని నెవరు చంపిరి!

తార: అది నాకుఁ దెలియును. నేనొక లేఖను వ్రాసి దానిని దీని మెడయందుఁ గట్టి నీయొద్ద కంపితిని. కాని మార్గమధ్యమున నిది యెవరి నేమి చేసినదో కాని వారు దీనిని తుపాకిచే కాల్చి చంపివైచినారు. నేను వ్రాసినపత్రమింకను దీనినోటియందే యున్నది చూడుము" అని చెప్పుచు నా కుసుకవస్త్రమునం దుండిన కాగితమును దీసి యమలచేతి కిచ్చెను. ఆమె దానిని నటు నిటుఁ ద్రిప్పి "నాకేమియు కనఁబడుటలేదు. ఇచ్చట దీపము లేదు. చంద్రుఁడు మబ్బులచాటున కేఁగినాఁడు. లోపలికిఁ బోదము రండు" అనెను. అప్పుడు తారాసింహుఁడు బండివానిని గాంచి "ఓరీ! యింక గంటకాల మాలస్య మగును. నీవు కనియుండుము. అర్ధ నిచ్చుగ నిత్తుము తెమ్ము. మేము మరలి వచ్చునందాఁక నిందే కాచి యుండుము" అని చెప్పి తన వెంబడినున్న దాసునిఁ గాంచి యాతనిచెవిలో నేదియో రహస్యముగ చాలకాలము దనుకఁ జెప్పి వానినిగూడ నా శకటమువద్ద నునిచి కరాళునితో నమల ననుసరించి పోయెను.

రవీంద్రున కిఁక వారిసంభాషణ నాలకింప నలవుపడినది కాదు. వెనుకఁ డిదివఱకే కరాళుని గుర్తిడఁజాలె నని చెప్పియుంటిమి కదా! [illegible]నాఁడు తాను ఫార్సీ పెద్దమనుష్యుని వేషమును ధరించి బావాబజారు తోఁటయందుఁ జూచినకరాళుఁడే వాఁడు. వానిని గాంచినంతనే యాతని హృదయమున రామనాథుని విషయమై యూహ లుదయింప సాగెను. అప్పుడాతనికి తన మఱంది కెట్టిదో యాపద ఘటిల్లిన దను భీతి కలుగ నారంభించెను. ఏ శిథిలమందిరమున బంధించిరో—యేమూల[illegible] [illegible]మాయుధమున సంహరించిరో యాతనికిఁ దోఁచలేదు. [illegible] యనుసంధానమును గావించుట కిది తఱి గాదు.

రవీంద్రున కేమిచేయుటకును దోఁచమి యోచనానిమగ్నుఁడై పోయెను. ఆతనిమానస మంతయు నా ముద్దుమఱఁది చెంతకుఁ బోయెను. ఎంత కాలము దానారీతి చింతాకులుఁడై యుండెనో యాతనికే తెలియ లేదు. తుదకు రవీంద్రుని యోచనాపరవశత్వమున కంతరాయము కలిగినది.

మందిరమునుండి వారెల్ల మరల వెలుపలికివచ్చిరి. అప్పుడు వారొకరితో నొకరు మాటాడుకొన లేదు. నిశ్శబ్దముగ నందఱు నాశకటమును సమీపించిరి. అప్పుడు కరాళతారసింహులు బండినెక్కి తిన్నగ దేనినో మిగుల భారమగువస్తువును క్రిందికి దింపుటను గాంచి రవీంద్రుఁ డదియే ప్రాయశః ప్రవాళునిమృతదేహమైయుండునని భావించెను. అది యొక నరకళేబరము. దేహమాద్యంతము చిత్రచిత్రపు దువ్వాలువలచేఁ గప్పఁబడి యుండెను. ఆ సమయమున నమల "హా! ప్రియా! నను వదలి పోయితివా? అకటా! యెంతటి యనర్థకము" అని డగ్గుత్తికతోఁ బలికెను. అప్పు డాతన్వి విలపించుట కవకాశము లేదు. తారసింహుఁ డామెను గాంచి "అమలా! ఏమి యీ గందరగోళము? కార్యము లెల్ల నీవేడ్పుచుండిన భగ్నములై పోవును. ఇది దుఃఖించుటకు తగినసమయము కాదు" అని హెచ్చరించుచుండెను. అమలయేడ్వనేర దయ్యెను. శవమును లోపలికిఁ గొంపోయిరి.

రవీంద్రుని యనుమాన మిప్పుడు చాలవఱకు తీఱిపోయినది. ప్రవాళుఁడు గతించినవార్త నిక్కమని యాతఁడు తెలిసికొనెను. అమల యా మృతుని "ప్రియా" యని సంబోధించుటను గాంచి యాతని కప్పుడు వార్తాపత్రికయందలి విషయములు కొన్ని తలఁపునకు వచ్చెను. "అందుపేరబలుఁ డనువానిని గదా యమల వరించినట్లు వ్రాయఁబడినది. అయిన నీ ప్రవాళుఁ డెట్లీమెప్రియుఁ డయ్యెను? ఈ రక్కసి మొదటి వానితో స్నేహము వదలి వీనివెంట పరుగిడి వచ్చినదా? లేక

వీరబలుఁడే ప్రవాళుఁ డని పేరిడుకొని తిరుగుచున్నాఁడా ! అయిన నిన్నటిదినమున ఆభీతమందిరమున వీనిని "భైరవపాలా" యని పిలుచుచుండెనే. దీనియర్థ మేమి? ఒక్కని కిన్ని పేరులా? ఇందేది నిక్కము?" రవీంద్రున కీవిషయమున నేమియు నాలోచన దోఁచినదికాదు. ఏవం విధములగు నూహాపరంపరలచే నాతనిమానసరాజ్య మలుముకొనఁబడెను.

# పదునేడవ ప్రకరణము

బాలిక

రవీంద్రుఁ డింకను నా వట వృక్షమునుండి క్రిందికి దిగి రాలేదు. ఇంతలో నొకఁడు గృహమును వీడి యీవలకు వచ్చి బండియొద్ద నిలుచుండెను—వాఁడే కరాళుఁడు. ఇప్పుడు వారందఱచ్చటికో పోవుచుండి రని పత్రేదా రూహించెను. కాని యట్లు జరిగినది కాదు. తారసింహుఁడు కాని, యమల కాని, యచ్చటికి రాలేదు. పూలవర్తకుఁడుమాత్రము కరాళునికి నాబండిలో నుండి యేదియో వస్తువును దించుటయందు సహాయము చేసి మరల యథాస్థానముననే నిలిచిపోయెను. కరాళుఁడు దానిని మోసికొని మరల నాయింటిలోనికిఁ బ్రవేశించెను. సూక్ష్మగ్రాహి యగురవీంద్రుఁడు తోడనే యట్లు మోసికొనిపోఁబడిన దొకబాలికామణి యని గ్రహించెను. ఆ క్షణముననే యాతనిహృదయమున శాంతినాథునిద్వితీయ పుత్రిక యగు సుశీలవిషయమై యోచన లుప్పతిల్లసాగెను.

తన్నారీతి కరాళుఁడు మోసికొనిపోవుచున్నను నాపసికందు మాటాడలేదు—కాలుసేతులైనఁ గదల్పలేదు. నిశ్చేష్టితయై పడి యుండెను. ఆమె జీవించియున్నదా ? రవీంద్రుని నీ ప్రబలసంశయము పీడింపసాగెను. ఆతని కేమియు బోధపడదయ్యెను. ఆపిల్ల నారీతి కరాళుఁడు లోపలికిఁ గొంపోయినపిదపఁ దానుకూడ చెట్టు దిగి లోపలికిఁ బోయి యా విషయముల నన్నిటిని ప్రత్యక్షముగ నరయుదమని యాతఁ

డోకమాటు తలంచుకొనెను. అతఁ డారీతి యోచించుకొనుచుండఁగ నే మరల నాయింటినుండి తారసింహాకరాళామణులు వచ్చి గృహప్రాంగణమున నిలుచుండిరి. రవీంద్రునకు గ్రిందికి దిగిరా ననుకూలపడినది కాదు. కావున నాతఁడు యథారీతిగ నా వృక్షమూలముననే కూర్చుండి పొంచియుండవలసినవాఁ డయ్యెను.

ఈ సమయమున నాతఁడు వారియొద్ద ప్రవాళుని మృతరూపమును గాని, బాలికను గాని చూడలేదు. వారందఱు అమలను కడుభద్రముగ నుండుమని హెచ్చరించుచుండిరి. అప్పుడు తారసింహుఁడు "రేపురాత్రి మూఁడుగంటలకు సరిగ పెద్దబజారునందలి ధూమశకట విశ్రమస్థానమునకు రమ్ము. అంతవఱకు నీవిం దతిజాగరూకతతో మెలఁగ వలయును సుమా!" అనెను. అమల భయంకరముగఁ జేతుల నాడించుచు "తారసింహా! అమల సాధారణయువతి కాదు. ఈ నిముసమునుండి యది భయంకరదానవియై పోవునని నమ్ముము. నా ప్రాణవిభుని—నాహృదయేశ్వరుని—మడియించిన క్రూరునిహృదయ కుహరమును జీల్చి యందలి యుష్ణరక్తపానమును జేయుదాఁక నాకు నిద్దుర రాదు. నేనుండవలసిన జాగరూకతతో నుండెదను లెమ్ము. మీరు పొండు." అని చెప్పుచు విద్యుల్లతవోలె నాయింటఁ బ్రవేశించి తలుపులు మూసికొనెను. బండి యతివేగముగ నా యింటిని వీడి పురములోనికి వెడలిపోయెను.

రవీంద్రుఁ డిప్పు డింకేమి చేయవలయును? శకటము ననుసరించి పోవుట యంత శ్రేయస్కరము గాదని యాతఁ డెఱుఁగును. అమల యింటిలోని కేఁగి ద్వారబంధన గావించుకొన్నది. గృహములోనికిఁ బోవుటకైన నాతని కవకాశము లేకపోయెను. తానిక నట్టియనుసంధానకార్యమును జేయక యానాఁ డింటికి వెడలిపోవలయునని

తలంచెను. కాని, యా క్షణముననే యొకసంశయముకూడఁ గలిగినది. "ఈ యమలగృహమునందే యేమైన రామనాథుఁడు బంధింపఁబడి యుండునా ?" యని యనుకొనెను. తోడనే యాతఁడిఁక నాభూరుహముపై నుండక తిన్నగ క్రిందికి దిగి వచ్చెను. కొంతసే పేమిచేయుటకును దోఁపక యటునిటు దిరుగాడ నంతలో నొకయుక్తి దోఁచినట్లైనది, రవీంద్రుని హృదయాధోభాగ మగమ్యమైనది. ఆతఁ డెట్టి సమయమున నెట్టివెరవ్రులఁ బరికించుచుండునో తెలిసికొనుటకు మిగుల కష్టము.

రవీంద్రుఁడు తనచేతనున్న మూటను విప్పి యందుండి మలీమసమై జీర్ణమై యుండినయొక నల్లనిచీరను బయటికిఁ దీసెను. ఒక్క క్షణకాలములో నాతఁ డాకోకను ధరించి పురుషరూపమును బాసి యచ్చపుస్త్రీ యయ్యెను. పరులెవ్వ రాతని నాసమయమున జూచి యుండినను తప్పక స్త్రీయనియే నమ్మియుందురు. పిదప తనచొక్కా జేబునం దుంచుకొనియున్న కొన్నిభూషణములను ధరించుకొని పరిశోధకోద్యోగి తనపూర్వవసనసమితి నంతటిని నొకగంటుగ గట్టుకొనెను. ఆసమయముననే యాతఁడిఁక నాలసింపక తిన్నగ కుంటుచు నా మందిరద్వారమును జేరఁబోయెను. రవీంద్రుఁడు తన యప్పటి చిత్రరూపమును గాంచుకొని తానే హసించుకొనుచుండెను. సృష్టికర్తయగు భాగతీశుని చతురత్వ మేమియో కాని పత్తేదారివృత్తి నవలంబించి జీవింప నిర్దిష్టులైనవా రేరూపమును ధరించి యెంతవేషమును మార్చుకొన్న సద యంతయు వారి కనుకూలమై సంశయదూరమునై యుండును. ఇది ఇతరులయందభావగుణము.

నేను రవీంద్రుని హృదయమునుండి యనేకరహస్య విషయములు తెలియనయ్యెను. అందులో నొక్కదానికన్న నొకటి యగాధరహస్య

గర్భితము. ప్రవాళుని మరణ వార్త—అమలదర్శనము — బాలిక, ప్రాయశః సుశీల—ఇంతకన్న నెక్కుడగు శాంతినాథుని కుటుంబవార్తలు! హంతకులఁ బట్టఁ బ్రయత్నించుచుండిన రవీంద్రునిపై నేఁటివఱకు దేవునిదయ యపారమై యున్నది. తత్సహాయంబున స్వల్పకాలముననే వారి జాడలను చాలవఱకు నెఱింగెను. ఇఁక నందఱిని బట్టు టొక్కటే కొదవ.

రాత్రి రెండుగంటలు కొట్టినది. రవీంద్రుఁడు ఢాకమూలు శిరమెత్తి యాకాశమువంకఁ దిలకించెను—అప్పుడాశుభ్రగగనభాగమంతయు జలధరచ్ఛాయావృతమై పోవుచుండెను. నక్షత్రఫలముల నేజే మూలములు క్రింగెనో కాని మిన్నుమన్నులనడుమ కనుచీఁకటి ప్రబలి పోయెను. అప్పుడావనధరసమితి యంతకంతకు ఘనీభవించి తుదకు జలరూపమున ముక్తాఫలపంక్తివోలె భూపతితము గాఁదొడగెను. రవీంద్రునికార్యమున కది యెంతయో సహకారి—అందుచే నాతఁ డానందించెను. మదమత్తేభతుండసదృశధారావర్ష మారంభమైనది!

అమలకు నిద్దుర రాదయ్యెను. ఆమె మోమంతయుఁ జింతాకులమై ద్యుతిదూరసుధాంశుబింబమువోలె వన్నెదఱిగి యుండెను; చెక్కిటఁ జెయిచేర్చి యొకపడకకుర్చీపైఁ గూర్చుండి యేమేమియో యోచించుకొనుచుండెను. ప్రవాళునిమరణమే యిందులకుఁ గారణమని వేఱుగ వ్రాయ నవసరము లేదు. శయ్యాతలమునకు దూరమున నొక మలినదీపము పవనునితో నాడుకొనుచుండెను, ఆమె మానసమధ్యమునఁ దరలుయోచన లివి, “ నేఁడు తారసింహుఁడు నాతోఁ దెల్పిన దేమి! నా ప్రియుని రవీంద్రుఁడు సంహరించె నని కదా! అకటా! ఇది యెంతటి దారుణకాలము! అయిన నేనీయుదంతము నెంతవఱకు నమ్మఁ దగును? కేశవపాలుఁడు గతింప,నానేరమును గావించినయపరాధులఁ బట్ట

వచ్చినరవీంద్రున కాకస్మికముగఁ బ్రవాళుని సంహరించునంతటి యవసరమేమి కలిగినది? విభీతమందిరమున నా పత్తేదారు ప్రవాళునితో పోరి యుండెనఁట. ఇది విశ్వాసార్హమా? విభీతమందిర మేడ? రవీంద్రుఁడేడ? కొన్నిదినములకుఁ బూర్వమీ చంద్రనగరమున కరుదెంచిన యాతని కప్పుడే విభీతమందిరము ప్రవాళునివాసస్థానము, కేశవపాలుని హత్యాపరాధులు తెలిసిపోయి యుందురా? తారసింహుఁడు కొలఁది దినములనుండి కడుదురాత్ముఁడై పోవుచున్నాఁడు. తాను ప్రవాళుని సేవకుఁడనియు నేను తనయజమానునిపత్నీ సమానురాల ననియు మఱచి మదోన్మత్తుఁడై నేనొంటిగ నున్నపుడు నాతో సరసోక్తులాడుచు తుదకు నన్నుఁ గామించి నట్లగపడుచున్నాఁడు. నేనప్పుడే యీసంగతిని నా ప్రాణేశునకుఁ దెల్పిన నాతఁడు కోపగించి వానిని వెడలఁగొట్టు ననియు నందుమూలమున వాఁడు మాపై విరోధ మూని కీడు చేయు ననియు తలఁచి భయపడి యంతటిని గూఢముగ నుంచి యాసీచుని నప్పటి కప్పు డదలించివైచుచు వచ్చినందులకు కడ కంతయు నింతకుఁ దేలినదికదా? కటకటా! దురాత్ముఁడగునీదుర్జాతి తారసింహుఁడు నన్ను దక్కించుకొనఁదలఁచి నా ప్రవాళు నేవిధముగనో మృతుని జేసి యుండును. ఇది నిక్కము. ఇదియే సత్యము. ఆపాపి తనపై నపరాధము మోసిపోవుటకై దానిని క్రొత్తగ నిచటి కరుదెంచినరవీంద్రునిపై మోప యత్నించెను. వాఁడాడినమాటలు కల్ల. పత్తేదారు లెంతైన నపరాధులను బ్రాణములతో నుండఁ బట్టుకొన మిగుల పాటుపడుదురు కాని వారిని సంహరింతురా! ఆహా! ఎంతటి ద్రోహము! దుర్మార్గా! తారసింహాహతకా! పాపీ! ఎంతటిపనిని జేసితివి? నేనెంత యశిక్షితయగు స్త్రీనైనను గులట ననుకొంటివా? నేవరించినవాని ననుసరించి పరుగిడి వచ్చితిని గాని చంచలచిత్త యగులంజను కాను. ఇంతలో నన్నుఁ

దప్పుదలంచితివా ? ఇట్టియున నేను నీ పాలగుదునని తలంచితివి కాబోలు ! హా ! దుర్భరము, ఎట్టిబాధ సహింతును ? నాథా ! ప్రవాళా ! ఈ దురాత్ములతో నే స్నేహ మొనర్చితినే. వారు క్రూరు లంటినే. ద్రోహచిత్తు లంటినే. వారి మాటల నమ్మితిని. ఇక నన్నెవ్వ రాదరించి సంరక్షింతురు ? నన్నీ కటికులపాలు గావించి చల్లగ సమసి పోయితివా ? నేనిక నెవిధముగఁ గాలము గడపుదును ! తారసింహుం డిక నెంతెంతటిపాప చేష్టలు చేయునో, వానిని దలంచిన మాత్రమున నా గుండె గుభిల్లు మనుచున్నది. నేనిక వీరియొద్ద నుండ నేరను. భరత పురమునకు వెడలిపోదును. అకటా ! దైవము మనప్రేమసాగరమును గాంచి యోర్వఁడాయెను. అయ్యో ! ఇంకేది గతి ?" అని తుద కమల బాలికవలె దుఃఖింపసాగెను ; అనవరము నేలఁ బడి హృదయమును బాదుకొనుచు ననేకవిధములుగఁ బ్రవాళుని ఘనుని దలంచుకొనుచు, తారసింహుని దూషించుచు, తన దుస్థితికి వలంచుచు విలపించెను.

అమల నివసించుచుండిన భవనము మిక్కిలి విశాలమైనది. అందనేకము లగు గదులున్నవి. కృత్రిమద్వారములును, పాతాళమార్గములును, భూగృహములును లెక్కకు మిక్కిలి యున్నవి. ఆ మందిరము చోర కిరాతహంతకాపాలికత్యాగితభద్రజనులకు నిలయమగుట వేఱుగ వ్రాయ వలయునా ? అయిన నీ యమల యారీతి నేకాంతమున నీ మందిరమున నుండుటకుఁ గారణ మేమి ? ముందుముందు మనకు గతి తెలియును.

అమల దుఃఖమునకు మేర లేదు. ఆమె కుపచరించువారు లేరు. ఆశ్వాసించువారు లేరు. ఆదరించువారు లేరు. తనకు తానే యోదార్చుకొనును. శాంతించును. మగుల నేడ్చును. అంతలో నూరట నొందును. అటునిటు పచారు చేయుచు నేదినో యోజించు కొనును. ఆ సమయమున నెవరో ద్వారప్రదేశమునఁ గూయుచు

తలుపులు దట్టిరి. ఆనాఁటి ప్రార్థనలో మునింగిన యమల కది మొదట వినఁబడలేదు. ఆ కంఠ ధ్వని క్రమముగ సంతాప మొందుచు వచ్చి శబ్దమై బలిసెను. తలుపుల బయట "లోపలనుండువా రెవరయ్యా! అనాథ యగు యాత్రికికి శరణ మొసంగరాదా" యనుపలుకులు వినవచ్చెను. ఆమె కష్ట ధ్వని వినఁబడినది. తోడనే యామె తన దుఃఖమునంతటి నణఁచుకొని ప్రయత్నపూర్వకముగ శాంతభావమును వహించెను. వెలుపలి వా రెవ్వరో యామెకుఁ దెలియదు. రవీంద్రుఁడొకఁడే యామె కేమియౌక?

అమల తలుపునకు వచ్చి తలుపును దెఱచెను. ఎదుట వృద్ధురా లొకతె—వర్షపాతమునఁ దడిసి—చలిచే గజగజవణఁకుచు నిలుచుండి యుండెను. అంతటి యపరరాత్రియం దా ముసలిదానిని గాంచి—నిక్కముగ స్త్రీ యని దలఁచి—యమల విస్మితురాలై "అవ్వా! నీవెవ్వరవు?" అని యడిగెను.

ముసలిది : తల్లీ! రాత్రి చాల కాలము దాఁటిపోయినది. తల విరుగునట్లు వర్షము కురియుచున్నది. ఊరిలోనికిఁ బోవుటకు కుక్కల భయము మెండుగ నున్నది. దారి తప్పి యిటు వచ్చితిని. కాన నీ యింట నీ రాత్రి కింత బస నొసంగుదువా? తెల్లవారుజామున లేచి నా దారిని వెడలిపోదును.

అమల : నీ దేయూరు?

ముస : అమ్మా! నా యాకారమే చెప్పుచున్నదిక దా! నా కష్టదే యేఁబదియేండ్లు గడచిపోయినవి. నాబోటిముసలిదాని కింతమట్టుకు సాయ మొనరించిన నీకుఁ బాపము రాదుక దా!

వృద్ధురాలి యసంబద్ధోత్తరము నాలకించి యమల యామెకు చెప్పుడు కాఁబోలునని యెంచుక బిగ్గఱగ మరల నదియేప్రశ్న వైచెను.

ముస : నాపేరు సదాశివదాసి. నేను కాయస్థవంశజురాలను తల్లీ !

అమల : ( మఱింతగట్టిగ ) అవ్వా! నీయూరుపేరును తెలుపుమన్న నేమేమియో చెప్పెదవే ? నీకేమి బాధిర్యమా ? నా మాటలు వినఁబడుట లేదా ?

ముస : ( చేతులఁ ద్రిప్పుచు ) ఆహా ! దేవాంగనవు. నీరూపు రంభను కాలితోఁ దన్నుచున్నదమ్మా. నీముఖమును చూచినప్పుడే నాకెంతతావు నిత్తువని తలఁచితిని, అట్లేయైనది తల్లీ ! నీ వెంతమంచి దానవు? ఎంత యందకత్తెవు: ఎంతసద్గుణవతివి? అమ్మా! ఆకుత్సితముఖము లేవేఱు తల్లీ! పైనే వారిహృదయభావములు కనఁబడిపోవుచుండును. అయ్యో! తల్లీ! ఇదేమి! కన్నీరు గార్చెదవేల? దేవతాస్త్రీవి, నీకేల దుఃఖ మమ్మా ! హా ! తెలిసెను. నాదుర్దశను చూచి దుఃఖింతువా ! అయ్యో ! ఇది స్త్రీసహజము. ఆహా ! నీ దెంతటిహృదయము : ప్రథమ సందర్శమున నే నాపై కరుణ కలిగినది. ఇది నా పుణ్యముతల్లీ !

అని పల్కుచు కృత్రిమరూపధారి యగుగవీంద్రుఁడు తిన్నగ గడప దాఁటి లోపలికి వచ్చి యొకచోఁ గూర్చుండెను. అమల యిది గాంచి యాశ్చర్యచకిత యయ్యెను. నిక్కమున కామె పరుల నాయింట నారాత్రి నొకగంటయైన నిలుపఁదలఁకొనలేదు. తన విషయమును వారు తెలిసికొనరాదని యామెయభిమతము. తోడనే యామె "అవ్వా! ఇంత స్వాతంత్ర్యముతో వచ్చి కూర్చుంట తగదు. రమ్ము వెలుపలకు ! ఇంట మగవా రెవ్వరును లేరు." అని బిగ్గరగ కంఠము పగులురీతి కూసెను. ముసలిది నగుచు " ఆహా ! నీపేరేమి తల్లీ ! ఎంత మంచిదానవు ! నాకు సదుపాయములు వలదు. నేను బీదరాలను. నాకీకఠినభూతలమే శాశ్వతశయ్య. నీవేల పడకను దెచ్చి యిత్తువమ్మా.

వలదు. వద్దువల్లీ. నీవే దానిని వేసికొని సుఖముగఁ బరుండుము." అని యనుచుఁ జేతనుండిన తనచిన్నగంటు తలగడగ నిడుకొని యాతఁడా నేలపైఁ బరుండెను. అమల యా బమ్మ్రచెవుడును గాంచి యాశ్చర్యముతో తన దుఃఖమును మఱచి యించుక కోపముతో నిట్లని గద్దించెను. "ఓసీ! ముసలిపందా! లేచి పోదువా? లేదా? ఎవరి నడిగి యీరీతిఁ బరుంటివి? ఇది నీ యబ్బగంటా?" అప్పుడు మరల సదాశివదాసి యామెకు నమస్కరించి "తల్లీ! నీకేల యింత శ్రమ? నేనిప్పుడే దాపున పల్లెలో నా భోజనమును దీర్చుకొని వచ్చినాను. నాకై నీవిపుడు మరల వండం బనిలేదు. నాకంత యాకలియును లేదు." అనియెను. అమల యిఁకఁ గాంచి సహింపనేరదయ్యెను. ఒకమూలనుండిన దుడ్డుకఱ్ఱ నొకదానిని గైకొని బెదరించుచు "పొమ్మావల! పందా! చెప్పినకొలఁది నీకు హాస్యమాయెనా? నీవు నాకెక్కడ దాపురించితివి? పోకున్న దీనితో నీకుఁ దగినశాస్త్రి గావించెదను చూడుము." అని కుపితురాలై కను లెఱ్ఱచేసి పలికెను. "ఏమి తల్లీ! యీ యింట దొంగ లున్నారా? వచ్చినవారి నీకఱ్ఱతో మోదుమందువా? మంచిపని. నీ యాలోచన సమయోచిత మమ్మా! నాకేమి తెలియవలయును? క్రొత్తదానను. ఎఱిఁగినవారు చెప్పినఁగదా గ్రహింతును! తెమ్మమ్మ, ఆ కట్టెను దెమ్మ, వారు వచ్చిన తల విరుగఁ గొట్టెదను." అని యమల చేతనున్న కాష్ఠమును గైకొని తనప్రక్క నుంచుకొని కనుమూసెను.

అమలనోట మాట వెడలకుండెను. ఆగ్రహాతిరేకముచే నామె యాపాదమస్తకము ప్రచలించుచుండెను. తాను తన దుఃఖమునఁ బడి పరితపించుపోవుతరి నీ యుపహాస్యమును గాంచి సహింపదయ్యెను. దంతఘట్టన గావించుచు కడ కామె "ఛీ! ముసలిముండా! చెవిటిరండా! నాకెచ్చట దాపరమైతివే? ఇచ్చటనే పడియుండుము. నీకుఁ దగినశాస్తి

గావించెదను" అని చెప్పుచు చటాలున నాద్వారమును బంధించి వై చి దాపున నుండినగదిలోనికి వెడలిపోయెను.

రవీంద్రుని కిప్పు డించుకయవకాశము దొరికినట్లయినది. అతఁ డొకమాఱు తల నెత్తి నలువైపులను దిలకించి చూచెను. అది మిగుల విశాలమైనమందిరము. అందొకచో దీపము వెలుఁగుచుండెను. ఆహాలు నకు మూఁడుభాగములందు గోడలు; తక్కినభాగమున రమ్యతరం బగు రమ్యోద్యాన మొకటియు గలవు. తన కనతిదూరముననే పై యంత స్తున కేగుట కొకదారునిర్మితసోపానపంక్తి గలదు. వనమున కవ్వల మఱియొక సమున్నతభవన ముండెను. అందేమున్నది యాతనికి గోచ రింపలేదు. కొంతసేపటివఱకు కాలము నింపుగ బుచ్చుచు నెట్టుచు నిద్ర నభినయించెను.

అమల మనదాసిని మాటాడించుటకు మరల రాలేదు. ఆమె తనకోపభావమును గొంతవఱకు శమనించుకొని మరల తనదుఃఖ సముద్రమున మునిఁగిపోయెను. ఎవరో దిక్కుమాలినముండ యీరాత్రి నేరీతిగనైన నచట పడియుండి యుదయమున నెందేని వెడలిపోవలయు నని వచ్చియున్నదని నిశ్చయించుకొని యామె సదాశివదాసిని మరల చెనకలేదు. ఇంతకు నమాయకురాలగు నా వృద్ధురాలివలన దన కేమి కీడుకలుగు నని యామెభావము. పాపము మందమతి యగునమల నివురుమూసిననిప్పును గాంచదయ్యెను — తృణాచ్ఛాదితభయంకరా గాధమగుగోతిని దెలిసికొనలేదు.

ఎంతటివివేకుల కైనను నొక్కొక్కతేప నజ్ఞానావస్థ కలుగు చుండునుగదా! ప్రపంచమున నిది యొకచిత్రము. అట్టి యీ గొప్పగొప్ప విషయములఁ దెల్పుటలేదు. ఎన్నటికిని దలంపనట్టి జడత్వము వారి

కతిస్వల్పవిషయములందే గలుగుచుండును. తత్కారణమునఁ గొండొక తేప సర్వనాశన మగుటయు గలదు. రవీంద్రుఁ డగాధభయంకర మగు కార్యమును మీఁద వైచికొని యున్నాఁడు. దానియం దెంతో యప్రమత్తుఁడై మెలఁగవలయు నని యాతనికోరిక. ఆ విధముగనే యాతఁడింతవఱకును సంచరించెను. నేఁ డమలగృహమునందలివింతలను కనఁగొనఁ దలఁచి సదాశివదాసిరూపున నాస్థలమును జొచ్చెను. అందు సహితమమేయప్రజ్ఞాతిశయమున నమలగన్నులఁగప్పి తాను యథార్థపు స్త్రీ యని నమ్మఁజేసెను. ఆమెను మోసగింప నెంచి యందు జరుగు నిగూఢకార్యములను గనఁగొనఁదలఁచి నిద్ర నభినయించు చుండెను. కాని, కొంతకాలమున కాతని కాయభినయనిద్ర పోయి యభినవమగు ననుభవనిద్రయే కలిగెను—ఆహా! ఏమి యీ యాగడము! వైరుల గృహములం దారవీంద్రున కింతటి ప్రమత్తత! బెబ్బులిబిలమందా దుర్బలకురంగశాబకమున కభీష్టప్రశాంతగాఢనిద్రావసరము!!

ఆతఁడు నిదురింపరా దని యెంతో ప్రయత్నించెను. కాని యా ప్రయత్నములు విఫలము లైనవి. రెండుదినములుగఁ దగిననిద్దుర లేమి సుషుప్త్యవస్థ యాతనికిఁ దెలియకుండఁగనే వచ్చి యాక్రమించుకొన్నది. రవీంద్రునంతటి మేధావంతుఁ డిట్టి యల్పవిషయమున నింతటి యవివేకిఁ డగు టెంతటివింత! దినములకొలఁది నిదుర లేక కష్టింపఁజాలిన సహనసాంద్రుఁడు నేఁ డింతటి జడుఁ డగుట మిగుల విస్మయజనకము! అది విధిప్రేరితము—అనుభవసిద్ధము—దుస్తరసంఘటనము. మానవమాత్రుల కెల్ల నిట్టి పొరఁబాటు లుండు నని కదా చెప్పితిమి. రవీంద్రుఁ డండఱివలెనే నరుఁడు. అందఱికుండు రీతిగనే యాతనికిఁ గూడ నజ్ఞానము కొంత గలదు. దానినుండి యాతఁడు దూరీభూతుఁడు కాఁడయ్యెను.

రవీంద్రుఁడు చాలకాలమువఱకు నిద్రింపలేదు—ఒక్క యర గంటమాత్రమే! అంతలో నాతఁడు తటాలున ద్వారముచప్పుడు విని లేచెను—అమల వెలుపల "చావు ముండకొడుకా!" యని యనుచు తలుపులను బంధించి తాళమును వైచుకొని వెడలిపోవుచుండెను.

# పదునెనిమిదవ ప్రకరణము

## భ యా న క ము

రవీంద్రుఁ డత్యంతాశ్చర్య నిమగ్నుఁడై పోయెను. ఇట్లగునని యాతఁడు తలంపలేదు. అమల యొకయబల—సాధారణస్త్రీ—ఆమె చేతనా తన కింతటి పరాభవము! ఇంతటి నగుఁబాటు !! ఇంతటి వింతపాటు !!!

వెడలిపోవునప్పు డామె యేమన్నది? "చావుముండకొడుకా" యన్నది. ఆమె తనొక్కకవృద్ధుగాలని నమ్మియుండలేదా? అట్లయిన స్త్రీల కీపురుషవాచకప్రయోగ మేమి! ఆమె తనొక్క పురుషునిఁగ నానవాలిడెనా యేమి? ఉండవచ్చును. ఎవరు చెప్పఁగలరు? పత్తేదారున కాశ్చర్యముపై నాశ్చర్యము—తానింట నిద్రించుట—అమల తన్ను గృహమున బంధించుట—తన్ను గుర్తించుట—ఆతఁడు తానిట్లు మోసగింపఁబడుటను గాంచి సహింపనేరఁ డయ్యెను. తా నొకటిచేయఁ బోవ వేఱొకటి సంభవించినది. వెలుపలి కేఁగిన యాయువిద తారసింహాదులను గొనితెచ్చిన నాతనిగతి యేమి? వా రూరకుందురా! కాని, అట్టిసమయమునఁగూడ రవీంద్రుఁ డధైర్యుఁడు కాలేదు. అటనుండి లేచెను. అమల చాలపొరఁబడినది. ఇంట దొంగ నునిచి దానిని వానియధీనము చేసి పోయినది. ఆమెది స్త్రీబుద్ధి. ఇఁకఁ జెప్పనేమి?

రవీంద్రుఁ డొక్కమారు తెలుఁగెత్తి "అమ్మా!" యని యఱచెను. ఆమాట కెవ్వరు నుత్తర మియ్యలేదు. పవనవేగమున నగాధ మధ్యగతంబై యుండిన దీపిక శాంతించిపోయినది. గృహమంతయు సాంద్రాంధకారపూరితమై యుండెను. అవ్వల నడుగున నేమున్నది గోచరించుట కష్టము. ఆతఁ డంత తనమూటయం దుండిన కరదీపికను దీసి వెలిఁగించి నలుదిక్కులను బరికించి చూచెను. ఎప్పటిభాతిగనే యెదుట కుసుమోద్యానము వాయువశంబున సంచలిత మగుచు సౌరభములఁ జిమ్ముచుండెను. రవీంద్రుఁడు మరల నొకమాఱు బిగ్గఱగ "తల్లీ!" యని పిలిచెను—ఎప్పటియనుత్తరభాతియే!

ఆతఁ డచ్చట నిఁక నిలుచుండక దీపికాహస్తుఁడై దాపున నుండిన యొకగదిలో ప్రవేశించెను. అది శూన్యమై, తైలపాయికనివాస యోగ్యమై, దుర్గంధావృతమై యుండెను. అంత రవీంద్రుఁ డీవలకు వచ్చి ఎదుటనుండిన మెట్లెక్కి హర్మ్యోపరిభాగమున కేఁగెను. అది యొక శయ్యాగృహము. అత్యంతరమణీయముగ నలంకృతమై పరిమళపుష్పదామసమాశ్రితమై యుండెను. అచ్చటనుండి యాతఁడు చాల కాలము తడయక సమీపమున నుండిన రెండుమూఁడు పెద్దగదులను పరికించి చూచెను. అంతటను గబ్బిలముల నివాసము—దుర్భరదుర్గంధము—ఇట్టిభవనమునం దమల యెంతకాలమునుండి నివసించుచుండెనో రవీంద్రునకుఁ దెలియరా దయ్యెను.

పదపడి యాతఁడు మెట్లు దిగి వచ్చి యుపవనమును బ్రవేశించెను. అది యంత గొప్పది కాకున్నను మిగుల నింపుగ నుండెను. ఆతఁడు నలుదిక్కులను పరిశీలించి చూచునరి తోఁట యంత్యభాగమున నొకద్వారము గోచరించుచుండెను. తోడనే యాతఁ డద్దానిని డాసెను. అది మిగుల బలవత్తర మయిన యయోవినిర్మితకవాటయుక్తము. చుట్టునుండు ప్రాకారము సమున్నతమై ప్రేక్షకభయావహమై

యుండెను. రవీంద్రుఁడు తాళపుఁజెవులను దెఱవఁ ద్రిప్పించెను. కాని, వానికి బీగము వైచఁబడి యుండుటచే శృంఖలాబద్ధమై యుండెను. ఇఁకఁ జేయునది లేక పత్తేదారు వెనుకకుఁ దిరుగవలసి వచ్చెను. ఎచ్చటఁ గాంచినను ఆయింటిలోనికిఁ బోవుటకు మార్గమే గోచరింపకుండెను. అతఁడు తలదడవికొనుచు నించుకంతయు భయము లేక మరల నొకమా రా లతాగుల్మభూమిని జుట్టివచ్చెను. అందువల్లసహిత మెట్టిప్రయోజనము లేకపోయినది. ఎందుకనఁ దానవీ మందిరము లోనికి దారి గాన్పింపలేదు, చాలసేపటివఱకు నాచెట్లను జుట్టి అలసిన తుద నాతఁడు దాపున నుండిన నొకబండఱాతిపైఁ జతికిలఁబడి కూర్చుండెను — ఆ క్షణముననే యత్యంతభయానక కార్యము సంఘటిల్లిపోయినది ! రవీంద్రుఁ డచ్చట సోపానశ్రేణిపైఁ దల్లక్రిందుగఁ, జీత్కారము చేయుచు, దొర్లుచుఁ గ్రిందికి పడిపోయెను ! ! అది పాతాళలోకమునకు పతనము ! ! !

దైవకృపమూలమున నాతని కెట్టిబలమగుగాయములును దగుల లేదు, కాని పదినిముసములవఱకు మందచేష్టుఁడై నేలపైఁ బడిపోయెను. తెలివివచ్చుసరి కాతనిముఖముపై నొకచిన్నగాయ మేర్పడి యందుండి రక్తము స్రవించుచుండెను. అందుపై నాతఁ డతికష్టముపై లేచి తాత్కాలిక చికిత్స నొకదానిని జేసికొనెను. దేహమున కందందు ప్రబలప్రహారములు వచ్చుటచే పాపము రవీంద్రునకుఁ గొంతకాలము వఱకు నడచుటచే దుర్ఘటమై యుండెను. తాను కూర్చున్నది బండ కాదనియు, శిలారూపకం బగు నొకమృదువస్తు వనియు, ఇతరులను మోసగింప నది యట్లుంచఁబడెననియు, రవీంద్రుఁ డప్పుడు గ్రహించెను. పత్తేదా రంతటితో నిరుత్సాహుఁడు గాలేదు. తా నిదివఱకుఁ గాంచియుండనట్టి మఱియొక భూగృహాపరిశోధన కవకాశము దొరకినది. అందుచే నాతఁడు తనబాధను విస్మృతి నొంది యానందముచే నుప్పొంగెను.

మరల నొకమాఱు హస్తగతదీపమును వెలిఁగించుకొని యాగృహపరీక్షకుఁ గడంగెను. కాని యది మిగుల కష్టప్రదమై యుండెను. ఏలయన, నచ్చట నేమూలనుండియో దుర్భరమగు చెడువాసన వచ్చుచుండుటచే నుచ్ఛ్వాసనిశ్శ్వాసములు జరుగుట కేయవకాశము లేకపోయెను. పైభాగమున వాని నన్నిటి నెట్లో సహించుకొని దాపుననుండిన త్రోవ ననుసరించి యొకగదిలోఁ బ్రవేశించెను. అందుండి వేఱొకగదికి మార్గము కలదు. దానినుండి వేఱొకటి—మరల నొకటి—ఈ విధముగ నొకదాని వెనుక నొకటిగ నాల్గుచిన్నగృహములు గలవు. ఆతఁ డంతట మూఁడింటిని గడచి తురీయమందిరములోనికి వచ్చెను. అందు కాలుంపఁగనే యది మూరెఁడులోతున భూమిలోనికిఁ గ్రుంగిపోయినది. అచ్చట వాసన మొదటిదానికన్నఁ బదిరెట్లధికమై రవీంద్రుని ప్రాణముల నొక్కసారిగఁ దీసివేయునట్లు ప్రబలియుండెను, కాని యాధీరశిఖామణి హతాశుఁడు గాకుండ ధైర్యమును జిక్కపట్టి గది నాలుగువైపులయందును దృష్టిపాత మొనరించి చూచెను. అప్పుడొకమూల నొకపెద్దపేటిక కాన్పించినది. రవీంద్రుఁడు పరుగిడిపోయి తనచేతి వెలుతురు సహాయమున నాతావు నంతటిని పరికించెను. ఆతఁడంతనా పెట్టెను దెఱచుసరి కప్పుడా దుర్గంధకారణము తెల్లమైపోయినది. అందొక యనాథప్రేతమును గాంచి యాతఁ డించుక వెనుకకుఁ దూలిపోయి యప్రయత్నముగ "హా! ఇదియేమి చిత్రము!" అనెను.

అప్పటి చెడువాసన వర్ణనాతీతము. రవీంద్రుఁడు నాసికారంధ్రముల నొకవస్త్రమూలమునఁ బిగపట్టుకొని దీపికాసాహాయ్యమున నా శవపరీక్షను సాగించెను. అది యొకసాధారణమానవుని దని ప్రథమదర్శనముచేఁ దెలిసిపోయినది. క్రుళ్లి దుర్లోక్యమై యుండెను. పత్తేదారుఁ డచట నిఁక నొకనిముసమైనను నిలుచుండనేరక దానిని

మూసివైచెను. “ఔరా! ఏమి యీ యనర్థకము! ఈ నృశంసులు మఱియొక హత్యఁ గావించినారు! ఈ మందభాగ్యుఁ డెవ్వఁడో కదా!” అని యనుకొనుచు నీవలకు వచ్చెను. అచట నెట్టిచిత్రమును గోచరింప లేదు. అప్పు డాతఁడు వేఱొకమార్గముగుండ నింకొక చిన్నయింటిలోని కేఁగెను—రవీంద్రుఁడు నిర్విణ్ణుఁడై నిలుచుండెను. ఏల! అతని కచట నొక చిన్న కంఠధ్వని వినఁబడుచుండెను. తోడనే యాతఁ డాగది నంతటి నతిజాగరూకతతో గమనించి చూచుసరి కొకకోణమున నొక తొట్టి కాన్పించినది. అది యుండుస్థల మంతయు చిమ్మచీఁకటిచే మూసికొని యుండెను. అచటినుండియే యా ధ్వని వచ్చుచుండెను. రవీంద్రుఁడు తత్క్షణమే పోయి యా తొట్టిని శోధించి చూచుసరి కాతని నయనయుగళములనుండి యశ్రునిపాతము కాఁదొడఁగెను. అతఁ డంత చింతాసూచక స్వరముతో “ఎంతటి భయానకము! ఆ బాలికయే! సుశీల కావచ్చును. హత్యగావింపఁబడెనా?” యని నిట్టూర్పు పుచ్చెను. అతఁ డంతటిసంతాపముతో నేమిచేయను దోఁపక నాబాలికా మణి మృదుదేహము నెత్తికొని యీవలకు వచ్చెను.

ఆ బాలికా ప్రాణములు దేహమును వీడిపోవుటకు చాల శ్రమ నొందుచుండెను. ఒకటి—రెండు—మూఁడుగంటలకుఁ బూర్వమే యామె కంఠము బలవత్తముగ నులిదిప్పఁబడియుండెను. ముఖము వివర్ణమై కందిపోయినది. బండిలోనుండి కరాళుఁ డింటిలోనికి మోసి కొని వచ్చినపు డామె నిద్రించుచుండెను. నిద్రాపరవశ యగు నాకన్యక కావిధముగనే శాశ్వతనిద్ర యబ్బినది. రవీంద్రుఁడు చూచుచుండఁగనే యామె యనేకవిధములుగఁ దన్నుకొనుచు, చీత్కారముఁ జేయుచు, తుదకు ప్రాణములఁ బాసెను. ఆ దురవస్థను గాంచి యాతఁడు కన్నీటి నాపుకొనఁజాలఁ డయ్యెను. “అకటా! ఈ ముక్కుపచ్చ లాఱని

పసిపాప యీ రాక్షసాధముల కేమి యపరాధమును గావించి యుండును! మహాపాతకులు—ధనాశాపీడితులై — యెంతటి ఘోరకార్యముల కొడిఁగట్టుకొనిరి! ఔరా! జగమున నట్టికట్టిఁడు లుందురోకదా! నాకు తెలిసినంతవఱ కీమెయే శాంతినాథుని ద్వితీయపుత్త్రిక యగు సుశీల యని తోఁచుచున్నది. అహా! ఆపాపిని యముల తనసోదరిమరణమున కెట్లొత్తుకొని యుండును? అది ప్రత్యక్షదానవి—ఘాతుకురాలు, విమలిప్తంబగు చక్కెరబొమ్మ. వీరి నందఱిని బట్టి నా కసిదీర్చుకొను దాఁక నేను నిద్రాహారములైన సరిగ ముట్టను" అనుచు రవీంద్రుఁ డటనుండి లేచెను.

అతఁ డాసమయమున నింకేమి చేయఁజాలును? మరణించిన యీ బాలికను గాంచినపు డెల్ల దుఃఖావేశమున దీర్ఘనిశ్వాసముల విడిచెను. తుద కాతఁ డాభయంకరదారుణదర్శనమును జేయనేరక "దుర్భరము! దుర్భరము! ఇఁక చూడఁజాల" యని యటనుండి వెడలి పోయెను.

రవీంద్రుఁ డోకదత్యుమువలె చేతదీపమును ధరించి గదినుండి గదికి తిరుగుచుండెను. అతని హృదయమున భయావేశ మగుట కణుమాత్రమైన తావు లేకుండెను. ఇందు ప్రవేశించి యీ పరీక్షలకుఁ గడంగుటలో నాతని యాశయ మేమన, నది హంతకశరణ్యస్థానము కావున తనకు విశేషరహస్యోదంతములు తెలియు నను నాశ యొకటి, కారసింహాదులు లోపలికిఁ గొని తెచ్చిన బాలికను మరల తమవెంటఁ దీసికొనిపోవమి యామె నేమి చేసిరో చూడవలయు నను నాశ రెండవది, ప్రవాళునిమరణ మేకారణమున జరిగినదో యని తెలిసికొను నాతురత మూఁడవది, రామనాథుఁ డెందుండు ననుకుతూహలము నాల్గవది. ఇన్నిటిలో మొదటిరెండు నాతనికి విదితమైనవి. ఇఁక తక్కినవానికై యనుసంధానమును గావించెను. అతఁ డిప్పుడు ప్రవాళుని దేహమును

వెదకుచున్నాఁడు, వాని ప్రీతమును మరల నొకమాఱు చూడవలయు నని యాతనియభిలాష. రవీంద్రుఁడు గృహము నంతటిని చుట్టి వచ్చుచుండెను, ఆ సమయమున నాకస్మికముగ నాతనిపాదమున కేదియో చటుక్కునఁ గుట్టెను. ఆబాధ కోఁగఁజాలక యాతఁడు "హా" యని యున్నచోటనే కూలఁబడిపోయెను. కాని శిలాసదృశహృదయుఁ డగు నాతనికి భయముమాత్రము జనింపకుండెను. కొన్నినిముసములు దాఁటినపిదప తననొప్పి నొకరీతిగ సహించుకొని లేచెను. తన యనుసంధానకార్యము నంతటితో వదలివైచుట రవీంద్రునియుద్దేశము కాదు. ఆతఁడు మరల నొకమాఱు తిన్నఁగఁ బోయి దాపున నుండినయొకచిన్న యిఱుకుగదియందు కాలుంచెను.

ఈసరి కాచోటున రవీంద్రుని మూఁడవయత్నము సఫలమైనది. అచ్చట నొకమూల నున్నట్టుండి యాతనికిఁ బ్రవాళునిశరీరము కాన్పించెను. దానిని గాంచినంతనే రవీంద్రునంతటివాఁడుకూడ నించుక జరిగి వెనకకు తూలి నిలుచుండెను. కొంతవఱ కాతఁడు తనదీపకాంతి నామృతునిమోమువంకకు ద్రిప్పి తదేకదృష్టితో వీక్షించెను. ముఖ మతి వికృతమై చూపరగుండెల జీల్చునట్లుండెను. తలపై బలమగు దెబ్బ పడుటచేతను, రవీంద్రునితోఁ బోరుతఱి క్రిందపడినపు డందందుతగిలిన గాయములమూలమునను వానిముఖమంతయు రక్తసిక్తమై యుండెను. రవీంద్రుఁడు కొంతకాలమువఱకు నట్లు చూచి "ప్రవాళా! నేను దురదృష్టవంతుఁడను. నీబోటిప్రతిద్వంద్విని బోనడచుకొంటిని" అనెను.

ప్రొద్దు చాల గడచిపోయినది. తెల్లవాఱుట కింక నెంతయుఁ గాలము లేదు. ఇంతలో రవీంద్రునికాలియందలిబాధ యతీతమై పోవుచుండెను. ఆతనిదేహ మాద్యంత మేదియో భయంకరవిషసమాశ్రిత మైనట్లుతోఁచినది. కన్నులు తిరిగిపోవుచుండెను. కొంతసేపటి కాతఁ

డావేధకు కంపించుచుఁ దాళలేక నిలుచున్నస్థలముననే కూలఁబడి పోయెను. శరీరమునం దంతట ముచ్చెమట లొదవ నారంభించినవి. దేహ మాద్యంత మా సమయమున మంచువలె చల్లనై రవీంద్రునికే భీతి గొలిపెను. "ఇది యెట్టిబాధ! అకటా! ఈ దిక్కులేని తావున— ఈ భూతగృహమున—ననాథుఁడనై మరణింతునా! ఆహా!" యని యాతఁడు కాతరవీక్షణములతో నలువంకలను పరికించెను. ఎట్టయెదుట మరల ప్రవాళుని భయంకరప్రేతరూప మగపడినది. ప్రవాళుఁడు రోషకళ లుప్పతిల్లఁ దన్ను చూచి వికటాట్టహాసముఁ జేయుచున్నట్లుండెను. ఎన్నటికిని—యేనిమిషమునను—యేస్థితియందును లేనట్టి భీతి నేఁడేలకో రవీంద్రునకు జనింప నారంభించెను. ఇట్టిదురవస్థ నాతఁడు తాను జీవితకాలమున నొక్కమారైన ననుభవింపలేదు. క్రమక్రమముగ నుచ్ఛ్వాసములు జరుగుటే కష్టము కాఁజొచ్చినది. ఏదియో వెనుకకుఁ దన్ని యీడ్చినట్లగుచుండెను. అతఁడిఁకఁ గూర్చుండఁజాలకపోయెను. "హా! దైవమా!" ఆ మఱుక్షణముననే నేలకొఱఁగి రవీంద్రుఁడు వివశుఁడై పడి తన్నుకొన నారంభించెను. ఒకటి—రెండు—నిముసములు దాఁటినవి. తుద కాతఁడు నిశ్చేష్టితుఁడై పోయెను.

# పందొమ్మిదవ ప్రకరణము

## విపరీతము

అమల : తారసింహా! నీ కేమి తోఁచుచున్నది. నాకుఁ జూడ నీతఁడే మమ్మన్వేషించుచుఁ దిరుగుచుండు పత్తేదారు రవీంద్రుఁడని తెలియుచున్నది.

తార : నాకు నదియే యనుమానము. ఈతఁడు పత్తేదారు కాకున్న నితరులు కీగదియం దేమిపని! నీవన్నట్లు ముసలిరూపమున వచ్చి నిన్ను వంచించి యింటియందు పరుండు టేల! యోచించి చూడ వీఁడు మమ్ము హంతకులుగ సంశయించి యీయింటియం దనుమానముండుటచే నీరీతిఁ బ్రచ్ఛన్నవేషముతో వచ్చినట్లున్నది.

అమల : ఉండవచ్చును. ఔరా! వీఁడెంతగ నన్ను మోసగించె ననుకొంటివి! ముసలిది యని నాకు నిశ్చయము కలుగునట్లు మాటాడి చెవుడు నభినయించుచు వచ్చెను. నేను గోతిలో పడిపోయితిని. నేను నిక్కంపుస్త్రీయని తలఁచితిని. కాని, వీఁడు పరుండినపిదప నించుక యనుమానముతో పరికించి చూడ నందలికృత్రిమము వెల్ల బోధపడి పోయినది. తోడనే వీని నింట వైచి వెలుపలతలుపులను బంధించుకొని నిను తోడ్తేర వచ్చితిని. అంతలో నెంతపనిని జేసినాఁడో చూడుమా! వీఁడుండిన దెచ్చట! ఇపుడు పడియుండున దెచ్చట! పత్తేదారు సాధారణుఁడు కాఁడు.

తార : అందుకు సందియ ముండదు. ప్రవాళుఁడు శోకప్పుడు నాకు వీని శక్తిసామర్థ్యములనుగుఱించి చెప్పియుండెను. ఏమైన నేమి ! వీఁడు గతించిపోవుటవల్ల మాకు పట్టిన శనిగ్రహము వదలినట్లైనది. మన కించుకంతయుఁ గష్టము లేకయే వీఁడు సమసిపోయెను. ఇఁక మనభావిపథ మప్రతిహతము.

అమ : అయినఁ దారసింహా ! ఈతఁడు గతించె నని నిశ్చ యించితివా ?

తార : అమలా ! ఇంకను ననుమానమా ? ఆ మూలనుండిన ప్రవాళుని ప్రేతముఖమునకు వీనిముఖమున కేమైన భేదమున్నదా ? శరీర మును జూడుము, కట్టెయై చల్లఁబడియున్నది.

తారసింహుఁడు ప్రవాళునివైపు చూపి చెప్పుచుండెను. అమల తనప్రియునిముఖము నొకమాఱు తిలకించి భయభ్రాంతయై నిర్విణ్ణ యయ్యెను. ఆమె దేహ మిప్పుడు సంచలిత మగుచుండెను. ముఖ మంతయుఁ దెల్లవాఱి కాంతి మాసిపోయినది. కన్నులు రక్త రంజితములై పోయెను. ఆమె యొకమాఱు తారసింహునిముఖముపైఁ దీవ్రదృష్టిని సారించెను. మరల ప్రవాళునిపై—అది శాంతసమ్మిళి తము—సంతాపసంకులితము—దుఃఖపూరితము. తననాథుని దారసిం హుఁడే యేదోవిధముగ సంహరించి తన్ను పొందఁగోరుచున్నాఁ డని యామె కిదివఱకే గట్టియనుమానము జనించిపోయినది. వానిపై నపార మగు నాగ్రహ ముదయించినది. వాని నొక్కమాఱుగ గోలుపులి చందమున కంఠమును గత్తిరించి రక్తపానము చేయ నుంకించినది. కాని, యమల యబల. పురుషుఁ డగుతారసింహుని పంతసుఖపుగఁ గడ తేర్పఁగలదా ! వానితో—ఆ రాక్షసునితో—నామె సరితూగనేరదు. విధివశమున ముండ్లకంపపై మల్లికాకుసుమదామము రాలి పడినది.

దాని నిదివఱకుఁ బోషించుచు ధరించియుండినలత శుష్కించిపోయినది. కంటకములకు కుసుమములపై కనికరమా ! వాని నిశితాగ్రప్రహారము లచే నాపుష్పము చాల నలిగిపోయినది. దాని నిఁక నితరులు పరిగ్రహింపఁగోరుదురా ? దళములు విచ్ఛిన్నమైనవి—కాంతి తఱిగినది—పరిమళ మడుగంటినది—అందము గతించినది. ఇఁక నది మల్లికాకుసుమమైన నేమి ? ఎవరు దాని నెత్తి శిరమున నుంచుకొందురు ? చూచియు చూడనట్లు వెడలిపోదురు. ఇఁక నాపుష్పగతి యేమి ? ముండ్లపై చిరకాలము పడియుండుటయేనా ? అవి తన్ను సంపూర్ణముగ నాశనము చేయకపోవు. ఇఁకను కొంతయందము—సౌరభము—కాంతి—యున్నపుడే యాకంటకలతను పీడి యీవలఁబడిన దానియదృష్టవశమున నెవరైన చేకొనకుందురా ? అమల బాగుగ యోచించుకొన్నది. తన నాథుఁడు ప్రవాళుఁడు తన్ను మాని స్వర్గస్థుఁ డయ్యెను. తాను బంధుదూరితమై యున్నది. తన్నుఁ గాంచినవా రేవగించుకొందురు. అట్లని యామె యిఁక చిరకాల మాతారసింహాదినృశంసవర్గముతో కలిసిమెలసి యుండ నిశ్చయింపలేదు. తనదారిని తాను బోవ స్థిరపఱచుకొనెను. ప్రవాళుఁ డెట్టిరాక్షసుఁడైన నేమి ? వాని నామె సంపూర్ణప్రేమాధీనునిఁ గావించుకొని యుండెను. వానిచేతనములు చేతోముదముతో యుండెను. తారసింహాదుల నామె యేవగించుకొనుచుండెను. ఇఁక వారితో నామెకు సఖ్య మెట్లుకుదురును ? వారినుండి తప్పించుకొని పోవ యత్నించుచున్నది. కాని సముచితసమయ మబ్బువఱకు వేచి యుండ నిశ్చయించెను.

అమల హృదయభావములను స్వల్పకాలములో మఱుగుపఱచుకొని మరల నాతారసింహునితో ప్రసంగమునకుఁ గడఁగెను.

అమల : తారసింహా! ఈ రవీంద్రుఁ డీరీతిఁ జచ్చుట కేమి కారణమై యుండును? నేను జూచినప్పుడు గుండువలె నారోగ్యముగ నుండెనే!

తార : పిఱికిపంద. ఇచ్చటిశవములను గాంచి భీతిలి గుండె పగిలి చచ్చెను కాఁబోలు! ఇట్టి నిరర్థకపు పత్తేదారులా మమ్ముఁ బట్టఁ జాలినవారు?

ఇరువురును గొంతవఱకు మాటాడలేదు. ఆ మౌనావస్థయం దంతటను తారసింహుఁడు రవీంద్రుని చూడలేదు—ప్రవాళుని దేహమును గాంచలేదు — ప్రావృట్కాలశంపాదీప్తమంజ మనోజ్ఞమగు నమల ముఖారవిందమును దిలకించుచుండెను. ఆ ముఖజలజసౌందర్యామృతమును గ్రోలి తన్మయచిత్తుఁడగుచుండెను. తదేకదృష్టితోఁ జూచుచుండెను—ఆ చూపుల కంతము లేదు—ఆ యానంద మపారము—ఆ పరవశత్వ మవాచ్యము. అమల యొకకంట వానిచర్యల నుపలక్షించుచునేయుండెను. కాని యేమియుఁ దెలియనిదానివలె రవీంద్రుని శరీరావలోకనము చేయుచుండెను. తారసింహుఁడు గ్రుడ్డియగుచున్నాఁడు. తానేమిచేయుచుండునది తనకే తెలియదు. మోహాయత్తుఁడై పోయెను. అమలముఖమునం దిదివఱ కాఁడింతటియందము—లావణ్యము—మంజులత యున్నట్లు తలంపలేదు. దేవతాకన్యకలకైన నీతేజముండదని వానియూహ. ఉన్నదున్నట్టుగ వాఁడు "అమలా!" యనుచు నామెహస్తమును బట్టుకొనెను. అమల వానిహృదయాశయములను చదివినది. తోడనే చేయి విడలించుకొని దూరముగ నిలుచుండెను. తారసింహుఁ డూరకుండ నేరఁడయ్యెను. మరల "సుందరీ! చూడుము. మనమార్గము నిష్కంటకమై యున్నది. రవీంద్రుఁడుకూడ గతించెను. మమ్మిఁక దురాత్ములుగ ననుమానించి బాధించువా రెవ్వరును లేరు. వీఁడొకఁ డుండెననికదా భయ ముండినది. నేఁటి

కదియును దీఱిపోయినది. మన మిఁక స్వతంత్రులము. ఒరుల మనల నేవిషయమునందు ననుమానింపఁజాలరు. మనము లోకమున సంపన్న గృహస్థులవలె నెందేని పోయి నివసింపవచ్చును” అనెను. అమల మాఱుపల్కక యేదియో యోజించుకొనుచు నవనతశిరస్కయై నిలుచుండి యుండెను. ఆ దురాత్ముఁ డగు తారసింహుఁడు మరల “తన్వీ! నీ విశ్వమోహనసౌందర్యము నీ ప్రాయమునసే నేలపాలు గావించుకొనకుము. నను వరింపుము. నే నీసంగతిని పలుదినములనుండి హెచ్చరించుచుంటిని. నన్ను శూనకుము. నన్ను నీ ప్రియునిఁగఁ జేకొనుము. మన మిరువుర మెందేని సుఖముగఁ బోయి కాలమును గడపుదము.” అనుచు మఱింతదాపునకు వచ్చెను. ఆమె శిర మెత్తి వానివైపు చూచెను. ఆ తేజోభూషితలపనారవిందమున నిపుడా మోహ ప్రభలు లేవు—హాసచిహ్నములు లేవు. అది కేవలరౌద్రరసపూరితము, నయనముల నిప్పు లదరుచుండెను. ముఖము జేవురించి భయంకరముగ నుండెను. తారసింహుఁ డది గాంచి “అమలా పూర్ణసుధాకరమండలమున నీ పావకజ్వాలలేల!” యనెను. ఆమె యిఁక సహింపనేరక దండతాడితంబగు సింహినివోలె ముందున కంజవైచి “దుర్జాతీ! తారసింహహతకా! నీ హృదయము నాకు తెలియకపోలేదు. నీ దుర్బుద్ధిని మానుమని పలుమాఱు హెచ్చరించితిని. ఈ ద్రోహ చింతన వలదంటిని. పలుగాకీ! నీ కింకను బుద్ధి రాదయ్యెను. నాకు నీ సంగతి తెలిసిపోయినది. నన్నపహరింప నెంచి ప్రవాళు నేదోవిధముగ సంహరించి యా నేరమును రవీంద్రునిపై వేయ నెంచితివి కదా! చండాలా! నృశంసాధమా! నీ హృదయమును చీల్చి యుష్ణరక్త పానమును గావించి నీపలలమును గాకులకు వైచినను నాకసి తీఱదు. ఇట్టి ద్రోహబుద్ధి వని తెలిసియుండిన నీగతి నిదివఱకే గావించి

యుండును. ఇఁక నాకు మీతో నేస్తము వలదు. మీరధమాధములు—దుష్టులు—పతితాత్ములు. నాదారిని నేఁజూచుకొందును. మీరిఁక నన్నుఁ బలుకరింపకుఁడు" అని వెడలిపోవుటకై కదలెను. కాని కారసింహుఁడామెను బోనియ్యక యడ్డునిలిచి "అమలా! నీవేమి చెప్పఁచుంటివో యోజించుకొనుము. నీవు భయభ్రష్టత్వము నొంది నేఁడు త్రిశంకుస్వర్గమున నల్లాడుచున్నావు. నిన్నుద్ధరించు శక్తి నాయొద్ద నున్నది. తండ్రిగృహమునకు నీవిఁక నేగఁజాలవు. ఒరులు నిన్నాసింపరు. నన్నుమానిన నిక్కముగ నధోగతి వాటిల్లును. యోజింపుము. నీకింకను నవకాశ మొసంగెదను. మనలో మన మంతఃకలహములఁ బెంచుకొన్న శ్రేయస్కరము కాదు" అనెను. అమల యాగ్రహమున కంతము లేకుండెను. భయంకరకాలసర్పమువలె రోఁజుచు నామె "నేనుభయభ్రష్టత్వ మొందినను మానె. ఒరులు నన్నాదరింపకున్నను మానె. నిన్నుమాత్రము చేపట్టను. భిక్షుకురాలనై వీథులందు మధుకర మెత్తి జీవింతును కాని నీకు భార్యకానొప్ప. దురూహాధమా! పాపీ! నేనెంత గయ్యాళినైనను, ఎంత తలిదండ్రుల మాట మీఱినను, ఎంత నీచురాలనైనను, నేను మనఃపూర్వకముగఁ బ్రవాళునిఁ బ్రేమించితిని. నా సర్వప్రేమనిధానము నాతనికొసంగితిని. ఇంతలో నన్ను తప్పఁదలంచితివా? నీవంటితుచ్ఛుల నిఁక నెందఱినో చేపట్టుదునని యెంచితివికాఁబోలు. ప్రవాళుని భార్య యమల. అమల భర్త ప్రవాళుఁడు. వారిరువురకు శాస్త్రోక్తవివాహము జరుగకున్న నేమి! వారి వాత్సల్య మనంతదృఢప్రేమరజ్జుబంధితమైనది. ఇదియే శ్రేయస్కరము. శాశ్వతము. పాపీ నామాటవిని బ్రతుకఁగోరుదువేని నాదారి నుండి తొలఁగిపొమ్ము. నీవు నా ప్రబలారివి. నాపతి హంతకుఁడవు. నా సోదరహంతకసహాకారివి. ఈపగను నేను దీర్చుకొనఁజాలనని నిశ్చ

యించుకొంటివి కాఁబోలును. చూతువుకాక యీ యమలదృఢసంకల్పమును" అని చెప్పుచు నామె తటిల్లతవోలె నీవల కరుదెంచి దాపుననుండి సోపానపంక్తి ననుసరించి పైభాగమునకు వెడలిపోయెను. తారసింహుఁ డామె నాఁపఁజాలక యామెపోయిన దిక్కును గాంచుచు హతాశుఁడై నిలుచుండిపోయెను—ఎంతటి విపరీతము !

# ఇరువదియవ ప్రకరణము

## జా నా బ జా రు తోఁ ట

నేఁడు చంద్రనగరమున నొక భయంకరవార్త జనించినది. జానాబజారునందలి తోఁటలో నొక మానవదేహము కాన్పించినది. దాని ఫాలమున నెఱ్ఱనియక్షరములతో "గ్రామపిశాచవుపని" యని వ్రాయఁబడియెను. చూచినవారెల్ల "ఇదియేమి యాగడము! పిశాచములు తుదకూరిలోఁ బ్రవేశించి మనుష్యులను జంప మొదలిడినవి. ఇంకేమిగతి?" యని భీతిలి పాఱుచుండిరి. నిక్కముగ నది పిశాచకృత్యమే యగు. అది మానవులు చేసిన హత్య కాదని విస్పష్టముగఁ దెలిసిపోవుచుండెను. దేహముపై కత్తిపోటులు లేవు. దేహమాద్యంతము చల్లఁగ నుండి భయానకమై యుండెను. పురివారెల్లరు గుంపులుగుంపులుగ వచ్చి యా శరీరమును గాంచి భయభ్రాంతులై పోవుచుండిరి. వింత యేమన మృతుఁడు మగవాఁడు, కాని స్త్రీరూపమున నున్నాఁడు. ఇందులకుఁ గారణ మేమి? ఎవరు నూహింపనేరకైరి—పత్తేదారు రవీంద్రుఁడని యెవరికిఁ దెలియును!!!

అతని నెవ్వరు వాయూరఁ జూచి యెఱుఁగరు. ఎఱిఁగిన యొక రిద్దఱికి కాసంగతియే తెలియరాలేదు. "కేశవపాలునిఁ జంపినహంతకాధములఁ బట్టుటకు కలకత్తానుండి రవీంద్రుఁ డనునపరాధరహస్యశోధకోద్యోగి వచ్చియున్నాఁ" డని మాత్ర మెల్లరకుఁ దెలియును గాని యాతఁడే యా రవీంద్రుఁ డని యెఱుఁగరు. క్రమక్రమంబుగ నీవార్త

దవానములరీతి పురమెల్ల వ్యాపింపఁజొచ్చెను. బాలురు తండోపతండ ములుగ వచ్చి యా స్థలముచుట్టును మూగుచుండిరి. పెద్దలు పలువు రాచిత్రమును గాంచి యక్కజ మందుచుండిరి. అచ్చో మూగిన వారెల్ల నోటికి వచ్చినట్లెల్ల మాటాడుకొనుచుండిరి. ఆ తోఁటయం దెప్పుడును దయ్యము లుండునని యా పురమున నొక ప్రాఁబల్కు కలదు. కాని యీరీతిగ జనులను సంహరించుట కిదియే మొదటిసారి యఁట. ఇఁకఁ జెప్పనేమి ? రవీంద్రుని దేహము నా తోఁటలోఁ గాంచినవారెల్ల విస్మయమున ననేక కారణముల నా చావువిషయమై చెప్పఁబోవ నారంభించిరి.

నిన్నటిరేయి భూతగృహమునఁ బరవశుఁడై పడియున్నరవీంద్రుఁడు నేఁడుదయమున నీగతి జానాబజారుతోఁటలోఁ బడియుండుటకుఁ గారణ మేమని మా పాఠకుల కాశ్చర్య మొనఁగూడియుండును కాఁబోలు. కారణమిద్ది. రాత్రి యా రీతిగ ప్రవాళునితనువు మ్రోల పత్తేదారు వివశుఁడై పడినపిదప నచటికి తారసింహాముల లరుదెంచుట మన మెఱిఁగినవిషయమే. పిదప తారసింహునకు నమలకుఁ బూర్వమున్నవిరోధాగ్ని ప్రబలిపోవ నామె యా హంతకాళి సహవాసమును వదలుకొని వెడలిపోవుటయు కూడఁ గాంచితిమి. పిదప తారసింహుఁడు రోషించుకొని యప్పటి కామెను వెన్నంటి పోఁడయ్యెను. ఆమె యిఁకఁ దమ రహస్యములను లోకమున వెల్లడించు ననుభీతిమాత్రము మెండుగఁ గలదు. అందుచే వానికి మిగుల నాగ్రహ మొదవినది. కాని, యమలను మరలుచ్చుకొనివచ్చు ప్రయత్నములను చేయఁడయ్యెను కొంతసేపైన పిదప వాఁడు రవీంద్రుఁడు నిక్కముగ గతించెనని తలఁచి యా మృత శరీరమును పైఁజెప్పినతోఁటలో పాఱవైచి యతనిసుదుట నా ప్రాఁత ప్రవాసి పోయెను. ఇంతచేయుటలో వానియాశయ మేమన

చంద్రనగర వాస్తవ్యుల కొకవిధ మగు భీతిఁ గలిగించి, యిఁక ముందు కేశవపాలుని హత్యాపరాధుఁడు బట్టుపడునట్లు తేదాక రవీంద్రునిగతి నాలకించి భయపడి తమ యభిప్రాయములను మార్చుకొని యానేరస్థుల విషయమై పాటుపడకుండునటుల చేయవలయుననియే.

ఎనిమిదిగంటలైనది. మఱియొక చిత్రోదంతము! విస్మయాకులు లైనపురివారియాశ్చర్యము మఱింత వృద్ధియైనది. ఏమనఁ దోఁటలోని దేహము కదలుచున్నదఁట! అదిగాంచి చిత్రభయాకులితులై జను లెల్లరు దూరముగఁ బరుగిడి పోయిరి. "చచ్చినవా రెందైన జీవింతురా" యనియే వారి తెచ్చపాటు—భీతి—

రవీంద్రుని భూతగృహమునఁ గుట్టిన దోకవృశ్చిక మని పాఠకులు గ్రహించియే యుందురు. దానివిష మెంతటిభయంకరమో కాని యాతఁడు నాలుగైదుగంటలవఱకుఁ దెలివి లేక పడిపోయెను. విశేష శీతము హెచ్చుటచే దేహమంతయుఁ జల్లపడి ముచ్చెమటలు గారు చుండెను. దైవకృపాతిరేకమున రవీంద్రుని కంతటిప్రబలమగునపాయము సంఘటిల్లినను ప్రాణాపాయము కలిగినదికాదు. ఆతనికిఁ దెలివి వచ్చు సరికి జను లెల్లరు దూరమునుండి తనవైపు చిత్రముగఁ జూచుచుండిరి. ఆతఁడు లేచి కూర్చుండి మొదట తన నిజరూపమును గప్పియున్న చీరను దీసివైచెను. రవీంద్రుఁ డిప్డు డెప్పటిరూపముతో లేచి నిలుచుండి నలువైపులను దిలకించి చూచెను. ఆ సమయమునఁ దటిల్లితవోలె నాచేరువ గుంపులోనుండి యొకయువకుఁడు తటాలునఁ జీత్కారము సేయుచు వచ్చి రవీంద్రునిఁ గౌఁగిలించుకొనెను—ఆతఁడే రామనాథుఁడు!!!

రవీంద్రునిప్రస్తుతవిస్మయావస్థ విలేఖనాతీతము. ఆకస్మికముగ నచట రామనాథుని గాంచుటచే ననిర్వచనీయభావోదయమున నాతని

గుండె గుభిల్లుమనెను. ఆసనికహస్తుల నాతఁడే విశ్వసింపనేరఁడయ్యెను. అంతయు భయంకరస్వప్నప్రాయమై యుండెను. అప్రయత్నముగ "ఏమిది! రామనాథా! నేఁటి కెట్లు రాఁ దటస్థించినది? ఇదివఱ కెందుంటివి?" అనెను. రామనాథుఁడు బావపైఁ జేయివైచి "బావా! నా సంగతిని పిదప నిదానముగఁ జెప్పెదను. కాని మీ రేల యీరీతి నీవీధియందు పడియుంటిరి? ఎవ రెందుకు మిమ్ముఁ బాఱవైచిరి? యోజించి చూడఁ గనుమద్భుతముగ నున్నదే!" అని చెప్పుచు నాతని నుదుటనుండిన రక్తాశ్రపంక్తిని తుడిచివేసెను. రవీంద్రుఁ డత్యంతాశ్చర్యసంభ్రముఁడై "ఏమది? నాముఖముపై నేమున్నది?" అని ప్రశ్నించెను. అప్పుడు రామనాథుఁ డాముదయమున జరిగినయుదంతము నంతటిని దెలిపివైచెను. రవీంద్రున కప్పుడు రాత్రి తానుచూచినచర్య లొక్కొక్కటి పుంఖానుపుంఖములుగ జ్ఞప్తికి వచ్చుచుండుటచే కొంతవడి మాటాడక నిశ్చేష్టితుఁడై నిలుచుండిపోయెను. తా నారీతి పాతాళగృహమునఁ బరవశుఁడై పడినదాదిగ నాఁటియుదయమువఱకు జరిగినయంశముల నన్నిటిని సూక్ష్మగ్రాహియగు నాతఁ డూహించెను. తా నారీతి నాహంతకులచే మోసగింపఁబడుట కెంతయుఁ జింతించి తనప్రస్తుతహాస్యాస్పదస్థితికి మఱియు లజ్జించెను. తా నంతటి యప్రమత్తుఁడై యమలగృహంబున నిదురించినందులకు మిక్కిలి పరితపించెను. అప్పు డాతఁ డిఁక నట నిలుచుండనేరక "రామనాథా! సర్వమును సావకాశముగ నెఱిఁగింతును. నమ్ముము, విషయము లతిభయానకములు. ఇపు డిచట ముచ్చటింపరాదు" అని చెప్పుచు నాతనితో నాస్థలమును వీడి కదలెను.

ఇంతలో చేరువ మూఁగియుండినసంఘంబున నేమూలనుండియో యొకతుపాకి పేల్చినశబ్ద మతిగంభీరముగ బయలుదేఱి యచట నుండిన వారినెల్ల సంక్షోభపరచెను. ఆ క్షణముననే యొకతుపాకి రివ్వున

శరవేగమున వచ్చి రవీంద్రుని కర్ణపార్శ్వమునుండి దాటిపోయెను. రవీంద్రరామనాథు లిరువురు నిర్విణ్ణులై నిలుచుండిరి. వారి కాసమయమున నేమిచేయుటకును దోఁపదయ్యెను. మనుష్యులమూకనుండి హాహాకారములు వెలువడి "పట్టుఁడు. తుపాకిని ప్రేల్చినవానిని బట్టుఁడు." అని మహాకల్లోల మధ్భవిల్లెను. కాని, ఎవరాపనిని గావించినది, వారెచ్చట నుండునది యేరికిని దెలియరాదయ్యెను. నిరర్థకం బగుశబ్దనిమాత్ర మాజనసమ్మర్దమధ్యమున జనించి భూమ్యాకాశములం జేల్చివైచెను. అప్పు డొకరిద్దఱుపురివారు రవీంద్రుని డాసి యీయాత్రమునకుఁ గారణము లడుగుచు "మీరెవరు? ఈ రీతిగ నీ వీథియందు పడియుండుటకుఁ గతమేమి? ఈతఁడు మీకేమి కావలయును?" అను ప్రశ్నల నొకదానివెనుక నొకటిగ నైవ మొదలిడిరి. ఆతఁడు వారితో నెచ్చుగ వాతతిని నుచ్చటించుచుండరాదని "నేను కలకత్తాపురవాసియగు పత్తేదారుఁడను. నాపేరు రవీంద్రుఁ డందురు. ఈతఁడు నా మఱిది" అని చెప్పుచు నటనుండి రామనాథునితో గృహాభిముఖుఁడై వెడలిపోయెను.

"ఇప్పుడు సంగతులు తెల్లమైనవి. ఇతఁడే కేశవపాలుని హత్యాపరాధపరిశోధకుఁ డగుపత్తేదారు. ప్రాయశః నిన్నటిరేయి నీతఁడు దురాత్ములను గనుఁగొనుట కేఁగియుండ నా దుష్టులలో నెవఁడో యొకఁడు మోసగించి యింతపనిని జేసి యీతని నిందు పాఱవైచియుండును. ఇతఁడు మరణించెనని వారు తలంచియుండి నేఁడట్లు కాకుండుటచే తుపాకిచేనైనఁ జంపవలయునని యత్నించిరి. దేవుఁడు సర్వశక్తిసంపన్నుఁడు. పత్తేదారుని మృత్యుముఖమునుండి యీవలి కీడ్చెను." అని రవీంద్రునిపేరు నాలకించియుండిన వారెల్లరు ననుకొనుచు నిష్క్రమింపసాగిరి.

నిన్నటినుండి రవీంద్రున కనేకరహస్యాంశములు తెలియవచ్చినవి, కాని వానిని సాధించుటలో నాతఁడు తొందరచేఁ బొరఁబడెను. ఇదియే యింతటి యనర్థకమునకు మూలకారణము. రవీంద్రుఁ డింటి కేఁగుచు రామనాథునితో సర్వవిషయములను జెప్పివైచి తా నమల గృహంబున నంతయువివేకియై నిదురించినందుల కెంతయో తన్ను దాను నిందించుకొనెను. "ఏమిచేయుదము? కార్యము మించిపోయినది. ఇఁక ముందైనను జాగరూకతతో మెలఁగవలయును. హంతకులొకరికన్న నొకరు దీసిపోవువారు కారు. వారు నన్ను సంపూర్ణముగ నంధునిఁ జేసివైచిరి." అని చెప్పుకొనుచు నిజగృహంబును డాసెను; అప్పటి కప్పుడే దినమణి గగనార్థభాగమున చండకిరణుఁడై వెలుఁగుచుండెను.

# ఇరువదియొకటవ ప్రకరణము

దేవీమూర్తి?

"అన్నా! రామనాథా! మొన్నటిదినమున నీవు కరాళుని వెంబడించి పోయినపిదప నీవార్తయే నాకుఁ దెలియరాలేదు. వాని నెఱుంగునిమిత్తముననే నిన్నటిరేయి యిలువెడలిపోయి యింతటి హాస్యాస్పదుఁడ నైతిని. ఏదీ నీచరిత్ర నొకమాఱు చెప్పుము, విందము" అని రవీంద్రుఁడు బుజ్జగించుచు బావమఱఁది నడుగుచుండెను. అప్పుడు రామనాథుఁ డిట్లు చెప్పఁదొడఁగెను. "బావా! ఈ రెండుదినములనుండి నేనొందినశ్రమము లత్యద్భుతములు. చెప్ప నలవి కాకున్నవి. రెండుదినములు పట్టును. నేనారీతి మీయాజ్ఞ ననుసరించి సుశీలవిషయమై తెలిసికొని రాను కరాళుని వెంబడించి యతిజాగరూకతతో వెడలిపోయితిని. వాఁడు పలుగతుల సందులఁ బడి పోవుచు నొకగంట యగుపరి కొకగొప్పసౌధమును జేరెను. అది యెందుండునది నాకుఁ దెలియదు. వానికిఁ దెలియరాకుండ నప్పు డొకలతాగృహమున డాఁగి వానిచర్యలను దిలకించుచుంటిని. ఇంతలో వానిపిలుపుల నాలకించి గృహములోనుండి యొకస్థూలకాయుఁ డీవలకు వచ్చెను. వారిసంభాషణమూలమున నాతనిపేరు సోమనాథదాసని గ్రహించితిని. అప్పుడు వారు పుష్పములఁ గోయునెపమున నేనుండు మార్గముననే యుద్యానవనమును బ్రవేశించుచు నన్నుఁ గాంచి బంధించి పట్టుకొనిరి. నా యప్పటిరూపు పాకబీదకూలివానివలె నుండుటచే వారు

నన్ననుమానింపక ఎవఁడో పూలకై వచ్చినదొంగ" యని నాకన్నులఁ గట్టి తీసికొనిపోయిరి, నానేత్రములఁ దెఱచుసరి కొక్క-జీర్ణాలయమున-దుర్గంధావృత మగుపాడుప్రదేశమునఁ బడియుంటిని.

"ఆగది ప్రాకారములు శిథిలరూపము నొందియున్నను మిగుల నెత్తుగ నుండి దుర్గమములై యుండెను. అప్పు డింక నేనేమి చేయఁ జాలుదును! నాకాలుసేతు లింకను బంధింపఁబడి యుండెను. కదలుటకుఁ గూడ నించుక యవకాశము దొరకినది కాదు. మఱునాఁటిప్రభాతము వఱకు నట్టిదురవస్థయందే పడియుండవలసివచ్చెను. క్రమక్రమముగఁ బొద్దు మీఱుచుండెను. అందుండినకీటకము లేవియో నన్ను మిగుల బాధించుచుండెను. అందుచే నాకు స్వస్థత లేకపోయినది. అప్పుడు నేనతిసాహసకష్టములతో మొదటితావును మాని యొకగజముదూరము దొర్లుకొని పోయితిని, బావా! అప్పటిచిత్రము నేమని చెప్పుదును! ఆ స్థలమునకుఁ దొర్లగనే యాస్థలమహిమ యెట్టిదో కాని దేహ మరగజము లోతున భూమిలోనికిఁ గ్రుంగిపోయెను. శరీరముపై నాసమయమున విశేషముగ మన్ను పడినది. నాస్థితి నప్పుడు చూచినవా రెఱుఁగుదురు కాని వర్ణింప నాతరము కాదు. బ్రతికియుండఁగనే నాయర్ధాంగము మంటిలోఁ బూడిపోయెను. నేనాగతినుండి తప్పి బ్రతుకు టెట్లు?"

"అప్పుడే రెండుగంటలై యుండెను. ఉదయమునుండి కడుపునకు తిండిలేకుండుటచేతను, పురుగులబాధ యతీతమగుటచేతను నా హృదయమున భయంకరబాధ యొకటి కలుగ నారంభించెను. కూడు, నీళ్లు లేక నేనట్లే మరణింతు నని నాకప్పుడు తోఁచినది. ఏమి చేయఁ గలను! ఊరక గుక్కిళ్లు మ్రింగుచు, అంత్యనిముషమునకై వేచి భగవద్ధ్యానమును గావించుకొన మొదలిడితిని. అప్పటికే జనించినది మరణ సంకట మని నాకుఁ దోఁచినది.

"సూర్యభగవానుఁ డస్తంగతుఁ డగువేళ నామందిరమున నొక చిన్నద్వారము తెఱచినట్లు శబ్దము వినఁబడినది. నేనాసమయమున నట్లు వచ్చుచుండువ్యక్తిని గాంచనేరకుంటిని. నాదృష్టి యూర్ధ్వదిశ కేగుచుండెనే కాని ప్రక్కల కేగఁజాలకుండెను. కదలినపు డెల్ల కొంత కొంతగ మన్ను పడి నా శరీరమును చాలవఱకుఁ బూడ్చివై చెను. నే నట్లు వచ్చినవాఁడు కరాళుఁడో లేక సోమనాథుఁడో యని తలఁచి వారు మరల నన్నేమిచేతురో యని భయపడితిని. కాని వారు గాలేదు. పదునేనువత్సరముల బాలికామణి యొకతె వచ్చి నాప్రొాల సాక్షాత్క-రించెను. అప్పుడు నేనాపవిమల సౌందర్యాతిశయమును, అసంపూర్ణాంగ సౌష్ఠవలావణ్యములను గాంచి దిగ్భ్రాంతుఁడనై యామె యాపాద మస్తకమును సున్మత్తునివలె పరిశీలింప నారంభించితిని. ఆమె నాదాపునఁ గూర్చుండి "అయ్యా! నీ కాఁకలి యగుచున్నదా?" యని యడిగెను. కన్నందుల కంగీకారసూచకముగఁ దల ద్రిప్పి "నీవెవరు?" అని ప్రశ్నించి తిని. కాని యామె నామాట కుత్తర మొసంగక కాతరవీక్షణములతో నలువంకలఁ దిలకించి తటాలున వచ్చి నా బంధనముల విప్పివై చెను. ఆహా! అప్పటి నాయానంద మేమని చెప్పుదును! నాకారీతిగ విముదలం గూర్చిన యా దేవీమూర్తి నభినందించి యా గుంతనుండి లేచి యీవల కరుదెంచితిని. అంత నా కన్యక తనయొడిలో నుంచుకొనియున్న ఫలముల నిచ్చి "అయ్యా! నీవు కడుజాగరూకుఁడవై యుండుము. ఈ రాత్రి గండమును గడచిన చల్లఁగ బ్రతుకఁగలవు. నేనిఁక నిట నుండరాదు. పరులు నన్ను చూచిన చంపివేతురు" అని చివాలున లేచి యాద్వారము గుండ వెడలిపోయెను. మరల నే నెప్పటివలె నేకాకి నైతిని. అది నా కెంతయుఁ గష్టప్రదమై-హృదయభేదనమై యుండెను!! నాకంతయుఁ గలవోలెఁ గాన్పించినది. నాకన్నులనే నమ్మనేరనైతిని.

"ఒక బాలిక—లోకానుభవ మణుమాత్రము నుండనియొక పసికందు—నేఁ డెంతటి సాహసకార్యమును జేసినది! ఇంటిలోని పెద్దల కీసంగతి తెలియ రాకుండ రహస్యముగ నట కరుదెంచి నాకు ముక్తి నొసగి హెచ్చరికను జెప్పి వెడలిపోయిన యా దేవీమూర్తి యెవ్వరు?" అని నేను చాల వెరగంది నిలుచుంటిని."

"ఇంతలో నా పాదములక్రింద భూమి చెమ్మగిల్ల నారంభించెను. నేనప్పుడు భయభ్రాంతుఁడనై చూడ నాదాపున గోడ చీలి యందుండి యేకధారగ జలము స్రవించుచుండుట కంటఁబడెను. అది గంగా ప్రవాహజల మని నాకు తోఁచినది. రానురాను, ఆ గదిలో నొకయడుగెత్తువఱకు నీరు నిలుచుచుండెను. అప్పు డాబాలికమాటలు స్మృతికి వచ్చి నా మానసము నంతటిని కలగుండుపఱచివైచెను. ఆమె "జాగరూకుఁడవై యుండుము. ఈ రాత్రిగండమును గడచిన చల్లగ బ్రతుకుదువు" అని చెప్పి వెడలిపోయినది. ఆవచోమధురగాన మింకను నా కర్ణకుహరములందే ప్రతిధ్వనించుచుండెను. వాని యర్థము నా కప్పుడు గోచరించినది. ఉదక మంతకంతకు హెచ్చగుచుండుటను గాంచి వారు నన్నా వనసంగ్రహమందు ముంచి చంపివేయ యత్నించినట్లు తెలిసిపోయెను. నేనప్పు డేమిచేయను దోఁపక యనూనభయాక్రాంతుఁడనై స్తబ్ధచిత్తముతో నిలుచుంటిని."

"ఇంతలో జలము కటిప్రదేశమును దాఁకినది. నేనప్పు డేఁక భీతిలిన ఫలము లేదని ధైర్యముతో నా యపారవిపత్సాగరమును దాఁట సంసిద్ధుఁడనై భగవద్ధ్యానమును జేయుచు నా నీటిపై నీఁదుటకు వేచియుంటిని. నేనట్లు వ్యస్తచిత్తమున నిలుచుండి యుండుతఱి రాత్రి ఎనిమిదిగంటలు కొట్టినచప్పుడు వినవచ్చెను. అప్పటి కప్పుడే నాగదియం దంధకారము ఘనీభవించి నా భయము నతిశయింపఁజేసెను.

నా పాదము లప్పుడు భూమిపైఁ బడకుండుటఁ గాంచి నేనిఁక నిలుచుండ లేకపోయితిని. అప్పటికి నీరు కంఠము నానుచుండుటచే నిఁక చింతించినలాభ ముండదని దైవముపై భారము వైచి తిన్నగ నానీటిలో నీఁద నారంభించితిని. నేనెంత ప్రయత్నించి యీఁదినను, నిలుచుండి పట్టుకొని యాయాసము నుపశమింపఁజేసికొనుటకుఁ దగినతావు దొరకకుండెను. ప్రాకారాగ్రములు మిక్కిలి యెత్తున నుండి దుర్గమములై యుండెను. నాకాసమయమున నీటి ప్రవాహముపై తేలి యాడుట తప్ప మరేమియుఁ దోఁపదయ్యెను. కాలుసేతు లవసన్నములై పోవుచుండెను. జల మాగడలోనికి వచ్చుటప్పటికి కాఁగిపోయినను ఉన్న జలమున నేను నిలుచుండఁజాలకపోయితిని. అసలికి దేహమున నొప్పి యెత్త నారంభించెను. నేనెంత ప్రయత్నించి చూచినను నిఁక ముందాజలమునఁ దేలియాడఁజాలనైతిని. ఒకటిరెండుపర్యాయములు నీట మునిఁగి లేచితిని. కాని యంతమున నా యాయాసము తీరినదికాదు. నన్నటఁ గాపాడఁజాలినవా రొక్కరును లేరు. ఇఁక నప్పుడు నిరాశాచిహ్నములు గాన్పించినవి. మృత్యుదేవత నాశిరముపైఁ జిందులఁ ద్రొక్కుచుండెను. ఆమె కరాళోత్కటసుశితదంష్ట్రాలంకృతభీకరవక్త్ర మతిసమీపముననే గాన్పించెను. అప్పు డిఁక ననన్యగతికుఁడనై ఈశ్వరస్మరణ గావించుకొనుచు నానీటిపైఁ దేలియాడుచుఁ గొన్నినిముసములు గడపితిని. ”

“ ఇంతలో నేదియో గోడపైభాగమునుండి దబ్బున నీటఁబడినట్లయ్యెను. నేను మరల నొకసారి అతిసాహసముతో నీఁదుచు నావైపున కేఁగి చూడ నదియొకపగ్గమువలె గోచరించినది. అది పైభాగమునఁ గాలవటకుఁ బోయియుండెను. దానిని గాంచినంతనే నా పంచప్రాణములు తిరిగి యథాస్థానమునకు వచ్చి నాకు పూర్వముకన్న పది

రెట్లధికమగునుత్సాహబలము కొసంగెను. దాని నొకమాఱు జేడ్చి చూడ నారజ్జువు పైభాగమున జెట్టికో భద్రముగఁ గట్టఁబడియున్నట్లు తెలియవచ్చెను. అప్పటినాయానందము నేమని చెప్పుదును! బావా! నీవు వర్ణించి చెప్పఁగలవా? సాధ్యముకాదు సుమా! నేనప్పు డారీతి నాపాశమును నీటఁబడవైచినవా రెవ్వరైయుందు రని తలఁ బైకెత్తి చూచినక్షణముననే యామహాంగళమూర్తి—నాకు బంధమోచనఁ గావించిన జేవిమూర్తి—యీపదునైదుసంవత్సరముల బాలిక—పైభాగమున బుద్దపై నిలుచుండి—చేతి నాడించుచు నాకు హెచ్చరిక నిచ్చుచు—తనవైపున కాపగ్గమును బట్టుకొని రమ్మని చెప్పుచుండెను. నాహృదయ మాద్యంత మపారముగ నజ్ఞాతభావోదయమున సంచలితమైపోయెను. నేనాబాలికామణి నట్టే విలకించుచు "ఈమె యెవ్వరై యుండును? ప్రవాళుఁడు చెప్పిన సుశీల యైయుండునా? ఈమెకు నాయుదంతము నెవరు చెప్పిరి? ఇంతయవ్యాజానురాగ ముద్భవిల్లుటకుఁ గారణమేమి?" అని తలపోయసాగితిని. ఆ సమయమున భువనమోహనరూపిణి యగు మోహినియు, అప్సరస్సుందరి యగు మేనకయు, మదనమనోహారిణియగు రతియు, నాకన్యకావతంసము యొక్క—దర్శనమాత్రమున నాతలఁపున కరుదెంచి రనుటకు లజ్జవొడముచున్నది. అవిచ్ఛిన్నాంధకారమునఁ బూర్ణసుధాకరుఁడు వెలిఁగినట్లుండెను. నేనట్లు చూచుచుండఁగనే యామె నాదృష్టిపథమునుండి దాఁటిపోయెను. ఇఁక నామెను చూడఁ జాలకపోయితిని."

"ఆపగ్గ మతిదృఢతరమై యుండుటచే నేనెంత యీడ్చినను దెగి రాకుండెను. అది నాభారమును వహింపఁగల దని తెలియఁగనే నేనంతఁ దిన్నఁగ దానిసహాయమున మిద్దపై కెక్కఁ-బోఁగలిగితిని. ఒకటి రెండుపర్యాయములు చెమ్మగిలిగియుండుటచే నాయత్నమున జాతి

నీటియందు మరలఁ బయటయుఁ దటస్థించెను. కాని ఎక్కవలసిన దూర మధికముగ నుండలేదు. అందుచే స్వల్పకాలముననే తుద కా త్రాటిసహాయమున నామిద్దెపైభాగమునకు వచ్చి నిలుచుంటిని— మరల నొకమాటు ఒకదినముమీఁదట—నీ విశ్వమంతయు నాకన్నులకు గోచరించినది! ఇది నా ద్వితీయజన్మము !! చచ్చి బ్రతికితిని !!! ”

“ నేనంతఁ బరీక్షించి చూడ నన్ను బంధించియుండినగదికిఁ బ్రక్కను గంగాప్రవాహము లేదు. ఆ యింటిప్రక్కనే మఱియొక సౌధము కలదు. దానికి వెనుకభాగముననే రాత్రి నేదాఁగియుండిన పుష్పవనముండుట. ఆ దుర్మార్గు లాయింటిలోని కంతనీటి నేగతిఁ దేఁగలిగిరని సంశయించి నేనప్పుడు చుట్టును పరికించి చూచితిని. తోడనే యనతిదూరముననే—యనఁగా సౌధమున కానుకొనియే యొకవిశాలమగు నూయి గాన్పించి నాయనుమానమును దొలఁగించినది. అందుండి యేదియో యంత్రసహాయమున నానీటి నట్లు తెచ్చియుందురను కొంటిని. ”

“ పిదప నాకారీతిఁ బ్రాణదాన మొసఁగిన బాలికామణి గాన్పింపలేదు. నేనెంత నిదానించి చూచినను నామెజాడలే నాకుఁ దెలియరావయ్యెను. అంత నామె యా గొప్పమేడలోనికి దిగిపోయి యుండుననుకొని యా ధైర్యసాహసములును — ఆ నిరుపమకరుణాతిరేకమును—ఆ జగన్మోహనాకారమును — మదిలోఁ దలఁచుకొనుచు నట నెంత కాలమైన నిక నుండుట శ్రేయోదాయకము కాదని క్రిందికి దిగివచ్చి యెరికిఁ దెలియరాకుండ నిశ్శబ్దముగ వచ్చి వీధిలోఁ బడితిని. నేనింటి కరుదెంచుసరికి మీరు గాన్పింపలేదు. కుశాలవుఁడు రాత్రి యనుసంధానకార్యముపై మీరు వెడలినట్లు తెలిపెనే కాని మరల నింటికి రానికారణమును దెలుపలేఁడయ్యెను. ఏదోవిధముగ నేను

రాత్రిసంతటిని వేగించివైచి ఉదయమున మీకై నిరీక్షించుచుండ నాకు జానాబజారుతోటలో నొకమానవకళేబరము పడియున్న దనువార్త తెలియవచ్చెను. తోడనే నేనమహావ్యగ్రస్తుఁడనై యచటికి వచ్చి చూచితిని. కాని స్త్రీరూపమున నున్నమిమ్ములను గుర్తిపనేరక పోయితిని. పిదప మీకు తెలివి వచ్చినపిదప నంతయు తెల్లమైపోయెను.”

# ఇరువదిరెండవ ప్రకరణము

మోసము

రామనాథుఁడు తనచరిత్రము నుఁ జెప్పుచుండుకొలఁది రవీంద్రుని విస్మయ మతీతమై పోవుచుండెను. అందుమూలమున కొన్ని రహస్యోదంతములుకూడఁ దెలియవచ్చెను. రామనాథుని గాపాడిన యాబాలికామణి యెవరు? సుశీల కాదుకదా? అయినఁ దాను రాత్రివేళ నా భూతమందిరమునఁ జూచినకన్యక యెవరు? ప్రాయశః ఆమెయే శాంతినాథునిద్వితీయపుత్రిక యగును. ఏలయన దాను వృత్తాంతపత్త్రిక యందు చదివినమేరకు సుశీల కిప్పుడు ఎనిమిది పదివత్సరము లుండునే కాని యధికముగ నుండవు. గతించినబాలికా విషయమున నీ విషయ మనుకూలమగుచున్నది. కాని యాదేవీమూర్తి యగు బాలికచరిత్ర కన్వయింపదు. శాంతినాథునికుమారున కిప్పుడు ద్వాదశవర్షప్రాయము. అట్టియెడ వానిభగినియగుసుశీలకు పదునేడు వత్సరము లుండునా? అసంభవము. రామనాథుఁడు పొరఁబడుట లేదు. అతఁ డాబాలికకు ప్రస్తుతవయస్సును సరిగ చెప్పినాఁడు. కాన నాతఁడుకాంచినబాలిక సుశీల కాదు. రవీంద్రున కావిషయమున గట్టి నమ్మకము పడిపోయెను.

ఎంతప్రళయము! ఒక్కరాత్రియందే — తానొకప్రక్కయందును — రామనాథుఁ డొకదిక్కునందును — ప్రాణాపాయకష్టదశ యందుండిరి. దేవుఁడు వారి కాసమయమునఁ దన యభయహస్తముల నొసంగి మృత్యుముఖమునఁ బడకుండఁ బట్టుకొనెను. లేకున్న

వారిరువురు—నొక్కసమయమున — దుర్మరణముపాలై—యీ జగమున నాము మాత్రావశిష్టులు గావలసినదే కదా ? అట్లు జరిగినది కాదు.

అమల గృహంబున రవీంద్రుఁడు గాంధివపురుమ్రపేత మెవ్వరిది ! రవీంద్రుఁ డావిషయమును యోచించుచుండెను. నడుమనడుమ సోమనాథునిగృహమందుఁ గాన్పించిన బాలికవృత్తాంతము సహితము మానసవీథియందు తరలిపోవుచుండెను. అప్పుడు మఱఁది యిట్లనెను. " బావా ! మీరిప్పు డేమిచేయ నెంచితిరి ? ఈ సందిగ్ధావస్థయం దెట్టి యోచనలును దోఁచకున్నవి. "

రవీం : రామనాథా ! అట్లన్న నెట్లు ? ఇట్టి సమయములందే పత్తేదారుల ప్రతిభ వెల్లడి కావలసినది ఈ దినముగడచిన హంతకులలో నొక్కరును జంద్రనగరమున నుండరని నా యభిప్రాయము. వారెందేని వెడలిపోదురు. తారసింహాక రాళామలలు నేనుమరణించితి నని నిశ్చయించియుండిరి కాని యట్లు జరగదయ్యెను. అది తెలిసికొని యాదురాచారులలో నెవ్వఁడో యొకఁడు రహస్యముగ నేఁటియుదయమున నన్నుఁ దుపాకితో పేల్చి చంపయత్నించెను. అట్లును వారియాశ సఫలము కాలేదు. నేను నిన్నటిదినమున వారిచే విశేషముగ హింసగింపఁ బడితిని. ప్రవాళుఁడు గతించిపోయినపిదప మన కీఁకఁ దెలిసినంతవఱకు. తారసింహాకరాళసోమనాథామలలే అపరాధులని తెలిసినది. నీవు చెప్పిన యుదంతమును విచారించి చూడ నాబాలికను వీరెచ్చటనో యెత్తికొని వచ్చినట్లున్నది. ఆమె సుశీలకాదు. పాప మాపసికందు సహితము తన పినతండ్రిజాడ ననుసరించి పోయినది. కాన నీ ప్రాణదాతయగు నా బాలవిషయమున నేదో విశేష మున్నది. కాని యది యిప్పుడు బోధపడుటలేదు.

రామ : ముందేమి యాలోచించితిరి ? ఇపుడే పోయి వారిని బంధింతురా ?

రవీం : వారి నేకారణమున బంధింతుపు ? అది యంత సమంజసము కాదు. ఇదియుఁ గాక వారు మనకు దొఱకుటెట్లు ? ఎందున్నారని పోదము ? నిన్నటిరేయి యమలగృహంబున జరిగినసంభాషణ నాలకించి చూడ వారెల్లరు నేఁటిరాత్రియే యెందో వెడలిపోవున ట్లున్నది. వారు రాత్రిమూఁడుగంటలకు సరిగ స్టేషనువద్ద కలయుదు రఁట. మనము వారికిఁ దెలియరాకుండ వెన్నంటి పోయి యేయూరి కేఁగుదురో యచ్చట మఱెట్టివిషయములు తెలియవచ్చునో చూచుకొని రావలయును.

రామ : అయిన మన మిరువురము పోదమా ? రాత్రి మూఁడు గంటలకు భరతపురమున కొకబండి బయలుదేఱును. దానియందే బహుశః వారు ప్రయాణమై పోదురు.

రవీం : అవును. అట్లే జరగును. కాని యిపుడు వారి ననుసరించి మనమిద్దఱము వెడలిపోవుటకన్న నొక్కరుఁడు పోవుటే బాగు. నేను భరతపురమునకు వెడలిపోదును. అదేసమయమున నీవిందుండి యా బాలిక యెవరో కనుఁగొనవలయును.

రామ : అవును, ఇదియు మంచియాలోచనయే. నీవొకవైపునను నేనొకవైపునను జాగరూకతతో ప్రవర్తించుచుండిన నిరుతావులందలిగూఢము లతిశీఘ్రముగనే తెలిసిపోవును.

రవీం : అన్నా ! నీవింకను బాలుఁడవు. ఏమాత్ర మశ్రద్ధ వహించినను కార్యములు విఫలము లగును. కావున నిట్టిసమయములం దేగతిఁ బ్రవర్తింపవలయునో బాగుగ యోజించుకొనుము. ఒక్కొక్కతఱి ప్రాణాపాయదశలుకూడ వాటిల్లుచుండును.

రామ : బావా! మీ రావిషయమున చింతింపఁ బనిలేదు. ఇఁకముందు మే మెల్ల కనుగల్గి మెలఁగెదము లెండు. ఒకచోరుని బంధించుటో — లేక యొక ప్రబలంబగు రహస్యము నెఱుంగుటో మీరు మరల వచ్చులోపలఁ గావించి యుందుము చూడుఁడు.

రవీం : భేష్, ఇఁక నాకేమియు భయ ముండదు. రామనాథా! మఱియొక మాట. నీవు నేను మరల వచ్చువఱకు సాధ్యమైన నయముల గృహముపైఁ గూడ నొకకన్నుంచి యుండుము. అచ్చట నేమి జరుగుచుండునో కనుఁగొనవలయును.

రామ : చిత్తము, అట్లే చేసెదను.

ఈలోపల నానందసాగరుఁ డచటికిఁ గూకలిడుచుఁ బరుగిడ వచ్చుటచే వారిసంభాష లాగిపోయెను. ఆతఁడు రోజుచు హాహాకారములఁ జేయుచు వచ్చుచుండెను; మోమున చింతాపవనము వీచి వివృతముగఁ జేసివైచినది. అట్లు వచ్చుచు "అయ్యో! రవీంద్రా! ఇంకేమి గతి! మోసము జరిగిపోయినది." అని యఱచెను. రవీంద్రుఁ డామాట లాలకించి ససంభ్రముఁడై "ఏది మోసమేమైనది! చెప్పుఁడు." అనెను. ఆనందుఁడు రుద్ధకంఠుఁడై కాతరనయనములతో నలుదిక్కులును జూచి "ఏమిచెప్పుదు నండీ. సర్వనాశన మైనది. మాశాంతినాథుని కుమారుఁడగు విశాలుఁడు నిన్నరాత్రినుండి గాన్పింపలేదు. ఎచ్చటి కేఁగెనో తెలియరాకున్నది. ఊరెల్లఁ గలయ వెదకించితిని. ఎందును కనఁబడఁడయ్యెను. అప్పుడే వచ్చి మీకీసమాచారమును దెల్పుదమనుకొనఁగ మీరెవరు నింట నుండలేదు. ఏమి చేయవలయును! వానిని మరల నేమరాత్ము లెత్తుకొనిపోయిరో కదా. ఇంకేది గతి." అని పెద్ద నిట్టూర్పుఁ బుచ్చి డాపుననుండిన యాసనమునఁ గూలఁ బడియెను.

ఈమాటల విన్నతోడనే రవీంద్రునిపై నొకభయంకర ప్రహారము పడినట్లయ్యెను. ఏమిచెప్పుటకును దోఁపకుండెను. “ఆబాలుఁ డపహరింపఁబడె నన్న నాపని నితరులు చేసియుండరు. తారసింహ కరాళులే చేసియుందురు. ఆ నరహంతకు లప్పుడే నిష్కారుణులై సుశీలను సంహరించిరి. ఇఁక నీవిశాలునకుఁగూడ నట్టిస్థితినే గూర్ప నిశ్చయించిరేమో ! ఆహా ! ఎంతటి భయంకరనిరోధము ! ఆ బాలుఁడు పోయిన శాంతినాథుఁడు జీవించుట కల్ల. అది తెలిసిన శ్యామల బ్రతుకదు. అంతయు సర్వనాశన మగును. ఎంతటియనర్థకము లీయానం దునిబుద్ధిలేమిచే జరిగిపోయినవి! దీనిని తప్పించు టెట్లు? ఆపిల్లవాఁ డిపు డెందుండును ?” అని యాతఁడు యోచనాపరవశుఁడై నిలుచుండెను.

ఆనం : అయ్యా ! ఏమియోచించుచుంటిరి ? ఏమిచేతము ? నా యజాగ్రత్తమూలమున నెంతటిప్రమాదము జరిగినదో నాకు తెలియక పోలేదు. ఇఁక నాబాలుఁ డేమగునో తెలియదు. మీరు పడినపాటులను వృథా గావించి మీకపచారమును గావించితిని. మావారి కెగ్గు గావించితిని. నేనేమి చేయుదును ? ఇంకేది దిక్కు !

రవీం : అయ్యా ! ఈగతజలసేతుబంధనముతోఁ బని యేమి ? జరిగిన దేదో యైపోయినది. కాని, యిఁక నాబాలుని మరలఁ గొని వచ్చుటెట్లు ? పూర్వము వాని నపహరించుకొని వచ్చినవారే నేఁడు కూడ నాపనిని గావించినారు. వారిప్డు డెచ్చట నుందురు !

ఆనం : ఏవిధముగనైన మీరీవిషయమున శ్రమ సహించి పాటుపడవలయును.

రవీం : రాత్రి పిల్లవాఁ డెచ్చట నుండెను !

ఆనం : రాత్రి వాఁడు భోజనానంతరము వచ్చి చావడియందు పరుండెను. మేము లోపల భోజనము చేయుచుంటిమి. అదివఱకే వాఁ డన్నముతిని యుండుటచే మేమెంత పిలిచినను రాకపోయెను,

ఎప్పుడు వాఁడు మరల వీథియరుగును చేరెనో మాకు తెలియదు. కాని, తొమ్మిదిగంటలప్పుడు పిల్లవాఁ డచట నుండుటను నేఁజూచితి నని మా సేవకుఁడు చెప్పెను. వాఁడప్పుడే తనయింటికి వెడలిపోయె నఁట. మేము మరల వచ్చి చూచుసరికి బాలుఁ డచట కనఁబడ లేదు. ఎంత పిలిచినను రాఁడయ్యెను, ఎచ్చటను గాన్పింపలేదు. పొరుగిండ్లకుఁ బోవువాఁడును కాఁడు. ఎచ్చట నున్నాఁడో తెలియకున్నది.

రవీం ; అయ్యా! ఈయనర్థకమున కేనేమందును? నిన్నటినుండి మేమాహంతకులఁ బట్టఁబోయి యనేకకష్టము లొంది వచ్చితిమి. కార్యము లత్యంతసందిగ్ధములై భయము కలిగించుచున్నవి. అంతలో నిచట నీయుట్టిపాటొకటి సంభవించినది కదా! ఏమి చేతము?

ఆనం : మీరు నిన్నటిరాత్రి యంతయు నెందేఁగి యుంటిరి?

రవీంద్రుఁడు సూక్ష్మముగఁ దనవిషయములను రామనాథుని చరిత్రమును దెలిపెను. అది విని యానందుఁ డాశ్చర్యచకితుండై పోయెను. ఇప్పుడు బాలకునివిషయమై రవీంద్రున కేమియుఁ దోఁప కుండెను. వానిని మరలఁ గొనివచ్చు టెట్లు? తన కార్యవృత్తమున కొక్క సారిగ నగ్నిప్రయోగ మైనది. అది యట్లనే యట్లనే దగ్ధమైపోయిన గతి యేమి? దానిని జల్లార్చుట యగునా? అప్పటి కాతఁడు మఱేమియు మాటాడక "కానిండు. ఇప్పు డప్పుడే కొంపమునిఁగిన దేమియు లేదు. ప్రయత్నింతము. వాఁ డెందున్నను మాకన్నులఁ బడక సురిగి పోనేరఁడు" అనెను. తుద కానందుఁ డాగృహమును వీడిపోవుచు "అయ్యా! మావిషయమై మీరొందుశ్రమలఁ జూడ మాకే జాలి వొడముచున్నది. ఇంతటి పట్టుదలతోఁ బనిచేయఁజాలిన పత్తేదారుల నిదివఱకుఁ గాంచియుండ లేదు. మేము మీ కెంతయుఁ గృతజ్ఞులము" అని చెప్పుచు భోజనార్థమై వారినిఁగూడఁ దోడ్కొని వెడలిపోయెను.

# ఇరువదిమూఁడవ ప్రకరణము

## సుందరి

నిన్నటిదినమునుండి రవీంద్రుఁడు చేయుచుండిన కార్యములలోఁ గొన్ని భయంకరముగఁ బరిణమించెను. వీఁడుగ నాతఁడు మఱఁదితో నెన్నియో కష్టములకు గుఱి కావలసివచ్చెను. ఇఁక ముందైన నతిజాగరూకతతో నుండి విశృంఖలత నొందినకార్యజాలములను సరిపెట్టవలయునని తుద కాతఁడు స్థిరసంకల్పమును గావించుకొనెను. రాత్రి భోజనానంతర మాతఁడు రామనాథుని రావించి యిట్లు చెప్పెను. "రామనాథా! నేనిప్పుడు ఛద్మవేషముతో హంతకుల ననుసరించి చంద్రనగరమును వదలి పోదును. నేనెచ్చటి కేగుదునో మఱల నెప్పుడు రాఁగలుగుదునో యిపుడు చెప్పఁజాలను. అంతలో నేమరక నీవు నీ చెప్పినకార్యముల నీ కుశాలవుని సాహాయ్యముతో సాధింపవలయును. బాల్యచాపల్యమునఁ గష్టములపాలు గాకుము. నేఁబోయివచ్చెద, హెచ్చరికసుమా!" అనుచు మఱఁదిని మఱలమఱల ప్రబోధించుచు రవీంద్రుఁ డామందిరమును వీడి వెడలిపోయెను.

రామనాథునకు స్వశక్తిసామర్థ్యములందు గట్టినమ్మకముకలదు. స్వల్పవయస్కుఁడైనను నతినిపుణస్వభావుఁడు—సాహసవంతుఁడు—వయసునకుమీరిన బలయుతుఁడు. యోచన లద్వితీయముగఁ బరిణమించుచుండును. నేఁడు రవీంద్రుఁ డాతనినొంటిగ వదలి తాను వేఱొక కార్యముపై వెడలిపోయెను. తన కాతఁడు నిర్ణయించిపోయినకార్యములు!

సామాన్యములా? ఒకటి—సోమనాథుని సౌధోపరివాసిని యగు బాలిక యెవరో కనుఁగొనుట—రెండు అమలగృహంబును గాంచి యుంచుట. రెండును రామనాథునివంటి వానికిఁ గష్టతరకార్యములే. అయినను నాతఁడు బావమూలఁ దనయుక్తిను దెలిపికొనఁడయ్యెను. మనఃపూర్వకముగ నాకార్యభారముల మీఁద వైచుకొనెను. వానిని సాధింపఁజాలినధీరత లేకున్న నాతఁ డందుల కంగీకరించునా?

రాత్రి తొమ్మిదిగంటలు కొట్టి పదినిముసములు దాఁటిపోయినవి. ఇంకను చీఁకటిరాత్రులు పోయి వెన్నెలరాత్రులు రాలేదు. పురములో నందందు గాఢాంధకారదేవత నిలుచుండి తనున్న దూరముగఁ దోసిన దీపములను దూషించుచుండెను. నేఁటివలె నాఁడు చంద్రనగరమున విద్యుద్దీపికాయంత్రములు పనిచేయుచుండలేదు. వీథులందు కిరోసెను దీపములు మాత్రము వెలుఁగుచునుండెను. అవియైనను చాలకాల ముండక గాలిచే కొన్ని, కొంటెపిల్లలచేఁ గొన్ని, వెలిఁగింపఁబడక కొన్ని శాంతించియుండెను. చిన్నచిన్నవీథులం దవియు నభావములే. చాలమట్టుకు చీఁకటిపడినతరువాత వీథులందు జనసమ్మర్దము తక్కువ.

రామనాథునకు నిదుర రాకుండెను. అప్పుడాతఁడు వెలుపల నరుగుపైఁ బరుండియున్న కుశాలవుని బిలిచెను. కుశాలవుఁడు రవీంద్రునియింటఁ జిరకాలమునుండి పనిచేయుచుండినబంటు. వాఁడు తనస్వామికి దగినసేవకుఁడని యూరివారెల్లరుఁ జెప్పుకొనుచుండుట కలదు. వానివయస్సు సుమారు ముప్పదియేఁడులుండును. మిగుల బలకాయుఁడు. అతిచతురుఁడు. రవీంద్రుఁడు తానెందుబోయినను తన సేవకుని వెంటఁగొనిపోవుచుండును. వాఁడు తనవెంటనుండుట రెండవ రవీంద్రుఁడు బాసటగ నున్నట్లే యని యాతనిభావము. కాన సాధారణ ముగ యజమానులకు సేవకులపై నుండునట్టి హీనభావము

పత్తేదారునకు లేదు. కుశాలవుని చాలనాదరించుచుండెను. వాఁడును ప్రభుభక్తిపరాయణుఁడే!

తన్నారీతి రామనాథుఁడు పిలువఁగనే కుశాలవుఁడు దిగ్గున లేచి లోపలికిఁ బోయి యొకచోఁ గూర్చుండెను. అప్పుడు రామనాథుఁడు వానిని గాంచి "కుశాలవా! నిద్దురపోవుచుంటివా?" యనెను.

కుశా : బాబూ! ఇంతశీఘ్రముగనే నిద్దురయా? ఊరక వెలకిలఁ బరుండి కలకత్తావిషయమై యోజించుచుంటిని.

రామ : కలకత్తావిషయ మేమి? నీవూరికి త్వరగ వెడలిపోవలయు నని తలంచుచుంటివా?

కుశా : లేదు. నాకూరికిఁ బోవలయు నను కుతుకము లేదు కాని మనయింటివారివిషయమై యొకమాఱు జ్ఞాపకపఱచుకొని యక్కడి విషయములను దలఁచుకొంటిని.

రామ : మన మిప్పుడే యూరికిఁ బోవునట్లు లేదు. ఇంకను చాలకాలము పట్టును. కారణముల కింతలో స్వస్తిఁజెప్పఁజాలము.

కుశా : నేఁడు పెద్దబాబయ్యగారు రెండో వెడలిపోవుచు "కుశాలవా! రామనాథబాబు బొక్కఁడే యింట నున్నాను. నీవు జాగరూకతతో నాతనిని గాచియుండుము" అని చెప్పిరి. అయ్యా! వారుపోయిన దెప్పటికి!

రామ : కుశాలవా! ఒకతావని చెప్పు టెట్లు? ఇట్టిభయంకర కార్యభారముల వహించినపిదప నూరక తిరిగి పలువిధకష్టముల కోర్చి సాహసించి పని చేసినఁగాని కార్యసాఫల్యము కాదుకదా! ఊరక యొకచోఁ గూర్చున్న నెట్లు!

కుశా : అయిన మీరొక్కరే యిందేమి చేయుదురు! బావగారి ననుసరించి పోఁగూడదా యేమి! నేనును వచ్చుచుంటినే.

రామ : నేనిచట నాలేఁడు వేఱొకచోట పనులు గావింపవలసి యున్నది. ఈయొకటిరెండుదినములలో సాధింపవలసినకార్యములు రెండుండుటచే నేనిందే నిలువవలసివచ్చినది.

అని వానితో సర్వవిషయములను జెప్పి "కుశాలవా! నేనీ రాత్రి యూరిలోని కేఁగి యేకోనొకరహస్యమును గనిపెట్ట నెంచినాను. నీవును నావెంట వచ్చి నేనందందు చెప్పినట్లు చేయుచుండవలయును. మనగుట్టు నొకరు నరయరాదు. మనకు వేళ మీఱుచున్నది. త్వరగ బయలుదేఱి పోదము లెమ్ము" అనెను. అందు కాసేవకచంద్రుఁడానందించి "అయ్యా! మీరెట్లుచెప్పిన నట్లు చేసెదను. అందందు నా నిజ ప్రతిభను సహిత మగపఱచుచు నీకుశాలవునిశక్తిని మీ కెఱిఁగింతును రండు. నా సంగతి మీకు బాగుగనే తెలియునుకదా! ఇఁక నేఁజెప్ప లేమి?" అని చెప్పుచు నాటనుండి లేచెను. రామనాథుఁడు వాని మూఁపుపైఁ జేయి వైచి తట్టుచు "కుశాలవా! నీసంగతులు నాకు విదితమ్ములై యున్నవిలెమ్ము. అందుకే యీ దినమున నీసాయమును గోరితిని" అనుచుఁ దానును లేచెను.

రాత్రి తొమ్మిదిగంటలవేళ జానాబజారుతోఁటలో నిరువురు వ్యక్తులు నిలుచుండి యుండిరి. అందులో నొకరు నవలావణ్యసురూప సుందరమోహిని యగుసుందరి. ఆమెవయస్సు సుమా రిరువదియేండ్లై యుండును. బాహువులందలి పయిడికంకణము లచ్చటిదీపకాంతుల యందు మెఱసిపోవుచుండె. ఆముగ్ధమోహన ముఖమండలమునుండి ముద్దులొలుకుచున్నవి. రెండవవ్యక్తి యొకపురుషుఁడు. అఱువదివత్సరములవానివలెఁ గన్పట్టుచు వృద్ధాప్యముచే కాఁబోలును గనులకు సులోచనములఁ దగిలించుకొని యున్నాఁడు. వేషభాషలనుబట్టిచూడ నించుక యనాగరికునివోలె నుండును. ఆ సుందరి చిన్న మందసము

నొకదానిని తలపై నిడుకొని వాఁడా మెపార్శ్వముననే నిలుచుండి యుండెను. వారి ప్రస్తుతస్థితిని బరిశీలించి చూడ వారొకనూతనపురమున కరుదెంచి యుండెందేగుటకును నోఁపనివారివలెఁ గన్పట్టుచుండిరి. సుందరి తన విశాలచంచలవీక్షణములను నలుదెసలకుఁ బఱపి "మార్గ మేదియో తెలియుకున్నదే" యనెను. వృద్ధుఁ డంతట చిన్నగ దగ్గుచు "ఏదో యొకత్రోవ ననుసరింపుఁడు, ఊరక నిలుచున్న నేమి ప్రయోజనము!" అనెను. ఇంతలో సుందరి కేదియో జ్ఞప్తికి వచ్చినది కాఁబోలు. తన సేవకుని రమ్మని పిలుచుకొని తూర్పుముఖముగ నడువసాగెను.

సుందరి—కృతకసుందరి! రామనాథుఁడు నేఁడారూపునఁ దన యనుసంధానకార్యమునకై బయలుదేఱెను. ఆతని కనువుకానికై సేతలు లేవు—ఒప్పని వేషము లేదు. సహజమోహనాకారుఁ డగునాతనికి నేఁడు సుందరీరూప మతిసుందరముగ నొప్పియుండెను. ఒరు లణుమాత్రమైన శంకింప నేరరు ఇఁక నా సేవకుఁ డగుముసలివాఁడు—మన కుశాలవ్రుఁడే. తన వేషమును కనువర్తనముగ ప్రవృత్తుఁ డగుచుం డెను. వారిరువురు నిప్పుడు శ్రీమతివీథియందు నడచుచుండిరి. రామనాథున కిది క్రొత్తస్థలము కాదు. ఇదివఱకప్పుడే రెండుమాఱు లాబజారునఁ దిరుగాడియుండెను. సుందరీరూపధారి యగు రామనాథుని మన మిఁకముందు సుందరి యనియే పిలుచుచుందము.

# ఇరువదినాల్గవ ప్రకరణము

పుష్పలావికుఁడు

శ్రీమతివీథిచివరయుం దొక గొప్పపురాతనసౌధము గలదు. దాని సన్నిహితప్రదేశమునందు కూడ నెన్నియో జీర్ణభవనములు కలవు. ఆ శిథిలగృహసముదాయ మధ్యమున నా సుందరహర్మ్య మెంతో మోహనమై విరాజిల్లుచుండును. దాని కానుకొని చిరకాలమునుండి యా గృహమేధిచే పోషింపఁబడుచున్న యొక పూఁదోటయును గలదు. అచిరకాలముక్రిందనే యా మందిరనివాసి యగు పెద్దమనుష్యుఁ డచటికివచ్చి చేరెను. అతఁడు దూరదేశములనుండి పలువిధములగు పూలమొక్కలను దెప్పించువానిచే వ్యాపారమును సాగించెను. మిగులనమ్మకముగల వాఁడై యూరిలోని పెద్దమనుష్యుల కనేకులకు పుష్పముల నమ్ముచు మంచిపేరును గడించి యుండెను. ఊరిలో విశేషపుష్పావశ్యకము గల వారెల్ల మనపుష్పలావికునికడ కరుదెంచి బేరమాడుచుందురు. అతఁ డచటికి వచ్చిన నాఁటినుండి యీ యుద్యోగమున దిగి పిన్నపెద్దలనక యందఱియెదుట నొకటే విధముగ వ్యాపారమును జేయుచువచ్చెను. అతనిపేరు సోమనాథదాసు. మా పాఠకుల కీసోమనాథుఁడు—ఈ ప్రదేశములు క్రొత్తలు గావు.

సోమనాథుఁ డీపనియందు కొంతధనము నార్జించెను. చంద్ర నగరమున నీతని నందఱు నెఱుంగుదురు. అయిన నాతఁడతిహేయమగు దుర్వ్యసనములకుఁ బట్టువడుకొలఁది పలువుర కసహ్యకరుఁడై పోయెను

అయిననేమి? ఆతని న్యాయముగుప్రవృత్తి వ్యాపారవిషయ మాకళంకముల నన్నిటిని మూసి యుంచుచుండెను. క్రమక్రమముగ నీతనికి దుర్మార్గుల సహవాస మబ్బుటచే నట్టివారు పలువురా యింటికి వచ్చుచుఁ బోవుచు నుండిరి. కాని, వారిమూలమున సోమనాథునిసంపదల కేమియు నష్టము కలుగలేదు. వారి కాతఁ డొకకాసైన నియ్యకుండెను. నిక్కమున కాతఁ డతిలోభి—మహాకాపీనితుఁడై—ధనార్జనకై యొక్కొక్కసమయమున నెంతటిగర్హితకార్యమునకైన సాహసించును. భూలోకద్రవ్యము తనయింట నున్నను "నాకొకకాసైనలే" దనువాఁడు. చిత్రప్రపంచమున నిట్టి చిత్రజంతువు లెన్నియో కలవు.

నాఁటినిశీథమున సోమనాథుఁడు భోజనానంతర మొకపత్రికను చేత పట్టుకొని సౌధోపరిభాగమున నటునిటుఁ దిరుగుచు నేమియో యోజించుకొనుచుండెను. ఒకమూల నొకకాచపాత్రమున దీపము మినుకు మినుకు మని వెలుఁగుచుండెను. అప్పు డాతఁడు క్రింద నెవరో తన్నుఁ బిలుచుచుండుటచే బిరబిర మెట్లు దిగి వచ్చి చూచెను. వెలుపల ముంగిటియందు మనసుందరియు నామెపరిచారకుఁడును నిలుచుండియుండిరి. అప్పు డామె యాపూలవర్తకునిఁ గాంచి "అయ్యా సోమనాథదాసుగారి ప్రాంతములో నెచటండి? ఆతఁ డొకసుమవిక్రయుఁడఁట" అనెను.

సోమ : నీదేయూరు? ఆతనితో నీకేమిపని?

సుంద : నాది భరతపురమండి. ఈనాఁటిసాయంకాలము బండిపై నీయూరి కేతెంచితిని. సోమనాథదాసుగారు మీరైనఁ జెప్పుఁడు, ఆతనితో నాకించుక పని యున్నది.

సోమ : నీపేరేమి?

సుంద : నాపేరు సుందరి యందురు. నేనొకపణ్యాంగనను.

సోమనాథుఁ డామాటలు విని కేమియో యోజించుకొనుచుఁ గొంతకాలమును గడపె . . తుదకింటిలోనికిఁ బోయి కొన్నినిముసములు దాఁటినపిదప మగల వెలుపలికి వచ్చి యాయాగంతుకుల నిరువురను లోపలికిఁ గొనిపోయి యొకచోటఁ గూర్చుండఁబెట్టెను. అంత వారి కీవిధముగ సంభాషణ ప్రారంభించిరి.

సుంద : అయ్యా ! సోమనాథదాసుగారు మీరేనా ?

సోమ : అవును. నేనే సూతఁడు. నీవు భరతపురమునుండి యెచ్చటికి పోవుచున్నావు ?

సుంద : నేనిపుడు దక్షిణదేశమున కేఁగి రామేశ్వరయాత్రను గడపిరాను బోవుచుంటిని.

సోమ : అది యుండనీ, నాతో నేమియో పని యున్నదంటివే, అదియేమి ? నిన్ను నేనెక్కడను చూచియుండలేదు. నీవెట్టిసమాచారమును దెచ్చియుంటివో చెప్పుము.

సుందరి యటునిటు చూచి “ ఇచట పరు లెవ్వరును లేరుకదా ! ఒకమాఱు పోయి తలుపులను మూసి రమ్ము ” అనెను. సోమనాథుఁడు తిన్నగఁ బోయి వెలుపలితలుపులు బంధించి వచ్చి సుందరీ ! చెప్పుము. ఇచట నెవ్వరు లేరు. ఏమియుదంతమో చెప్పుము ” అనుచు నొకచోఁ గూర్చుండెను. అప్పు డాకృతికస్త్రీ తనపెట్టెయందుండిన యొకలేఖోటా కాగితమును దీసి యాతని కొసఁగెను. అతఁ డాతురతతో విప్పి దీపపు వెలుఁగున నీరీతి చదువుకొనెను.

“ అయ్యా ! మీకు నా పరిచయము లేకున్నను నాకు మీ పరిచయము కొంత గలదు. మీరొకమాఱు మాయూరి కరుదెంచి నా భర్తయగు శాంతినాథునితో మాటాడుచున్నపుడు మిమ్ముఁ గాంచి

యుంటిని. మీరప్పుడు నన్నుఁ జూడలేదు కాఁబోలు. మీరు వెడలి పోయిన పిదప నా భర్త మీ యుదంతము నంతటిని నాకెఱింగించెను. ఇఁక దాఁపనేల! నాఁటినుండి మీపై మనసు కలిగి యున్నదానను. మీ ముఖారవిందమును గాంచిననాఁటినుండి నేను సరిగ నన్నపానీయంబుల ముట్టక దినమొక యుగముగఁ గడపుచున్నాను. నా నాఁటికి మీపై వాళి యతిశయించుటచే నిద్రాహారములు లేక సన్నగిలిపోవుచుంటిని. అది గాంచి నా ముసలిమగఁడు నేనేదియోరోగమువల్ల బాధపడుచుంటినని తలఁచి చింతించి నాకు వైద్యులచే నౌషధ మిప్పింపఁ గడఁగెను. ఏమిచేయుదును? నా కప్పటి కిరువురుబిడ్డలు కలుగుట చేతను, లోకాపవాదమునకు వెఱచియు, నేను సాహసించి మీయొద్దకు రాఁజాలకుంటిని. కాని నా యదృష్టవశమున నా యిరువురుపిల్లల నెవరో చోరు లపహరించుకొనిపోయిరి. నేఁటివఱకు వారు గానిపింప కున్నారు. దానికి నేను చింతింపను. వారు పోయినరాత్రియే మఱియొక యానందవిషయము జరిగినది. నా భర్తను సహితము దొంగ లెత్తుకొని పోయిరి. నేనిపుడింట నుండున దొకతనే. ఆ ముదుసలి విశేషముగఁ గష్టించి దండిగ రొక్కము నార్జించి యున్నాఁడు. వాఁడు పోయినపిదప నా కుండినశ్రమలెల్ల వీడినట్లైనది. నేనప్పటినుండి స్వతంత్రురాలనై నా గృహకృత్యములను నేనే నిర్వహించుకొనఁగడంగితిని. ప్రథమమున నా బంధువులట్లు కానరాక పోయినందులకుఁ గొంత దుఃఖించితి ననునది యంతయుఁ గపటశోకమే. అయ్యా! నా బోఁటితరుణీవతంసము నొక చచ్చుముదిగొడ్డున కంటఁగట్టిన మిముబోఁటి తరుణసుందరులఁ గాంచి నేనెట్లోర్చియూరకుందును! నా కుండునను రాగము దినదినాభివృద్ధి నొంది నన్ను మిగుల బాధించుచున్నది. మీరు మరల నొకమాఱీ దేశమునకు వత్తురేమో యని వేచియుంటిని కాని యట్లు జరిగినది కాదు.

నేను విసిగి పరితపించుచుంటి నిన్నటిదినమునఁ జంద్రనగరపువారు కొందఱు మా యింటికి రాఁగ వారితో మీ విషయమై కొంత ముచ్చటించితిని. అందున నాకు మీ విషయము సానోసందికంబుగఁ దెలియవచ్చెను. నేనిఁక తాళి యుండనేరనైతిని. నా మానస మూరక ప్రేరేపించుటచే తుద కీలేఖను లిఖించి రామేశ్వరయాత్రకు బయలుదేఱి పోవుచుండిన యీ సుందరిచే దీనిని బంప సాహసించితిని. ఇందుకు నన్ను క్షమింతురు గాక. ఈ సుందరి విటురాలు. నా భర్త పోయిననాఁటినుండి యిది నా యొద్ద ప్రాణసమానురాలుగ మెలఁగుచున్నది. మిగుల నమ్మకము గలది. కావలయునన్నఁ బ్రాణములను వెచ్చించునది. దీనికి నా యుదంత మంతయు బాగుగఁ దెలియును. ఇఁక నేను హెచ్చుగ వ్రాయనేరను. ప్రియా! సోమనాథా! నీవు తత్క్షణమె యరుదెంచి నన్నుఁ గావకున్న నే జీవింపను. నీ నవమోహనాకారమును గాంచక యొకనిముసమైనఁ దాళఁజాల. ఈ దాసి నేలుకొనుట మీ భారము. మీకు భార్యాపుత్త్రు లుందురని తెలిసియు నేనిట్లు వ్రాయఁగడంగితిని. ఇది నాకు మీ యెడనుండు నమూల్యప్రేమ కాని యన్యము కాదు. మీరు వచ్చినపిదప నా యాస్తి నంతటిని గైకొని యెందేని మన కనువగుస్థలమునకు వెడలి పోదము. స్త్రీనై యుండియు నిట్లు సాహసించి వ్రాసినందులకు మఱి యొకమారు క్షమాపణ వేఁడికొందును.

"మఱియొకమాట. ఈ సుందరి నేఁడు దక్షిణదేశయాత్రకు వెడలుచున్నది. చంద్రనగరము దీనికిఁ గ్రొత్తతావు. అచ్చట తగిన స్థలము దొరకకున్న మిగుల శ్రమనొందునని తలఁచి దీనిని లేఖతోడుగ మీ యొద్ద కనిపితిని. ఈ దాసి నాదరించినట్లే యీ సుందరినికూడ నాదరింప నెంతయుఁ బ్రార్థితులు. త్వరలో నిది రామేశ్వరమునుండి మగిడి స్వదేశమునకు వచ్చును. అప్పుడు మన కెంతయు బాసటగ

నుండుననుటకు సందియము లేదు. విశేషము లింకను దీనిమూలమున తెలియఁగలవు. ”

భరతపురము,
మార్గశిర శుద్ధ ౧౦
జయవారము.

ఇట్లు
మీ ప్రేమస్వరూపిణి,
శ్యామల.

ఈలేఖను జదివి ముగించుసరికి సోమనాథుఁ డత్యంతాశ్చర్య నిమగ్నుఁడై తనలో “ ఏమియీవింత! శ్యామల! ఎవరీమె నేనెన్నఁడును గాంచియుండలేదే? ఈమె భరతపురపు శాంతినాథునిభార్యయఁట ! ఆ శ్యామలాంబయా ! ఆహా ! నాకేమియుఁ దోఁచకున్నది. శ్యామల నన్నుఁ బ్రేమించుచున్నదా! ఔరా! ఏమి యీమానందాశ్చర్యములు!” అనుకొనుచుఁ గొంతసే పేమిచేయుటకును దోఁపక నిశ్చేష్టితుఁడై కూర్చుండెను. ఆతనిమానసలోకమునం దాతఱి ననిర్వచనీయభావ స్ఫూర్తి కలిగినది. ఒక్కసారిగ నీ బాహ్యప్రపంచమును వీడి యాతఁడు తన భావనాప్రపంచమునఁ బడి యందు దిక్కులు తెలియక చిందులు ద్రొక్క మొదలిడెను. తనప్రేమలనుండిన సుందరిని ఆమెమనుష్యుని మఱచిపోయెను. దాను రామనాథునికృత్రిమలేఖ కొక్కమాఱుగ [illegible]ంచింపఁబడి నట్లుండెను. పత్తేదారిట్లగుననియే తలంచి ఇంతధైర్యముతో [illegible]వ్వలావికునికన్నులయందు మట్టిని జిమ్మెను. సోమనాథునకుఁ [illegible]లు గానరాకుండఁబోయినవి. అతఁడు తలఁచినదే ప్రపంచము—[illegible]చినదే మార్గము—తానెంచినదే యుక్తమని యూహింప మొద[illegible]ను. ఎంత సేపటివఱకు దానారీతి యోచనాపరవశుఁడై యుండెనో [illegible]నునకు తెలియలేదు. ఇంతలో సుందరి చల్లనిమృదుహస్తస్పర్శచే [illegible]తఁ డూహాలోకమును వీడి బాహ్యలోకమున కన్నులఁ దెఱచెను. [illegible] డావనిత యాతని గాంచి “ ఏమి యోజించుచున్నారు? ” అనెను.

అతఁడేమియుఁ జెప్పనేరఁడయ్యెను. తన యోచనామార్గమెద్దియో తనకే తెలియుటలేదు. అంతలో నాతఁడించుక తెలివొంది మనకుశాలవునిఁ గాంచి "ఓరీ, నీవు వెలుపల నుండియుండుము. నీ యజమానురాలితో కొంత మాటాడవలయును" అనెను. వాఁడంత దగ్గుచు చిన్నకంఠముతో "అయ్యా! నాపేరు కాష్ఠకుఁడు. నాకు సుమారిరువదియేండ్లున్నవి" యనెను. సోమనాథుఁడది విని యించుక కోపముతో "పందా! వెలుపల పండుకొనఁబొమ్మన నేమేమియో కూసెదవుగదరా!" యని గద్దించెను. అందుకు వాఁడు మరల "నాదియును భరతపురమే జియ్యా! నే నమ్మవారింట్లో సేవకుఁడను" అని చెప్పుచు దగ్గ నారంభించెను. సుందరి యది గాంచి నవ్వుచు దానుతో "అయ్యా! మీరు నిజే నేదియో స్వేచ్ఛగ మాటాడవచ్చును. భయములేదు. వానికి చెవుడు. మనము మాటాడుమాటలలో నొక్కటి వానికి విన లేదు" అని చెప్పి కుశాలవునిఁ గాంచి యింటికప్పు విఱుగునట్లు "కాష్ఠకా! ఆమూలఁ బరుండఁబొమ్మ" అని చెప్పెను. తోడనే వాఁడ[illegible] దుండి లేచి పోయి చేరువమూలలో నిండుగ ముసుగుంచుకొని పరుండెను. సోమనాథుఁడాబధిరుని గాంచి పకాపక నవ్వుచు సుందరిని గాంచి "వీఁడెక్కడ నీకు దాపురమాయెను? వీనితో నీవెట్లు యాత్రల గడపివత్తువు సుందరీ?" యనెను. అందు కామె "నాకేమి భయము లేదండి. వీఁడు చిరకాలమునుండి మాయింట నుండువాఁడని తోడ్తెచ్చితినే కాని వానివల్ల నెట్టిసహాయము చేయుటకు సాధ్యము కాదు. నేను దేశములఁ దిరిగిన ప్రోడను. వీనిసాయము నాకంతగ నవసరముండదు లెండు" అనెను. దాసు నవ్వుచు "భోగమువారికి క్రొత్తతావు లెందుండి వచ్చును లే. వారికిఁ బ్రపంచమంతయును బరిచితగృహమే" అనుచు నెకసెక్కెములాడఁగఁదొడంగెను.

తన చంచల విశాలనేత్రకంజములనుండి తేజఃప్రకాశితంబులగు వీక్షణముల నాతనిపైఁ బ్రసరింపఁజేసెను. సోమనాథుఁ డంతులకు సంపూర్ణముగఁ గట్టువడిపోయెను. సుందరి మరల నిట్లనెను. "ఏమండి దాసుగారు! విశేషముగ యోజించుచుంటిరే? కాగితమునందలి విశేషము లెవ్వి?"

సోమ : సుందరీ! నీవు మిగుల చతురమతిగఁ గన్పట్టుచున్నావే. నా నోటనుండియే నీ మానసమునందలి విషయములను వినఁగోరుచున్నావు. నీ కులగుణములు నీ చూపులందే విశద మగుచున్నవి.

సుందరి మాటాడ లేదు—మరల నొకమాఱాతరళచంచలవీక్షణ [illegible]ర్శనము—సోమనాథుఁ డంతులకు మఱింత మోహపడిపోయెను.

[illegible] ఆతఁ డింకను దాపునకువచ్చి కూర్చుండి "నిజమును చెప్పుము. [illegible]ందలి విషయములు నీకుఁ దెలియవా?" యనెను.

[illegible]ంద : (నగుచు) నేనాకాగితమును చదువలేదు. దానికి [illegible]టా వ్రైవఁబడియుండెను కాదా?

సోమ : అయిన నేమి? తనలో నీ విషయములు నీకుఁగూడఁ దెలియువని కాగితము నాతో చెప్పినది.

సుంద : ఏడీ. నేవినలేదే. అది యబద్ధమును జెప్పియుండవచ్చును.

సోమ : అది నా చెవిలో రహస్యముగఁ జెప్పినది. నీకీయంశములు తెలిసినమాట నిజమేఁటు.

సుంద : అయ్యో! వన్నేల బాధింతురు? నాకావిషయము లొక్కటియును దెలియవు.

సోమనాథుఁడు సుందరిహస్తమును బట్టుకొని "రమ్ము. మేడమీఁదికి రమ్ము. నీకన్నివిషయములను జెప్పివైతును." అనుచు రామనాథుని బిలుచుకొని మెట్లెక్కి మేడపైకి వెడలిపోయెను అచ్చట

దాసు తానొకయాసనముపైఁ గూర్చుండి ప్రక్కయందే కుహనా సుందరి నుంచుకొని యిట్లు పలుకసాగెను.

సోమ : సుందరీ! భరతపురమున నీవాసస్థాన మెక్కడ? నీకు బందుగు లెవ్వరును లేరా?

సుంద : నేను భరతపురమున శాంతినాథుని యింటిసమీపము ననే యొకముద్దె నద్దెకుఁ దీసికొని యచట కాపురము సేయుచుంటిని. కాని యాతనిఁ జోరు లెత్తుకొనిపోయినదాదిగ నాతనిభార్య యగు శ్యామలాంబ బలాత్కారముచే నామె యింటియందే కాపుర మున్నాను. నాకు బంధువు లెవ్వరును లేరు. ఒకటిద్దఱున్నను వారిని నావారని చెప్పుటకే సిగ్గగుచున్నది.

సోమ : అది పోనిమ్ము. అయిన నీవు శాంతినాథుని నెఱుంగుదువా?

సుంద : ఎఱుఁగ కేమండి. చిన్ననాఁటినుండి వారియింటికి వచ్చుచుఁ బోవుచునే యుంటిని. ఆదినుండి మా తల్లికిని, శాంతినాథు నకు నెంతయో స్నేహము.

సోమ : (నగుచు) నీవింకను నెవరితోడను స్నేహమును గుదుర్చుకొనలేదా, సుందరీ!

సుందరి మాటాడక తలవంచుకొనెను. దాసా మెపైఁ జేయివైచి తట్టుచు "అది పోనిమ్ము. మఱియొకమాట. శాంతినాథుని భార్యను నీవెఱుఁగుదువా?" అనెను.

సుంద : అయ్యా! శ్యామలాంబనే నే నెఱుఁగకుండఁ బోవలయునా? నేననేటి కండి. ఆ భూలోకరంభ జగమునకే యెఱుకయై యుండుననుకొందును.

సోమ : నీకన్న నామె సుందరియా!

సుంద : నేనామెయొద్ద సేవకురాలనై యుండ నిక నారూప మామెయుందలి సెంతవఱకు శోభించునో మీరే యూహించుకొనుఁడు.

సోమ : అదియుఁ బోనిమ్ము. ఈలేఖను నీకెవ రిచ్చిరి ?

సుంద : మా యజమానురాలు శ్యామల.

సోమ : దీని నెవరి కిమ్మన్నది ? నీవు పొరఁబడి నాకియ్యలేదు గదా ?

సుంద : చంద్రనగరమందు శ్రీమతివీధియందు పూలవర్తకుఁడగు సోమనాథదాసుగారి కిమ్మన్నది. మీరే వారైన నేను పొరఁబడలేదు.

సోమ : దీని నెందు కిచ్చినది ?

సుంద : కాగితమునందే కారణము నిరూపింపఁబడి యుండ కదా ?

సోమ : నేనావిషయముల నమ్ము టెట్లు ?

సుంద : అయ్యా ! ఈ ప్రశ్నకే నెట్లుత్తర మొసంగుదును ! అందలి విషయము లన్నిటిని నిరూపింప నేనుంటిని కదా ?

సోమ : శ్యామలకు నాపైఁ బ్రేమయఁట.

సుంద : ఆ విషయము మీకన్న ముందు నాకుఁ దెలిసినది.

సోమ : ఆమె నన్నచ్చటికి రమ్మన్నది.

సుంద : ఆ విషయము నాకుఁగూడఁ జెప్పినది.

సోమ : ఏమని ?

సుంద : సోమనాథదాసుగారిని దక్షిణమే భరతపురమునకుఁ బ్రయాణము చేయించి నీవు రామేశ్వరమునకుఁ బొమ్మని చెప్పినది.

సోమ : అంత శీఘ్రముగా నేల భరతపురమునకుఁ బోవలయును ?

సుంద : [illegible] యింకను కాచి యుంచ వలయును? సర్వమును చెప్పి [illegible] శ్యామల భర్త పోయిననాటి నుండి మీకై [illegible] బొందఁగోరుచున్నది. మీకై కాచికాచి సన్నగిలి [illegible] మీరామెను జేరకున్న జేపో యెల్లుండియో [illegible] చూచుకొనుట యుత్తమమని మూర్ఖపుఁబట్టుఁ బట్టినది. [illegible] ఆడించి యేవిధముగనైన మీతోఁ జెప్పి మిమ్ము రప్పించవలసినదని చెప్పి వచ్చితిని. మఱియొక రహస్యము [illegible] సుమా. పరులెవ్వరో యామెకై కాచి యున్నారఁట. నేఁడో జేపో వారు వచ్చి యామె నేమైనఁ జేయుదు రని మిగుల భీతిలుచున్నది. వారీపురివార లనికూడఁ జెప్పి మిగుల జడియుచుండెను.

ఆకస్మికముగ సోమనాథునివాక్ప్రవాహ మాఁగిపోయినది. అతనికిఁ దెలియరాకుండ నోటినుండి "పరులా! ఈపురివారలా!" అనుమాటలు వెడలెను. ఏదియో యోచించుకొనుచు మౌనవ్రతమును గైకొనియుండి పిదప నిట్లనెను.

సోమ : వారిపేరేమో చెప్పినదా?

సుంద : చెప్పినది. కాని మఱచితినండీ. హరసింహుఁడో— క్రూరసింహుఁడో యున్నదండీ. మఱచితిని.

సోమ : శూరసింహుఁడా?

సుంద : ఆ. ఆ. అదియే. అదియే. శూరసింహుఁడేనండీ. మఱచియుంటిని. బాబూ! వాఁడెవఁడో నేనెఱుఁగను. ఈ యూరి వాఁడనిమాత్రము మాశ్యామల యన్నది.

సోమ : ఆమాట అటుండనీ. శ్యామల యిప్పు డొంటరిగ నున్నదా?

సుంద : ఒంటరిగఁగాక వెంట నుండువా రెవ్వరు? ఉన్నబిడ్డ లాగతిఁ బట్టెరి—భర్త యీగతిఁ బట్టెను. అయ్యా! నే నున్నసంగతి నన్ను మీరు కనియుగుకదా?

సోమ : కనియు నేల? చెప్పుము చూతము.

సుంద : శ్యామల కిప్పుడు విశేషధన మున్నది. మీరామెను జేసికొన్న నది యంతయు మీపాలగును. ఇది నిజము. అప్పుడు మా బోటివారు మీకంటెఁ బడరు మహాత్మా! ఇదియుఁగాక యీ యస్థిరధనముకన్న నామె సౌందర్యధనమే యెక్కువ యని తలంతును. ఆ జగన్మోహనాకారమును గాంచిన మా బోఁటివారికే యొట్టెట్టో యగును. ఇఁక మిమ్మ్రు మగవలయునా! ఇంతటి గొప్ప యదృష్ట మబ్బుచుండ మీరింకను యోజింతురా?

సోమ : సుందరీ! శ్యామలయే యీ తీరునఁ బైబడి వరింప నొప్పుచుండుట నా యదృష్టము దప్ప వేఱు కాదని భావింతును. నేను అపవాదమునకు వెఱవను. కులము చెడినను సుఖ మబ్బునుగాదా! అంతియే చాలును. నేనితరులను లక్ష్యపరుపను. అయిన నేను నేఁడే యచటికిఁ బోవుటకు వీలగునో లేదో యని సంశయించుచున్నాను.

సుంద : నిక్కముగఁ జెప్పుచుంటిని. మీరు పోకున్న నామె వారలు బలాత్కారముగ నామెభర్తను పిల్లలను నపహరించుకొని పోయినట్లు చేసి వెడలిపోవుటో, లేక యామె యాత్మహత్యను గావించు కొనుటో సంభవించును. మీబోటిపెద్ద లింతటియనర్థకమున కెడమియ్య రాదు. ఎన్నిపనులున్నను వదలి మొదట నీ యదృష్టమును సాధింపుఁడు.

సోమ : నేనిపుడు వెడలిపోయిన నీ యింటివద్ద నుండువా రెవ్వరు? తాళము వైచుకొని పోవ నాకిష్టము లేకున్నది.

సుంద : మీ భార్యాపుత్రు లుండరా ?

సోమ : వారిప్పు డిచట లేరు. కొలఁది కాలము క్రిందటనే వారిని స్వర్గమునకు పంపివేసితిని. ఇంటివద్ద నెవరును లేకుండఁబోదురే యని నాశంక.

సుంద : మీరు యోచించి తగినవారి నెవ్వరినైన నిచటఁ గాపుంచి పొండు.

నే నెవరి నుంచి పోదును ? ఈ యూరికిఁ గ్రొత్తవాఁడను.

సుంద : నే నీవిషయమున నే యుపాయమును జెప్పఁగలను ? మీరే యొకవెఱవును బరికింపవలయును.

సోమ : నీవు రామేశ్వరమున కెప్పుడు ప్రయాణమైపోదువు ?

సుంద : రేపటి యుదయముబండిపై వెడలి పోదును. అది యేటికండి ?

సోమ : నీ వెల్లుండి పోవచ్చును గదా ?

సుంద : అయ్యా ! బాసుగారూ ! అట్లు వలనుపడదు. నన్ని నుంచి పోవ యత్నించుచుంటిరి కాఁబోలు. ఆ పని కాదుసుమా ! అట్లు జరుగుటకు వీలు లేదు; నేను తప్పక రేపు వెడలిపోయి శీఘ్రముగ మరలి రావలయును. ఇదియుఁగాక మా బోటి క్రొత్తవారి నుంచుట కన్న వేఱెవ్వరినైన నుంచుట బాగుస్వామీ. మా పరిచయము మీకు మెండుగ లేదు. అది సమయోచితయుక్తి కాదని నా తలంపు.

సోమ : ఆ విషయమై నాకుఁ జింత లేదు నీ విదివఱకుఁ గ్రొత్తదానవై యుంటివి కాని నేఁటినుండి చిరపరిచితురాలవు. నీవు వేఱుగ భావింపవలదు.

సుంద : స్వామి ! మీ బోటి పెద్దలయనుగ్రహ ముండినఁ జాలును. ఈ దాసి యెందైన హాయిగ జీవింపఁగలదు.

సోమ : శ్యామల నాపాలఁ బడిన నీ వెందు పోదువు సుందరీ ?

సుంద : ఎందును బోవు టేల ? మా శ్యామల నన్నొ వదలదు, ఆమె తానున్నచోట నన్నుంచుకొనును.

సోమ : సుందరీ ! నామాట కన్యథా చరింపకుము. నీవు నేను వచ్చువఱకు నాయింట నుండి భద్రముగ దానిని గాపాడవలయును. ఇది శ్యామల యాజ్ఞగ నెఱుఁగుము.

సుంద : దాసుగారూ ! నాకిదేమి మీరరాని యాజ్ఞను గలిగించితి రండీ, నేను దీని కెట్లుత్తర మొసఁగుదును ? నన్నీరీతి మీరు పరీక్షింపఁ దగదు. నాకూరికే బోవ సెల వొసఁగుఁడు. నేను మీకీయుదంత మును జెప్పి యీ లేఖ నిచ్చిపోవలయు నని వచ్చితిని. కాని లేకున్న నా కేమి పనియున్నదండీ యిచట ? వచ్చిన దే తప్పాయెనా ? నేను క్రొత్తదానను, మీరీరీతి త్వరపడకుఁడు.

సోమ : అబలా ! మరల "నేను క్రొత్తదానను" అని యన నమ్మి నేనిందు వదలిపోవుచున్నాను. నామాటఁ గాదనకుము, నీవవశ్య మిందుండియే తీరవలయును. ఇది నీకుఁ దప్పనిపని. దీనిని నీయింటిగ నే భావింపుము. ఇఁక ముందు నీవు నాదానవు. నీకిఁకఁ గ్రొత్తయెవరు సుందరీ ?

అని చెప్పుచు నాతఁడు చటాలున వచ్చి సుందరి హస్తమును బట్టుకొని మనసార ముద్దిడుకొనెను. ఆ కపటపుటతివ యించుక సిగ్గొందినదానివలె వెనుకకు జరిగి నిలుచుండి "అకటా ! దాసుగారు ! ఇది నాకెట్టిసంకటము ! మీ రెప్పుడు వత్తురో, మీ రెన్ని దినములకు వత్తురో యని భయ మగుచున్నది" అని చెప్పుచు తనకుందసమదంత పంక్తి నవ్యక్తగరిమఁ గాన్పించుచు హసించి తన మోహానవీక్షణ శరపరంపర లాతనిపైఁ బ్రయోగించెను —— సోమనాథుని మోాల

నాకస్మికముగ చంద్రకాంతి మెఱసినట్లయ్యెను. ఆవీక్షణబాణాహతుండై సంపూర్ణముగ నాతండు సమ్మోహితుండై పోయెను.

సోమ : నీకు భయమేల? నేను సహాయముగ నీకాప్తుఁ డుండునుకదా? నేనీరాత్రియే ప్రయాణమై పోయి యెల్లుండి ప్రొద్దు పుట్టువేళ కేతెంతును. వచ్చునపుడు సాధ్యమైన శ్యామలను సహితము తో డ్తెత్తును.

సుంద . అంతయు సరియే కాని నాకిచ్చట నుండుట భరింపరానిభార మని తోఁచుచున్నది.

సోమ : అట్లనకుము. నీయింటికి నీవు చూచుకొనుటయు భారమా? నేను నిన్ను నమ్మవచ్చునని నాయంతరాత్మ చెప్పుచున్నది.

# ఇరువదియైదవ ప్రకరణము

## ప్ర యా ణ ము

సుందరి యింక మాటాడలేదు. ఊరక తల వంచుకొని యోచించు దానివలె నుండెను. సోమనాథుఁడు మరల మరలఁ దన్నా గృహమునొద్ద నుండుమని బతిమాలెను. ఆమె తుదకింక నొప్పుకొనక తప్పదయ్యెను. అప్పుడు "ఆర్యా! నేనేమి చెప్పవలయునో మీ యాజ్ఞ నెట్లు మీరవలయునో నాకుఁ దోఁచకున్నది. మీరత్యంతశీఘ్రముగ భరతపురమునుండి మరలి రావలయునని మాత్రము వేడుకొనుదానను." అని మాత్రము పలికెను. "అట్లే కానిమ్ము. నీవాదింక విడువుము. భీతిలకుము." అని సోమనాథుఁడు త్వరితగతిని క్రిందికి దిగిపోయెను.

విశ్వస్థానమున సర్వకామ్యార్థప్రదాయిని యగుసిరిరా మాకా లొద్దువా రుందురా? ధనము సర్వజనాహ్లాదము, దానిని వలదనువా రెవ్వరు? లేకున్నఁ జీవితము గాసి యగునే సేస్తురా? దాని నార్జింప నహరహరంబు సన్నాహముతో నానా...సకలకష్టముల కోర్చి—వివిధపాపములఁ జేసి—పలువుర నొవ్వనాడి పాటుపడుదురు. ఇది లోకమునఁ జిత్రము కాదు; సర్వజనసమ్మతం బగు కార్యము. ధనము ప్రధానము. దానిని గలవాఁడే ప్రభువు. దాని మూలమున సమూల్య సౌఖ్యమబ్బును. కావుననే ప్రపంచ మంతయు ధనాశాపీడితమై పోయినది. మంచివారు చెడువా రగుదురు. ఆ ధనమ్ము వమ్మృతపాషాణ సమ్మిళితము కదా! సోమనాథుఁడు జగమున కేమి, నైజము చేతనే

యాతఁడు మిగుల లోభి. ధనాశాగ్రస్తుఁడు. ఏవిధముగనైన నేమి ధనము వచ్చినఁ జాలునని యానందించుచుండును. అట్టియెడ భరతపురమునందలి ధనికునిభార్య యగు శ్యామలాంబ విశేషద్రవ్యముతో తనపాలు కానున్నదన్న నెట్టి ప్రాణి నమ్మకుండును? ఒక్క రొక్కమే కాదు—దానికిఁదోడు భువనమోహినికూడఁ దనకు వశము కానున్న దఁట. రామనాథుఁడు పన్నిన యీ పన్నుగడ కాదాసు సంపూర్ణముగఁ దానవాగ్రుఁడై పోయెను. ఆతఁ డాడినమాటలు నన్నిటిని విశ్వసించెను. సర్వమును వంచనమని యనుకొనఁడయ్యెను. అందుచేతనే యా రాత్రియే యంతటి సుఖైశ్వర్యము నార్జించు కుతూహలముతో సుందరీరూపధారుఁడగు రామనాథునిఁ దనయింట నుంచి పోవ యత్నించెను. సుందరిముఖమును జూచినంతనే యాతని కనిర్వచనీయమగుసంబంధ ముప్పతిలి చిరపరిచితునిఁ జేసివైచెను. ఏతత్కారణమున నామె నింటియొద్ద కావలియుండి వేఁడుకొనెను. ఆమె మూలమునఁ దనకెట్టిమోసమును కలుగదని యాతని నమ్మకము.

రామనాథుఁడు చుట్టును పరికించి చూచెను. దాసు క్రిందికి వెడలిపోవునపుడు తన యాసనమున నొకబంగరుటుంగరము నుంచి పోయియుండెను. ఆతఁడు తన్నారీతిఁ బరీక్షించుటకై యట్లుంచి పోయెనని యాతఁడు తత్క్షణమే గ్రహించి సోమనాథునికన్న నెక్కుడు జాగరూకతతో బ్రవర్తించుచుండెను. ఆతఁ డాయంగుళీయకమును ముట్టఁడయ్యెను. తన యుక్తియంతయు నీరీతి సఫలమైనందు కపార సంతోషము నొందెను. ఇఁక సోమనాథుఁడు భరతపురమునకు వెడలిపోవును. ఇఁక నింటఁ దాసు కుశాలవుఁడు దప్ప పరు లెవ్వరు నుండరు. అప్పుడాబాలికవిషయమై యా గృహమున వెదకవచ్చునని తలఁచెను. "సోమనాథుఁడు తనకుటుంబమును స్వగ్రామమున కంపితినని చెప్పెను.

కదా ? అట్లయిన నామె యెవ్వరిని చంపి పోవలె. నిన్నటి రేయి యే కదా నేనామెను జూచినది. నేక పోవుటకొరకిల్లు సేవకుని నారీతి వచ్చి యుండునా ? అట్లనుటకు సాధ్యము కాదు. ఏలయన, నిన్నటి దినమున నేనిచట బంధింపఁబడినవార్త నెవ్వరికిని దెలియదు. తెలిసియున్నను పరులయింటినుండి యంతటిబాలిక చెప్పి సహాయము చేసె ననుట యసంభవము. ఆమె యీ యింటియందే యుండవలయును. సోమ నాథుఁడు వెడలిపోయినపిదప సావకాశముగ గృహపరిశోధన గావించి యామెసంగతిని దెలిసికొందము" అని యీరీతిగ యోచించుకొను చుండుగతి మరల సోమనాథుఁడు మేడపైకి వచ్చుచు "సుందరీ ! నా వజ్రపుటుంగర మొకటి పోయినది. కనుపించదేమి ? ప్రియమా !" యని చింతాసూచకం బగుమాటలతోఁ బలికెను.

సుందరి తటాలునఁ బోయి కుర్చీపై నుండిన యంగుళీయకమును వచ్చి యాతని కందించుచు "అయ్యో! ఇందే విడిచి పోయి యెంతటను వెదకుచున్నారే ?" అనెను. నాథుఁడు దాని నందుకొని హర్ష ప్రఫుల్లముఖుఁడై సుందరిచేయి పట్టుకొని "అందే మఱచి యుంచితిని కాఁబోలు" ననుచు నామె ముఖారవిందము నెగాదిగఁ గాంచుచు నిలుచుండెను. ఆ దీపకళికాప్రభయు నామెముఖసౌందర్యము మరిమోహా వేశము గల్పించుచుండెను. సోమనాథునికి నంతటిలావణ్యా మబ్బియుండదు. అతఁ డానందమును బట్టఁజాలక "ఆహా ! సుందరీ — త్రిపురసుందరీ — జగదేకసుందరీ — నా మానసుందరీ !" అని చెప్పుచు నామెను బిగియారఁ గౌఁగిలించుకొని ముద్దుగొనెను. సోమనాథుఁడు నగుచు ప్రయత్న పూర్వకముగ వాని బాహుబంధములనుండి వదలించుకొని దూరముగఁ బోయి నిలుచుండి తన మోహనవీక్షణములచే నామూర్ఖుని సంపూర్ణ ముగఁ బైవశము గావించుకొనెను. సోమనాథుఁడు మరలమరల

# విశ్వ విఖ్యాత
# నవలా సాహిత్యం

| | | |
|---|---|---|
| వాగ్దానం | (శరత్) | 2–0 |
| చంద్రనాథ్ | ,, | 1–8 |
| స్వామి | ,, | 1–0 |
| పరిణీత | ,, | 1–0 |
| బడీబహెన్ | ,, | –12 |
| పల్లెజీవనం | ,, | 2–0 |
| విప్రదాస్ | ,, | 3–0 |
| దేవదాస్ | ,, | 1–8 |
| సుమతి | ,, | –12 |
| చరిత్రహీనులు | ,, | 4–0 |
| బిందుగారబ్బాయి | ,, | 1–0 |
| అనుపమాదేవి | ,, | 1–0 |
| శ్రీకాంత | ,, | 7–8 |
| అరక్షణీయ | ,, | 1–4 |
| సవిత | ,, | 4–0 |
| సుందరి | (ప్ర॥ముఖర్జీ) | 2–8 |
| ఫాదరిండియా | | 1–8 |
| మదరిండియా | | 1–0 |

వలయువారు

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్**

**సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా.1882) రాజమండ్రి.**

# భూతగ్రహము

## ( రెండవ భాగము )


శ్రీ గుంటి సుబ్రహ్మణ్య శర్మ

గ్రంథరచన

కవిరాజహంస-కవికులాలంకార

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

గ్రంథసంపాదకులు



కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్

గ్రంథప్రకాశకులు : రాజమహేంద్రవరము.

# భూతగృహము

## ద్వితీయ భాగము—మొదటి ప్రకరణము

### నిర్భిన్న రహస్యము

రెండుగంటలు సమీపించుచుండెను. చంద్రనగరమునుండి పొగబండి మూఁడుగంటలకు బయలుదేఱును. ఆబండి చాలవఱకు ఉత్తరదిశ కేఁగి పిదపఁ బశ్చిమదిక్కున కేఁగును. ప్రయాణికు లనేకులు త్వరత్వరగ స్టేషనువైపున కేఁగుచుండిరి. కొందఱు అశ్వశకటములపైని, మఱికొందఱు ద్విచక్రశకటములపైని, వేఱొకకొందఱు కాలినడకలమూలమునను బోవుచుండిరి. బండ్లను తోలువారి కేకలవలనను, ప్రయాణికుల సంభాషణలవలనను ఆమార్గమంతయు గగ్గోలుగ నుండెను. కూలివా రనేకులు వింతగఁ బాటలఁ బాడుచుఁ బ్రయాణికుల సామగ్రుల మోసికొని పోవుచుండిరి. పెద్దమనుష్యు లేఁగు చలనహేతుశకటము లనేకములు మహార్భాటములఁ

ప్రేక్షకులమనస్సుల నాకర్షించుచుండెను. అప్పు డేదో యొకమూల నుండి "కూలి, కూలి" యను కేకలు వినఁబడఁజొచ్చెను. అట్లు కూయుచున్న యాతఁ డొకపెద్దమనుష్యుఁడు. ఇంచుక స్థూలదేహుఁడు. ఆతఁ డితరులవలె శకటముపైఁబోవక సాధారణునివలె నడచిపోవుచుండెను. తనచేతియం దుండిన పెద్దపెట్టె కొంతసేపటికి మిగుల భారమై కాన్పింపఁగనే యాతఁ డొకకూలివానిని బిలువఁదొడఁగెను. ఆతని కేకల నాలకించి యచటనే దాఁపున నేఁగుచుండిన యొకవృద్ధుఁడు పరుగుపరుగున వచ్చి అయ్యా! "ఏమి సెలవు?" అని యాగౌరవనీయునియెదుట నిలుచుండెను. కూలివాఁ డాతనిని గొంతసేపటివఱకు నాపాదమస్తకము పరీక్షించెను. ఇంతలో నాప్రయాణికుఁడు వానిని గాంచి "ఏమట్లు చూచెదవు! ఈపెట్టెను మోసికొని స్టేషనుకు రాఁగలవా!" అనెను. వాఁ డందులకు వంగి సలాముచేసి "అయ్యా! మీ రామాట నడుగవలయునా! మీ రేమి చెప్పినను చేయుటకు సంసిద్ధుఁడనై యున్నాను" అనెను. వానివినయభావమును గాంచి యాతఁ డానందమున హసించి తనపేటికను వానిచేతి కొసఁగెను. వాఁడు దానిని మోసికొని తిన్నగ నాతని ననుసరించి కదలెను.

కూలివానికి రమారమి యేఁబదివర్షము లుండును. ముఖమంతయు గడ్డము మీసములచేఁ గప్పఁబడి నవ్వును బుట్టించుచుండెను. శిరోజనము లందందు వెండితీగల ననుకరించుచు నిరువైపులందును వ్రేలాడుచుండెను. వాఁడు పాపము బీదవాఁడు కాఁబోలు! కట్టినగుడ్డయు, తొడిగినయంగరకాయు, పై నుండిన గుడ్డయు జీర్ణములై మలినములై జుగుప్సాకరములుగ నుండెను. దక్షిణభుజమునకుఁ దగిలించుకొనియున్న పెద్దకృష్ణాజినచర్మభస్త్రినుండి మాటిమాటికి దేనినో తీసికొని తినుచుండును. నిమిషమున కొకసారి

బాగాలు సేవించుచుండును—ఒకమాట. పత్తేదారు రవీంద్రుఁడే యీ రూపమున నుండుటచే మేము వాని సంతిగ వర్ణింపవలసివచ్చినది. లేకున్నఁ బ్రతివానిని వర్ణించుట మా పని గాదు.

రవీంద్రుఁడు నేఁ షాకకూలివాని వేషమును వైచుకొని యీ హంతకులజాడలను గమనింపఁ బోవుచుండెను. ఆ పెద్దమనుష్యుఁడు తన్నారీతిగఁ బిలువఁగనే యిదివఱకుఁ దానాతనికి సమీపమునఁ బోవుచు నాతనిఁ బరీక్షించుచుండుటచే చటాలున నతనియొద్దకు వచ్చెను. దానినే యాతఁడు కోరుచుండినది. ఆతనియెడ రవీంద్రున కనుమానము జనించినది. అందుచేతనే యీ పెట్టెను మోసికొని పోవుట కియ్యకొనెను. కొంతసేపు వారొండొరులతో మాటాడక పోయిరి. కాని రవీంద్రుఁ డూరకుండనేరక యిట్లని ప్రశ్నించెను. " దేవరా! మన దీయారేనేమండి ?

పెద్ద : అవును.

రవీం : ఇప్పు డెంతవఱకుఁ దమ ప్రయాణము ?

పెద్ద : నే నిప్పుడు భరతపురమున కేఁగవలయును. రైలు వచ్చుట కిఁక నెంతకాల మున్నదో తెలియునా ?

రవీం : జియ్యా! ఇఁక నొకగంటకాల మాలస్య మగును. ఏమి, మీరు మరల నూరిలోనికిఁబోయి వత్తురా ?

పెద్ద : లేదు, లేదు. నేను సరిగ స్టేషనుకే నడలిపోవలయును; ఊరిలో నింకేమియుఁ బని లేదు.

అని చెప్పుచు నాతఁడు మఱేమియు మాటాడక యూరకనడువ సాగెను. రవీంద్రుఁడును బలుకలేదు. ఇంతలో మఱియొక పెద్దమనుష్యుఁ డాదారిని బోవుచు మన మొదటిగౌరవపురుషునిఁ గాంచి విస్మితుఁడై యతివేగముగవచ్చి యాతనిముందు నిలుచుండెను. వారొం డొరుల

నానవాలు పట్టి యాశ్చర్యచకితులైరి. రవీంద్రుఁడా నూతనునిఁ గాంచి తనలోఁ దాను నవ్వుకొని "ఇప్పు డన్నియు సరిపోయినవి" యని యనుకొనెను.

అప్పు డా మొదటిపురుషునిఁ గాంచి క్రొత్తపెద్దమనుష్యుఁ డిట్లనెను. "సోమనాథదాస్! ఏమిది? ఇంతవేళలో నెచ్చటికి ప్రయాణము?"—ఈ సోమనాథదాసు మన సోమనాథుఁడే. దాసుఁ డాయాగంతకునిఁ జూచి "ఆహా! నీవా తారసింహా? ఎంత యాకస్మికముగఁ గానిపించితివి? నీ వెచ్చటికిఁ బోయెదవు?" అనెను.

తార : నే నిప్పుడు భరతపురమున కేఁగుచున్నాను. నీ వెచ్చటికి?

సోమ : నేను నచ్చటికే.

సోమనాథున కిప్పుడు సుందరిమాటల యథార్థము బోధపడినది. తారసింహుఁ డీరాత్రియో, రేపో, భరతపురమునకు శ్యాముల నెత్తుకొని వచ్చుట కేఁగునని యామె తెలిపినది. నేఁడే తారసింహుఁ డచ్చటికిఁ బోవుచున్నాఁడు. అచ్చటికి వెడలుటలో వీని యుద్దేశము ప్రాయశః అదియే యై యుండును. లేకున్న నం దేమిపని?" యని తనలోఁ దాను యోజించుకొని యెట్టకేల కిట్లనెను. "నీ వొక్కఁడవే పోవుచుంటివా?"

తార : లేదు. మనవా రెల్ల వచ్చుచున్నారు.

సోమ : అది యేల యంతశీఘ్రముగ నచ్చటి కేఁగుచున్నారు?

తార : నీ కాసంగతిని పిదపఁ దెల్పెదను. కాని, నీ వేల యింత యాకస్మికముగఁ బ్రయాణమైతివి? నీ విచ్చటనే యుండుట బాగు కాదా?

సోమ : తారసింహా! నే నేమి చేతును. నేఁడే యచటి కొక యవశ్య కార్యముపై వెడలిపోవలసివచ్చినది. ఎల్లుండి తిప్పకవచ్చి

యథాస్థానమున జాగరూకుఁడనై యుండెను. ఇంతలో పట్టి మానుఁగున దేమి ?

తార : ఇంటివద్ద నెవనినుంచి వచ్చితివి !

సోమ : భద్రముగ తాళములు వైచినాను లెమ్ము. భయము లేదు. సోమనాథుఁ డింటికి బీగములు వైచి వచ్చుట కల్ల. వాస్తవస్థితిని తారసింహునితోఁ దెలుపఁ దయ్యెను. తాను శ్యామలకై భరతపురమున కేఁగువిశేషములో నణుమాత్రమైనఁ బరులకుఁ దెలియకూడదని యాతని కోరిక. తారసింహుఁడు మాఱుపల్కలేదు. అతఁ డేదియో యోజించుకొనుచుఁ బోవుచుండెను. దాసునకు వానిపై చాల ననుమాన మొదవినది. తన్నుండే యుంచి శ్యామలను దెచ్చుకొనుట కేఁగుచున్నాఁడని యాతఁ డనుకొనెను. సుందరి సకాలమున వచ్చి యా యుదంతమును దనకు తెలియచేసినందుల కెంతయు ముదమంది కృతజ్ఞతాసూచకముగ నామెకై మనసున నెన్నియో నమస్కారములు—ముద్దులు—కౌఁగిలింతలు జరిగించెను. ఇంతలో స్టేషను సమీపించుటచే వారు మఱేసంగతిని గుఱించియు ప్రసంగింపరైరి.

రవీంద్రున కేమి తెలిసినది ? తారసింహ సోమనాథు లిపుడు భరతపురమున కేఁగుచున్నారు. ఇది యొకరహస్యము. తారసింహుఁడు తనవా రందఱితోను వెడలిపోవుచున్నాఁడట. ఇది రెండవరహస్యము. రవీంద్రున కిదివఱకు వీరిగమ్యస్థానవిషయమై గొప్పసంశయ ముండెను. ఇప్పటి కది తీఱిపోయినది. రహస్యము నిర్భిన్నమైనది. కాని యాతని కాసమయముననే వేఱొక యనుమాన ముదయించినది. వా రందఱును గలసి వేఱొకతావునకుఁ బరుగిడిపోవుచుండిరా యేమి! అయిన నిప్పుడే పోలీసువారితో నా సంగతులను దెల్పి వారి నప్పుడే బంధించుట బాగుకాదా ! రవీంద్రుఁ డిది యోజించుకొనెను. కాని యది మిగుల

పొరబాటుపని యని భావించి మఱికొన్నిదినము లాలసింత మని నిశ్చయించుకొనెను.

జనులు తండోపతండములుగ తమతమ గమ్యస్థానములకు టిక్కెట్లను గొని స్టేషను ప్లాటుఫారమున కరుదెంచుచుండిరి. జనసమ్మర్దము విశేషముగ నుండుటచే తారసింహాదులపైఁ గన్నుంచి యుండుట రవీంద్రునకు మిగుల కష్ట మని తోఁచెను. ఇంతలో సోమనాథుఁడాతని యొద్దకు వచ్చి యివ్వవలసిన కూలి నిచ్చి తనపెట్టెను గైకొని వెడలి పోయెను. అందఱు పత్తేదారు దృష్టిపథమునుండి దాఁటిపోయిరి. అతఁ డిఁక వారినిఁ జూడనేరకపోయెను. తోడనే తాను సహిత మతికష్టమున భరతపురమున కొకటిక్కెట్టును దీసుకొని యా జనపము దాయములోఁ దూఱిపోయెను.

# రెండవ ప్రకరణము

శ్యామల

తారసింహాదులకై రవీంద్రుఁడు డామనున్యపమూహామునఁ దిరుగుచుఁ గొంతకాలము గడపెను. వారాతని కెందును గోచరింపలేదు. అతఁ డింకను ఆకూలివానిరూపున నుండుటచే వరు లెవ్వ రాతనిని గుర్తిడనేరకైరి. నిరంతర మాతని ప్రక్కను దిరుగుచు నాతనిని గాంచుచుండిన రామనాథకుశాలవులైన నాకస్మికముగఁ జూచిన నానవాలిడనేర రన్న నీక నితరులగతి తడవ నేల? స్టేషనునందు మిగుల గందరగోళముగ నుండెను. ఇంతలో కలకత్తానుండి బండి వచ్చి నిలిచినది. రైలు నెక్కువారి సందడుల చేతను, దిగువారి యాతురతచేతను, కూలివారి కూఁకలచేతను, అచ్చటి సందడి శతాధిక మయ్యెను. జను లాదినమున విశేషముగఁ బ్రయాణమై పోవుచుండిరి. బండియందు కూర్చుండఁ జావు దొఱకుటే దుర్లభముగ నుండెను. ఒకరిమీఁద నొకరు పడుచు, జగడమాడుచు, పడుచు, పరుగు లిడుచు ప్రయాణికులు విశేషము బాధల నొందుచుండిరి. ఉద్యోగస్థుల కానాఁడు పని మిక్కుట మగుట ననేకులకు టిక్కెట్లు నివ్వకపోయిరి. అందుచే పలువు రందే నిలిచిపోవలసివచ్చినది.

ఈ సందడియం దేవిధముగనో రవీంద్రుఁడు బండి నెక్కి వెలుపల వచ్చి పోవుజనులను బరీక్షించుచుండెను. సోమనాథుఁడు కాని తారసింహుఁడు కాని యాతని దృష్టికి గోచరింపరైరి. తారసింహుఁ

డున్నరీతి కరాళుఁడు అమల కూడ వచ్చి యుండవలయును. వారును గాన్పింపరైరి. రవీంద్రుఁడు కాచికాచి తుదకు వేసరిల్లెను. జనులలో కొందఱు బండి నెక్కిరి. మరికొందఱు స్టేషను విడిచిపోయిరి. ప్లాటు ఫారమున జనులప్పుడు క్రిక్కిరిసి యుండలేదు. ఉన్నవారి నందఱ నాతఁడు పరీక్షింపక విడువలేదు. తుదకు రవీంద్రుఁ డిట్లని తలపోసెను. “ వారు ప్రయాణము చేయక యిందే నిలచిపోయిరా ? ఏమో ! ఎవరు చెప్పఁగలరు ? ప్రాయశః సోమనాథుఁడైన దప్పక యిందెందో యుండవలయును. వీనికి భరతపురమున నత్యంతావశ్యక మగుకార్య మొకటి కలదఁట. హంతకులకార్యము లన్నియు మేము తెలిసికొనఁ దగినవిగనే యుండును. ఏమైన నేమి ? నా ప్రయాణమును నిలుపుట సమయోచితము గాదు. ఒకపక్షమున వారు రాకున్నను భరతపురమున శ్యామలయొద్ద కేఁగిన విశేషము లేమైన తెలియవచ్చునేమో చూతము. ” అని యాతఁ డీవిధముగ నాలోచించు చుండఁగనే బండి కదలెను.

రైలుబండి చంద్రనగరమును వదలి చాలదూరము వెడలి వచ్చెను. రవీంద్రుఁ డందు కూర్చుండి తన భావికార్యక్రమమును గురించి చాల నాలోచించుకొనెను. అతఁడు చేయవలసినకార్యములు దినదినంబునకు భయంకరములై పోవుచుండెను. బాలుఁడగు రామనాథు నొక్కనినే యట వదలివచ్చెను. అతఁ డీవిధముగ కార్యసిద్ధి నొందునో యని పత్తేదారునకు మిగుల బలమగుసంశయ మొదవుచుండెను. అయినఁ గొంతయవకాశము గలదు. సోమనాథుఁడు నేఁడు భరతపురమునకు వెడలిపోవుచున్నాఁడు. వానియింటియొద్ద నెవరును లేరు. అతఁడు మరల చంద్రనగరమున కరుదెంచుసరికి మఱేది యొక్కైన మద్యుక్త కార్యసిద్ధి నొందియుండు ననికూడ తలంచెను.

మఱునాఁడు దీపములుంచువేళకు ధూమశకటము భరతపురమునకు వచ్చిచేరెను. రవీంద్రుఁడు తనరూపు నదివఱకే మార్చి యుంచుకొనియుండెను. అతని ప్రస్తుతప్రచ్ఛన్నవేష మొకపార్సీపెద్దమనుష్యుని వలె నుండెను. నల్లనిగడ్డము, తెల్లనిదుస్తులు, ఆజానుబాహురూపము చూపరుల హృదయకుహరముల భయభక్తిభావముల నుద్భవిల్లఁజేయుచుండెను. దైవకృపచే బండి గమ్యస్థానముఁను జేరుసరి కాతఁడున్న గదిలో పరు లెవ్వరు లేకుండిరి. అందుచేతనే యాతని కపట నింత నాటకము నాడ నవకాశము దొరకినది. అతఁడు బండి దిగినపిదపకూడ నచట చాలకాలమువఱకు నిలుచుండి యాత్రాయాతజనవ్రాతములఁ బరిశీలించుచుండెను. అందున నెట్టిఫలమును లేకపోయినది. అతనికిఁ గావలసినవారు గాన్పింపరైరి. తుద కాతఁడు విసిగికొని యచ్చటనున్న యొకతురగశకటముపై నూరిలోనికి వెడలిపోయెను.

రవీంద్రుఁ డుదయమువఱకు నౌకసత్రమున విడిసియుండెను. అందాతని నాసత్రాధికారి యెంతో గౌరవించి "అయ్యా! ఇంకను మీరీపురమునం దెన్నిదినము లుందురు?" అని యడిగెను.

రవీం : నేనిఁక రెండుమూఁడు దినములుమాత్ర ముండెదను. అంతదనుక నాబస నిందే యేర్పఱచుకొన నిశ్చయించితిని. ఇందున కెట్టియభ్యంతరమైనఁ గలదా!

సత్రాధి : ఎట్టియభ్యంతరము నుండదు. రెండుదినములు గాకున్న రెండుమాసము లుండుఁడు—రెండుసంవత్సరము లుండుఁడు. మీ కెట్టిలోపమును వాటిల్లకుండ గౌరవించుభారము మాది.

రవీం : మంచిది. నాకీక్షేత్రస్థలమునం దింతయనుకూలమగు చోటు నొసంగినందు కెంతయుఁ గృతజ్ఞుఁడను.

అధికారి : అయ్యా! ముఖములు క్రొత్తవైన దుష్టుఁ క్రొత్త యగునా ? ఎంతటియపరిచితుఁడైనను జిరపరిచితునిఁ జేయు నా వస్తువు చేత నున్నంతవఱకు భయ మేల ?

అని కార్యాంతములపై నాతఁడు రవీంద్రునియొద్ద సెలవు గైకొని వెడలిపోయెను. పత్తేదారుఁడు కాలకృత్యములఁ దీర్చుకొని తన యుడుపుల ధరించి చేత నొకసీరాంగమును బట్టుకొని వీధిలోనికి వెడలెను.

భరతపురము సహితము చంద్రనగరువలె నొకగొప్పపట్టణము. సౌందర్యగరిమయందు దానికేమాత్రము దీసిపోవునది కాదు. వీధు లతివిశాలములై ఇరుప్రక్కలయందలి మనోజ్ఞములగు సౌధపంక్తిచే వెలయు చుండును. పలువిధములగు నామములతో నందలి బజారు లొప్పు చుండెను. అందు సహిత మనేకులు ధనికుల గృహము లూరి వెలుపల నుప వనమధ్యములందు నిర్మింపఁబడి యుండెను. వీనినన్నిటిని గాంచి యాతఁడు మిగుల నానందించెను. గృహోపరిభాగము లన్నియుఁ దత్సమయసంజనితకోమలారుణభానుబింబప్రభాదీప్తిచే సువర్ణమయ ములై యుండెను. జనులందరును వీధులను శుభ్రపఱచి నీటిని జల్లు చుండుటచే చల్లనిమందమారుత మరుదెంచుచు నా యుషఃకాలము నత్యంత రామణీయకముగఁ జేసివైచెను.

రవీంద్రుఁ డాపురమున శాంతినాథుని గృహము నన్వేషించుచుఁ బోవుచుండెను. అది యేవీథియందుండునది యాతనికిఁ దెలియదు. తానాయూరికిఁ గ్రొత్త. ఎవరి నడిగినను "వినోదవీథియందు భద్ర మంగళోద్యానమున నున్నదని చెప్పుచుండిరి. అవి యెచ్చట నుండు నది యతని కేమి తెలియును ? కాన నాతఁ డూరక యేమియుఁ దోచక నా శ్రేణికొనవఱకుఁ బోయి వచ్చెను. అందుఁగూడ నెట్టి ప్రయోజనము లేకపోయెను. ఆ సమయమున రవీంద్రున కాదారిని బోవుచుండిన

గొక వనిత యగపడెను అోడనే యాయాశ్రమమును జూచి " అమ్మా! ఈ యూరిలో శాంతినాథునిగృహ మెచ్చట?" అని యడిగెను. ఆమె యాతని యాకారమును జేటిపారఁజూచి "మీ రేయూరు?" అనెను.

రవీం: నాది కలకత్తా.

స్త్రీ: మీకా శాంతినాథునియింట నేమిపని?

రవీం: కొంచెము పని యున్నది. నీవు దయచేసి యాతని యింటిని జూపఁగలవా?

స్త్రీ: మీ రాతనిబంధుగులా?

రవీం: కాదు. నాకాతనితో నెట్టిపరిచయమును లేదు.

స్త్రీ: అయిన మీరుద్యోగులా?

రవీం: అవును. నేను పోలీసుపనియందున్నాను.

ఈ మాటలను వినగనే యామె తనమేలిముసుగును సరిదిద్దుకొని యించుక వెనుకకు జరిగి నిలుచుకొని "అయ్యా! శాంతినాథుఁడు గారిపు డింట లేరు" అనెను. "ఆ విషయము నాకుఁ దెలియును. వారి యింట నాకుఁ గొంచెము పనియున్నది" యని యాతఁడనుట విని యామెయువిద మాఱు మాటాడక "రండు. నావెంట రండు" అని నడువ సాగెను. రవీంద్రుఁడామె ననుసరించి వెడలిపోయెను.

స్త్రీ చాలదూరము నడువ లేదు. ఆ వీధి కావలనుండునదే వినోద వీధి. అచ్చటి కేగఁజాలక రవీంద్రుఁ డెంతయో కాలము వృథా తిరుగాడెను. దానికానుకొనియే యొక పుష్పోద్యానము కలదు. అందనేకము లగు పుష్పలతలును, పండ్లవృక్షములును మనోహరముగఁ బెరిగి యుండెను. అదియే భద్రమంగళోద్యానము. దానిమధ్యభాగమునందు శాంతినాథుని మేడ కలదు. దానికి చేరువ నొక చిన్న కాసారముకూడ నున్నది. విలాసార్థము దాని నాగృహమేధి నిర్మించియుండెను. ఆ నిర్మల

జలఫలకమున కుసుమకిసలయసమాశ్రిత వృక్షచ్ఛాయలు ప్రతిఫలిం చుచు, నిరంతరపక్షి కలకలారావములచే, కోకిలకూహూగానంబులచే నది నందనవనమును నెదురదన్నుచుండెను.

స్త్రీ రవీంద్రునితో నా వనమును జేరినది. రవీంద్రుండా పరిసర భూమిసొబగును గాంచి మందమలయానిలస్పర్శచే తన్మయచిత్తుండగు చుండెను. ఆ స్థలమెల్ల శాంతినాథుని యైశ్వర్యమహిమను గంతమెత్తి చెప్పుచున్నది. ఆ తరుణి యాతని నా మేడలోనికిఁ గొనిపోయి యొక సుందరమగుగదియందు కూర్చుండఁబెట్టి లోపలికిఁ బోయెను. మంగ ళోద్యానమువలె నాగదిసహిత మత్యంతశోభావంతముగ విరాజిల్లు చుండెను. శాంతినాథుని దొంగ లెత్తుకొనిపోయినదాదిగ నాయింట నానందదేవత వాసము చేయుట లేదని ప్రథమసందర్శనముననే రవీంద్రు నకుఁ దెలిసిపోయెను.

లోపలి కేగిన యా యబల చాలసేపటికి వచ్చి యాతనితో నిట్లనెను, "అయ్యా! చూచితిరి కదా శాంతినాథునిగృహమును. ఇంకేదియో పని యున్నదంటిరే తెలుపఁగలరా?"

రవీం : అమ్మా! నాకీయింటిని చూచుటలో నెట్టిప్రయోజన మును లేదు. ఇంటివారిసంగతిని గొంత యడిగి తెలిసికొనవచ్చునా?

స్త్రీ : అడుగవచ్చును. అభ్యంతర మేమియు లేదు.

రవీం : నీ పేరేమి? ఈ గృహయజమానునకు నీవేమి కావలయును?

స్త్రీ : నన్ను బిందువాసి యందురు. నేనీయింటిదాసిని.

రవీం : ఈ యింటియజమానుఁ డిపు డెచ్చట నున్నాఁడో మీకుఁ దెలియునా?

స్త్రీ : తెలియదు. ఆతఁ డెనిమిది నెలలక్రిందట నాకస్మికముగఁ జోరులచే నెత్తుకొనిపోఁబడి నేటివఱకుఁ గానిపింప కున్నాఁడు!

రవీం : అదిపోని, ఆతనిభార్యాపుత్త్రులిందే యున్నారా ?

స్త్రీ : అయ్యా ! అదినమే యాతనిపిల్లలకుఁగూడ నాతనిగతియే పట్టినది. వారి సంగతులుకూడ తెలియరాలేదు. ఇప్పుడాతనిధర్మపత్ని యొకతె మాత్రమిందున్నది. భర్త పోయినపిదప నామె యన్నగారగు పుష్పమిత్రుడు మాత్రము వచ్చి యిందే యుండి యామెను కాపాడుచున్నాఁడు.

రవీం : పుష్పమిత్రుఁ డిపు డింట నున్నాఁడా !

బిందు : ఉండవచ్చును. వారిని తోడ్తెత్తునా ?

రవీంద్రుఁ డంగీకారసూచకముగఁ దలద్రిప్ప బిందువాసి పుష్పమిత్రుని దెచ్చుటకు వెడలిపోయెను. ఆమె శీఘ్రముగనే మఱలి వచ్చి "అయ్యా ! వారింట లేరు. ఇప్పుడే యెందో వెలుపలికి వెడలి పోయిరఁట. పదిగంటలవేళ కింటికి మఱలి వచ్చును" అనెను. రవీంద్రుఁడు కొంతసేపటివఱకు నాలోచించుకొని "అమ్మా ! ఒకమాట నడుగవచ్చునా ?" యనెను.

బిందు : అడుగుఁడు. మీరేమాత్రము సంకోచింపఁబని లేదు. మాకీసమయమున మీబోటిపోలీసువారు పరమమిత్రులు. మిమ్ముఁ జూడ గొప్పయుద్యోగస్థులవలెఁ గాన్పించుచున్నారు.

రవీం : నేనొకపత్తేదారుఁను. నేనిపు డమ్మగారితో మాటాడ వీలగునా ?

బిందు : మీరు పత్తేదారులా ! మఱియు సంతోషము. రండు. లోపలికి రండు. మాటాడుదురుగాక.

అని రవీంద్రుని వేఱొక గదిలోనికిఁ దోడ్కొనిపోయి యాతని నొకకుర్చీపైఁ గూర్చుండఁజేసి తాను లోపలి కేఁగెను. అచట నాతఁడు చాలసేపటివఱకు నొంటిగ నుండవలసివచ్చెను. బిందువాసి

యెంతసేపటికి మఱలి రాదయ్యెను. అప్పు డెట్టయెదుట నుండినగడియార తొమ్మిదిగంటలఁ గొట్టినది. రవీంద్రుఁడు ద్వారమువంకఁ దిరిగి చూచెను. బిందువాసి యచటనుండినపటభిత్తికను ద్రోసికొని సుమారిరువదియైదేండ్లయీడుగలయొకలావణ్యమయి యగుసుందరిని వెంటఁబెట్టుకొని వచ్చుచుండెను— ఆమెయే శాంతినాథుని ద్వితీయజాయ— శ్యామల !!!

# పంహాఁడవ ప్రకరణము

### బా లి క యె వ్వ రు ?

దాసు భరతపురమునకుఁ బ్రయాణమై వెడలిపోయినపిదప రామనాథుఁడు మేడపై నుండనొల్లక క్రిందిభాగమునకు దిగి వచ్చెను. అప్పటి కింకను కుశాలవుఁ డాపూర్వస్థలముననే ముసుగుంచుకొని పరుండియుండెను. కాని వాఁడు నిదురింపలేదు. జరుగుచుండిన చిత్రముల నన్నిటిని సాధ్యమగునంతవఱకుఁ గనుగొనుచుండెను. రామనాథుఁడు వానితో నేమియు మాటాడక యచటనుండిన యొక చిరుకంబళమును వైచుకొని పరుండెను. ఆతనికి చాలసేవటివఱకు నిద్దుర రాదయ్యెను. రెండుమూఁడుమారులు సోమనాథుఁ డింటికి వచ్చి పోవుటచే నిద్దురపై నున్న కొంతయాశయు దూరమైపోయెను. సోమనాథుఁడు దన్నునేకరీతులఁ బరీక్షించుచుండెనని యాతఁడు గ్రహింపకపోలేదు. దాసుమనసు నెఱిఁగి వర్తించుచుఁ దనవిషయమై యెట్టియనుమానము నొందకుండునట్లు చేసెను. ఆతనిని సంపూర్ణముగ మోసపుచ్చెను. అప్పుడే రెండుగంటలు కొట్టినను సోమనాథుఁ డింటికిరాలేదు.

ఉదయ మారంభమై సహస్రకరుఁ డాకాశగోళమున బారెడెత్తున వెలుఁగుచుండినను రామనాథుఁడు తలుపులను దెఱవలేదు. ఆతఁడు కుశాలవుని లేపి జరిగినయుదంతము నంతటిని దెల్పి "కుశాలవా! నీవు వేలుపలఁ గూర్చుండియుండుము. సోమనాథుఁ డేమైన మఱలివచ్చుట గాన్పించిన నొకపాటఁ బాడుము. నేను దాని నొకసంజ్ఞగా నెఱింగి

జాగరూకుఁడనై వర్తించుచుండెదను" అనెను, వాఁడందుల కియ్యకొని యప్పుడే బయటికి వచ్చి యొకచోఁ దనమూఁపుననుండినజట్టును బఱచుకొని పండుకొనెను. రామనాథుఁ డంత తలుపులను మఱల బిగించి వైచి కాపల తనకార్యమునకుఁ గడంగెను.

సోమనాథుఁడు వసించుచుండినభవన మతివిశాలమైనది. దాని యందనేకములుగ గదులు, సందుగొందులు, భూగృహములు గలవు. దాని భయంకరాకారమును గాంచి జను లెవ్వరును వచ్చి యందు నివసింప సాహసింపరైరి. కేవలమొక సోమనాథుఁడే యీ పనికిఁ గడఁగెను. అది చిరకాలమునుండి శూన్యమై యుండుటచే రంగు మాసి యసహ్యముగ దుర్గంధయుక్తమై భయమును గలుగఁజేయుచుండెను. అందులో నొకటిరెండు గదులనుమాత్రము చక్కఁబఱచుకొని యాతఁ డందు నివసించుచుండెను. ఆ గృహమునందేమూలనుండినద్వారములు, జాలకములు మూయఁబడియుండుటచే లోపల నంతయు నంధకార బంధురమై యుండెను. రామనాథున కందేమియు గోచరింపలేదు. తోడనే యాతఁడు తనకరదీపికను వెలిఁగించి చూచెను, చుట్టును నాలుగైదు ద్వారములు కనఁబడినవి. కాని యన్నియు బంధితములై తాళములు వైవఁబడియుండెను. అంత నాతఁడు తన మందసము నందుండిన తాళపుచెవులగుత్తి సహాయమున నా గదులలో నొకదానిని దెఱచెను. అది యంత విరివిగ లేక చిమ్మచీకటిచే నావృతమై యుండెను. ముందేముండునది గోచరింపదు. రామనాథుఁడు తన వెలుఁగు సహాయమున నా స్థలమునంతటిని పరిశీలించి చూచెను. అందొకమూల నొకపెద్దఖడ్గము గాన్పించినది. అది కాంతి మాసి చిలుమువడి యుండుటచే చిరకాలముగ నిరుపయుక్తమై యున్నదని తెలియవచ్చుచుండెను, మఱియొకచో గొన్నికాగితపుముక్క లుండినవి. ఆతఁడు

వానినంతగ లక్షించి చూడక యిఁక నందేమియుఁ గాన్పింపమి నీవలికి వచ్చి యథారీతి తలుపులను బిగించివైచెను.

తన బీగములచే నాతఁడు పదపడి రెండవగదితలుపులను దెఱచెను. అది మొదటిదానికన్నఁ జెక్కురెట్లు గొప్పది. ఎప్పటివలెఁ జీకటి. ఆతఁడు దానిని బరీక్షించి చూడ నొకచోఁ గొన్ని పురాతన పాత్రములు — రెండవచోఁ గొన్ని కట్టెలు — మూఁడవచో నింత బూడిదయుఁ దప్ప నితరేమియుఁ గాన్పింపలేదు. రామనాథుఁ డంతలో నచట నొకభూద్వారమును గాంచి యచటి కేఁగెను. అది పాతాళమార్గమై యుండునని యాతఁ డూహించెను. దానికిసహిత మొక తాళము వేయఁబడి యున్నది. ఆతఁడు తనతాళపుచెవుల నన్నిటిని ద్రిప్పి చూచెను. అవన్నియు నిరర్థకములై పోయెను. ఒకటియును సరిపడవయ్యెను. ఆతఁ డంత గత్యంతరము లేక దానిని విడువవలసి వచ్చెను. రామనాథుఁ డతికష్టముపై నా పనిని గావించి యా ద్వారమును దెఱచి చూచెను — లోపలికి మెట్లు లేవు. అంతయు నంధకారపూరితమై యుండెను. లోపల మాటిమాటికి నేదియో చిన్నగ శబ్దము వినఁబడుచుండెను. ఎవరో మూల్గుచున్నట్లుండెను. రామనాథుఁ డాసమయమున నేమిచేయుటకు దోఁపక చాలసేపటివఱకు వితర్కించుకొనెను. రవీంద్రునివలెనే యాతఁడును నణుమాత్రమైన భీతిలువాఁడు కాఁడు.

ఆ పాతాళలోకమున కేఁగుమార్గ మెద్ది? అది తోఁచక యాతఁడు కొంతసే పటునిటు తిరుగులాడెను. క్రిందిభాగమున చాలవఱకుఁ బోయి యున్నది. సాహసించి కుప్పించి దుమికిన మరల వెలుపలి కరుదెంచు టెట్లు? అది సమంజసము కాదు. ఇంతలో నాతని కొక వెరవు దోఁచినది. అప్పు డాతఁడు చటాలున తానుధరించియుండిన నిడుపాటి కోకను విప్పివైచి తన నిజరూపమును ధరించెను. వెంటనే యాచీరచెరగును

దీసి యాతలుపుగొళ్లెమున కతిభద్రముగ బిగించివైచి శేషవస్త్రమును క్రిందికి దిగవిడిచెను. పనిపోయినది. అంత దన కరదీపికను మొలయందు బంధించుకొని యీ వసనసహాయమున గ్రిందికి జాఱిపోవ సాహసించెను. రామనాథుం డతిజాగరూకతతో దిగి పోవుచుండెను. తనయప్పటిసాహసకార్యమును దలంచుకొని తానే విస్మయచకితుం డగుచుండెను.

క్రిందిభాగమును జేరినతోడనే యాతండు తన దీపికమూలమున నాతావునంతటిని శోధించిచూచెను. మఱియొకకవాటదర్శనమైనది. కాని, బీగము వేయంబడియుండలేదు. రామనాథుం డచటి కేఁగి దానిని దెఱచి చూచెను. ఆ పిదప నొకచావడి—దానిముందుభాగమున మఱియొకగది—రెంటికిని మధ్య సూర్యప్రభాంకిత మగుశూన్యభాగము వినీలవర్ణయుతమై గోచరించుచుండెను. తన దీపప్రకాశమున నాతం డా సమయమున నాకూటమునం దొకవ్యక్తి పరుండియుండుటను గాంచి విస్మయవిస్ఫారితాననుండై వెనుకకు తాళి నిలుచుండెను.

తుద కాతండు సాహసించి లోపలం బ్రవేశించెను. వ్యక్తిదేహమాద్యంతము నవకుంఠనము గావించుకొని నిద్రించుచుండెను. దాపున నొకమూలయం దొకపాత్రమునం గొన్నితినుబండములు నీరును దప్ప మఱేమియు నచట లేదు. రామనాథుండు తిన్నగ నావ్యక్తిని సమీపించి పరీక్షించి చూచెను, అందుచే నచ్చట నుండునదెవ్వరైనది యాతనికిం దెలియలేదు. తుద కాతం డూరకుండనేరక సాహసించి వ్యక్తిపైం జేయివైచి తట్టి మొదలిడెను. తటాలున నిదురించుచున్నప్రాణి లేచి కూర్చుండెను—ఆతండొకపురుషుండు! ఒండొరులం గాంచుకొని వారాశ్చర్యచకితులై పోయిరి. నూతనపురుషుండు రామనాథునిం గాంచి భయవిస్మయసంభ్రమయుతుండై నిర్విణ్ణతతో లేచి నిలుచుండెను. పత్తేదారు

కూడ నాతని నిదివఱ కెన్నఁడును గాంచి యుండలేదు. అతఁ డెట్టకేల కిట్లనెను, "అయ్యా! మీరెవరు? ఈపాళ భూమియందు మీరేమి చేయుచుందురు?" పురుషుఁడు మాటాడలేదు. అతని నూరక చూచుచుండెను. అప్పుడు మరల రామనాథుఁడు "భయపడకుము. చెప్పుము. నీవెవ్వరవు? ఇం దేమి చేయుచున్నావు?" అని యడిగెను. వ్యక్తి మాటాడక యేదియో హస్తసంజ్ఞను గావించెను. రామనాథున కది యర్థము కాలేదు. అతఁడు మఱలమఱల నదే ప్రశ్నను వైచెను. కాని యాతఁ డూరక చేతుల ద్రిప్పి మూల్గుచుండెనే కాని మాటాడనేరఁ డయ్యెను—రామనాథుఁ డిప్పుడు గ్రహించెను—అతఁడొక మూగ!!!

ఊరక మాటాడుచుండిన లాభము లేదని యెంచి రామనాథుఁ డాతనిని దనవెంట రమ్మని చేతిసైగలచేఁ బిలిచెను. మూగ యందుల కియ్యకొన్నవానివలె నడువ నారంభించెను. అతఁడు పాపము భూగృహవాసంబుననో, యుక్తాహారములు లేనిదాఁ చేతనో సన్నగిలి యుండెను. కాని సహజముగ బల మున్నదని యెంచి రామనాథుఁ డాతనిని తనచీర యుండుస్థలమునకు దెచ్చి పై కెక్కుమని సైగఁ జేసెను. అప్పు డాతఁడు పై కెక్కిపోక యూరక మూల్గుచు చేసైగలచే రామనాథునికూటమున కెదురుగనున్న గదియొద్దకు రమ్మనుచుండెను. ఉద్యోగి యది గ్రహించి యతనితో మరల నాదావడియొద్ద కేతెంచెను. మూగ తిన్నగ నాతని హస్తమును బట్టుకొని వచ్చి గదితలుపులయొద్ద నిలిపెను. అదియును బీగము వైవఁబడి యుండెను. అప్పుడు దాని నతికష్టముపై తెఱచి యిరువురును లోపలి కేఁగిరి. అదియుఁ బైవానివలె నొకవిశాలమగు గది. దుర్గంధసమాశ్రితము. దానియందు మరల రెండు ద్వారములు కలవు. అందులో నొకదానియొద్ద కామూగ రామనాథుని దెచ్చినిలిపి మూల్గుచుఁ జేతులఁ ద్రిప్పెను. కరసంజ్ఞచే దానిని కూడదీయు మని

రామ : బాలా! నీవానాఁడు నాకాయమూల్యసహాయ్య మొనరింపకుండిన నేను నేఁడిట్లు నీ మ్రోల నిలుచుండియుండను. పితృపతి యెద నిలుచుండి యుందునుసుమా. నీవు నా ప్రాణదాతవు. నీకు నా కృతజ్ఞతాపూర్వకము లగునభివందనములు. నీవు దేవీమూర్తివి కాని సామాన్యవు కావు.

బాల. అయ్యా! అట్లు వర్ణింపకుఁడు. నాకు శిరోవేదన కలుగును.

రామ : ఓసిమ్మ సరోజినీ! నిన్ను మీతండ్రిని ఈ చెఱనుండి విడిపింతును. వత్తురా?

ఆమాటల నాలకించినతోడనే మోహానచంద్రుఁ డపరిమితానందమున గంతులు వైచి తనతనయ నెత్తికొని యావల కరుదెంచి రామనాథునిగూడ రమ్మని హస్తసంజ్ఞఁ జేసెను. సరోజిని తండ్రియొడిలోనుండి "రమ్మా, మమ్ము వదలింతునంటిరే యీనిర్బంధమునుండి, రమ్మా, మేము మీ దాసులము" అనెను. "నీవు నా ప్రాణము నొకసారి రక్షించితివి. ఇపుడు మీకు సాయపడుట నావంతు కదా!" యని చెప్పుచు రామనాథుఁ డివ్వల కేతెంచెను.

# నాలుగవ ప్రకరణము

### నిష్క్రాంతము

రామనాథుఁ డాయిరువురు దీనులను దోడ్కొని తాను చీరగట్టిన తావునకేతెంచెను. ఆతఁ డొకమాఱు తల నెత్తిచూడఁ దాను మిగుల నెత్తునకేఁగవలసినట్లు తెలియుచుండెను. సరోజిని యొంటిగ నా బట్టను పట్టుకొని యెక్కఁజాలదు. అందుచే నామెను మోహనచంద్రుఁడు గాని తానుగాని మోచికొని పైకి ప్రాకి పోవలసివచ్చినది. మోహనచంద్రున కది మిగుల కష్టతరమైన పని. తన్నుఁ దాను భరించి యెక్కలే యాతనికి బాధగఁ దోఁచు నెడ నిఁక నా బాలిక నెత్తికొని పోఁగలుగునా? రామనాథుఁ డిది యోజించి యా కార్యభారమును దనపై వైచుకొనెను. ఆతఁ డంత చంద్రునిఁ గాంచి చేసైగలచే "పైకెక్కు" మని చెప్పెను. అందు కాతఁడు తలనల్లాడించి మూల్గుచు నా పటమును బట్టుకొని పైభాగమునకుఁ బోఁదొడఁగెను.

మోహనచంద్రుఁడు మీఁదికిఁ బోవుటకు మిగుల శ్రమనొందుచుండెను. ఆతఁడు మిగుల దుస్స్థితియం దుండుటచే పసనమును బట్టుకొని తనబాహుద్వయముపై నిజదేహభారమును నిలుపుకొనఁజాలక యొకటిరెండుపర్యాయములు క్రిందికి జారి పడుటయు సంభవించెను. రామనాథుఁ డది గాంచి మిగుల జాలి నొంది యాతనికనుకూలమగు రీతి నా చీర కడదండు గ్రంథులను వైచెను. మోహనున కది మిగుల నుపయోగకరముగ నుండెను. అందుచే నాతఁ డీసారి యవలీలగఁ

పై కెక్కిపోయెను. ఇఁక క్రిందిభాగమున సరోజినీరామనాథు లిరువురు మాత్రము మిగిలి యుండిరి.

రామనాథుఁ డామెతో నిట్లు "సరోజినీ! నీవు మీతండ్రిజాడ ననుసరింపఁగలవా?" యనెను. ఆమె యా తాడకు చీరను జూచుచుఁ దనకది సాధ్యము గాదని యోజించుచుండెను. తుదకు "మీ రెక్కి పొండు. నేనావల వత్తును" అనెను.

రామ : నీ వొంటిగ నెక్కఁ గలవా?

సరో : అది నాకంత సులభసాధ్యము కాదు. అయినను బ్రయత్నించెదను.

రామ : నీకుఁ బ్రయత్నించుటకంతటిశ్రమ యేల? నామూపుపై కూర్చుండుము. నిన్నెత్తికొని పోదును.

సరో : అది మీకు మఱింత కష్టముకాదా! నాకు సాధ్యమగు విషయములం దొరుల నేల కష్టపెట్టవలయును!

రామనాథు డామెముఖారవిందము నుపలక్షించినవ్వుచు "నాకు కష్టము కాదు. నీకిష్టపడిన రమ్ము. భుజములపైఁ గూర్చుండుము. వేళ మీరుచున్నది. మనము శీఘ్రముగ దాటిపోదము" అనెను. సరోజిని లజ్జావనతశిరస్కయై మారుపల్కక యూరక నిలుచుండి యుండెను. అప్పుడు రామనాథుఁడు మరల "సరోజినీ! యోజింతు వేల? నీవేమియు ననుమానింపవలదు. నీవు నా పాలిటి దేవీమూర్తివి. నీకై నా ప్రాణములనైన వెచ్చింప సిద్ధుఁడనై యున్నాను. ఇంత మాత్రమునకే యింతటిసిగ్గా? రమ్ము. వేళ మీరుచున్నది" యనెను. అప్పుడామె మఱుమాట నాడక తిన్నగ వచ్చి యాతనిమూపున భద్రముగఁ గూర్చుండెను. అతఁడంత నతిసాహసముతో నామెను మోసికొని యాయంబర సహాయమున కడుజాగరూకతతో వెలుపలికి ప్రాకి పోసాగెను.

రామనాథుఁడు వాయుమధ్యమున వ్రేలాడుచు నొకమాఱు శిరమెత్తి చూచెను. ద్వార మింకను జాల నెత్తుననుండెను. అతఁడు తనశక్తిసామర్థ్యములఁ బన్నిటిని వ్యయపఱచి దానివైపునకు వెడలిపోవుచుండెను. అతని కప్పుడు తా నెంతటి భయంకరకార్యమును జేయుచుండినది బోధపడదయ్యెను. సరోజినీ మోహనచంద్రుల నారీతి చెఱనుండి తప్పించి తనశౌర్యమున దనసామర్థ్యాధిక్యమును దెలుప నువ్విళ్లూరుచుండెను. అతని హృదయమున నెట్టిభయమును గలుగలేదు. మీఁదుగ సరోజిని ప్రోత్సాహవచనములచే నాతనిశక్తి ద్విగుణిత మగుచుండెను. ఆహా! రామనాథా! నీ సాహస మత్యంతశ్లాఘనీయము! నీ బల మద్వితీయము!! నీ యపారమేధాశక్తి యతులితము!!!

రామనాథున కిప్పుడు భయమగుచుండెను. ఏల? వెలుపల కుశాలవుఁడు రాగాలాపనఁ గావించుచుండెను. ఏమి యీభయంకరము సోమనాథుఁడు వచ్చుచుండెనా? లేక పరులెవరైన వచ్చుచున్నారా? లేకున్న నాతఁ డేల పాడును? దాను వచ్చుచుండుట తటస్థించెనేని పాడుమనికదా రామనాథుఁడు చెప్పియుండెను? కుశాలవుఁడు రాగము నాపలేదు. అది బాగుగ నింటిలోనికి వినఁబడుచున్నది. రామనాథుని యూపాద మేలునో ప్రచలితమగుచుండెను. సోమనాథుఁడు తన్నాస్థితి యందు చూచిన మరి యుండనిచ్చునా? తాను వానితోఁ బోరి జయింపగలఁడా? సరోజిని కేమియు బోధపడలేదు. ఆమె యాతనికి హెచ్చరిక నిచ్చుచు "ఏటికిట్లు వణకెదరు? నేనతిభారముగఁ దోచుచుంటినా? మహాశయా! నేను మొదటనే వలదంటినే యీసాహసకార్యము" అనెను. రామనాథుఁడు తిన్నగ "సరోజినీ! మాటాడకుము. నాకేమియు నలసట లేదు. నీవు భద్రముగఁ గూర్చుండుము. సోమనాథుఁడు వచ్చుచున్నట్లున్నది" యనెను. ఆమాటల నాలకింపఁగనే

యాయబల భయాతిరేకమునఁ దనబాహులతలచే నాతనికంఠమును బెనవైచి "అయిన నింకేమిగతి? అయ్యో! వాఁడు మమ్మీరీతిఁ దప్పించుచుండుటఁ గాంచిన మిమ్మేమి చేయునోకదా ! ఎంతటి యనర్థము సంభవింప నున్నది" యనెను. ఆతఁడు తనభీతిని వెలుపలికిఁ దోఁపనీయక "బాలా ! నాకేమియు భయము లేదు. దేవుఁడు మనకు సాయపడును లెమ్ము" అని చెప్పుచు మఱింతవడిగ నెక్కిపోసాగెను.

సోమనాథుఁడు వచ్చుచుండుట నిజము. ఆతఁడు భరతపురమున కేఁగలేదు. మార్గమధ్యముననే యాతనికి సుందరిపై బలమగు ననుమానము కలిగినది. "సుందరి నిజముగ సుందరియా? అది నాకుఁ గ్రొత్తది. నేనామెముఖము నెన్నఁడును జూచియుండలేదు. మోహపరవశుఁడనై, ధనాశాపీడితుఁడనై, యుక్తాయుక్తపరిజ్ఞానవిహీనుఁడనై దానిని నమ్మి నాయింటియొద్ద నుంచినచో నెంతసుకరము? శ్యామల నన్ను వరించు ననుమాట యబద్ధము. సుందరి చెప్పినవార్తలకును నేను నేఁడాలకించిన దానికిని నెంతో భేదము కలదు. నేఁడు నాతో ప్రయాణమైవచ్చుచుండు భరతపురపువర్తకులమాటలం బట్టిచూడ నామె యింటియొద్ద నొంటరిగ లేనట్లు తెలియుచున్నది. ఆమె అన్నయగుపుష్పమిత్రుఁడను వానిపోషణలో నున్నదఁట. శ్యామల సద్గుణపుంజమఁట. పరపురుషులఁ గన్నెత్తి చూడనిసాధ్వియఁట. ఇట్టితరుణీవతంసము నన్ను వరించునా? కల్ల. ఇది నిజమైయుండదు. ఇది మోసము. సుందరిమాట లబద్ధములు. అది నన్ను సంపూర్ణముగ నంధుని జేసివైచినది. ఏదో ఫలాపేక్షచే నన్నీరీతి వంచించియుండునే కాని యీలేఖను నమ్మనేర. త్వరగ నింటి కేఁగుటే యుక్తము. ఇదియుఁగాక నేఁడు తారసింహుఁడు భరతపురమునకుఁ బ్రయాణమై రాక యుండె నిలిచిపోయెను. ఒకవేళ సుందరి మాటలు యథార్థములైన రేపు రావచ్చును. నేనీరీతి నాకస్మికముగ

కాడలివచ్చుట సమంజసము కాదు" అని యాతఁడు వితర్కించుకొని చంద్రనగరమునకుఁ గొంతిదూరమున నున్న [illegible] అక్కడే మరల చంద్రనగరునకు వచ్చుచుండిన సామానుబండి (Goods Train) పై వాపసు వచ్చెను.

ఆతఁడిలు చేరుసరికి కుశాలవుఁడు పూర్వప్రవేశమునవే కట్టపైఁ బరుండి పాట పాడుకొనుచుండెను. ఇంటితలుపులు బంధింపఁబడియున్నవి. సోమనాథుఁడు వానిని గాంచి "సుందరి యెచ్చట!" యని యడిగెను. కాని వాఁడు పూర్వమువలె బధిరునివలె నటించుచు "నేనిందే యున్నాను, ఉదయభాగమునందు నాకు కడుప్రీతి. కాన దానిని బాడుచున్నాను" అని చెప్పెను. దానునకు వానితో ముచ్చటలాడుచు నుండుట కవకాశము లేదు. ఆతఁడించుక కోపమున గొంతుచించుకొనుచు "కాష్ఠకా! సుందరి యేది? ఎచ్చట కేఁగినది?" అనిఅడిగెను. వాఁడు మరల వినఁబడనివానివలె హస్తమును చెవి కడ్డముగఁ జేర్చి "అయ్యా! తామనున దేదో వినఁబడుట లేదు" అనెను. సోమనాథుఁడిఁక సహింపనేరక వానిని దిట్టి చటాలున ద్వారమును సమీపించి సుందరిని గేకవేసి పిలిచెను. ఎట్టిప్రత్యుత్తరము రాదయ్యెను, తలుపు తెఱవఁబడలేదు. లోపల గొళ్లెము తగిలింపఁబడియుండుటచే నాతఁడు సాహసించి యిలు ప్రవేశింపనేరఁడయ్యెను. ఎన్నిమార్లు పిలిచినను ప్రయోజనము లేకపోయెను. తుదకాతఁడు విసిగికొనుచు "ఇందేదియో నిక్కముగ మోసమున్నది" యని యెంచి యాయిలుచుట్టును తిరిగి కడకొకచోనుండిన గుప్తమార్గముగుండ లోపలికిఁ దూఱి పోయెను.

కుశాలవుఁ డాశ్చర్యచకితుఁడై యాతని యాకస్మికదర్శనమునకుఁ గారణ మూహింపసాగెను. తమ్ముఁ గేఁడనుమానించెనను[illegible] దోఁచుచుండెను. ఎట్టియనర్థకము జరుగునో యని వాఁడంత జడిసి రామనాథుని

రక్షించుటకై సోమనాథుఁడింట బయలువెడలిపోయిన బిలమార్గముగుండ నాతనికిఁ దెలియకుండఁ దానుగూడ వెడలిపోయెను

రామనాథున కేమి చేయను దెలియకుండెను. ఎక్కవలసినదూర మెంతయో గలదు — ఇంతలో నాహా! సోమనాథుని కంఠనాదము! తలుపులచప్పుడు! ఆకస్మికముగ నిప్పుడు భయాతిరేకమైన దడదడ కొట్టుకొనిపోవుచుండెను. అప్పుడేమి చేయఁగలఁడు? తానొకపాతాళ గృహమున సోమనాథుఁడు బంధింపఁబోయిన ఖైదీని నాతనికిఁ దెలుపకుండ వదలించుచుండెను. రామనాథున కిప్పుడు తానెంతటిసాహస కార్యమును జేయుచుండినది తెలిసిపోయినది. తానొకను బాలుఁడు సోమనాథుని నెదిరింపఁగలఁడా? తప్పించుకొనిపోవుట కవకాశము లేదు. వెలుపల మోహనచందు నిర్విణ్ణుఁడై నిలుచుండి చేతులఁ ద్రిప్పుచు మ్రాల్గుచుండెను. అంతలో నేమూలనుండియో యాకస్మికముగ సోమనాథుఁడు గర్జించుచు సుందరిని మాటలచేఁబిల్చుచు నాగది ప్రవేశించెను !!!

మోహనచం దాతనిని గాంచిన యుత్తరనిమిషముననే భయభ్రాంతుఁడై చీకాకుపడుచు పఱువెత్తుచుఁ బోయి యొకమూల నొదిగి కూర్చుండెను. సోమనాథుఁ డాతనిని గనకుండెను. అతఁ డాగ్రహగ్రస్తుఁడై పటపట పండ్లు గీటుచుఁ బరుగిడి వచ్చి భూగృహమునొద్ద నిలుచుండి క్రిందుగాఁ దొంగి చూచెను — అనాథుఁ డగు రామనాథుఁ డతి కష్టముపై సరోజినిని మోచికొని యా వాయువీధియందు నర్ధభాగమున వల్లాడుచుండెను !!! దా నదిగాంచినతక్షణమే కోపావేశమున మైమఱచి పోయెను. ఇప్పు డాతనికి 'సుందరి మోస' మంతయుఁ దెల్లమై పోయెను. సుందరి కాదు. తన్నారీతి మోసగింపవచ్చిన యొకపురుషుఁడు. రామనాథుని ముఖమును గాంచి జరిగినదాని నంతటిని నూహించు

కొనెను. తోడనే సోమనాథుడు కోపపూరితతామ్రాక్షుండై భయంకరముగ గర్జించుచు "ఓరీ! ఎంత పాపిష్ఠీ! దురాత్మా! స్త్రీరూపమున నన్ను బంధించి యీరీతిని నీవు వశపరచుకొనఁ బోవుచుంటివా! దుర్మదమహాపాపీ! కృతఘ్నా! నీ పాపకార్యమునకుఁ దగినశిక్ష ననుభవింతువుగాక, ఇక చచ్చితివి." అని చెప్పుచు భీషణాకారమున నాగదినంతటిని జూచి దాపుననుండిన యొకపెద్దగుండును మోసికొనివచ్చి రామనాథు పై వేయ నుద్యమించెను.

ఆహా! ఏమి యీ ప్రకోపము! రామనాథుడీట్లగునని తలంపలేదు. ఆకస్మికముగ మృత్యుదేవత తనపై నోరుదెఱచుకొని వచ్చుచుండుటను గాంచి యాతనిహస్తము లవసన్నము లగుచుండెను. హృదయావేగ ముప్పతిల్లెను. కన్నులఁ జీకటులు గ్రమ్ముచుండెను. ఎంతటి విషమావస్థ! ఎంతటి భయంకరసంఘటనము! ఎంతటియనర్థకము! ఎంతటి విపరీతకాలము!—ఒకనిమిషకాలము — ఆ మీఁద రామనాథునిపై బండ పడి యాతని శిరమును భిన్నముగఁ జేసివైచును— ఆతని తోడుగ బాలికాతిలకంబగు సరోజిని పరలోకమార్గము ననుసరించును!! ఆతని కప్పుడే ప్రాణములు వీడినట్లుండెను. నోట మాట వెడలుట లేదు, బహుప్రయత్నపూర్వకముగ నా చీరను గట్టిగఁ బట్టుకొని సరోజిని యొక్క భాగమును వహించి యుండెను, సోమనాథుని నయనగోళములనుండి యగ్నిస్ఫులింగములు వెలువడి యాతని ధైర్యకార్పాసమును దహించివైచెను. ఆతని దంతసంఘట్టనారవములచే గుండెలు ప్రీలుచుండెను—ఒకనిమిషకాలము దాఁటిపోయినది! కాని రామనాథునిపై గుండు పడలేదు!! కారణ మేమి!!

సోమనాథుఁ డాయింటిలోఁ దూఱుచుండుటనుగాంచి కుశాలవుఁడు సహిత మాతని వెంబడించి వచ్చెను. అచటనుండు యింటిలోనిమార్గ

మతికష్టప్రదమై యుండుటచే దానుననుసరించి రాఁజాలఁడయ్యెను. కొంత యాలస్య మైనది. ఇంతలో సోమనాథుఁడు గుండు నెత్తికొని వచ్చి రామనాథునిపైఁ బడవేయ సిద్ధుఁడై యుండెను. ప్రమాద మేదో జరుగునని యూహించిన కుశాలవుని యూహ నిరర్థకము కాలేదు. అతఁడతికష్టముతో [illegible] సోమనాథుఁ డాస్థితియం దుండెను! తోడనే వాఁడాతనిని సహజబలయుక్తం బగుదోర్బంధముచే సోమనాథుని [illegible] పోటు పొడిచి యారాతిని దీసి యావలఁ బాఱవైచెను. ఆ వేటునకు దాను భూమిపైఁ బడి దొర్లెను. కుశాలవుఁ డాతనికి మరల లేచుట కవకాశము నివ్వలేదు. వానిపైఁ బడి పిటికెటిపోటులచే ప్రాణములను సగము దీసివైచెను. ఇంతలో మోహనచంద్రుఁ డాతనికి సహాయముగ వచ్చి తనమీఁదనుండివస్త్ర సహాయమున సోమనాథుని కాలుసేతుల బంధించివైచెను—ఒక్కక్షణ కాలములో నింతపని ! దైవమాయలాశ్చర్యము లాశ్చర్యములు !!

సోమనాథునకుఁ గదలుటకుఁగూడ వీలు లేకపోయినది. కుశాలవుఁడు బంధనములను మఱింతబిగువుగఁజేసి నోట గుడ్డలు గ్రుక్కెను. అతఁడిఁకేమియుఁ జేయఁజాలక యూరక కన్నుల నిప్పులు రాల్చుచు పడియున్నచో మూల్గుచు పొరల యత్నించుచుండెను. మోహనచంద్రుఁడాసమయమున గంతులు వైచుచు కేకల వైవసాగెను. కుశాలవుఁ డిదివఱ కాతని నంతగ గమనించి చూచియుండలేదు. రామనాథుఁ డెందుండినది యాతనికిఁ దెలియదు. అందుచే చుట్టును జూచి యొక మాటెలుగెత్తి "బాబూ ! రామనాథ్ !" అని కూసెను. ఇంతలో నావసుధామార్గమునుండి "కుశాలవా ! కుశాలవా !" యనుమాటలు వినవచ్చెను. తోడనే వాఁడచటికి పరుగిడిపోయి చూడ రామనాథుఁ

డింకను యథాస్థితియుండే యల్లాడుచు గాతరనయనములతోఁ బైకి చూచుచుండెను.

కుశాలవుఁ డాతని గాంచి విస్మితుఁడై "బాబూ! ఎంతటి సాహసము! ఎంతటిపని చేసితిరి?" అనెను. రామనాథుఁడు నగుచు "ఇది పత్తేదారులపని కుశాలవా?" యనెను. అతఁడంత ధైర్యము నవలంబించి "సోమనాథుఁ డేఁడీ?" యనెను. "వానికిఁ దగినశాస్తియైనది. మీరు త్వరగఁ బైకి రండు?" అని కుశాలవుఁడు చెప్పుచుండుట నాలకించి "అట్లనా! అయిన బ్రతికితిమి" అనుచు బిరబిర రామనాథుఁడు పైకిఁ బ్రాఁకి రాఁదొడంగెను. అతఁడు ద్వారమును సమీపింపఁగనే మొదట కుశాలవుఁడు మిగులభారముగఁ దోచుచుండిన సరోజిని నెత్తుకొనెను. పాప మామె మూర్ఛిల్లినది. మోహనచందు పరుగిడి వచ్చి యాబాలిక నెత్తుకొని తొడపైఁ బరుండఁబెట్టుకొనెను. కుశాలవుఁ డించుక జలమును ముఖమునఁ జల్లి శైత్యోపచారములఁ గావింప నారంభించెను. ఇంతలో రామనాథుఁడు బిలమార్గమునుండి యీవలి కరుదెంచి జరిగినసంగతులను గాంచి యత్యాశ్చర్యనిమగ్నుఁడై తనసేవకుని గాంచి "ఏమిది?" అనెను. వాఁడు నవ్వుచు "అది పాపమునకుఁ బరిణామ—శిక్ష" అనెను. ఇంతలో బాలికకు తెలివి వచ్చినది. ఆమె కన్నులఁ దెఱచి చూచెను. అప్పుడు తాను రామనాథుని భుజాసనమున నావాయుమార్గమున సల్లాపక దనతండ్రియూరుభాగమున పరుండియుండుటను గాంచి యెంతయు సంతసించెను. దురాత్ముఁడగు సోమనాథుఁడు తనపై శిలాపాతమును జేయుసమయమున నాయబల యాభయంకరదృశ్యమును గాంచి కెవ్వునఁ గేకవైచి రామనాథునిభుజప్రదేశముననే మూర్ఛిల్లి యుండెను. పత్తేదా రప్పుడామెను గాంచి "సరోజినీ! రమ్మా, నిన్ను బాధించుచుండిన

మృగమును జూపింతు " ననెను. సరోజిని నగుచు "అయ్యా! నన్ను బాధించుచుండినది మృగము కాదు. మృగజాతిలో మృగముని చెప్పందు" అనెను. ఆ మాటలను విని కుశాలవుండు రామనాథుండు పకాపక నవ్విరి. మోహనచంద్రతిహర్షముతో చప్పటలు చఱచెను. సోమ నాథుండు గర్జించెను.

కుశా : బాబూ! రామనాథ్! మనమింక నెంతకాలమును డడయరాదు. ముందు కార్యక్రమమును జరుపుటకై యింటి కేఁగుదము లెండు.

సరో : మే మేయింటికి రావలయును?

రామ : సరోజినీ! నీవును మీ తండ్రియు మా యింటికి రండు.

సరో : మా యూరికిఁ బోవలదా?

రామ : వలదు. ఇప్పుడు వలదు. సుఖముగ మా యింటఁ గొన్నిదినము లుండినపిదప కృష్ణనగరున కేఁగవచ్చును.

సరో : అయ్యా! ఇప్పుడైన మీ రెవ్వరో తెలిపెదరా? మిమ్ముల నొక దేవత యనుకొందును. రామనాథుఁ డామాటలకు హాసించుచు "నేను నిన్నొకప్పుడు దేవీమూర్తి యని తలచియుంటిని. నీవు నన్నిప్పుడు దేవత యని చెప్పుచున్నావు. నిక్కముగ మన మీలోకములో మానవమాత్రులము. నేనొకప త్తేదారు. నీవొక బాలికామణి" యనెను. సరోజిని యా మాటల నాలకించి లజ్జాన్వితయై తండ్రియొడిలో తలదాఁచుకొనెను.

అప్పుడు రామనాథుఁడు దాసును జూచి "అయ్యా! సోమనాథ దాసుగారు! ఇదిగో మీయింటిని మీకప్పగించివైచినాను. మీరు భరతపురమున కేఁగి యుందు రనుకొందును. శ్యామలను తో డ్తెచ్చితిరా?

అయిన నాకిప్పు డామెను చూచుట కవకాశము లేదు, మఱియొకప్పుడు వత్తునులెండు. అయిన నీ సుందరినిమట్టు కెప్పటికిని మఱువకుండు. ఇది మీ కెంతయు నుపకారిణి" అని చెప్పుచు నాతఁ డేకఁ దడయక సరోజినీ మోహానచంద కుశాలవులతో నా యిలు వదలి వెలుపలికి వచ్చి వెంటనే దానికి బీగములను వైచి భద్రపఱచిరి—సోమనాధుఁ డేమిచేయును? వారు వెడలిపోయిన దిక్కును గాంచి మూల్గుచు నయనగోళములనుండి యగ్నిని బ్రసరింపఁజేయుచుండెను !!!

# ఐదవ ప్రకరణము

ఆ నం ద ము

రవీంద్రుఁడు మోమెత్తి శ్యామలవైపు దిలకించిచూచెను. ఆమె పాపము సన్నగిలి కాంతి మాసి యుండెను. ఆశంపాదీప్తదేహకాంతు లిప్పు డడఁగిపోయినవి—ఆ మోహనలావణ్యమయముఖతేజ మాఱిపోయినది — ఆ హిమధామ ప్రభాసదృశహాసచిహ్నము లెగిరిపోయినవి—శ్యామలాంబ—కోమల వినీలకంజదళాక్షి యగుశ్యామలాంబ—నేఁడు మూర్తీభవించినశోక దేవతవోలె వచ్చి యొకయాసనమునఁ గూర్చుండెను. ఆమెదుస్స్థితిని జూచి రవీంద్రుఁడు చాల చింతించి యానారీశిరోమణి భర్తృవియోగ దుఃఖమున నిఁక చాలకాలము జీవింపదని తెలిసికొనెను. అప్పుడు బిందువాసి యాతనితో నిట్లనెను. "అయ్యా! ఈమెయే మా యజమానురా లగుశ్యామలాంబగారు. మొదట మీ పరిచయము గొంత మాకు కలిగించుట మంచిది."

రవీం : అందు కెట్టియడ్డంకియును లేదు. అమ్మా! నేను కలకత్తాపురవాస్తవ్యుఁడ నగునొకపత్తేదారుండను. నన్ను రవీంద్రుఁ డందురు. మీరు నన్ను లాఁతివానిగ నెంచకుఁడు. మీకత్యంతశుభమును గూర్చునిమిత్త మిచ్చటికే తెంచితిని.

బిందు : ఇచ్చట మా కెట్టిశుభమును గూర్తురు!

రవీం : మీకుఁ బ్రాయశః చంద్రనగరు కేశవపాలుఁడుగారి హత్యవిషయమై తెలిసియుందు ననుకొందును.

బిందు : అవును. ఆ విషయమునసే మా దుఃఖముల కంతవే లేకుండఁబోయినది. అయిన దానితో మీకు సంబంధ మేమి ?

రవీం : కేశవపాలునిజామాత యగునానందసాగరుని వేఁడికోలు లపై నేనీహత్యాపరాధకులఁ బట్టనిశ్చయించి తిరుగుచున్నాను. నే నిప్పుడు చంద్రనగరున విడిసి నా కార్యక్రమమును జరుపుచున్నాను.

బిందు : అయిన మీకిప్పు డీపురమునం దేమిపని యుండెను ?

రవీం : నేనిప్పు డాహంతకులజాడలు పరయుచు నిచ్చటి కరు దెంచితిని.

శ్యామ : ( ఆశ్చర్యమున ) ఏమి, భరతపురమునందా యాహం తకు లున్నారు ? ఈ పురివారలా యాపనిని గావించినది ?

రవీం : అమ్మా ! వారేపురివారలో నాకు బాగుగఁ దెలియదు. ఇచ్చట నేమైన వారుందు రేమో యని యనుమానించి వచ్చితిని.

బిందు : అయ్యో ! పోలీసువారిచేతల నెఱుఁగుట మిగుల కష్ట మండి. వారెవరితో విశేషస్నేహమును కలిగియుందురో యట్టివారినే కడకు దోషులని నిరూపింతురు. వారితో నేస్తము పాములో చెలి లాటము. వారి కెట్టిసమయములం దెట్టియనుమానమును గలుగు చుండునో తెలిసికొనుట కష్టము.

రవీం : ( నగుచు ) అమ్మా ! అట్లనకుఁడు. వారికి నిష్కారణ ముగ నొకరిపై ననుమాన మొదవదు. వారిదోషనిరూపణ లనేకకారణ ములపై నాధారపడి యుండును.

బిందు : అది యుండనిండు. మీరు మాయింటి నన్వేషించు కొనుచు వచ్చుచుండిరే. ఇచ్చట తమ కేమిపని ?

రవీం : నేనీగృహమేధి యగు శాంతినాథులవారి విషయమై కొంతవఱకు మీనుండి తెలిసికొని పోవలయునని వచ్చితిని.

బింక : అడుగుండు.

రవీం : శాంతినాథుని దొంగలెత్తుకొనిపోయి యెన్నిదినము లైనది !

శ్యామ : అయ్యో ! ఆ యుదంతము నేల మరల జ్ఞాపకమునకుం దెత్తురు. దానిని జెప్పనలయునన్న నా ప్రాణము లెగిరిపోవును.

రవీం : తల్లీ ! నేనొక్క విషయమును దెలిపెదను వినుండు. ఇందున మీ కెట్టిసంకటమును గలుగుచుండుట లేదు. మీరు నన్నీ కార్యమునందును నియమింపక పోయినను నేనే యదృచ్ఛావృత్తిగ నీ రహస్య భేదనకార్యములందు దిగి శాంతినాథాదుల నెత్తికొనిపోయిన చోరుల జాడల నెఱుంగ యత్నించుచున్నాను. నేను దీనిని కేవల పరోపకారబుద్ధిచే చేయుచుంటిని గాని యన్యము కాదు. మీరు నన్ను వేఱుగం దలంపకుండు.

శ్యామ : అయ్యో ! అయిన మీరీయభియోగమును గైకొని పనిచేయుచున్నారా ! ఎంతవఱకు పని సాగించితిరి ?

రవీం : ఆ విషయమును జెప్పుటకుం బూర్వము నా ప్రశ్నకుత్తర మొసంగుండు. శాంతినాథుం డింట లేక యెన్నిదివములైనది !

శ్యామ : సుమా రెనిమిదిమాసము లైయుండును.

రవీం : అతండు పోవుట కెంతకాలమునకుముం దాతనిబిడ్డ లపహరింపంబడిరి !

శ్యామ : అయ్యో ! ఒకదినముననే రెండును జరిగిపోయినవి—పగటిపూట బిడ్డలు పోయిరి—రాత్రి భర్తపోయెను. (అని యొక నిట్టూర్పు విడిచెను.) ఆమె నేత్రకమలమునుండి బాష్పకణములు రాలుచుండెను. అది గాంచి రవీంద్రుండా ప్రసంగము నాంపివైచి వేరొకసంగతి నెత్తెను.

రవీం : అమ్మా ! మీరు వారిని గనుఁగొనుటకుఁ నెట్టి ప్రయత్నములకు జేయలేదా ?

శ్యామ : చేయుటకేమి ? సర్కారువారి కీసంగతిని దెలిపి వార్తాపత్రికలం దీవిషయములను ముద్రింపఁజేసితిమి. వారును చాలకాలము వఱకు వెదకి తుదకు విసిఁగి చల్లఁగ కూర్చుండిరి.

రవీం : మఱెట్టి ప్రయత్నమును జేయ లేదా ?

శ్యామ : ఇంకను లేదు. ఇఁక ముందు మీబోఁటిసుప్రసిద్ధ రహస్యాపరాధ పరిశోధకులలో నొకరిని నియమింప నిశ్చయించి యుంటిమి. కాని, నేఁడు దేవుఁడే మిమ్ము మాయొద్దకుఁ దెచ్చిపెట్టి మా కష్టములను దీర్ప యత్నించెను.

రవీం : అమ్మా ! నేను మీయనుమతి లేనిదే యీ విషయమున జోక్యమును గలుగఁజేసికొని చాలవఱకుఁ బనిని గావించితిని. మీరు మీదుఃఖములను మఱచుకాల మాసన్నమైనది. త్వరలో శాంతినాథుని జూడఁగలరు.

ఈ మాట లాలకించినక్షణముననే శ్యామలాబిందువాసు లత్యంతాశ్చర్యచకితులై - " ఏమి, యేమనుచుంటిరి ! మీరు మావారిని గాంచి వచ్చితిరా ? " యని యడిగిరి.

రవీం : కూర్చుండుఁడు. మీకంతయుఁ దెల్పెదను. శాంతి నాథుని నేఁగాంచినది నిజము. మీ పిల్లలనుసహితము జూచివచ్చితిని.

ఆ స్త్రీలవిస్మయానందము లపారములై మైమఱపించుచుండెను. వారెట్టిమాటలను వినుచుండినది, ఎట్టితావునం దుండినది మఱచి యనేకగతులఁ దమభావప్రకటన గావింప మొదలిడిరి. శ్యామల తన భర్తయు పిల్లలు జీవించి సుఖముగ నుండిరను వార్త నాలకింపఁగనే యొక్క యుదుటున లేచి నిలుచుండి "అయ్యా! వారెందున్నారు! వారు

క్షేమమా? మీ రెప్పుడు చూచి వచ్చితిరి? ఏమైనఁ జెప్పిరా?" యని యనేకము లగు ప్రశ్నల వైచుచు రవీంద్రుని యాపాదమస్తకమును జూడ మొదలిడెను.

రవీం: నేను కేశవరావుని జంపినహంతకులఁ బట్టఁ దిరుగుచుండుతఱి మీ వారినందఱిని చంద్రనగరున నొకచోఁ గాంచితిని. వారు మిగుల కష్టదశయం దున్నారు. కాని ప్రాణభయ మేమియు లేదు.

శ్యామ: దానినే మేము కోరినది. ఇంకను గొన్నిదినముల మీఁదట మా యొద్దకు వచ్చిన రానిండు. ఎందైన సుఖముగఁ నుండినఁ జాలును.

ఆకస్మికముగ నీయానందావేశముచేత నా శ్యామల బిందు బాహుబంధనమునఁ బరవశయై పోయెను. వయస్య యామె నొడియందు పరుండఁబెట్టుకొని శైత్యోపచారములు గావింప నారంభించినది. ఇంతలో నా గదిలోనికిఁ బుష్పమిత్రుఁ డరుదెంచుటయును దటస్థమయ్యెను. ఆతనిని గాంచి బిందువాసి సంతోషసంభ్రమమున "అయ్యా! మీ బావగారు పిల్లలు సుఖముగ నున్నారఁట. చంద్రనగరున చాల కష్టములలో నున్నారంట" యని కేక వేసి చెప్పెను.

ఆమాటల నాలకించి యాతఁడు సహిత మనూనంబగు వింతచూపులతో "ఏమే, బిందు! మా వారు జీవించియున్నారా? ఎవ్వరు చెప్పిరి!" అనెను. "అదిగో, అచటఁ గూర్చున్న పెద్దమనుష్యుఁడు చెప్పెను. ఆతఁ డొక పత్తేదారు. వారిని గన్నారఁ గాంచి వచ్చినాఁడట" అనుచు రవీంద్రునివైపు వ్రేలితోఁ జూపెను. పుష్పమిత్రుఁ డాతనిని నిశ్చల వీక్షణములతోఁ బరీక్షించి "అయ్యా! ఈసంగతి నిజమా?" అనెను.

రవీం : అవును. అంతయు నిజము. ఇందావంతయు నసత్యము లేదు. ఇట్టితాపులం దబద్ధము లాడుటచే మాకు వచ్చులాభ మేమి?

పుష్ప : మీరు వారి నెప్పుడు తిలకించితిరి?

రవీం : సుమారు నాల్గుదినములక్రిందట. అనఁగా కడచినకుజ వారమురాత్రి మూఁడుగంటలసమయమున.

పుష్ప : చంద్రనగరమున వారేస్థలమం దున్నారు?

రవీం : అయ్యా! ఆ విషయము నిప్పుడు చెప్పుట చాల కష్టతరముగ నున్నది. వారిని విడిపించి యేవిధముగనైన మీపాలఁ జేర్ప నేనహోరాత్రము లన్నపానీయంబుల మాని శ్రమ లొందుచున్నాను.

పుష్ప : ఆర్యా! ఇంతటి యవ్యాజానురాగంబుచే మాకై పాటుపడుచున్న మీరెవ్వరో దేవతలు కాని సామాన్యులు కారు. మాపై మీకింతటి యపారకరుణ కలుగుటకు మా పూర్వార్జిత సుకృతఫలము గాని యన్యము కాదు.

ఇంతలో శ్యామలకు తెలివివచ్చి "అన్నా! అన్నా! నీవన్న దెంతయు నిజము. ఇంతటి సుఖవార్తలను దెచ్చి తెల్పిన యీమహాత్ము నేగతిఁ బూజింపవలయునో దోఁచకున్నది" అని యామె చటాలున వచ్చి పుష్పమిత్రునిపార్శ్వమున నిలుచుండెను.

రవీం : తల్లీ! నన్నింత యుగ్గడించుట కిందున నేఁ జేసిన దేమి కలదు? నావిధ్యుక్తకార్యాచరణము గాదా దీనుల రక్షించుట? నేనీ యుద్యోగమునందు కేవలలోకోపకారార్థము దిగితిని కాని ప్రతిఫలాపేక్షచే కాదు. నాయపరాధపరిశోధకోద్యోగ మీరీతి పలువుర నానందపరవశులఁ జేయుచుండ నేనెంతయు మురియుచు దేవుని బూజింపవలసి యుండును.

పుష్ప : అయ్యా! మాసంగతి నంతటిని నింతకుఁ బూర్వము మీా కెవరు చెప్పియుండిరి ?

రవీం : నాకొకరు చెప్పలేదు. వార్తాపత్రికల మూలమున నాకీయుదంతములు తెలియవచ్చినవి. అయిన మఱియొకమాట. శాంతి నాథుని ప్రథమభార్యసంతాన మెందున్నది ?

శ్యామ : అయ్యా! ఆ విషయమును జెప్పుటకే సిగ్గగుచున్నది. దానిని నేఁ జెప్పరాదు.

రవీం : అమ్మా! ఇవి దాఁచియుంచఁదగిన సమయములు కావు. ఎట్టిరహస్యములైనను సరియే మేము వినకతప్పదు. అందువలన మా కెంతయో యుపయోగము కలదు.

పుష్ప : వార్తాపత్రికలను చూచియున్నానంటిరే, యందు లోనే యీా విషయము వ్రాయఁబడి యున్నది కాదా !

రవీం : అందది యంతవిపులముగ లేదు. ఆమె ప్రస్తుతవాస స్థానమును గుఱించి యడుగుచున్నాను.

పుష్ప : అది మాకును దెలియదు. ఆమె యిలు విడిచి పోయినపిదప నెచటి కేఁగినదో, యిప్పు డెచ్చట నున్నదో యెవ్వరికిని దెలియదు. మా యింటనుండిన యొకకృతఘ్నుఁ డామెను తస్కరించు కొని పోయెననిమాత్ర మెల్ల రెఱుఁగుదురు.

రవీం : ఆ కృతఘ్నుని పేరేమి ?

పుష్ప : వానికి వానితలిదండ్రులు వీరబలుఁడని పేరిడి యుండిరి. మా బావగా రప్పుడప్పుడు వానిని వానితండ్రిపేరఁట "భైరవపాలుఁ డ" ని కూడ పిలుచుచుండెను.

రవీంద్రుని హృదయగతంబై యున్న మఱియొక చింతాశల్య మూడిపోయినది. ప్రవాళుఁ డొకఁడే వీరబలుఁ డనియు, భైరవపాలుఁ డనియు మూఁడు పేరులు గలిగియుండెను. ఆ వీరబలుఁడే ప్రవాళ

నామమునఁ జంద్రనగరునఁ దిరుగుచుండెను, కాని రవీంద్రుఁడు వారితోఁ బ్రవాళుని మరణవార్తను గాని, వారికుమారుని యుదంతమును గాని, యమలచర్యలను గాని చెప్పలేదు. వారికి వాని నిప్పుడే తెలియఁజేయ రాదని యాతని కోరిక.

రవీం : ఎన్ని సంవత్సరములకుఁబూర్వ మూ వీరబలుఁ డామెను సంగ్రహించుకొని పోయెను ?

పుష్ప : సుమారు మూఁడునాలుగువత్సరము లైపోయినది.

నేఁడు రవీంద్రుని మూలమున శాంతినాథుని గృహమునం దెప్పటి యానందము నెలకొల్పఁబడెను. అందఱుఁ బోయినవారిని గాంచినట్లు ముద మొందిరి. శ్యామల శుష్కముఖమునందు లావణ్య మంకురించెను. ఆ చిఱునగవు లతిశయించెను. ఆనాఁడు వారెన్నియో దేవతల నుపాసించిరి. రవీంద్రునకు వేయివందనములఁ బెట్టి యాతని నాయూరనుండు నంతకాలము దమయింటియందే యుండునట్లు వేడికొనిరి. అందుల కాతఁ డియ్యకొనెను.

# ఆఱవ ప్రకరణము

## హత్య

పశ్చిమకాంతాధృతభానుబింబఫల మవాప్తగతిని వచ్చి యామె నీలాంబరోత్సంగమధ్యభాగమునఁ బడిపోయెను. అప్పుడా నీలవసనద్యుతి లోకమునకుఁ గాన్పించుచుండెనే కాని జ్యోతిర్లతాసమూహప్రభ లదృశ్య మొందెను. చరమ దిక్కాంతాచేలము నీలము—తత్కాంతినీలము— జగ మంతయు నీలవర్ణవిరాజితమై పోయెను—అదియే గాఢాంధకారము ఆ తరుణీమణి యనన్యదుర్లభంబగు దివాకరబింబఫలము నొసంగినందుల కానందాతిశయమునఁ గాలపురుషునిపై ముత్యాలు జల్లెను—అవియే తారకలు ! అది గాంచి ప్రకృతికాంత కిలకిల నవ్వెను— అవియే విహంగసంతానకూజితారవములు ! కాళరాత్రి కాలపురుషునితోడ నేస్త మొనరించి తిరుగుచు వీని నన్నిటిని లక్షించుచుండెను—అప్పుడే ప్రపంచరంగమున నిశీథాంకము ప్రారంభమైనది—ఆ రాత్రి భరతపురపు పెద్దబజారున నొకసమున్నతరూపవిరాజితుం డగు గౌరవపురుషుండు నడచి పోవుచుండెను—అతఁడే మనరవీంద్రుఁడు !!

అతఁ డొక్కచోటునందైన నిలువక నడచుచుండెను. అతని కాస్థలమంతయుఁ గ్రొత్తది, స్నేహితులుగాని, తనకుఁ దెలిసినవారుగాని యుండ లేరు. ఇఁక నాతఁ డెవ్వారింటికిఁ బోవును ? ఎవ్వారితో మాటాడును !

ఎనిమిదిగంటలైనది. ప్రక్కవీథియందు విశేషముగ శబ్దమగుచుండెను. జనులసందడి యెక్కువగ నుండెను. అది యేమి యుండెదియో విశేషము జరుగుచుండు నని యెంచి రవీంద్రుఁ డచ్చట నున్న యొక సందుత్రోవ ననుసరించి యాచోటికిఁ బోయి చూచెను. జనులనేకులాకచో మూగి దేనినో తిలకించుచుండిరి. కొందఱు చేతులందు ఖడ్గములును, మఱికొందఱు దుడ్డుకఱ్ఱలును ధరించి మూలమూలలకు, వీథివీథికి, సందుసందునకుఁ దిరుగుచు వెదకుచుండిరి. పోలీసువారనేకులాతావునకుఁ బరుగిడి వచ్చి యచ్చటిమనుష్యుల నేమేమియో యడుగుచు దామును ఆయుధసమేతులై యటునిటు బరుగులిడుచు దేనినో వెదకుచుండిరి. రవీంద్రున కందేమియు నర్థము కాలేదు. పరుగిడి పోవుచున్న యొకరిద్దఱి నాపి సంగతి యేమని యడుగగా వారైన సరియగు నుత్తర మొసంగక "హత్య! హత్య!" యనిమాత్ర మఱచుచుఁ బోవుచుండిరి. అతఁడు విస్మితుఁడై "హత్యయా! ఎవరిది?" యని తనలోఁ దానుకొని యామూల యుండుస్థలమున కేతెంచెను. ఇంతలో నాతని కాగుంపున నొకపురుషుఁడు గాన్పింపగనే రవీంద్రుఁడు తటాలున నాగిపోయి వానిని దదేకదృష్టులతోఁ బరీక్షింపసాగెను. వ్యక్తి యది గాంచి యించుక యాతనిచూపులనుండి తొలఁగి నిలుచుండెను. కాని పత్తేదారాతనిని విడుచుట మానలేదు. కదలక నిలుచుండి యనుమానపూరితహృదయముతో నల్లే చూచుచుండెను. ఆ పురుషుఁ డంత నిఁక నచట నిలుచుండ నేరక తిన్నగ నడుచుచు నానరసమూహమధ్యమున నదృశ్యుఁడు కాఁదొడఁగెను. రవీంద్రుఁడు సహింత మప్పు డిఁక నూరక నిలుచుండక గట్టిగ "ఆ మనుష్యుని బట్టుఁడు, కదలనియ్యకుఁడు" అని యఱచుచు నాతైపునకుఁ బరుగిడెను.

ఆ గుంపులోనివా రాకేకలను విని రవీంద్రుని గాంచి "ఏమిది? ఎవరు వారు?" అని యడుగుచు నచ్చటికి వచ్చిరి. అతఁడావ్యక్తి

పోయినదిక్కును జూపుచు "ఆ వైపున కేగినమనుష్యుని బట్టుఁడు. వాఁడే హంతకుఁడు" అని యఱచెను. జనులలో గందరగోళము మఱింతవృద్ధి యయ్యెను. వారందఱాదిక్కునకుఁ బరుగిడి పోయి చూచిరి. అచ్చట నెవరును లేరు. మనుష్యుఁడు గాన్పించుటలేదు. వాఁడేమూలకుఁబోయి దాఁగుకొనెనో వాఁడెవ్వఁడో యెవ్వరికిఁ దెలియదు. పత్తేదారా తావు నంతటిని బరీక్షించి చూచెను. అందునఁగూడ నెట్టిలాభము లేక పోయినది. ఆ పురుషుఁ డెవ్వఁడు? రవీంద్రుఁ డాతని నెందో చూచి యుండెను. ఎందో యననేల? చంద్రనగరుననే. ఆనాఁటిరాత్రి జానా బజారుతోఁటలోను, అమరగృహసమీపమునను గాన్పించినకరాళుఁడే వాఁడు. రవీంద్రుఁడు వానిని బాగుగ నెఱుఁగును—వాఁడే వీఁడు.

కరాళుఁడు రవీంద్రుని దృష్టిపథమునుండి దాటిపోయెను. ఆతఁ డింక నెవరికంటికిని గనపడలేదు. ఎవ్వరికి వానితో పరిచయమే లేదు. వాఁడొక్కక్షణకాలములో నందఱికన్నులలో దుమ్ముజిమ్ముచుఁ బోయెను. పత్తేదారుఁ డప్పు డేమిచేయును దోపక యూరక నిలుచుండెను, ఆతని వాలకమును గాంచి యచ్చటివా రాతని నొకయుద్యోగిగా నెఱింగి "అయ్యా! మీరెవ్వరు? ఆ పురుషుని మీరెట్లు హంతకునిగ గుర్తిడితిరి?" అని యడిగిరి. రవీంద్రుఁడు వారికిఁ దనపరిచయమును గలిగించి యా చంపఁబడినవ్యక్తిని జూడ నచటి కేఁగెను. పోలీసువా రాతనివంక అపరాధపరిశోధకోద్యోగిగ నెఱిఁగిన వెంటనే వచ్చి చుట్టును మూగిరి. రవీంద్రుఁడు వారిసహాయమున నా మృతదేహము పడియున్న తావున కేఁగి దానిని బరీక్షించి చూచెను—ఆమె యబల యగునొక స్త్రీ !!!

వేషభూషణాదులఁ గాంచ నామె యొక గొప్పయింటివారి యువతివలెఁ గన్పడుచుండెను. ముఖమంతయు రక్తసిక్తమై యుండి రూపు మారి యుండెను. ఆమె వక్షోభాగమునుండి యేకధారగ నెత్తురు

ప్రసవించుచుండెను, రవీంద్రుఁడు చాలసేపటివఱకుఁ బరిశీలించి చూచి హాత్య కొంతకాలము క్రిందటనే జరిగినట్లు తెలిసికొనెను. అతఁడంతి నట నిలుచుండియున్న రక్షకోద్యోగిని గాంచి "అయ్యా! ఈమె యెవరో తెలిసినదా?" అని ప్రశ్నించెను.

రక్ష : ఆ విషయము బాగుగఁ దెలియదు. ముఖము నించుక నీటిచే కడిగి చూచిన బాగుండును.

రవీ : హత్యాపరాధకు లెవ్వరు?

రక్ష : అది మాకింకను దెలియదు. ఒకయరగంట కాలము క్రిందట నీ జనులసందడి నాలకించి యిటు వచ్చి చూడ నీమె యీ యవస్థయందు పడియుండెను. ఎవ్వరి నడిగినను "మీకెంత తెలియునో మాకంత తెలియును." అని చెప్పుచున్నారు.

రవీం : అయ్యా! ఇంచుక జలము దెప్పించిన బాగుండును. ఈమె ముఖము నించుక కడుగుదము.

రక్షకోద్యోగి యుదకమును దేఁబోయెను. రవీంద్రుఁ డచటనే కూర్చుండి యా యనాథస్త్రీదేహమును బరీక్షించుచుండెను. ఆ యబల కింకను బ్రాణములు పోలేదు. మరణావస్థయందు విశేషబాధ ననుభవించుచు నటునిటు పొర్లుచుండెను. నీరమును దెచ్చి యియ్యఁగనే యాతఁ డామెముఖము నంతటిని గడిగి చూచెను—చూచుచుండఁగనే రవీంద్రుఁ డాశ్చర్యచకితుఁ డయ్యెను—ఆ స్త్రీ యెవ్వరు! ఆమె యమల!!!

రవీంద్రుఁడు కొంతసేపటివఱకు నేమియు మాటాడలేదు. తీక్ష్ణ దృష్టులతో నాగుంపునంతటిని గలయఁజూచి యమల నొకమాఱు తిలకించెను. ఆమె ముఖము వివర్ణమై కీలాలప్లుతమై భయంకరముగ నుండెను. అమల కన్నుల దెఱచి యెదుటఁ గూర్చుండియున్న రవీంద్రుని

జూచెను. తోడనే యామె చీత్కారము జేయుచు తనహస్తయుగళముచే వక్షఃస్థలాచ్ఛాదనము గావించుకొని, "గాహాము, దాహాము" అని యఱచెను. తరువాత నాప్రవాహమునుండి నీటి నామెనోటిలో నింత పోసినఁగాని యేమియు ఫలము లేదని యూరక చూచుచుండెను. "ఇది యెట్టి విపరీతము. ఈయమున కిచ్చటి కెట్లు వచ్చినది ! ఎవ్వరీమెను బాడిచి యుండరు ! ఇందు నాకేమియు నర్థము కాకున్నది కదా. ఈ భరతపురిమున నీమె కెవ్వరైనఁ బగతురు గలరా ? లేక నేగాంచిన కరాళుఁడే యేమైన పికార్యము గావించియుండునా ! అంతయు బ్రబలాంధకారావృతమై యున్నది. ఈమె కింకను బ్రాణములు పోలేదు, ఇంకను మాటాడుశక్తి యున్నది. ఇచ్చట నీనడువీథి యందీగొప్పయింటి స్త్రీచరిత్ర మడుగుటకన్న నీమెను శాంతినాథునియింటికిఁ గొనిపోవుట మేలు. అని యీవిధముగ రవీంద్రుఁడు చాలకాలమువఱకు యోజించి యచ్చటనుండినయుద్యోగిని గాంచి యిట్లనెను. "అయ్యా ! ఇందెందైన నొకబండి దొరకునా ?"

ఉద్యో : ఏల ? మీరీమె నెందైనఁ గొనిపోదురా ?

రవీం : అవును. నాబసకుఁ దీసికొనిపోదును.

ఉద్యో : మీబస యెచ్చట ? ఈస్త్రీ యెవ్వరో మీకుఁ దెలియునా ?

రవీం : నేనిప్పుడు భద్రకుంగళోద్యానమున శాంతినాథుని యింటియం దున్నాఁడను.

ఉద్యో : ఈమె వారింటిసతీమణియా ?

రవీం : అవును, శాంతినాథుని జ్యేష్ఠపుత్రి.

ఈమాటల నాలకించినతోడనే యాజనులగుంపునుండి విశేషమగుసందడి బయలుదేఱెను. కొందఱాస్థలమ్మును వీడి పోదొడఁగిరి.

మఱికొందఱు సమీపమునకు వచ్చి విస్మయమున "ఈమె శాంతినాథునితనయయా? ఆహా! ఎంతటిపని జరిగినది!" అని యనమొదలిడిరి. రక్షకోద్యోగి యింకేమియు మాటాడక బండిని దేఁబోయెను. ఇంతలో రవీంద్రుఁడు కమలను గాంచి పలకరించెను కాని యామె మాటాడలేదు. ఊరక హస్తమునచే ముఖమును మూసికొని పడియుండెను.

ఉద్యోగి శకటము నొకదానిని దెచ్చి యాసంగతిని రవీంద్రునకుఁ దెలిపెను. తోడనే యాస్త్రీ నంపుంచుమని యచ్చటిపోలీసువారికిఁ జెప్పి తాను చాలవఱకు రహస్యముగ నేదియో యాయుద్యోగితో మాట్లాడెను. అంత వారిరువురు వేఱొకబండిపై నామొదటిదాని ననుసరించి భద్రమంగళోద్యానముఖులై చనిరి. జనులకల్లోలము చాలవఱకు మించిపోయినది. అనేకులాచిత్రమును జూడ నాశకటముల వెంటఁ బరుగిడసాగిరి. కాని రక్షకభటులయాటంక మెక్కువగుటచే నొక్కరును నాదెస కేఁగఁజాలకపోయిరి. క్రమక్రమముగ వారెల్లఁ దమయిండ్ల కేఁగుచు నోటికివచ్చినట్లెల్ల ప్రేలఁదొడఁగిరి.

## ఏడవ ప్రకరణము

ఆ త్మో ద ం త ము

శకటములు రెండును మంగళోద్యానమును చేరునప్పటికి పదిగంట లయ్యెను. అప్పటికి శాంతినాథుని గృహకవాటములు బంధింపఁబడి వెలుపల నిర్మానుష్యముగ నుండెను. రవీంద్రుఁడు కవాటమును దాసి తట్టుచు లోపలివారిని బిలిచెను. ఇంతలో పుష్పమిత్రుఁడు వచ్చి తలుపులఁ దీయుచు "అయ్యా! రవీంద్రముగారూ! చాలసేపటివఱకు వెలుపల నుండి వందున నింక నీ రాత్రి యిచటికి రారనుకొంటిమి. క్షమింపుఁడు" అనెను. అందుకు రవీంద్రుఁడు నవ్వుచు "ఏమిచేతము. నే నట్లే చేయవలయునని పోయితిని కాని, యత్యంత శీఘ్రకార్యమొకటి మరల నన్నిచ్చటికిఁ బిలుచుకొనివచ్చి యీ నడురేయి మీకుఁ దొందరఁ గలిగించెను." అని చెప్పెను. పుష్పమిత్రున కేమియు నా మాట లర్థము కాలేదు. ఇంటిముందఱ రెండుశకటము లుండుటను గాంచి యనుమానించుచు "ఆ బండ్లెవరివి?" అనెను. "అవి మనవే రెండు. లోపలికి నడువుఁడు. మీకుఁ గొన్నివిషయములను జెప్పెదను," అని చెప్పుచు రవీంద్రుఁ డాతని నింటిలోనికిఁ గొనిపోయెను. పత్తేదారు పరుండియున్న శ్యామలాబిందులను సహితము లేపి జరిగిన యుదంతము నంతటిని చెప్పి యల్లరి చేయకుఁడని హెచ్చరించెను. ఇంటివారెల్లరు భయోదంతము నాలకించి వెఱగుపడి కొంతవఱకుఁ జింతించిరి. రవీంద్రుఁ డుద్యోగిసహాయమున నమలను మోసికొని వచ్చి యింటిలో

నొకపడకపైఁ బరుండఁబెట్టెను. ద్వారములన్నియు వెంటనే బంధింపఁబడెను. అందఱును వచ్చి మరణాసన్నయగునమలచుట్టును గూర్చుండిరి. ఆమె యొకమాఱు కనువిచ్చి చుట్టును బరికించెను. కాని, వెంటనే నేత్రనిమీలన గావించి "హా!—పాపము—పరిణామము—చావు" అని యఱచెను. శ్యామల యామెదురవస్థను గాంచి చింతిల్లుచు "అమ్మా! అమలా! ఏమి యీయనర్థకము? నిన్నెవరీ గతిఁ జేసిరి తల్లీ?" యని కంటఁదడిపెట్టుకొన నారంభించెను. అచ్చటివారెల్ల రామెపూర్వజీవితచర్యల నన్నిటిని మఱచి ప్రస్తుతదుస్థితిని గాంచి పరితపించిరి. అమల మరలమరలఁ దన్నుఁదాను దూషించుకొనుచు "పాపిని—నరకము—ఘోరము—దానవి—చావు—హా—హా" యని యఱచుచు మిగులవేదన ననుభవించుచుండెను. ఆమె యింక చాలసేపటివఱకు జీవించునట్లగపడలేదు. ఇఁకనొకగంట—లేక రెండుగంటలు—పిదప నమల యిహలోకమును వీడిపోవును.

రవీంద్రుఁ డది తెలిసికొని యింక నాలసింపక "అమలా! నన్నెఱుంగుదువా?" యనెను. ఆమె నేత్రస్పందన గావించిచూచి "హా!—సదాసివదాసి—భూతగృహము—రవీంద్రా! రవీంద్రా!—ఎఱుఁగుదును—పాపము—పరిణామము" అని యేడ్వసాగెను. అతఁడు మరల "అమలా! దుఃఖింపకుము. ఎట్టిపాపమును జేసితివి. ఈ మరణకాలమున వానిని జెప్పుము. నీ పశ్చాత్తాపమున నీ పాపములు నశించును. భీతిలకుము" అని హెచ్చరించెను. అమల మాటాడక కొంతవడి నిశ్చేష్టితురాలై పడియుండి మరల నిట్లనెను. "నీవు పత్తేదారుఁడవు కావా?"

రవీం: అవును, నా విషయ మంతయు నీకుఁ దెలిసియుండును. ఏమి చెప్పఁదలఁచుకొంటివో చెప్పుము. ఇదిగో, ఇచట మీ పినతల్లి మొదలగువారు కూర్చుండి నీకై దుఃఖించుచున్నారు చూడుము.

అమల : అయ్యో! నేను ఘోరపాపినిని. నృశంసురాలను. రక్కసిని. ఆ దేవతలు నన్నుఁ జూడరాదు. నాకై దుఃఖింపరాదు. వారు కళంకు లగుదురు. నాపాపమునకు నేనే యడలి యడలి మరణింతును. నాకై యెవరును దుఃఖింపరాదు. దుఃఖించినవారు పాపు లగుదురు.

శ్యామ : బిడ్డా! శోకింపకుము. నీ వెట్టిదాన వైననేమి? నీవు మాదానవు. నిన్ను దూషింపము. నీవు మాయింటియాదిలక్ష్మి వమ్మా—

అమల : కాదు, కాదు, తల్లీ! నేను ఘోరరాక్షసిని, నేను మీవంశము నాశ్ప జనించిన కాలసర్పమును. నన్ను గ్గడింపకుము. నేను పాపినిని. హా! హా! ఈనిముషముననే యేల యీప్రాణములు పోవు. అమ్మా! అమ్మా! నన్ను మన్నింపుము. నాదుడుకుల క్షమించితి ననుము. నే నప్పుడు నిశ్చింతనై మరణింతును. నాశిరముపై గుండు వేసి చంపుఁడు. నేను గతింతును. మీబోఁటిపుణ్యాత్ములు లుండుభూమిపై నేను చాలకాల ముండరాదు. అందుమూలమున మీరపవిత్రు లగుదురు. నేను పాపినిని—పరిణామము—చావు—హా!

శ్యామల యీదుఃఖమును జూడఁజాలకపోయెను. ఆమెనయన ములనుండి యశ్రుధార లవిరళంబుగఁ గాఱుచుండెను.

రవీం : అమలా! వృథా యీకాలహరణ మేమి? చేసినపాపము లను జెప్పుటవలన పాపము నశించునని నీకుఁ దెలియదా?

అమల : తెలియును. రవీంద్రా! అంతయుఁ దెలియును. తెలిసి కొనియే యీగతి పట్టితిని. నాదురదృష్టము—హా!

రవీం : చెప్పుము, వేగముగఁ జెప్పుము, నిన్నెవ్వ రీరీతిఁ బాడి జేసినవారు.

అమల : నాశత్రువు—నావైరి—దురాత్ముఁడు—హా! హా!

రవీం : శత్రువా! వాఁడెవఁడు? ఎందులకు పొడిచెను.

అమల : రవీంద్రా! చెప్పవలయునా? వలదు. వలదు. మా తల్లినన్ను దూషించును. శపించును. నిరసించును. ఈచచ్చుకాలమున వాని ననుభవింపఁజాల. నన్ను మరణింపనిండు. నేచేసినపాపము నాహృదయముననే కుమిలికుమిలి నన్ను దహింపనిండు. దానిని వెలుపలికిఁ బోనివ్వరాదు. అందుచే నేఁబవిత్రురాలనగుదునేమో. అయ్యో! నేనట్లు కారాదు. నావల్ల పవిత్రత యపవిత్రత యగును. నేను పవిత్రురాలను గాకూడదు. రాక్షసు లెప్పుడు నశుచులే—ఘోరాఘపూరితులే.

శ్యామ : అమ్మా! ఏటి కీమాటలు. మమ్మింకనునేల సంకటపఱతువు. నీపాప మెట్టిదో చెప్పుము. మేమెల్లరము నిన్ను క్షమించితిమి. నీపశ్చాత్తాపమును గాంచి దేవుఁడు కూడ క్షమించును. నీవు మాదానవు. నీవేమిచేసినను సైరింతుము. నీవిఁక దుఃఖింపకుము. తల్లీ! నిమ్మళముగ నేమిజరిగినదో చెపుమా. నీకేటి కీదుస్థితి వాటిల్లెను? ఏక్రూరుఁ డీకోమలహృదయమున ఖడ్గప్రహారమును గావించెను?

అమల : మాతా! నాకీయవస్థ కలుగుట నాపాపపరిణామమునఁగాని యన్యము కాదు. ఎట్టిమంచివారైన నాబోఁటివిషసర్పమును గాంచిన సంహరింపక విడుతురా? నేనీపుణ్యభూమియం దుండఁదగినదానను కాను. అదిగో, ఆనరకమే నాశరణ్యము. చూడుమా తప్తశిలాస్తంభమే నానిరంతరవాసస్థానము. ఆప్రళయజ్వాలావహ్నియే నాయాహారము. ఆభీకరతీవ్రకంటకభూమియే నాకు శయ్య. నాకట్టివే యర్హము లగును. అన్యములు నానిర్ణీతభోగములు కావు.

రవీం : అమలా! నీవిచ్చటికి వచ్చుటకుఁ బూర్వ మెందుంటివి?

అమల : చంద్రనగరమున.

రవీం : ఎవరివద్ద?

అమల : దాని నెట్లు చెప్పఁగలను? నాకార్యముల నెట్లు నోట నుడువుదును!

రవీం : చెప్పుము, భీతిలకుము. నీ యనుతాపమూలమున నీ పాపములు నశింపఁగలవు.

అమల : అది నిజమా? అగ్నిదగ్ధమగుసుమ మెన్నటికైన మరల పరిమళించుట కలదా రవీంద్రా?

రవీం : దైవకృప యుండిన నది నెఱవేఱు [illegible]పని.

అమల : నాపై దైవకృప లేదు. ఆతఁడు నన్నుఁ గరుణింపఁడు.

రవీం : అట్లనకుము. ఆతఁడు దీనావనుఁడు. వగచువారిని కరుణచే మన్నించును. పరితాపతప్తు లగువిన్ను నిక్కముగ దయచే పాలించును. భీతిలకుము. నీపాపమునుండి తరింపఁగలవు.

అమల మాటాడలేదు. ఏదియో యోజించుకొనుచుండెను. ఆమె తుదకు రవీంద్రుని గాంచి "అయ్యా! నా జీవితచర్య యత్యంత కలుషపూరితము — అవాచ్యము. దేవుఁ డిట్టికట్టిఁడిపాతకుల నేల సృజించెనో తెలియకున్నది. అయ్యా! రవీంద్రా! నాయంత్యకాలము సమీపించుచున్నది. జరిగినది తెలుపక తప్పదు. అందున నాకించుక మనశ్శాంతి చేకూరువనుకొందును. మీ యందలి క్షమాపణలచే నాపరితాపముచే, నేను కొంతవఱకు నానందింతును. వినుఁడు, చెప్పక తప్పదు. పాపము నశించునను నాశ లేదు. అది యెట్టిపుణ్యముచేతను నశింపదని నాకుఁ దెలియును. అయినను జెప్పెదను, వినుఁడు" అనెను. అప్పుడామె యించుక దాహమని చెప్ప శ్యామల పరుగిడిపోయి యొకగిన్నెలో నించుకశుద్ధోదకమును దెచ్చి యిచ్చెను. అమల [illegible]

ద్రాగుచు "తల్లీ! తెలిసినది. ఇవి నీ పవిత్రహస్తముచే వచ్చుటవల్ల నిక్కముగ నొకపాపనాశకరసాధన మని తలంతును." అనెను. శ్యామల యామెను గాంచి దుఃఖము నాపుకొనజాలక వెక్కివెక్కి యేడ్వసాగెను.

రవీంద్రుఁ డింతలో కాగితముపై నమల చెప్పఁబోవుదాని నంతటిని వ్రాయ సిద్ధుఁడై "ఇప్పుడు చెప్పుము, అమలా! నీ దుఃఖము నంతటిని మఱవుము. ఇచటివారెల్లరు నీ యాత్మీయులే. భీతిలకుము. తలఁచినదాని నంతటిని జెప్పుము." అనెను. ఆమె కొంతసేపటివఱకు నిరుత్తరయై యుండి కడ కిట్లు చెప్పఁదొడఁగెను.

"అయ్యా! రవీంద్రా! ఏమని చెప్పుదును? నోరాడకున్నది. హృదయము సంతాపాగ్నిచే దహించుకొనిపోవుచున్నది. నా తలిదండ్రులకు నేను దప్పజనించితిని. నేను మాయావినిని—రక్కసిని—నా చరిత మత్యంత నింద్యము—కర్ణకఠోరము. రాక్షసిచేతనము లెందును శ్రవణానందకరములుగ నుండఁజాలవు. మీరు వానిని విన్న నన్ను దూషింతురు. అట్లు చేయుక సైరింప నెంతయు ప్రాధేయపడుచుంటిని. చెప్పెదను వినుము. అంత్యకాలమున నెట్టిదానిని దాఁపకూడదుకదా. అంతయు నందుచేతనే చెప్పివేయుదును. నేను జనించిన కొంతకాలమునకే నాతల్లి గతించిపోయెను. మాతండ్రి యగుకాంతినాథుఁడు — ఆహా! ఆ మంగళనామోచ్చారణచే నా హృదయ మానంద మొందుచున్నది!—నన్నుఁ గాంచి తృప్తినొందక కొంత కాలమునకు పుత్రసంతానాభిలాషియై, ద్వితీయవివాహమును జేసికొన నెంచి నీ యెదుటనుండు నీ దేవీమూర్తిని—యీ శ్యామలాంబను—వివాహ మాడెను. ఇంతకుఁ బూర్వమే మాయింట నొకవింత జరిగి యుండెను. ఏమన మా తండ్రికి భైరవపాలుఁ డనునొకమిత్రుఁ డుండ

అతఁడు గతించిపోవునప్పుడు తనకుండిన యొకకుమారుని మాజనకునిచేతి యం దుంచి పోయెను. ఆతఁ డామిత్రపుత్రుని నిజపుత్రునింబోలెఁ బెంచి పెద్దఁజేసెను. ఇంతలో మాతల్లి యగుశ్యామలాంబ యింటి కరుదెంచు టయుఁ దటస్థించెను. ఒక నాఁడు మాపిత యూర లేనియెడ నావీరబలుఁ డనునాతని పెంపుడుతనయుఁడు యౌవనమదముచే నీమెను గామించి మీఁద పడఁబోయెను. కాని యీసతీతిలక మాతనిని దూషించి యీ బాధనుండి తప్పించుకొని ప్రియుఁ డగుశాంతినాథుఁ డరుదెంచినపిదప నాతనితో నీసంగతిని దెల్పెను. తోడనే ఆతఁ డాగ్రహాపూరితచిత్తుఁడై వీరబలుని రప్పించి కొంతధన మిచ్చి వేఱొకయింటియం దుండుమనెను. ఆతఁ డట్లే వాసము చేయుచు వచ్చెను. రవీంద్రా! అప్పటివిషయముల నేమని చెప్పఁదును? వీరబలుఁడు చేయుచుండిన కృత్రిమకార్యముల కెల్ల మోసపడి యాతనిపై నా ప్రేమ నిలిపితిని. అప్పటికే నేను సంప్రాప్తయౌవననై యుండుటచే మాతండ్రి నాకు వివాహప్రయత్న ములు గావింప మొదలిడెను. కాని నేనప్పటి కావీరబలునిమనమునఁ గోరియుండుటచే మా జనకున కాయుదంతము నెఱింగించి నన్నాతని కిమ్మని వేఁడుకొంటిని. కాని, యాతఁ డాసంబంధమున కియ్యకొనక వేఱొకచోఁ బ్రయత్నించుచుండెను. అది నాకు రుచింపలేదు. ఒకనాఁ డీసంగతి నాప్రియునితో నంటిని. ఆతఁ డందులకు "అమలా! ఈయూర నుండుటకన్న వేఱొకచోటికిఁ బోవుట మంచిది. అచటికి రమ్ము. అప్పుడు మనలను మాటాడించువా రుండరు" అనెను. నేనందులకు సమ్మతించి తిని. పిదప నొకనాఁ డందఱు పరుండియున్నతఱి నేరికిని దెలుపకుండ— కృతఘ్నురాలనై —పాపినై —తలిదండ్రుల కెఱింగింపక —వీరబలుని వెంట— కేవలప్రేమప్రవాహపతితనై —పరుగిడిపోయితిని."

"మొదటనే మేము పెండ్లియగుదమని మా భవిష్యద్వ్యవస్థానముగ నిర్ణయించుకొని యున్నదాన నప్పటి కేఁగితిమి. క్రమక్రమముగ నా వీరబలుఁ డప్పటి పుష్టసౌహార్ద్రతతో నేస్తమును కలిగించుకొని మిక్కిలి మంచివాఁడుగ మెలఁగుచుండెను. కాలవైపరీత్యమున నేరీతిగనో నాతనికి మా పినతండ్రి యెడల కేశవపాలుఁడు ప్రాణమిత్రుండై పోయెను, మా స్నేహము దినదినాభివృద్ధి నొందుచుండెను. కాని నేనారీతి వీరబలుని వెంటఁ బరుగిడి వచ్చినవార్త మా పితృవ్యున కేమాత్రమును దెలియరాలేదు. అతఁ డప్పుడప్పుడు మాయింటికి వచ్చుచుండినను నేనాతనికంటఁ బడకుంటిని. ఆదినములందు వీరబలుఁడు తననిజరూపమును పేరును మార్చుకొని ప్రతాపుఁ డనునభిధానమునఁ జుట్టుపట్ల మెలఁగుచుండెను. ప్రాయశః రవీంద్రా! నీకీవిషయము తెలిసియుండ వచ్చును. అయిన నా యంతరాత్మపై సాక్షినుంచి—అఖిలజగదాధారుఁడు సర్వేశ్వరునిపై సాక్షి నుంచి—యొకసంగతినిమాత్రము దెలిపెదను. మీరు దానిని విశ్వసింపకున్నను సరియే. విషయమున సమ్మతము లేదన్నను సరియే. అయిన నానిశ్చయభావము నామదికి గోచరించి యుండుటచే నాహృదయ మంతటితో శాంతి నొందుచున్నది. ఏమన, నే నించుక యువిలక్షితనై పెద్దలఁ దిరస్కరించి, లోకమునకు వ్యతిరేకముగ నే మోహించినవాని వెంటఁ బరుగిడి పోయినమాత్రమున మీరు నన్ను దప్పుగఁ దలంపకుఁడు. నే నాతనిని త్రికరణశుద్ధిగఁ బ్రేమించి యుంటిని. ఆతనిని దప్ప అన్యులఁ జేపట్ట నని స్థిరసంకల్పనై యుంటిని. అతనికై ప్రాణములనైన వీడ సంసిద్ధనై యుంటిని. ఇంతయు నాయేక పతిహితాభిలాషయే కాని యన్యము కాదు. వీరబలుని నాపరదైవముగ సేవించితిని. మఱియొకమాట దెల్పెద మహాశయులారా! మాయిరువురకును విధ్యుక్తవివాహావిధులమూలమునఁ బరిణయము గాకున్నను, పెద్ద లిచ్చగించి నన్ను తగినవరున కియ్యకున్నను, పలువురు మాచేతల

నాలకించి యానందింపకున్నను — మా ప్రణయ శృంఖలము మాకెట్టి లోపములను గావింపక విధ్యుక్తవివాహమంత్ర బంధితవధూవరుల ప్రేమ ప్రవాహమునకన్నను మా యన్యోన్యానురాగము నెక్కుడు గావించెను. నేను వరింపరానంత కాతం డధమజాతుండు కాండు. అప్పటికి నందటివలె కులయుక్తవిద్య నభ్యసించి నిపుణతఁ సంపాదించిన వాఁడే. అందుచే వరించితిని. అందుచే తండ్రిని నిరసించి యతనితో పరుగిడి పోయితిని. అంతియే కాని నేను దూషితనగుటకు కులటఁగాను సుమా! పతివ్రతాచరణమును సాధ్యమగునంత వఱకు నెఱపితిని. తుద కది కష్టమై తోఁచినపు డీరీతిగఁ బ్రాణముల వదలుచున్నాను. నా మానసంరక్షణార్థము నే పడినపాట్లు మీకుఁ దెలియవు. ఇందు కా సర్వసాక్షి యగు సర్వేశ్వరుఁడే సాక్షి. అయిన నే నెందుకు దూషిత నందురా? యొక కారణము మూలమున నే. ఏమన, చిన్ననాఁటినుండి పెంచి విద్యాబుద్ధులఁ గఱపినతండ్రి యని దలంపక యాతనిని కాదని యాతఁడు నిరసించియుండిన పురుషుని వరించి పాఱిపోవుటే. అయిన నిది తప్పని దలంతురా? అది కాదని నా యభిప్రాయము. పూర్వము కృష్ణభగవాను నాశించియుండ నిజజనకుఁడు తనొక్క రాజాధమునకుఁ గట్టనుండ నది సరిపడనందున రుక్మిణీదేవి యా ద్వారకానిలయుని వెంట పరుగిడి పోలేదా? అంతమాత్రమున నే యామె సుగుణ మతిదూషిత మైనదా! కాన, మీరు నన్ను వేఱుగఁ దలఁపకుఁడు. ఇదియే నా ప్రార్థన. అయిన నే నేటికి దుఃఖంతు నందురా? చెప్పెద నాలకింపుఁడు, క్రమక్రమంబున నా దురదృష్టవశమున వీరబలుఁడు మద్యపానాసక్తుఁడై, దుర్వ్యసనములఁ దవిలి, దురాత్ములతో కుతంత్రములఁ బన్నుచు నామనమునకు చాల వ్యథనుగలుగఁజేసెను. నేనెంత హెచ్చరించి వేఁడుకొనుచుండినను అతఁడు నా మాటల సరకుగొనక

తుదకొకనాఁడు కోపించి నాతో తగవు లాడి నన్నాభూతమందిరమున నుంచి తాను మఱియొక సౌధమునందు నివసింపసాగెను. నేనాతని యిష్టమున కన్యథా నడవనేరక పోయితిని. ఆతఁ డేమన్నను సహించి యొకనాఁటికైనను గోపింపనైతిని. నా ప్రాణముల నాతనికి ధారపోసి యుంటిని. ఆతఁ డెంతకట్టిఁడై యగుచుండినను నాతనియందలి ప్రేమను బాయకుంటిని. అతఁడు నాదైవమై యుండెను. ఇట్టిస్థితిలో నొకనాఁ డాకస్మికముగ నా ప్రియుఁడు తన స్నేహితు లగు తారసింహాకరాళులతో నా యొద్ద కరుదెంచి "అమలా! నీ తండ్రిని సోదరసోదరీమణులను దెచ్చి చెఱయం దుంచినారము." అనెను. దాని నాలకించి నేను దుఃఖావేశమున మూర్ఛిల్ల నప్పుడే వారా తావు వదలిపోయి యుండిరి. వీరబలుఁడు దినదినంబునకు నా యెడ మిక్కుటమగు కాఠిన్యమును జూపుచు నన్ను మాటాడింపకయే యుండెను. కాని నేను వాని నంతటిని మనసార నోర్చి దుఃఖించుచు నా వారిని వదలుఁడని యెన్నియో విధముల వేఁడుకొంటిని. కాని నామాటల నాతఁడు వినక తుదకు నాబసకు తఱచుగ వచ్చుటే మానుకొనెను. ఎందుకు వారిని బంధించినది నాకుఁ దెలుపఁడయ్యెను. ఎంత వేఁడుకొన్నను తుద కవి యున్నియు నరణ్యరోదనములై పోయెను. ఇట్లుండ నొకనాఁడు హఠాత్తుగా నెవ్వరో మా పినతండ్రియగు కేశవపాలుని హత్య గావించి రను వార్త తెలియవచ్చెను.

అమల యింతవఱకుఁ దెలుపఁగనే శ్యామలా బిందు పుష్పమిత్రు లత్యంతవిస్మయ విస్ఫారితులై తూలిపడి "ఏమి, మావారి బంధించికొని పోయినవాఁడు వీరబలుఁడేనా? ఆహా! ఏమి యీద్రోహ చింతన! ఇంతటి మోస మెందైనఁ గలదా?" యని రవీంద్రుని వైపుఁ జూచిరి. ఆతఁడు వారి నిప్పుడు మాటాడకుఁడని హస్తసంజ్ఞతో నాఁపి మరల నమలతో నిట్లనెను. "అమలా! కేశవపాలుని జంపినవారెవ్వరో నీకుఁ దెలియునా?"

అమల : అయ్యో ! నాకావిషయ మేమియుఁ దెలియదు. నే నావిషయమై యెన్నియోమాఱు లడిగితిని. వీరబలుఁడు మొదలగు వారు నాకు సదుత్తరమా కొసంగక మిూఁదుగ నేఁ బ్రశ్నించినపుడెల్ల నన్నుఁ గాంచి నవ్వుచువచ్చిరి. దానియర్థ మేమో నాకింకను దెలియకున్నది.

రవీం : అది యుండనీ. ఆపిదప నీయుదంతమును జెప్పుము.

అమల : నాకారీతి మాపితృవ్యుఁడు గతించె నని దెలియఁగనే మిగుల దుఃఖించుచుంటిని. ఏమి చేతును ? అప్పటను నన్ను మాటాడింపుటకైనఁ బ్రజాళుఁ డింటికి రాకుండెను. ఈనడుమ రవీంద్రా ! మఱియొక మాటఁ జెప్పుమఱచితిని. సుమారొక నెలదినములనుండి నాప్రియుఁడు నన్నుఁ జూడరాఁడయ్యెను. కాని తారసింహుఁడు మాత్రము ప్రతిదినము దప్పక వచ్చుచుండెడివాఁడు. వాఁ డంతనిర్ణీత పద్ధతితో ననుదినము వచ్చి పోవుటకు కారణమును నేను మొదట నూహింపనేరనైతిని. కాని పదిదినములక్రిందట నాకాసంగతి తెలిసిపోయెను. వాఁడు నాయింటికి వచ్చినపు డెల్ల దురాత్ముఁడై నన్ను కామించి మాటాడ నారంభించెను. నేను వానిని పలువిధముల దూషించుచు నప్పటి కప్పు డేదోవిధముగ నాయాపదలనుండి తొలఁగిపోవుచుంటిని. నేనేమి చేయుదును ? నే నాసమయమున ననాథనై యుంటిని. నాభర్తతో నీవిషయమును దెలుపుదమన్న నాకవకాశము లేకుండెను. ఇంతలో నాకస్మికముగ నొకనాఁటిరాత్రి యాక్రూరులగు తారసింహాదులు నాయింటికి వచ్చి నాప్రియుఁడు గతించిపోయె నని చెప్పి తార్కాణముగ నాతనిప్రేతమును జూపిరి. నే నాభయంకరదృశ్యమును గాంచి విశేషముగ దుఃఖించి యాయాకస్మికమరణమున కేమి కారణమని

యనుగ నీవు (రహీంద్రుడు) చంపితి వని చెప్పిరి. ప్రథమమున నేనా సంగతిని విశ్వసించినను కడకు నాకు తారసింహునిపై బలమగు ననుమానము జనించినది. నన్నుం దనకైవశము గావించుకొన నెంచి యాకఠినకర్ముం డేదో విధముగ నాప్రియుని హతమార్చి యుండు నని యోజించుకొని చాల దుఃఖించితిని. ఆనాటిరాత్రియే శ్రీ సదాశివ దాసిరూపమున నన్ను బాయింట నివసించుట తటస్థించెను. నేను కొంతకాలము మీఁదట నీజన్మస్థితి నెఱిఁగి భయపడి యా తారసింహుని తోడ్తెచ్చితిని. కాని యంతలో నీవు భాగ్యవశమున నివసించుడవై నా ప్రాణప్రియుండగు వీరబలుని ప్రేమము ప్రేమాల పడియుంటివి. నేనిదివఱ కాతనిశవమును సరిగనైనం జూచియుండ లేదు. తారసింహుడు నాకట్లు చూపియుండ లేదు. నేనప్పు డారీతి నామృతదేహమును గనులారఁ దిలకించి పట్టరానిశోకముచేతను రోషముచేతను నాహృదయభావమును తారసింహుని కెఱిఁగించి వానిని దూషించి యిఁక వానితో కలిసి యుండనని చెప్పి యారాత్రియే భరతపురమునకు వెడలివచ్చి యొక సత్రమునఁ బడియుంటిని. నేవచ్చునప్పు డాదుర్జాతి నన్నాఁపఁడాయెను. పిదప నీవు గతించితి వని తలఁచి నీదేహమును మోసికొనిపోయి జానాబజారుతోఁటలోఁ బారవైచె నని కర్ణాకర్ణిని వింటిని."

రహీం : నీకారీతి ప్రవాళునిమరణవార్తను వారు తెలిపినరాత్రియే నీయింట మఱియెట్టిచిత్రమును జరుగ లేదా ?

అమల : మఱేమియు జరుగ లేదు. ఆపిదప నీవు వచ్చుటే తటస్థించినది.

రహీం : అమలా ! అవసానసమయమున నీరీతి నన్మృతము లాడువా రుందురా ! నిక్కమును జెప్పుము. నీయింట నానాఁడు మఱియొకహత్య జరుగ లేదా ?

అమలకు నోట మాట వెడలకుండెను. ఆమె తీవ్రదృష్టులతో నాతనిని గాంచుచు "రవీంద్రా! దుర్మార్గా! ఎవరిని? నాకేమియుఁ దెలియదే!" అనెను.

రవీం : అమలా! ఏటికి కీర్తి దాచియుంతువు! చెప్పుము, ఏమిజరిగినదో చెప్పుము. ఆ మహాపాతకు లెవ్వరో చెప్పుము. అది నీ మూలమున నాకుపన్న వేఱొకరివల్లనైన జరిగియుండవలయును. దాచిన మఱింతపాప మగును. నీవు చేసినపాపము మిక్కిలి స్వల్పము. నీవు పరమసాధ్వివే యగుదువుగాక. అయినను తాటిక్రింద పాలు ద్రాగిన చందమున దురాత్మునిస్నేహము చేసినందులకు నీకింతటి యప్రతిష్ఠ సంభవించినది. నిక్కముగ నీపతిభక్తి నాలకించి యెంతయో యానందించుచున్నాను. ఇట్టితరుణీపతంగమున కిట్టిదుర్మరణము గలిగినందుల కెంతయుఁ జింతించుచున్నాను. మఱియొకమాట తెల్పెదను. అమ్మా! నీవు పూతచరితవని నేను నమ్మితిని. కాని నీ దుష్కర్మ నీకింతలేసి యిడుముల కలిగింపనుండ దాని నాఁపువా రెవ్వరు! కాని, యీ విషయమును మాత్రము చెప్పెదను. నీవు పరమసాధ్వివై పుణ్యలోకములఁ జూఱగొనఁబోవుచుంటివి. ఇది నిజము. అయిన నేనిప్పుడు ప్రబల రహస్యభేదనకార్యములందు దిగి యా దురాత్ముల నందఱిని బట్ట యత్నించుచున్నాను. నీవానాఁడు హత్య గావించిన నృశంసుని పేరును దెల్పిన నా కార్యములందు మిగుల ననుకూలపడినదాన వగుదువు. ఆ దుర్జాతి యెవ్వఁడు! చంపఁబడినప్రాణి యెవ్వరు!

అమల హృదయమున నిప్పుడు గందరగోళ ముద్భవించినది. ఆమె యేకధారగ నశ్రువుల రాల్చుచు దుఃఖింప నారంభించెను. దేహము చల్లఁబడిపోవుచుండెను. రక్తము స్రవించిపోవుటచే ముఖము తెల్లవాఱె. కంఠనాదము సన్నగిల్లిపోవుచుండెను. కడ కామె డగ్గుత్తికతో "రవీంద్రా! నీవానాఁ డెందుంటివి!" అనెను.

రవీం : సీయొంటిమొకట్టుంజీన వటవృక్షమున దాగి యుండి జరిగినచర్యల నన్నింటిని గ్రహించితిని.

అమల : అమ్మా! శ్యామసుందరి నేను చెప్పఁజాలను కఠినకర్మ రాలనగు నా హృదయము వలె యెంతకును తుత్తునియలై పోవుచున్నది. హా! రవీంద్రా! నా తల్లి మూర్ఛాక్రాంతురాలు కాకుండిన నెంతగ దుఃఖించునో కదా! నన్నెంతదూషించునో కదా! నా ప్రారబ్ధకర్మ మిటులుండ నేనేమి చేయుదును. అకటా! సోదరీ! సుశీలా!

అని యొక్కమాఱెలుఁగెత్తి యరచి మూర్ఛాగతురాలై పోయెను. అమల నోటినుండి యారీతి తనతల్లి యగుసుశీలపేరు వచ్చుటచే నా బాలిక వధింపఁబడెనని తలఁచి శ్యామల తోడనే ప్రబలవాయు ప్రహారమున ప్రాలురంభావృక్షమురీతి "సుశీలా! అమ్మా!" యని క్రింద పడి పరవశురాలయ్యెను. తోడనే రవీంద్రుఁడు బిందును జూచి "ఈమెను లోపలికిఁ గొనిపోయి శైత్యోపచారములఁ జేయుము" అని చెప్పెను. పుష్పమిత్రుఁడు చెల్లెలి నెత్తుకొనిపోయి యొకగదిలో పడకపైఁ బరుండబెట్టి వచ్చెను. బిందుతనసాహసశక్తి నంతను వ్యయ పఱచి యుపచరించుసరికి శ్యామల మూర్ఛనుండి మేల్కాంచెను. ఆమె యనేక విధములుగ బిందుభుజములపైఁ బడి బిడ్డను దలఁచుకొని విలపింప సాగెను. ఈ నడుమ నామె యమలవిషయమే మఱచుటచే మఱల నామె యుండుస్థలమునకు రాలేదు.

పుష్పమిత్రుఁడు తన దుఃఖము నంతటిని మఱచి రవీంద్రునితో పాటమలకు స్మృతి కలుగుటకై పాటుపడెను. కొంతసేపటి కామె తెలివొందెను "హా! జననీ! శ్యామలా! ఎంతటిపాపపుమతి నాది. నీనవనీత హృదయమును నొప్పించితినే. నీ నేత్రాంబుజముల

న[illegible] వ్రా[illegible] [illegible] [illegible]జాలక వెడలిపోయితివా! జననీ! మాతా! [illegible] నా సుశీల మరణకారకురాలను నేను గాను తల్లీ! నన్ను [illegible] . హా! రవీంద్రా నా తల్లి యేది! ఆమె నన్ను [illegible] [illegible]ను మోసగించెనా! అకటా! నా కామూర్ఛావస్థ [illegible] [illegible] [illegible] నీవును [illegible] శోకమురల రావలయును? సుశీలా! [illegible]— హా —[illegible]—[illegible]—అమలా" యని వాపోవసాగెను.

అమల నిష్కల్మషహృదయురాలనియు, నిరపరాధినియనియు, సాధ్వీతిలక మనియు, రవీంద్రునకుఁ దెలిసిపోయినది. పుష్పమిత్రుఁడు కూడ నట్టిసదభిప్రాయమునే కలిగియుండెను. అందుచే వారిరువురు నామెదుఃఖమును గాంచి తామును గంట తడిపెట్టుకొనిరి. అమలయింక చాలసేపు జీవింపదు___ఇంక నొకయరఘంట! అప్పుడు రవీంద్రుఁడిట్లని పలుకరించెను. " అమలా! సుశీలయెట్లుమరణించెను ! "

అమల : " అయ్యో ! రవీంద్రా నేనేమి చేయుదును ? నా ముద్దుసుశీల మరణము వాప నానాఁడు నేగావించిన విశ్వప్రయత్నమంతయు నాజగదధీశున కెఱుక, నా కెఱుక. మీ కేమి తెలియును ? తారసింహ, సోమనాథ, కరాళులు నామాటలఁ బెడచెవిని బెట్టి నన్నొకచో గట్టిగ పట్టుకొని కూర్చుండిరి. నేనప్పు డబవఁజాలకుండునటుల నోట గుడ్డలు గ్రుక్కివైచిరి. నేనప్పు డేమి చేయజాలుదును ! నాకన్నుల యెదుటనే యన్నృశంసుఁ డగుకరాళుఁడు నా బాలను హత్య గావించెను. ఆక్షణముననే నేను మూర్ఛాగతురాలనై పోయితిని. పిదప వారా శవము నేమిచేసిరో నాకుఁ దెలియదు. కాని నేనాసమయమున వారిని యింటినుండి పంపివైచి నాదుఃఖమున మునిఁగిపోయితిని. రవీంద్రా ! ఆకాలముననే శోకాతిరేకమున నాహృదయము బ్రీలి నేఁజావకుండుటొకతప్పు.

రవీం : వారామె నెందులకు జంపినది నీకుఁ దెలియుదా ?

అమల : తెలియును. నాకేమాత్రము దెలియును. ఆరాత్రియే నాకు తారసింహునిపై [illegible] జనించి నాప్రాణము వదలి నన్ను యిచట నొకసత్రమునఁ జంపిపోయితినని చెప్పితినికదా. నాకప్పటినుండి ప్రపంచవాసమే భారముగఁ దోఁచినది. సాహసించి నాకొండ్రియిల్లు చేరఁజాలకపోయితిని. అదియ్యు నాకంఠనాళములు బిగఁ దన్నుకొని పోవుచున్నవి. ఇకనేను చాలకాలము జీవింపను. పిదప వృత్తాంతమును సూక్ష్మముగఁ జెప్పెదను. ఆనాఁటినుండి తారసింహుఁడు నన్ను వివాహమాడ యత్నించినట్లు దెలిపియుంటిని గదా. తుదకు నేనిటు పరుగిడి వచ్చుచుండుట గాంచి సహింపనేరక మఱి దెప్పుడైనఁ దనదుర్వృత్తాంతమును లోకమునకు వెల్లడిసేయుదు నని యెంచి నన్నె రీతిగనైనఁ దుదముట్టింపసాహసించెను. కడకు నేటిరాత్రి యేడు ఘంటలసమయమున నాదురదృష్టవశంబున నాగల్లియం దాకస్మికముగ నారాక్షసుని జూచితిని. నేనాకరాళదర్శనము నకు భీతిలి తొలఁగి పొమ్మని వేఁడికొంటిని. కాని వాఁడు కలుషమానససంజనిత వికటాట్టహాసమును గావించుచు " అమలా ! నన్ను మోసగించి పోఁజాలవు. నీవు నాపత్నివి కాకున్న మానె. నీవు భూమిపై జీవములతో నుండుట నాకత్యంతోపద్రవకరము. నాకు లేని నీసౌందర్య మిట్లనే మంటఁ గలసి పోనిమ్ము " అని చెప్పుచు కనుఱెప్పపాటుకాలములో మొలయందుండిన బాకును దీసి నాహృదయశిరమునందు గాఢముగఁ బొడిచి యటనుండి తటిల్లత వోలెఁ బరుగిడిపోయెను. అప్పుడే నాయార్తనాదముల నాలకించి జను లనేకు లాచోటికి కరుదెంచిరి. అవ్వలివృత్తాంతమును నీవెఱిఁగియే యుందువు " అని యమల యాత్మోదంతమును ముగించునప్పటికి రవీంద్రుఁడు దాని నంతటిని వ్రాసి యుంచుకొనెను.

అప్పటి కామె యాయాస మతిశయించినది. ఆమె మరల నొక మాఱు దప్పి యని చెప్ప పుష్పమిత్రుఁడు నీటిని దెచ్చి యిచ్చెను. అవయవములు క్రమక్రమముగఁ జేతనాశూన్యములై పోవుచుండెను. రవీంద్రుఁ డంతఁ దనకౌగిటముపై నతికష్టముచే నామెచే వ్రాలు చేయించుకొని "అమలా! ఇఁక దుఃఖింపకుము. నీవు సద్గుణవతివి— సచ్చరిత్రవు — నిరపరాధినివి — సతీతిలకమవు. అయిన నీకింతటి యుపద్రవములు కలుగుటఁ జూడ నీ మాయాలోకంబునఁగూడ సద్గుణ భాములకుఁ గష్టములు దప్ప వను నార్యోక్తి సార్థకమగుచున్నది. నీ పూత్రపవర్తన మకళంకితము. ఇఁక నిశ్చింతవు గమ్ము. ఇదివఱకు నీ నిజకథ నాలకింపక దూషించినవారు నేఁటినుండి నిన్ను భూషింతు రమ్మా. నీకు సద్గతి చేకూరుఁగాక" అని యనెను. అమల యతికష్టముతో నుచ్ఛ్వాసనిశ్వాసముల జరుపుచు "పాపినిని — తల్లిని దుఃఖింపఁ జేసితిని. ఆమె నోదార్పుఁడు. నే నపరాధినిని గానను నమ్మకము జనింపఁజేయుఁడు. నే నిఁక మరణింతును. ఇప్పటికి నా కించుక హృదయశాంతి చేకూరినది" యని నిమీలితనేత్రయై, ముకుళితకర కమలములతో భగవధ్యానమును సలిపెను.

అంత్యకాలమున నామె విశేషసంకటము నొందుచుండుటఁ గాంచి రవీంద్రాదులు మిగుల వగఁజెందిరి. ఆమె నోట నిఁక మాట లాఁగిపోవుచుండెను. తుదకు చేతు లెత్తి మ్రొక్కుచు "సెలవు— మాతా—నారాయణ—నారాయణ" యని కన్నుల మూసెను— అదియే యామె యంత్య వాక్యోచ్చారణ. అమల ప్రాణానిలము లిహలోకదూరితములై పోయెను.

# ఎనిమిదవ ప్రకరణము

ఐం డీ

రామనాథుఁడు సరోజినీ మోహనచందులను సుఖముగఁ దనయిలు చేర్చెను. అప్పటి కింక నాతని భోజనమై యుండలేదు, కాలము విశేషముగఁ గడచిపోయినది. అయిన నాతఁడు సరకుసేయక తన మిత్రుని మట్టు కన్నవసతిని గల్పించి వారియొద్దఁ గుశాలవు నుంచి చేరువనుండిన రక్షకభటస్థానమున కేఁగెను. అచ్చట నుండిన యుద్యోగికిఁ దన పరిచయమును గలిగించి పోలీసువారి సహాయమును గోరెను. తోడనే యా యధికారి రామ నాథుఁడు గావించిన సాహసకార్యముల నాలకించి యచ్చెరు వొంది "అయ్యా! మీ కెంతమంది భటులసహాయము కావలయును?" అని యడిగెను.

రామ : ఎంతమందియు నేలనండీ? నలుగు రైనఁ జాలును.

ఉద్యో : రవీంద్రముగారిని నే నెఱుఁగుదును. వా రిప్పు డూర లేనట్టున్నదే! ఎందేఁగి యున్నారు?

రామ : అయ్యా! మేమీఘనతరంబగు అపరాధరహస్య భేదనకార్యమును మీఁద వైచుకొన్ననాఁటినుండి సరిగ నిద్రాహార ములు లేవు. ఒకచో నుండుటకే వీలు లేకున్నది. ఎన్నఁటికిఁ భయంకర పరిశోధనలకుఁ బరిణామము గాన్పించునో దేవునికే యెఱుక. అంత వఱకు మా యవస్థలు దప్పినవి కావు. అట్లని హంతకుల నందఱిని బంధింపక వదలువారము కాముసుమా.

రక్షకోద్యోగి సోమనాథుని యుబ్బుపోయినహృదయాంగమును నుండి యిట్టిఫిర్యాదుక్తుల తెలుపనటుల గాంచి ఆశ్చర్యపాటు నొందుచుండెను. అతఁడు వెంటనే పలువురు భటుల నాయుధసహితంబుగ రావించి సోమనాథుని వెంటఁ బోనాజ్ఞ యిచ్చెను.

పత్తేదారు స్వగృహమున కేఁగక వారితోఁ దిన్నగ శ్రీమతివీధి ముఖుఁడై చనెను. వారందఱు సోమనాథుని నిలయమును జేరుసరికి పండెండుగంటలు దాటియుండెను. అప్పటి కింకను మందిరద్వారము బంధింపఁబడియే యుండలేదు. అప్పు డాతఁడు పోలీసువారిని గాంచి "మీరిందే యుండుఁడు. నాయీల విన్న క్షణముననే లోపలికి రండు." అని చెప్పి తా నాకవాటమును దెఱచుకొని లోపలఁ బ్రవేశించెను. పూర్వపుగదియం దెట్టయెదుట సోమనాథుఁడు యథాస్థితియందే మూల్గుచు తనభావిస్థితిని గుఱించి యోజించుకొను చుండెను. అచ్చట మఱియెవ్వరును లేరు. సోమనాథుఁ డాతనిని గాంచి వికట పరిహాసమును జేయుచు నోటనుండిన గుడ్డలను దీసివైచుచు "ఏమండీ దాసుగారు! శ్యామలాంబ యెచ్చట నున్నది? ఆమెతో మాటలాడవలసిన పని కొంత కలదు" అనెను. దాసునకు వక్త్రబంధన మూడిపోఁగనే మరల మాఁటి రొప్పుచు మాటాడ శక్తి గలిగెను. అప్పు డాతని నయనగోళము లుబ్బిలేచి మెఱయుచు మిగుల భయంకరముగ నుండెను. అప్పుడు గట్టుదుఁ బండ్లు గీటుచు లేచుట కనేకప్రయత్నములఁ జేయసాగెను. కాని యది దుస్సాధ్యమగుటను చాల కోపగించుకొని గర్జించెను. ఇంతయుఁ గాంచుచుండిన యపరాధపరిశోధకోద్యోగి మరల నవ్వి "ఏటి కింత శ్రమ. నేనే యామెను వెదకికొందును లెండు" అనెను. అనవుడు సోమనాథుఁడు రోషకషాయిత ముఖముతో "ఓరీ! నన్ను మోసగించి నట్లు కాదు. నీ విఁక నీభూమిపై నొక్కగడియకాలమైన నిలువఁజాలవు మానును, సోమనాథుని శక్తిసామర్థ్యములు నీకింకను దెలియవు.

నీ ప్రాణానిలయముల నపహరింపక యీ దండనోత మెన్నఁటికిని నీచేఁ జిక్కఁ డని తలంపుము" అని గద్దించి పలికెను.

రామ : దాసుగారు ! చాలునండి యీప్రసంగములు ! సుందరి యుండిన నామె మ్రోల నీడంబపుమాటలాడియుండిన సాగియుండును. కాని, యది యిపు డచట లేదు. దానిబదులు నేను నిలిచి యున్నాను. నీ భయోక్తులకు జడిసి నిన్ను వదలివైతు ననుకొంటి వేమో, ఈపత్తే దారు పిఱికిగుండెకక్కఁ గాదుసుమా ! నీ వెంత ప్రయత్నించినను పాఱిపోఁజాలవు. నీవు మాకు బందీవైతివి.

సోమ : నీ వింకను బాలుఁడవు. యుక్తాయుక్తనిహీనుఁడవై యూరక ప్రాణములమీఁదికి తెచ్చిపెట్టుకొనకుము. నామాట విని యీబంధనముల వదలించి మావారి నిట డించిపొమ్ము, లేకున్న నీయాయు వింతటితో నంతరించె ననుకొనుము.

రామ : నాయాయువు నంతరింపఁజేయుటకుఁ బూర్వము నేన డుగుప్రశ్నల కుత్తర మొసఁగుము. నీవు సరోజనీమోహనచందుల నేల బంధించియుంటివి ? వారు నీకేమి కావలయుదురు ?

సోమ : నీ వడుగు ప్రశ్నల కుత్తర మొసఁగవలయునా ? ఒసఁగెదను. నాబంధనముల వదలింపుము. నీకు మొదట బుద్ధి గఱపినఁ గాని నే నిచ్చునుత్తరముల నీమది కెక్కవు. కాన మొదట నీ మూర్ఖభావమును సరిచేయవలయును.

రామ : ఓహో ! అట్లైనఁ జేతువుగాక. నీకు చాల కృతజ్ఞుఁడనై యుండెద.

అని చెప్పుచుఁ జిన్నగ నొకయీల వైచెను. తోడనే వెలుపల నుండిన రక్షకభటు లొక్కయుదుటున వచ్చి యాగదిలో నిలుచుండిరి.

వారిని గాంచినంతనే సోమనాథునకుఁ బ్రాణములెగిరిపోయినట్లయ్యెను. అతఁడు చీత్కారముఁ జేయుచు నేమి చేయుటకుఁ దోఁపక "ఆహా! ఇది యేమి! ఈ యింటికిఁ బోలీసువారు రాఁగూడదు, వారి కిం దేమిపని? పొండు! పొండు! పొండావలకు!" అని కూఁకలు బెట్టెను. అది విని యందఱు పకాపక నగిరి. తోడనే యా భటులు పత్తేదారుని మొదల ననుసరించి దాసు చేతులకు నినుపసంకెలలఁ దగిలించి యీవలకుఁ గొని వచ్చిరి. సోమనాథుఁడు మిడ్డతుసియు రీతిఁ గేకల వైచుచు "ఈ యన్యాయ మేమి? నన్ను నిష్కారణముగ బంధించుకొని పోవుచున్నారే! నే నేమి చేసితిని చెప్పుఁడు" అనెను. రామనాథుఁ డాతనిని గాంచి "అయ్యో! నేఁటి కిట్లు గూసెదవు? నిర్దోషులగు సరోజినీ మోహనులను దెచ్చి నీయింట బంధించి యున్నందులకు నేఁడు నిన్ను ఖైదీగఁ గొనిపోవుచున్నాము" అనెను.

సోమనాథుని యార్భాటముల నాలకించి వెలుపల వీథియందు పోవుచుండిన వారనేకు లాస్థలమునకుఁ బరుగిడి వచ్చిరి. ఆతని నారీతిఁ బోలీసువారు బంధించుకొని పోవుటను గాంచి వారచ్చెరువొందుచు "ఇది యేమి యనర్థకము? ఈ పెద్దమనుష్యుని నేల బందీచేసితిరి?" అని రామనాథు నడిగిరి. అందు కాతఁడు సమాధానపూర్వకముగ "ఈతఁడు లోకులకుఁ బెద్దమనుష్యునివలెఁ గాన్పించుచున్నాఁడే కాని నిజముగ గౌరవార్హుఁడు కాఁడు, వీఁడు పెద్దదొంగ" యనెను. ఆ మాటలను విని వారు మఱింత విస్మితచిత్తులై "ఈతఁ డెట్టి యపరాధమును గావించెను?" అనిరి. "దాని నిప్పుడు చెప్ప వలను పడదు, రేపు న్యాయస్థానమున నా సంగతి తెల్లమగును," అని యనుచు రామనాథుఁ డింక నచట నిలువక పోలీసువారితో సోమనాథ దాసును బందీగఁ జేసికొని యా తావును వదలి పోయెను.

ఊరివారినెల్ల నీ పుష్పలావికునిపై విశేషము నమ్మక ముండెను. ఆతఁ డందఱితోను మర్యాదగఁ బ్రవర్తించుచు మంచిపేరు నార్జించి యుండెను. వానికెంతమాత్రము గావలసినవాఁడు, అట్టివానిని నేఁడు రక్షకభటులు కారాగృహమున నుంచిరి. కారణ మేమి? ఎవరికిని దెలియదు. వారు నోటికి వచ్చినట్లెల్ల మాటాడుకొనిరి. "పోలీసువారి దన్యాయము నిష్కారణముగ నీ సత్పురుషు నవమానించుచున్నారు. ఆంగ్లప్రభుత్వమున కిట్టియనర్థకమా!" యని కొందఱును, "ఏమో, యెవరు చెప్పఁగలరు? ఉద్యోగి యున్నట్టీతఁ డెట్టిమారీచుఁడో, ఎవ్వరికిఁ దెలియును? వారుమాత్ర మేల కారణము లేనిదే యాతనిని బంధింతురు?" అని కొందఱు ననుకొనుచు నాస్థలమును వీడిపోయిరి. క్రమక్రమంబుగ నీవార్త చంద్రనగరమునం దంతటను వ్యాపించెను.

# తొమ్మిదవ ప్రకరణము

"ప్రేతమా! పిశాచమా!"

రామనాథుఁడు రవీంద్రుఁడూరలేనిచో నతిశ్లాఘనీయముగాఁ బ్రవర్తించెను. తన కాతఁడు చంద్రనగరును వదలిపోవునప్పుడు రెండు కార్యముల నప్పగించి పోయియుండెను. రామనాథుని యింటియందుండు బాలిక యెవ్వరో కనుఁగొనుట. రెండవది భూగృహముపై నొకకన్నుంచియుండుట. రామనాథుఁ డా ప్రథమప్రయత్నము నద్వితీయశక్తిచే సాధించి బాలిక యెవ్వరో కనుఁగొనెను. ఇఁక రెండవకార్యమున నెట్టికష్టములు వాటిల్లునో యూహకునికిఁ దెలియదు. నేఁటిరాత్రియే యూపనికి కుశాలవునితో వెడలిపోవలయు నని తలఁచెను. దాసు రామనాథుఁడు చెప్పిన కారణములపై కారాగారమున నిర్బంధితుఁ డయ్యెను. ఈవార్తను దత్క్షణమే రవీంద్రునకుఁ దెలుపుటకు వీలైనదికాదు. అతఁడు మరల చంద్రనగరునకు వచ్చువఱకు విచారణ నాఁపియుండవలసి వచ్చెను.

నాఁటి మధ్యాహ్నభోజనానంతరము రామనాథుఁ డానందసాగరుని జూడఁబోయెను. కాని సాయంకాలమువఱకు మాటాడుచుండిదీపము లుంచువేళ కింటికివచ్చెను. అప్పుడు కుశాలవుఁ డాతని కొక లేఖ నందిచ్చి దాని నొక పెద్దమనుష్యుఁ డిచ్చి పోయినట్లు తెలిపెను. రామనాథుఁడు దానిని దీపపువెలుఁగున నీరీతి చదివెను.

అయ్యా! రవీంద్రా!

నేను మీకుఁ గ్రొత్తవాఁడను. నాది దక్షిణదేశము. కలకత్తాయందు మీతో కొంత పనియుండి యచ్చటికి వచ్చియుంటిని. కాని,

యచట మీరు లేరనియు, చంద్రనగరున నొకయభియోగకార్యమునఁ బాటుపడుచుంటి రనియు దెలియఁగనే యచ్చటికి వచ్చితిని. కాని నేఁటి సాయంకాలమున మీబసయొద్ద కరుదెంచి విచారింప మీసేవకుఁడు మీరూర లేరని చెప్పెను. నేనంత విచారించి యీలేఖను మీకిమ్మని చెప్పి వచ్చితిని. విశేషము లేమన, నేనును నొకయపరాధపరిశోధకుఁడను. పదిదినములకుఁబూర్వ మొకనాటి రేయి గోగ్రానదిగట్టున నాకొక పేటిక దొఱికినది. దాని నప్పుడు తెఱచి చూడ నందొక స్త్రీశవము గోచరించెను. అది యెవరిదైనది నాకు తెలియదు. వేషభూషణాదుల బట్టి చూడ నాయువతి యీప్రాంతములకు సంబంధించిన దని తెలిసికొంటిని. మీరీతావులవిషయములను బాగుగ నెఱిఁగినవారగుటచే నీవిషయమున మీసలహా నొందవలయు నని వచ్చితిని. నేను నాప్రాంతములందు మిగుల వర్ణనకెక్కిన పత్తేదారుఁడనే. నాకీర్తి యీదేశమునందు విశేషముగ వ్యాపించి యున్నది. అయిన నేమి, యీతరుణమున మాత్రము మీబోఁటివారిసలహా నొందకున్న నాకార్యము సాగునట్లు లేదు. కాన తాము దయయుంచి మీరూరికి వచ్చినతత్క్షణమే మీదర్శన మొసఁగ వేఁడుచున్నాను. నన్ను కృష్ణలాలందురు. నా వాసస్థానమును మోతీబజారునందు కడపటనుండునొకభవనమున నియమించుకొని యున్నాను. దాని కెట్టయెదుట సమీపముననే యొకగొప్పవటవృక్షము కూడఁ గలదు. దాని నొకగుర్తుగ నెఱింగి యచటికి వచ్చి యింతమట్టుకు సహాయము చేసిపోవలయును. ఒకపక్షమున మీరీరాత్రియే వచ్చుట తటస్థించిన మఱియు నానందమే. ఒకవేళ మీకు రావీలు లేనియెడ నా కాసంగతిని దెలియఁబఱచిన నేనే యచటికివత్తును.

ఇట్లు,

కృష్ణలాలు.

రామనాథున కాయుత్తరము నంతను జదివి ముగించుసరికి మిగుల సందేహము కలుగుటచే కుశాలవునితో నిట్లనెను. “ కుశాలవా! ఈ లేఖ నిచ్చిన మనుష్యునియాకార మెట్లుండెను ? ”

కుశా : అతఁడు మీరు ధరించినట్లే కొన్ని పోలీసుదుస్తులను ధరించియుండెను.

రామ : అతని నిదివఱ కెన్నఁడైనఁ జూచినట్లు జ్ఞాపకమున్నదా ?

కుశా : లేదు. ఆ ముఖము కేవలము క్రొత్తది. నేనిదివఱ కెందును జూడలేదు.

రామ : అతఁడు నిన్నింకేమైన నడిగెనా ?

కుశా : అవును అతఁ డింట మఱియెవ్వరును లేరా యని యడుగ నీ సంగతిని దెల్పితిని. అప్పు డాపురుషుఁడు మిమ్మైన నీ రాత్రికి తన బసకు రమ్మని చెప్పెను.

రామనాథుని మానసవీథియం దూహాశకటపంక్తి తరలి పోవుటచే మాటాడఁజాలక పోయెను. మఱెట్టి ప్రశ్న నడుగక యూరక యా కాగితమును మరలమరల చదివెను. ఇంతలో డాపున గదియం దుండిన సరోజిని తిన్నగ నీవలకు వచ్చి “ అయ్యా ! ఏదియో యోజించుచున్నారే ? ఈ కాగితము నిచ్చినవానిని నేనుకూడ నీ సాయంకాలమున నిచట చూచితిని ” అనెను.

రామ : నీవాతనితో మాటాడలేదా ?

సరో : లేదు. నేనాతనికంటి కగపడకుండ నీ కిటికీసందునుండి యాతఁ డీకుశాలవునకుఁ గాగితము నిచ్చుచుండుటను జూచితిని. ఆ ముఖము నెందో చూచినట్లు నాకు జ్ఞాపకమునకు వచ్చినది.

రామ : ఎందు చూచితివి ? ప్రాయశః సోమనాథుని గృహము నందు నివసించునపు డొకనాఁడు కలలోఁ గాంచియుంటివి కాఁబోలు.

సరో : కాదు. నన్నారీతి నెకసెక్కెము లాడకుఁడు: నాకెందు చూచినదియు సరిగ జ్ఞాపకము లేదు.

రామ : (నగుచు) సరోజినీ! నిన్నెకసక్కెము లాడరాదా! నీవు గొప్పరాణివి కాఁబోలు.

సరో : అవును. ఈ గొప్పరాణి మీకొకయుత్తరువు నొసంగు చున్నది. మీరు దానిని మనసున నుంచుకొని పరిపాలింపవలయును.

రామ : అదేదియో సెలవిమ్మ. ఈ దాసుఁడు దానిని నెఱ వేర్పసంసిద్ధుఁడై యున్నాఁడు.

అనుచు రామనాథుఁడు హర్షప్రఫుల్లముఖుఁడై సరోజినిని జూచి నవ్వెను. అప్పు డామె ముఖము నతిగంభీరభావపూరితముగఁ జేసి నేత్ర కంజయుగళమునుండి తరళకాంతులు మెఱయ "మీరాతనియింటి కేఁగిన మిగుల జాగరూకతతో ప్రవర్తింపవలయును. ఏమరిన నపాయము రాఁగలదు" అనెను. రామనాథుఁ డామెలావణ్యమయ ముఖవనరుహమును నెగాదిగఁ జూచుచు మరల పకపక నవ్వెను. సరోజిని యందుండి చటాలున జరిగి నిలుచుండి "నేను బాలికా చాపల్యమున నీ మాట లనుచుంటి ననుకొందురా! అయిన మీకిఁక నే నేమియుఁ జెప్పను. ఇంటిలోనికిఁ బోయెదను. పిలువని పేరంటమునకు వచ్చుట నాదే తప్పు" అనెను. అప్పు డాయువతీమన్మథుఁ డగుయువకుఁ డామెను బోనివ్వక హస్తమును బట్టుకొని నగుచు "రాణీ! రమ్ము. ఈ దాసునిపై నింతటి కోపమా! నీపై నాకపనమ్మకము లేదు. అనుమానము లేదు. ఏమిచెప్పెదవో చెప్పుము. సావకాశముగ విందును" అని యామెను తనయాసనము దాపునకుఁ దోడ్తెచ్చెను.

సరో : నేను చెప్పిన మీరు నవ్వెదరు.

రామ : నవ్వను లెమ్ము. ఏదీ నీయాజ్ఞను మఱియొకమా ఱుచ్చరింపుము.

సరో : మీరు నేఁడానూతనపురుషుని మందిరమున కేఁగిన మిగుల హెచ్చరికను వహించి యుండవలయును. ఆ కన్నులయందు నాకు మోసము కాన్పించుచుండెను.

రామ : సరోజినీ ! నేనొకమాట నన్న నీకుఁ గోపము రాదు కదా !

సరో : చెప్పుఁడు. నాకుఁ గోపమన నేదియో తెలియదు.

రామ : అదిగో ! నీవసత్య మాడెదవు. ఇంతకుముందే కదా నీవు కోపము నొంది యింటిలోనికి వెడలి పోదునంటివి. ఇప్పు డపుడే నాకుఁ గోపమన్న నేదియో తెలియదనుచున్నావే !

సరో : అట్టిదే నాకోపము ! అయిన దాని నిఁక మీఁద వదలి వైతును. ఏదియో చెప్పెదనంటిరే చెప్పుఁడు.

రామ : నీవు రాణివి. చెప్పుటకు భయమగుచున్నది. మరల నాపై నాగ్రహ మొందిన నెట్లు !

సరో : (నవ్వి) అయ్యో ! ఈ క్షణమునుండి కోపమును దూర ముగఁ దోలివైచెదను. మీరు భీతిలఁ బని లేదు. చెప్పుఁడు.

రామ : నీవు నిరంతరము మోసగాండ్రనడుమఁ జిక్కి యనేక మోసములకు లోనై యున్నందున నీకిప్పుడు ప్రపంచమే మాయమయము మైనట్లు దోఁచుచున్నది.

సరో : అయిన నే నసృతము లాడుచుంటినా !

రామ : నీకనృతముగఁ దోఁచదు. నీకన్నుల కంతయు సత్యము గనే గోచరించును. రేపు నన్నుఁగూడ నొక మోసగాఁ డందువు. ఏలయన, నీకుఁ గాన్పించునదంతయు వంచనమువలెఁ గనఁబడును.

సరోజిని మాటాడలేదు. ఆమె నిశ్చలనయనములతో నాతనిని జూచుచుండెను. ఆప్రశాంతకోమలముఖసరోజమున గభీరభావచిహ్నములు గోచరించుచున్నవి. పిదప నామె యధరస్పందన గావించుచు నిట్లనెను. "అయిన నన్ను మీరు విశ్వసింపరు. నేను కానిదాననుఁ నన్ను దూషింతురు. నన్ను మాతండ్రితోఁ గృష్ణనగరునకుఁ బంపుఁడు" అనెను. రామనాథుఁడు నగుచు నామె భుజముపైఁ జేయివైచి "సుందరీ! నిన్ను నేదూషింపలేదు. నీముగ్ధభావ మట్టిదని యంటిని కాని వేఱుకాదు సుమా. నీవు కృష్ణనగరున కింతయాతురతతోఁ బోనుండుటకుఁ గారణ మేమి? అచట నీబంధువు లున్నారా?" అనెను.

సరో: లేరు. నాకీలోకమున నాతండ్రి యొకబంధువు. ఆతనికి నేనొకబంధువను. ఉన్నవారందఱు నశించిపోయిరి. కాని నూతన్నముగ మీాస్నేహ మొకటి యులవడినది.

రామ: నీకు తల్లి లేదా సరోజినీ?

సరో: ఆమె యీాలోకమున లేదు. వత్సరముక్రింద గతించి పోయెను.

రామనాథుఁడు శిరమెత్తి యా సుందరి ముఖమండలమును దిలకించుసరికి పంకజస్థహిమాంబుకణములవలె ముక్తాఫలసదృశాశ్రువులు గాన్పించినవి. తోడనే యాతఁడు సరోజిని హస్తద్వయమును గ్రహించి పట్టుకొని "రాణీ! దుఃఖించుచుంటి వేల?" అనెను. ఆమె మాటాడలేదు. ఊరక యధోవదనయై పాదాంగుష్ఠముతోలమున నేల గీచుచుండెను. రామనాథుఁ డామెను బుజ్జగించుచు "నామాటలచే నీకోమలహృదయము చాల నొచ్చినదికాఁబోలు. నేను క్రూరుఁడను. నిన్ను సంకటపఱచితిని. నన్ను క్షమింపవా!" అని యామె చుబుకమును బుడుకుచు దాపునఁ గూర్చుండఁజేసికొనెను. ఆమె

రొక్కమాఱు శిరమెత్తి యాతనితో నేదియో చెప్ప యత్నించెను. కాని మాటలు వెలువడలేదు. ఏకధారగ బాష్పముల రాల్చుచుండెను.

రామనాథుఁ డేదియో ప్రమాదకరమగు నేరము గావించిన వానివలె భీతిలసాగెను. ఆమెకు తల్లిమరణవార్తను జ్ఞాపకపఱచి యేడ్పించెను. అదియే యాతని తప్పు. అదియే యాతని నేరము. అందుండి విముక్తుఁ డగుట కామె ననేకవిధముల నాశ్వాసించెను దుఃఖింపవలదని వేడుకొనెను. ఆత్మనింద గావించుకొనెను. సరోజిని యశ్రువు లొత్తెను. హస్తచుబుకముల గ్రహించెను. రామనాథున కింతటి స్వాతంత్ర్యమా! సరోజిని యెవరు? తా నెవ్వరు? ఇంత నిర్భీతిభావమున నామెకోమలాంగముల స్పృశించుచున్నాఁడే! కారణ మేమి? ఆహా! తెలిసినది. చెప్పుదుమా? రామనాథున కాసమయమున ననిర్వాచ్యమగు భావోదయమై యుండెను. దాపునఁ గుశాలవుఁ డుండెనని మఱచెను. ప్రపంచమునే మఱచెను. సరోజినితోఁ దనకుండు స్వల్పపరిచయమును మఱచెను. ఆతని దేహ మంతయు నదరిపోవు చుండెను. అతిసాహసముతో — యుక్తాయుక్తజ్ఞానవిహీనుఁడై — మోహావేశుఁడై —యంధుఁడై — యామె మృదుకంఠమునకుఁ దన బాహువులఁ బెనవైచి యా మృదుమేదురలావణ్య ప్రకాశిత ముఖ మండలమును ముద్దిడుకొనెను—ఆహా! ఏమి యీ సాహసము !!!

పిమ్మట నాతఁడు తన యవివేకకార్యమునకు లజ్జనొంది కొంత సేపూరకుండి పిదప "సరోజినీ! నన్ను క్షమించితివికదా?" యనెను. ఆమె ముఖ మెత్తి చూచెను. ఆ సుధాంశుమండలమున నిప్పుడా జల బిందువు లంతరించిపోయినవి. ఆ కోపశోకభావము లాఱినవి. కేవల మోహనప్రభలు—నిత్యానంద ప్రదాయక మాధుర్యహాసచిహ్నము లంకురించి యుండెను. అప్పు డామె దూరముగఁ బోయి నిలుచుండి

"అయ్యా! నీవు క్రూరుఁడవు. నన్ను బాధింతువు" అని చటాలున లోపలికి వెడలిపోయెను.

అప్పుడే యొసిమిదిగంట లైనది. రామనాథున కప్పుడు మరల లేఖవిషయము జ్ఞప్తికి వచ్చెను. అప్పు డాతఁడు కుశాలవుని గాంచి "కాల మెంతైనది" యనెను. వాఁడందులకు నగుచు "నేనిప్పుడు చెప్పిన మీకు బోధపడదు. మీరిప్పుడిచట లేరు" అని బదులుచెప్పెను. రామనాథుఁడు కుశాలవుని హృదయగతభావమును జదివి తనయకార్యమునకై సిగ్గునొందెను. "కుశాలవా! సరోజిని యింకను బాలిక. పదునాల్గువత్సరము లుండవచ్చును. ఇంకను బ్రపంచజ్ఞానము మెండుగ లేనిది. ముగ్ధహృదయ" యనెను. అందుకు కుశాలవుఁడు "మీరును నట్టివారే. దేవుఁ డీరీతి నీమెను మీయొద్దకుఁ దెచ్చుటలో నేదియో సంకల్పించుకొని యుండును" అనెను. పత్తేదా రాతనిమాటల నాలకించి హాసప్రఫుల్లవదనుఁ డయ్యెను.

భోజనానంతరము రామనాథుఁడు తన సేవకుని బిలిచి "కుశాలవా! ఈ లేఖవిషయమై నీవేమందువు? ఈ మనుష్యుఁడు కోరినరీతిగ నాతనిబస కేఁగుదమా?" యనెను.

కుశా: అచ్చట కేఁగి యాతఁ డెవ్వరో తెలిసికొనివత్తము రండు. అందున నెట్టిప్రమాదము గల్గును!

రామ: ఈ లేఖాంతర్గతవిషయముల నవలోకించి చూడమిగుల నస్వాభావికముగఁ గన్పట్టుచున్నది. ఒకయపరాధపరిశోధకోద్యోగి తనకు దొరికినశవ మెవ్వరిదైనది తెలిసికొనలేరక యింతదూరము దానిని దెచ్చియుండునా! తాను మిగుల కీర్తినొందినవాఁడఁట. ఇంతమాత్రపు పనియే తన కసాధ్యమై యుండ నంతకీర్తి నెట్లార్జించెను! వినుటకే యసహ్యకరముగ నున్నది.

కుశా : ఏమో, యెవ్వ రెఱుఁగుదురు! అతఁ డెట్టివిచిత్రపురు షుఁడో పోయి చూచిన నన్నియుఁ దెల్లమగును.

రామ : నేటిరేయి మనమా భూతమందిరమున కేఁగవలయునని యుంటిమి కాదా? ఇప్పుడా పనిని జేయక నిరర్థకముగ నీయుద్యోగికడ కేఁగి కాలమును వృథా యేలచేయవలయును.

కుశా : బాబూ! మీ బోఁటిబుద్ధిమంతు లీమాట నన్న నే నేమి చెప్పుదును? పత్తేదారులు దమ కాలికి దగిలిన కాచిపుల్లను, కంటికిఁ గాన్పించినప్రాణిని బరీక్షింపక వదలరాదనుసంగతి మీకు తెలియదా? ఒక్కొక్కసమయమున నతినికృష్టముగఁ జూడఁబడువానినుండియే మహోపకారములు జరుగుచుండును. ఇఁకఁ గాలహరణ మంటిరా? అది యెట్లగును? కొంతకాలముమాత్ర మాతనితో ముచ్చటించి మీ కావగా రూర లేరని చెప్పి యప్పుడే మననిర్దిష్ట కార్యముపై వెడలి పోవచ్చును కదా? ఇందు నష్ట మేమున్నది?

రామనాథుఁ డీసారి మరుమాటాడక వేగముగఁ గొన్నివస్తువులను దీసికొని మూటగట్టి వానిని కుశాలవునిచేతి కిచ్చి "అయిన నీమూటను దీసికొనుము. అచ్చటికే పోదము" అని చెప్పుచు నుచితవస్త్రముల ధరించి నిలుచుండెను. ఇంతలో మరల నొకమాఱు సరోజిని తటాలున లోపలినుండి వచ్చి రామనాథునిదాపున నిలుచుండెను. అతఁ డామెను గాంచి నవ్వుచు "ఇది యేమి, రాణీ! మరల నాకేమి యాజ్ఞనిచ్చెదవు?" అనెను. సరోజిని సగంభీరభావమునఁ జేతులెత్తి "మునుపటియాజ్ఞయే. వారియింటికిఁ బోయిన జాగరూకతతో మెలఁగవలయును" అనెను.

రామ : మంచిది. నీవు చెప్పినట్లే నడచుకొందును. పొమ్ము. చాలకాల మైనది. మీతండ్రిపద్ద తలుపులను భద్రముగ బంధించుకొని

పోయి వత్తుము. పరులు వచ్చిన తలుపులను బిగించుకుము సుమా, ఇంటివద్ద భద్రము.

సరో : నేనెన్నడు నట్టిప్రమత్తతతో మెలంగుట లేదు. మీరు సుఖముగఁ బోయిరండు.

అని యామృదుమృణాలబాహుయుగళమును మరల నెత్తి యాతనిమూఁపుపై తట్టెను. రామనాథునిశరీరమునం దాద్యంత మొక్కపారిగ విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లయ్యెను. అతఁ డాముగ్ధమోహనముఖమండలమును గాంచుచుఁ గుశాలవునితో వెడలిపోయెను.

పత్తేదారు రామనాథుఁ డిదివఱ కాభూతగృహమును గాంచియుండలేదు. దానివిషయమై తన బావనైన నడిగి తెలిసికొనఁ డయ్యెను. అజ్ఞాతం బగునాతావున కెట్లుపోఁగలుగుదు ననుసంశయమైన నిదివఱకుఁ గలిగియుండలేదు. గ్రుడ్డివానివలె రవీంద్రునిమాట కియ్యకొనెను. తన కార్యమునం దింతనిర్లక్ష్యముగ వర్తించినందులకు నాతని కిప్పుడు పరితాప మొదవినది—ఏమైన నేమి? వారిప్పుడు మోతీబజారునందు కృష్ణలాలుగృహమును వెదకికొనిపోవుచున్నారు. లేఖయందు చెప్పిన రీతిగ నావీథియం దెంతవఱకు నడచిపోయినను ఆమఱ్ఱి గాన్పింపలేదు. చాలవఱకు నడచినపిదప వా రావీథిచివర కరుదెంచిరి. అచ్చట నొక ఫర్లాంగుదూరమున నొకగొప్పమందిరమును, దాని కెదుట నావటవృక్షమును గాన్పించెను. దానిని జూచి రామనాథుఁడు "అదిగో, ఆచెట్టు గాన్పించినదే కృష్ణలాలుండుబస. నేనిదివఱ కెన్నఁడు నీబజారునకు వచ్చి యాయింటిని జూచియుండలేదు. కంటివా, కుశాలవా! నేనన్న రీతి నదియెంతదూరమున నున్నదో! అయిన నాకు మఱియొకయనుమాన మొదవుచున్నది. పత్తేదా రూరకుండక దొంగవలె వెలుపల

నీ నిర్మాణమున్న ప్రదేశమున నేల దననివాస మేర్పఱచుకొనెను ?”
అనెను.

కుశా : అతఁడు శవపేటికచే వచ్చియుండుటచే పరులకాసంగతి తెలియరాకుండుటన ట్లూరివెలుపల నుండవచ్చును. అందుకే యింతటి యనుమానమా ? అబ్బా ! పత్తేదారులము౦ దేమిచేసినను అనుమానాస్పదముగనే కాన్పించును.

రామ : ఇట్టి యల్పవిషయముల మూలముననే మనకత్యంతోపకారము లొక్కొక్కతఱిఁగలుగునని యంటివే——

అని యింకను నేమియో ననుచుండఁగ నంతలో నాగృహము నుండి యొకవ్యక్తి యీవలకు వచ్చెను. అది కాంచి యాతఁడు తన సంభాషణ నంతటితో నాఁపివైచి యావైపు చూచెను. వ్యక్తిశరీర మంతటను నవకుంఠనము గావించుకొని యుండెను. చూచుచుండఁగనే యాతఁడు రామనాథుని కతిసమీపముగ దాఁటిపోసాగెను. ఇంతలో గుశాలవుఁ డాపురుషుని నాఁపి “అయ్యా ! ఈ యింటియం దెవ రున్నారు ?” అని యడిగెను. నూతనుఁడు క్షణకాలములో వారి యాకారాదులఁ బరీక్షించి “ఆ యింట నొక క్రొత్తపత్తేదారు వచ్చి నివసించుచున్నాఁడు. మీకు బాడుగకు కావలసియున్నఁ బ్రస్తుతము దొరకఁజాలదు” అనెను.

కుశా : ఆతని దేయూరు ?

పురు : దక్షిణదేశము.

కుశా : ఆతనిపేరేమి ?

పురు : కృష్ణలాలు.

కుశా : నీవాతని కేమి కావలయును ?

పురు : నేనాతని సేవకుఁడను. ఆతనికిఁ గావలసిన కొన్ని సామగ్రులను దెచ్చుట కూరిలోపలికిఁ బోవుచున్నాను ” అని చెప్పుచు నాతఁ డటనుండి చకచక నడచి పోయెను. రామనాథుఁడు కాని, కుశాలవుఁడుకాని యాతని నాఁపక తిన్నగఁ నా యింటియొద్దకుఁ జనిరి. వారికిప్పు డందొక యుద్యోగి యున్నాఁ డనుసంగతి స్థిరపడెను. మరొక్కటి సందేహమును గలుగలేదు. నిర్భీతిగ నామందిరమును డాసిరి—అదియే యా భూతగృహము! అమల పూర్వనివాసస్థానము!! రామనాథుఁ డిదివఱకు దానిని గాంచియుండలేదు. ఆకస్మికముగ నేఁడచటికి వచ్చుట తటస్థించినది. కాని యాతనికి మ్రొక్కఁబోయిన దేవుఁడెదురయ్యె ననుసంగతి తెలియు లేదు. తాము తలఁచుచుండిన మందిర మదియే యని తెలిసికొన నేరఁడయ్యెను.

కవాటమును సమీపించి చూడ నది యూరకముందునకు మూయఁబడి యుండెను. వెలుపల సేవకు లెవ్వరునులేరు. కావున వారికి నెట్టియడ్డంకియును లేక నిరాఘాటముగ లోపలఁ బ్రవేశించిరి— ఎప్పటి వలెనే యెదుట పుష్పోద్యానము, చావడి, కాన్పించినది. వారాకూట స్థలమున నిలుచుండి చుట్టును బరికించి చూచిరి. అందుండి మూఁడుద్వారములు బంధింపఁబడియుండెను. ఎదుట వనమున తెనుపత్రములు మందమారుతవశమున ప్రచలిత మగుచు శబ్దించు చుండెను. అచ్చట జనులెవ్వరును లేరు. అప్పుడు రామనాథుఁ డెలుఁ గెత్తి “ అయ్యా ! కిష్ణలాలుగారూ ! ” అని పిలిచెను. మేడపైనుండి దానికి బదులుగ “ నెవరో రండు. మీఁదికి రండు. కృష్ణలాలుగా రిందున్నారండీ ” అని మాటాడినట్లు వినఁబడెను. తోడనే రామ నాథుఁడు ముందుగ, కుశాలవుఁడు వెనుకగ నచ్చటిసోపానశ్రేణి నధిరోహించి పోయిరి.

ఇరువురు మేడపైనుండిన గదిగుమ్మమును డాసిరి. ఆ మందిర మధ్యభాగమున నాజానుబాహుఁ డగు నొకసమున్నత భీకరాకారుఁడు

కూర్చుండి యుండెను. ఆగంతకులఁ గాంచి యాతఁడు చటాలున లేచి నిలుచుండెను—రామనాథుఁ డాతనిని గాంచెను ! ఆయుత్తరక్షణముననే యాతఁడు భయవిహ్వలమానసుఁడై విస్మయవిస్ఫారితనయనములతో వెనుకకు వ్రాలి యప్రయత్నముగ గద్గదికుఁడై "హా—ప్రేతమా—పిశాచమా" అని యార్చెను.

# పదియవ ప్రకరణము

## మృ త జీ వి

రామనాథుని శరీర మంగుష్ఠాదిశిరఃపర్యంతము ప్రచలితమైపోవుచుండెను. హృదయచలన మత్యంతభయావేశమున నతీతమైపోయెను. ముఖము రక్తవిహీనతచే వెలుకబాఱియున్నది. నేత్రములు నిశ్చలములై ప్రకాశశూన్యములై చిత్రాకృతి నొంది యాభయంకరాకారునివైపు తిరిగి యుండెను. అనిమిషుఁడై రామనాథుఁడు మరల నొకమాఱు గద్గదికుఁడై "ప్రేతమా! పిశాచమా!" అని కుశాలవుని హస్తమును గట్టిగఁ బట్టుకొనెను.

ఆతనిభయావస్థకుఁ గారణ మూహింపఁజాలక కుశాలవుఁ డనేక విధములఁ బ్రశ్నలవైచి ధైర్యమును జెప్పుచుండెను. ఎదుటనుండు పురుషుని వాఁడెన్నఁడును గాంచి యుండలేదు. ఆతనిభీషణాట్టహాసము నాలకించి కుశాలవుఁడుసహిత మించుక విస్మితుఁడై పోయెను. ఇంతలో నావ్యక్తి ముందునకు వచ్చి "ఇది యేమి రామనాథా! ఇట్లు వెఱఁగుపడెదవు! నే నెవ్వరో మఱచితివా!" అనెను. రామనాథున కేమి చెప్పుటకును నోరాడకుండెను. నాలుక చెమ్మలేకపోవుటచే కంఠనాళములు బిగించినట్లుండెను. ఆతఁ డతికష్టముపై నింకను భీతివాక్కులతో "ప్ర—వా—శా! నీ—వు!" అనెను, వ్యక్తి మరల నవ్వెను. ఆ పరిహాస మా మందిరభాగములం దంతటను మహాభయంకరముగఁ బ్రతిధ్వనించెను.

వ్యక్తి : రామనాథా! నేను ప్రవాళుఁడనే. నన్నిప్పుడే మఱచితివా ?

రామ : భూ—త—ము, హా !

వ్యక్తి : నేను భూతము కాను, నిక్కముగ ప్రవాళుఁడనే సుమా. నీకుఁ గృష్ణలాలును జూపెదను రమ్ము.

పత్తేదారున కేచిత్ర మేమియో బోధపడలేదు. రవీంద్రుఁడు ప్రవాళుఁడు మృతిఁబొందెనని చెప్పి యుండెనే? అయిన నేఁడెట్లు వీఁడు జీవించివచ్చెను! చచ్చినవారు మరల బ్రతుకుదురా? లేక యీ ప్రవాళుని ప్రేత మీరీతి పిశాచరూపమున లేచి వచ్చినదా! అయిన భూతలక్షణము లొక్కటియును గానరావు. నిజమగుమానవుఁడని చెప్పఁదగియున్నది, ఇదెట్టి మోసము! ఎట్టివింత!! ఎట్టిభయంకరము !!!

ప్రవాళుఁ డింకను పరిహాసనాదముచే బ్రహ్మాండమును బ్రద్దలు గావించుచునే యుండెను, అతఁ డతని భుజప్రదేశములఁ బట్టి కదలించుచు "నేనే కృష్ణలాలును, రామనాథా! ఇట్లు చూచెదవేల? నేను ప్రేతమును గాను. పిశాచమును గాను. బ్రదికిన ప్రవాళుఁడే. నేనే యీ కాగితము ను వ్రాసి నేఁడు నీ యింటికిఁ దెచ్చి యిచ్చితిని. నిన్ను మీ బావను జూడక రెండుదినము లగుటచే మిగుల తహాతహ నొంది యీ విరహబాధ కోర్వఁజాలక మీ దర్శనాభిలాషినై యీ యుక్తిని బన్నితిని." అనెను,

కుశా : అయ్యా! మీరెవ్వరు ?

ప్రవా : కనఁబడుటలేదా? నేనొకమనుష్యుఁడను.

కుశా : ఆ సంగతి మాకుఁ దెలిసినది లెండు. మీరేనా కృష్ణలాలని యడుగుచుంటి నయ్యా!

ప్రవా : అవును.

కుశా : మీరాక ముందే నేనెరుఁగ నని యున్నారని వ్రాసి యుంటిరే, యది నిజమే ?

ప్రవా : దాని నిప్పుడే తెలిపెదను. ఆ యాసనములపైఁ గూర్చుండుఁడు.

అని రామనాథ కుశాలవుల నట సింగారించిన కుర్చీలపైఁ గూర్చుండఁబెట్టి తానచ్చటి గదితలుపులఁ దెఱచుకొని లోపలికిఁ బోయెను.

ఇప్పటికి రామనాథున కించుక ధైర్యము కలిగినది. "ప్రవాళుఁడు గతించి పోలేదు. వాఁ డేవిధముగనో జీవించి యున్నాఁడు మాపై పగను దీర్చుకొన యత్నించుచున్నాఁడు. ఆహా ! సరోజినీ ! నీ వెంతటి యద్వితీయ మేధానిధివి ! ఈ తావులో మోస మున్నదని యొక్కక్షణ ములో నూహించిన నీ నైపుణ్యము నెంతని కొనియాడుదును. నీవు నిజముగ రాణి కాఁదగినదానవు. మూఢుఁడనై నీ మాటల విని నవ్వితిని." అని తనలో దాను తలపోయుచు నాతఁ డొకమాఱు కుశాలవుని వైపు తిరిగి చూచెను. అప్పుడు కుశాలవుఁడు తనయుజ మానునిఁ గనుంగొని యిట్లనెను. "రామనాథ బాబూ ! మీ రిట్లేల భీతిలుచున్నారు ? ఈతఁ డెవ్వఁడో మీ రెఱుఁగుదురా ? ఇందేదైన మోస మున్నదని తోఁచుచున్నదా ?"—"అంతయు భయంకర మోసము. మనము దిక్కు తెలియని కూపమునఁ బడిపోయితిమి. వీఁడు గొప్ప హంతకుఁడు, ఎట్టి ఘనకార్యము గావించునో తెలియకున్నది మిగుల జాగరూకులమై యుండవలయును." అని చెప్పుచు రామనాథుఁడు తలుపువైపు తిరిగి చూచెను—ప్రవాళుఁడు సుందరుఁడగు బాలకు నొక్కనిని వెంటఁబెట్టుకొని యీవల కరుదెంచుచుండెను. ఆ యర్భకుని గాంచి పత్తేదా రాశ్చర్యచకితుఁడై లేచి, "ఆహా ! ఈ బాలుఁ డిచటి కెట్లువచ్చెను ! శాంతినాథుని తనయుఁడు కాఁడా !" అనెను ప్రవాళుఁడు హసించుచు "ఏమి రామనాథా ! నీవు వీనితండ్రి నెఱుఁగుదువా ?" అనెను.

రామ : నేనతనివిషయమై వినియుంటిని. వీఁ డాతనికుమారుఁడు. మాయొద్ద నుండినవీఁ డెట్లిచ్చుటకి వచ్చెను.

ప్రవా : రామనాథా ! మీయొద్దనుండినవెల్ల నట్లే స్థిరముగ నుండే యుండవలయునా ? స్థలములు మాఱుచుండవలయును. అట్లయిన గొప్పగొప్పచిత్రములు జరుగుట కవకాశ ముండును.

రామ : నీవసాధారణచోరుఁడవు. నీవు వీని నెత్తికొని వచ్చితివి కాఁబోలుఁ

ప్రవా : ఉండవచ్చును. లేకున్న వీఁడిచ్చుటికి వచ్చుట కవకాశ మెందున్నది ?

రామ : ప్రవాళా ! నన్నీరాత్రిసమయమున నీరీతి కృత్రిమ లేఖను రప్పించుటలో నీయుద్దేశ మేమి ?

ప్రవా : ఉద్దేశమా ! నీకుఁ దెలిపితిని కాదా ! నిన్ను మీబావను చూడవలయు నని. అయిన నా దురదృష్టవశముల రవీంద్రుఁడు రాఁడయ్యెను. నీవొక్కఁడవే వచ్చితివి.

రామ : నీవు మరణించిపోయితి వని మేము తలంచి యుంటిమి కదా ? కాని, నేఁటి కాతలంపు లబద్ధము లని తెలిసిపోయినవి.

ప్రవా : ఉండవచ్చును. నేనింతమంది మీబోఁటిమిత్రుల నిందు విడిచి నేనొక్కఁడనే పరలోకమునకుఁ బోదునా ! నాకచ్చట ప్రొద్దు పోవుటెట్లు ? మిమ్మిరువురను గొనిపోయిన చాల బాగుగ నుండు నని మరలి వచ్చితిని. అచ్చట మరల మీరు పత్తేదారువృత్తి నవలంబించు చుండ నేను చోరవృత్తి నవలంబించెదను.

రామ : ప్రవాళా ! నీవు భయంకరరాక్షసుఁడవు. నీకుఁ దగినశిక్ష త్వరలో కాఁగలదు. దురదృష్టవంతుఁ డగునీకు మాసేస్తము

పరలోకమున నబ్బుటకు వీలు లేదు. మమ్ముఁగూడ తీసికొని పోవలయునని వచ్చిన నీతలఁపులు వ్యర్థలగును కదా యని నాకు చాల చింతగ నున్నది.

ప్రవా : రామనాథా ! నీకా చింత వలదు. ఈ ప్రవాళునిశక్తి సామర్థ్యములు నీకుఁ దెలియునవి కావు. బలవంతముగ నిచ్చటినుండి మిమ్మెత్తుకొనిపోదును. మీరున్నచోటనే యుండవలయును. నేనుండు చోట నీవుండవలయును. నీవిఁక జింతచేయఁ బని లేదు. కావలసినవానిని జూచుకొన నేనుంటిని కాదా !

రామ : నీవెట్టియసాధారణుఁడవైన నేమి ? ఇఁక మీఁద నీయాటయు సాగదు. బలవంతముగ నిన్నొక్కనిచే యమలోకములోనికి గొంతుపట్టి త్రోసెదము.

కుశా : అయ్యో ! మమ్ము సంహరించెదవా ! అది యిఁక నీ బోఁటివారు నూఱుమంది వచ్చినను సాగదని తెలిసికొనుము.

ప్రవా : (నగుచు)—ఓరీ నీవొకఁడవు మా వెంబడి స్వర్గలోకమునకు వత్తువా ? అయిన మఱియు నానందము. కాని, నీకొకయాజ్ఞ. నీవు మాకన్న ముందుగ నేఁగి మాయాగమనవార్త నచ్చటివారితో తెలుపవలయును.

కుశా : నాకన్న మొదట నీవు పోవుటే మంచిదని తోచుచున్నది. దురాత్మా ! హంతకా ! నీమాటలు తలకు మీఱుచున్నవి.

అని చెప్పుచుఁ గుశాలవుఁడు తనజేబునందుండిన చిన్నయినుప క్రోవిని ( Pistol ) వెలుపలికిఁ దీసి ప్రవాళునికిఁ జూపుచు గర్జించెను. ప్రవాళుఁ డట్టహాసమును గావించెను. భీకరవక్త్రకుహరమునుండి భీషణాగ్నిజ్వాలలు వెలువడుచున్నట్టుండెను. రోషకషాయితంబు లగు నేత్రగోళము లుల్కలరీతిఁ బ్రజ్వలితములై వారిని దహించునట్లుండెను

కుశాలవుఁ డారీతి పిస్తోలును దనవైపునకుఁ ద్రిప్పియుండుటను గాంచి
యణుమాత్రమైన జడియక "ఓరీ, యేమి యీ బుద్ధిమాంద్యము
సేవకుఁడగునీవు మొదట పోయి దాసత్వమును జేయవలయునుగా
నేఁ బోరాదు" అనెను.

కుశా : ఒక్కయడుగైనఁ గదల్పకుము. నీకు నేఁటితో నాయు
వంతరించినది. అందుకే నీవిధి ప్రేరేపింప హాయిగ నింట పరుండి
యున్నమమ్ము నీ దాపునకుఁ దెచ్చుకొంటివి.

ప్రవా : నన్ను నీవెఱుఁగవు. నా ప్రభావము నీకుఁ గ్రొత్త
ఊరక చెడిపోవు టేల? పొమ్మావల. దుశ్చరిత్రా! పరలోకమునకు
బొమ్ము.

అని చెప్పుచు నాతఁ డతివేగముగఁ బోయి యా దాపుననుండిన
దారునిర్మితత్సరువు నొకదానిని ద్రిప్పివైచెను. తోడనే కుర్చీపైఁ
గూర్చుండియుండిన కుశాలవుఁ డాకస్మికముగ—నా యాసనసహితం
బుగ—పాతాళమునకు—తలక్రిందుగఁ బడిపోయెను. ఆశ్చర్యము!
ఆశ్చర్యము!! రామనాథుఁ డది గాంచి భయభ్రాంతుఁడై యొకకేక
వైచి తన పీఠమును వీడి లేచి నిలుచుండెను!!!

ఏమి యీ వింత! కుశాలవుఁ డెందు పోయెను? ఒకక్షణకాల
ములో నతఁడు పాతాళలోకమునకు వెడలిపోయెను. రామనాథున
కా సమయమున నేమిచేయుటకును దోచలేదు. అతఁ డూరక జిచ్చపడి
చూచుచుండెను. హృదయభాగమున రోషశోకభయభావములు ముల్లడి
గొని యాతని శాంతప్రకృతిని వ్యత్యస్తము గావించెను. అప్పుడు
ప్రవాళుఁ డాతనిని మరల హెచ్చరించుచు "రామనాథా! చూచెద
వేల? మనము త్వరలో వత్తుమని చెప్పుటకు నీ సేవకుఁడు ముందుగ
స్వర్గమునకుఁ బోయెను. నీవు కూర్చుండుము. సావకాశముగఁ బోదువు

కాని ” యనెను. పత్తేదారున కపారరోషము జనించినది. అతఁ డధర స్పందన గావించుచు “ఓరీ, పాతకా! కష్టాత్మా! ఇఁక కడతేరితివి. నిన్నీ క్షణముననే సంహరింప మానను. ఆలసించినకొలఁది నీయాటలతిశయించి పోవుచున్నవి. నీవు మా ప్రబలవైరివి. నీతో నాకు పరసోక్తులు వలదు. నీవీభూలోకమున నుండఁదగినవాఁడవు గావు. దుర్జాతీ! మొదట చచ్చినవాఁడవు చావక మరల బ్రతికి వచ్చి మమ్ము బాధింపయత్నించితివి కాఁబోలు.” అని రామనాథుని నోటినుండి వాక్ప్రవాహము వెడలివచ్చుచుండఁగనే దురాత్ముఁడగు నాహంతకాధముఁడు తటిల్లతవోలె వచ్చి యా హస్తద్వయమును గట్టిగఁ బట్టుకొనెను. బాలుఁ డగునాతఁ డాబంధమును వదలించుకొననేరఁడయ్యెను. ఆతని ప్రయత్నములు నిరర్థకము లయ్యెను. అప్పు డా ప్రవాళుఁ డాతని జేబునందుండి పిస్తోలును దీసి యావల నుంచి “ రామనాథా! నన్ను సంహరింపక నీ గర్వమును మానవా? తులువా! నోరుమూసికొని కిక్కురుమనకుండఁ జచ్చిపొమ్ము. లేకున్న దుర్మరణమునకుఁ పాల్పడుదువు. నీకిచ్చట సాయము వచ్చువా రెవ్వరో చూతము.” అని యదలించెను. రామనాథుఁ డిఁక తప్పించుకొనిపోవు టెట్లు! ఒకటి—కాదు–రెండుమాఱు లిదివఱకే యాతనిపై దుర్నిరీక్ష్యంబగు మృత్యుదేవత వచ్చియుండెను. కాని దైవకృపాతిరేకమున నప్పటి కాగండములు తప్పిపోయెను. ఇప్పు డీమూఁడవగండమున నాతని నుద్ధరించువా రెవ్వరు? ఆ యువకుఁ డాసమయమున నూరక పెనఁగులాడుచు నింకను దనపౌరుషోక్తులను మానక “ దుర్జాతీ! నిన్ను చీల్చి యాబాలకుని గొనిపోక మానను. నీ కుత్సిత ప్రవర్తనమునకు నేఁడే పరిణామము గాన్పించును చూడుము ” అని చెప్పుచుఁ బ్రవాళునిహృదయముపైఁ గాలితో నతి భయంకరముగఁ దన్నెను. అయినను వాఁడు పట్టువడలేదు. ఆ వేటుచే

ఖడ్గాఘాతమునుండి సురిగిపోయినకంఠీవమట్లుగర్జించుచు "బాలకాధమా! నేను మన్నించుకొలఁది నీగర్వము మితిమీఱుచున్నది. నన్నుఁజీల్చి వీనిని గొనిపోవు సామర్థ్యము కలదా? అయినఁజూతును. నాకన్న ముందు నీవే చీల్పఁబడుదువు" అని చెప్పుచు ప్రళయాకారముగ నేత్రసంచాలన గావించి యొఱయందుండిన దీర్ఘకరవాలము నెత్తెను—ఆ మృత్యుదంష్ట్రాదర్శనముచే రామనాథునిహృదయ మతివేగముగ నదరిపోయెను!

ప్రవాళుఁడు ఖడ్గహస్తమును బైకెత్తెను. పత్తేదారుతను వెల్ల గడగడవడఁకిపోవుచుండెను. కంఠము నెత్తియొకకూత వేయుటకైన నా సమయమున దోఁచినది కాదు. ప్రవాళునిచేత—ఒక క్రూరుఁడగు తస్కరునిచేత—హంతకునిచేత — దనకింత దుర్మరణమా ! అదియే యాతని భయకారణము. నేఁడాతనిని రక్షించువారెవ్వరు—కుశాలవుఁడు లేఁడు. దీనావనుండగుసర్వేశ్వరుఁ డొక్కఁడే. ప్రవాళునిఖడ్గ మాతనిశిరముపై నతిభీషణరూపమున వ్రేలాడుచున్నది. ఆతనిశిరమును కత్తిరించి పారవేయును. రామనాథుఁ డిక నీభూమిని బ్రవాళుఁడన్నట్లు వీడిపోవలసినదే. కాని, తనయుదంతమును రవీంద్రుల కెఱిఁగించినవా రెవ్వరు ? ఆతని నాకాలమున కాపాడువారు లేరా ! ఇంకేది గతి ? ఆతఁ డింకను బాలుఁడు, అద్వితీయ మేధావి, అనన్యదుర్లభరత్నము— అట్టిది నేఁడీరీతిగ నగ్నిదగ్ధము కావలసినదేనా ! ఆయమూల్యవస్తు వారీతి నంతరించుచుండ రవీంద్రుఁ డిక దాని నేకాలమునకు నంతరింపఁ గలఁడు ? ఆహా ! దైవమాయ ! ఎట్టివారి కెట్టిసమయమున కెట్టివిపరీతములు సంభవించునోకదా. ఘటనాచక్రమున నేఁడొక భయంకర కార్యముజరుగనై యున్నది. అది దుర్నివార్యము. రామనాథున కిఁక జగదీశ్వరుఁడే దిక్కు. ఆతఁ డాయార్తపరిపోషకుని మదిలో నెంచుచు మఱల నొకమాఱతిగాఢముగఁ బాద మెత్తి ప్రవాళుని మెడపైఁ దన్నెను. అందుచే నేమి ప్రయోజనము కలిగినది ? ప్రవాళునకోపాగ్ని

ప్రజ్వలితమై ముఖమునంతను రక్తరంజితముగ జేసెను. వానికరమందలి తరవారి వాయుమధ్యమున నిలిచి యిచ్చటి దీపప్రకాంతులలో దళతళ మెరసిపోవుచుండెను. ఆ హంతకుఁడు బాలునిచేతులను వదల లేదు. ఆ దృఢబంధనమున హస్తశల్యములు పొడిపొడియగుచుండెను. ఇఁక చావు నిశ్చయము. హతాశుఁడై రామనాథుఁడు తీక్ష్ణ దంష్ట్రాకలిత ఘోరాజగరముం బోలి నిస్సారుఁడై హరినామస్మరణం గావించుకొనుచు నూరక నిలుచుండెను. ప్రవాళుఁ డట్టహాసముఁ జేయుచు "రామనాథా! కడతేరితివి" అని కేకవైచెను. తోడనే యాకస్మికముగ నావెలుపలి ద్వారమునుండి యొకతుపాకిగుండ తిభయంకరశబ్దమును జేయుచువచ్చి యా ప్రవాళుని ఖడ్గహస్తమునకుఁదాకి దానినిఖండించి పాఱవైచెను !! ప్రవాళుఁడు మూర్ఛాగతుఁడై నేలపైఁబడిపోయెను !!!

అహా ! ఏమియా దైవనిర్దిష్టమ యీమహిమ ! రామనాథుఁడు వెనుదిరిగి ద్వారమువంకఁ జూచెను. బాలికయగుసరోజిని యాసమయమున కేకల నగుచు వచ్చియాతని బాహుపంజరమునఁ బడిపోయెను. ఆమెహస్తమునం దుండిన యనుపక్రోవి మెఱసి యాతనికన్నుల మిఱుమిట్లుగొలిపెను. ఎంతటిచోద్యము ! సరోజినియేనా యింతపనిని జేసినది ఆమె యిచ్చటి కెట్లు వచ్చెను ? ఎవ్వరెఱుఁగుదురు !

రామనాథుఁడు నిర్విణ్ణుడై నిలుచుండియుండెను. ఆతనిహృదయమున నప్పు డనిర్వచనీయమగు నూహాపూరితము వీచుచుండెను. ఆకస్మికముగ నింతపని జరుగుటయు, సన్నరీక్షితంబుగ సరోజిని యట దృశ్యురా లగుటయు నత్యంతాశ్చర్యకారణము లగువింతలు. అప్పుడా ముగ్ధబాల యాతనినిఁ జూచి "ఏ మట్లు చూచెదరు ? రాణిని చూడఁగా భయ మగుచున్నదా ?" యని నవ్వెను. అతఁ డామోహనాకారిణిని

విస్మయనయనములతోఁ జూచుచు "సరోజినీ! నీవిచ్చటి కెట్లు వచ్చితివి?" యనెను. "నడచివచ్చితిని" అనుచు నామె మరల నవ్వెను. అతఁ డామెహస్తమును బట్టుకొని "నీ వీరాత్రిసమయమున— చీకటియం దొంటరిగ వచ్చితివా?" యనెను.

సరో : లేదు, ఒంటరిగ రాలేదు.

రామ : అయిన నీవెంట వచ్చినవా రెవ్వరు?

సరో : దేవుఁడు.

రామ : నీ విటకు రాఁ గారణ మేమి? ఇంట పండుకొనుమని చెప్పితినే.

సరో : ఇంట పరుండుట కిష్టము లేక మీకుఁ దెలియకుండ మీ బావగారి యలమారునందుండిన యీ చిన్నతుపాకిని గైకొని యిచ్చటికి వచ్చితిని.

రామ : ఏల?

సరో : నే నీరాత్రి మోస మున్నదని హెచ్చరింపఁగ మీరు నవ్వితిరి. నాకు చాల భయమగుచుండెను. వీఁడే నేఁటిసాయంకాలమున మీయింటికిఁ గాగితము తీసికొని వచ్చినవాఁడు. వీని నొకమాటు నేను సోమనాథుని గృహమునందు చూచియుంటిని. అప్పుడు వీఁడు వానితో మిమ్ము సంహరింప యోజించుచుండెను. అందుచే నే నపాయము రాఁగలదని భీతిలి మిమ్ముఁ గాపాడుట కిట్లు వచ్చితిని. నే ననుకొన్నంత పని జరిగినది. కాని దైవము కరుణామయుఁడు. సజ్జనసంరక్షణపరుఁడు." రామనాథుఁ డప్పు డాలావణ్యమయిని బిగియారఁ గౌఁగిలించుకొని ముద్దిడుకొనెను. "నీవు నిజముగ నాపాలిటి దేవతవు. సరోజినీ! నీవు రాణివి. నేను నీ దాసుఁడను, నీవు బాలికవు గావు. నా ప్రాణదాత వగు త్రైలోక్యమాతవుసుమా, ఈ రూపున

నన్నుద్ధరింప నీ జగమునకు దిగి వచ్చితివి. నిన్నెంతో పొగడుదును. నాకది సాధ్యముకాకున్నది." అని యానందాశ్రుపూరము రాల్చుచు నిజబాహుబంధనమున నజ్ఞానవశవర్తినియై యున్న సరోజిని సుస్నిగ్ధ దంతావళదంతవిభ్రమమగు ప్రశస్తగండభాగమున ననేకమారు చుంబన వర్షమును గురిపించెను. ఆమె యజ్ఞాతదశయందున నాతని హస్తములనుండి వెలువడి యామె కనుదెరచి యచ్చట పడియున్న యొకదీర్ఘపాశముతోఁ గ్రూరాత్ముని కాలుసేతుల బంధింపసాగెను. రామనాథుఁ డది గాంచి నవ్వి "రాణీ! సరోజినీ! నీవు దేవతవు. దేవతలు రాక్షసులను ముట్టరాదు. తొలఁగి రమ్ము. నే నాపనిని జేసెదను." అని చెప్పుచు నామె హస్తమునందలి పగ్గమును గైకొని యా హంతకుని హస్త పాదములను దృఢముగ బంధించివైచెను. ఇంతలో మెట్లపై నెవ్వరో వచ్చుచున్నట్లు శబ్ద మయ్యెను. రామనాథుఁడు మరల నెవ్వరో దురాత్ములు వచ్చుచుంటిరని తలఁచి యచ్చట పడియున్నకత్తిని దీసికొని యా వైపునకుఁ బరుగిడి పోయిచూచెను—అప్పుడు మెట్లపై గుశాలవుఁడు వచ్చుచుండుటను గాంచి యాతఁ డానందాతిశయముతో నొక కేకవైచెను.

ఇఁక నేమి? ఇంతకన్న హర్షదాయక మేది? పోనున్న రెండు నిండుప్రాణములు బ్రతికినవి. రామనాథుఁడు కుశాలవుని సేవక భావమును వదలి కౌఁగిలించుకొని "ఎంతటి సుదినము! కుశాలవా! జీవించితిమి!" అనెను. ఇంతలోఁ గుశాలవుని కంటికి బాలదేవీ స్వరూపిణి యగు సరోజిని గానవచ్చెను. తోడనే యాతఁడు చీత్కా-రముఁ జేసి "ఈమె యిచ్చటి కెట్లు వచ్చెను?" అని యడిగెను.

రామనాథుఁ డాతని నొకచోఁ గూర్చుండఁబెట్టి జరిగినయుదంతము నంతటిని దెల్పి "కుశాలవా! సరోజిని మన దేవత. ఆమెను

మన మింట నునిచి పూజింపవలయును" అనెను. సరోజిని రామనా థునిపై వు దనచంచలకురంగమోహానవీక్షణములఁ బఱపి హాసించెను. వాని నాతనిచూపు లెదుర్కొన్నవి. వానిభావ మవాచ్యము! కుశాలవుఁడు వాని యర్థమును గ్రహించెను! అదియే ప్రేమానందవీక్షణ సమితి !!

చతుర్దశవర్షశోభావంతుఁడాలగు సరోజిని చేసిన యీయద్భుత కార్యము నాలకించి కుశాలవుఁడు విస్మయానందములతో గంతులు వైచుచు "ఆహా! నేఁడీదేవీశిరోమణి సమయమునకు రాకుండిన నెంతటిప్రమాదము జరిగిపోయి యుండును! ఈమె నిక్కముగ మా దేవత బాబూ!" అనెను.

రామ : కుశాలవా! నీస్థితిసహితము కడు ప్రమాదకరమైనదే. నీవు క్రింద పడిపోయినప్పు డేనూతిలో పడిపోదువో యని నాకు చాల భయ మయ్యెను. నీవెట్లావిపత్సాగరమునుండి తప్పించుకొని వచ్చితివో చెప్పుము.

కుశా : అయ్యా! నే నేమని చెప్పుదును? భగవంతునికృప యపారమై యుండుటచే బ్రతికి రాఁగలిగితిని. లేకున్నఁ బ్రవాళుఁ డన్నట్లు పరలోకమున కేఁగవలసిన వాఁడనే! నేనారీతి పడుటలో విశేష మేమియును లేదు. నేను కూర్చుండి యుండిన యాసన మొక పలక కమర్పఁబడి యుండెను. వీఁడాసమయమున నారీతిగ నాకత్తి పిడిని ద్రిప్పఁగనే యాక్రిందపలక యవ్వలి కీడ్వఁబడినది. తోడనే నేఁ గూర్చుండి యున్న పీఠ మాధారరహితమై తలక్రిందుగ నా సహితముగఁ గ్రిందియింటిలోనికి బడిపోయెను. నాపుణ్యవశమున నే నాసమయమునఁ గ్రింద నుండిన ప్రాఁతబట్టలకుప్పపైఁ బడుటచే నాశిరము ప్రక్కలుగాక నిలిచినది. లేకున్న నీసరి క్షేమమై యుందునో!

అయినను చాలయెత్తునుండి పడుటచే నేను కొంతసేపు స్మరణ లేక పడియుండి పిదప లేచి చూచుసరికి కారాగృహ మంతయు దుర్భర దుర్గంధపూరితమై నరక ప్రాయమై యుండెను. ఆమందిరద్వారమునకు వెలుపల తాళము వైచఁబడి యుండుటచే నాకు బయటికి వచ్చుటకు వీలు లేకపోయినది. నే నెంత ప్రయత్నించి చూచినను నాకోరిక సఫలము కాకపోయెను. ఇంతలో నాకు హఠాత్తుగ పైభాగమునఁ దుపాకిశబ్దము వినఁబడుటచే నాయాతురత శతాధికమయ్యెను. ఈపాపి మ మ్మేమి చేసెనో యను భీతిచే నప్పుడిఁక గత్యంతరము లేక నాయొద్ద నుండిన చిన్నచురియచే నాతలుపులను బంధించియుండిన చిన్నమల నూడఁదీసివైచి వాకిలిని దెఱచుకొని పరుగిడి వచ్చితిని. నాకింకను మేడపై మాటలు వినఁబడుచుండెను. భయాతురత సంభ్రముఁడనై యిట కరుదెంచుసరికి దేవుఁడు నా కింతటి నేత్రానందకరమగు దర్శనమును జూపి నను ధన్యుని జేసెను,"

ఈ చరిత్ర నాఁ కింది రామనాథాదు లాశ్చర్యపూరితులై యాతని ధైర్యసాహసములను మిగుల కొనియాడిరి. అంతయును భీషణ ప్రయత్నము — అమానుష శక్తిసాహసములు — అనర్థప్రదాయక ఘోర సంకటములు. ఇన్నియు భగవంతుని లీలావలోకమున నొకక్షణ కాలములో జరిగినవి. ఇట్టివే దైవచిత్రములు !!!

# పదునొకండవ ప్రకరణము

## సీ తా రా మ ల క్ష్మ ణు లు

ప్రవాళుఁ డింకను మూర్ఛ నుండి మేల్కొనలేదు. వాఁడింకను పాశబద్ధుఁడై తెలివిదప్పి పడి యుండెను. శాంతినాథునితనయుఁ డీభయంకర దృశ్యములను గాంచి యించుక జడియుటచే రామనాథుఁడు వానిని దాపునఁ జేర్చుకొని బుజ్జగించుచుండెను. అప్పు డాబాలకుఁ డాతనితో నిట్లనెను. "అయ్యా! వీఁడు మహాక్రూరుఁడై నన్ను మిగుల బాధించుచు నేఁడు సంహరింప యత్నించుచుండెను. కాని, యింతలో నాపాలి ప్రాణదేవతవోలె వచ్చి మీరుద్ధరించితిరి."

రామ : బాలకా! నిన్నానందసాగరునింటినుండి గొనితెచ్చిన వా రెవ్వరు?

బాల : వీఁడు కాదు; మఱియొకఁడు. పేరు కరాళుఁడఁట. అయ్యా! వాఁడు సార్థకనామధేయుఁడే. నేను భోజనానంతర మూరక వచ్చి వెలుపలపరుండి యుండగ నానాఁ డాముచ్చు మాయింటి కొక భిక్షుకునివేషముతో వచ్చెను. నేను వానిని గాంచి లోపల భోజనము చేయుచున్నారు కాన నించుక నీ వాఁగుమని చెప్పితిని. వాఁడట్లే నాకట్ట దాపునఁ గూర్చుండెను. ఇంతలో నాగ్రహచారవశమున నాకించుక నిద్రవచ్చినది. అప్పుడు వాఁడు తిన్నగ నాకాలుసేతుఁ గట్టి నోట గుడ్డలు గ్రుక్కి యెత్తుకొని వచ్చి యీయింటఁ బడవైచెను. వాఁడు వీనిస్నేహితుఁ డఁట. ఇరువురు నన్ను చంపవలయునని యుండిరి. మీరు వచ్చుటకుఁ బూర్వమే వాఁడిందుండి వెడలిపోయెను.

ఈ మాటలు వినఁగనే రామనాథునకుఁ దాము దారిలో చూచిన పురుషుఁడు జ్ఞప్తికి వచ్చెను. వాఁడే కిరాతుఁడని యిప్పు డాతనికిఁ దోఁచెను. ఏమియో వస్తువులను దెచ్చెదనని నాకు చెప్పి పోయిన యీ మహాత్ముఁడు మరల వచ్చునేమో యని యీ విషయము నా బాలుని నడిగెను.

బాలు : అది నాకుఁ దెలియదు. వాఁడు వచ్చునో లేక నీ గడ బిడ నాలకించి పారిపోవునో, మీరు మాత్ర మేమరక వానిపై నొక కన్నుంచి యుండుఁడు.

రామ : కుశాలవా! చాలకాలము గడచిపోయినది. నీవూరి లోనికిఁ బోయి రెండు బండ్ల నద్దెకుఁ దీసికొని వచ్చిన నీ ప్రవాళుని ఖైదీగఁ జేసికొని యొకదానిలోఁ గొనిపోదము. ఇచ్చట నీవు మరల వచ్చువఱకుఁ గావలి యుండెదను.

కుశాలవుఁడు వల్లెయని జాగరూకుఁడవై యుండుమని హెచ్చరించుచు నా యింటిని వదలిపోయెను. ప్రవాళుఁ డింకను నెంతసేపటికిని దెలివొందకుండుటను గాంచి సందేహించి "వీఁడు మరణించెనా!" యని వచ్చి దేహమును ముట్టి చూచెను. అది యింకను వెచ్చగనే యుండెను. విశేషరక్తము కారుటచే గుండె దడదడ కొట్టుకొను చుండెను. అది గాంచి ప్రాణభయము లేదని యెంచి యాతఁడు "సరోజినీ! ఎంతపనిని జేసితివో చూడుమా. ఈ యసాధారణబలవంతు నింతసేపు మూర్ఛగడిపిన నీసామర్థ్యము నేమని కొనియాడుదును!" అనెను.

సరో : అది నా సామర్థ్యము కాదు. నిన్ను నేఁజూచినంతనే మీశక్తి యంతయు నాలోపలి కరుదెంచి నాకంతటి యుద్రేకమును గలిగించినది.

రామ : నీవు వయసున బాలికవైనను బెద్దలకన్నను శక్తిమంతు రాలవు. నీబుద్ధి యద్వితీయము. నీయట్టిబాలిక నిదివఱ కెందును నేఁ జూచియుండ లేదు.

సరో : మీరు చెప్పినదేదో నాకర్థము కాకున్నది.

రామ : నీకు మానవభాష తెలియుదా ?

సరో : తెలిసినమాత్రమున నేమి ప్రయోజనము ? తెలియనిది లేనిది చెప్పిన నెవరి కర్థమగును ?

రామ : తెలియనిది లేనిది యేమి చెప్పితిని ? అంతయుఁ దెలిసి యున్నదే కదా.

సరో : లేదు. లేదు. మీరు చెప్పుదానిలో ముక్కాలుమువ్వీస ముత్తైతొభావ మిమిడి యున్నది.

అనిమిషలోచనుఁడై సోమనాథుఁ డామెముఖారవిందమునుండి దొరఁగునావాక్ప్రవాహమాధుర్యమును గ్రోలుచు నానందపరవశుఁ డగుచుండెను. అప్పు డామె యాతనితో నిఁకమాటాడక నా బాలుని వైపు తిరిగి "బాబూ ! నీపే రేమి ?" యనెను.

బాల : విశాలుఁడు.

సరో : నన్ను నీవెఱుఁగుదువా ?

విశా : ఎందును జూచియుండ లేదు.

సరో : నిన్నుమాత్రము నేఁజూచియున్నాను.

విశా : ఎచ్చట ?

సరో : సోమనాథునియింటియందు. నిన్నుఁ గొలదిమాసముల క్రింద కరాళుఁ డటకుఁ దెచ్చియుండెను. అప్పుడు నీవలెనే యుండిన యొకబాలికకూడ నీవెంటనుండెనే యామె నీకేమి కావలయును ?

విశా : ఆమె నాచెల్లెలు. సుశీల.

సరో : ఆమె యిప్పు డెచ్చట నున్నది, బాబూ !

విశా : నాకాసంగతి తెలియదు.

సరో : నీతలిదండ్రు లీయూరిలో నున్నారా ?

విశా : ఇది మాయూరు కాదు. మాది భ్రాంతపురము. మా తండ్రిసహితము వీరిచే నీయూరిలో నెచ్చటనో దాఁచియుంచఁబడి యున్నాఁడు. మాతల్లి మాయూరిలో కష్టపడుచున్నదఁట.

సరో : "పాపము, మీస్థితి మాకన్న శోచనీయము అన్నా ! దేవుఁడు మిమ్ము త్వరలో నొకతావునఁ జేర్చి సుఖపెట్టుఁగాక" అని తనకోమలకరపల్లవములను విశాలునిశిరముపై నుంచి యాతని నాశీర్వదించుచుండెను. రామనాథుఁ డామోహితమోహనచేష్టలఁ గాంచి హర్షప్రఫుల్లుఁడై "సరోజినీ ! నీయాశీర్వచనబలమమోఘము. విశాలుఁడిఁక నదృష్టవంతుఁ డయ్యెను లెమ్ము. నీదేవహస్తస్పర్శచే నాతఁడు పవిత్రుఁ డయ్యెను" అని చెప్పెను.

సరో : మీరు చెప్పిన దొక్కటియు నాకర్థము కాదని మొదటికే చెప్పితిని కాదా ! మీరేచిత్రభాష నెందు నేర్చితిరో నాకుఁ దెలియకున్నది.

రామ : దానిని నీగుణగణాదులు నేర్పినవి. ఏమిచేతము, ఎంత మఱతుమన్నను సాధ్యము కాకున్నది.

విశా : అయ్యా ! ఈమె మీ కేమికావలయును ? మీ రెవ్వరు? మిమ్ము నే నెక్కడను జూచియుండలేదు.

రామ : విశాలా ! నేను నిన్ను విభీతమందిరమునుండి తీసికొని వచ్చినరసింహుని బావమఱఁదిని. నీ తండ్రికి స్నేహితుఁడను, ఇఁక నీమెవిషయమా, యామెనే యడుగుము. ఆమె నాకెట్టిబంధువని చెప్పఁ జాలకున్నాను.

సరో : అన్నా ! విశాలా ! నమస్కారము. ఈతని [illegible]క యున్మత్త చేష్ట లభ్యమగుచున్నవి. వానిని [illegible] ము నమస్కారము.

అని హాసించుచు నామె విశాలునితో [illegible] రామనాథుని చేతులను గట్టిగా పట్టుకొని [illegible] పలుకుచుండెను. రామనాథుఁడును నానంద ప్రపూర్ణహృదయుఁడై సరోజినితో నిట్లనెను:

"సుందరీ ! కవివరేణ్యుఁ డైన నేను [illegible] ల నీ స్థితియందు గాంచిన నిక్కముగ మమ్ము శ్రీరామలక్ష్మణులతోఁ బోల్పక పోవు సుమా."

సరో : ఇందు రాముఁ డెవఁడు ?

రామ : నేను.

సరో : లక్ష్మణుఁడు ?

రామ : విశాలుఁడు.

సరో : ( ఇంచుక జరిగి నిలుచుండి ) అయిన నన్ను సీతను కమ్మనెదరా ? ఛీ ! మీ యుపమానాలంకార మీ సమయమున నంతసమంజసముగ లేదు. మీరు [illegible] జేసెదరు.

రామ : ( నగుచు ) నా యుపమానము బాగుగ లేదా ? సరోజినీ ! అయిన నీవే చెప్పుము. ఇందులో సీత నేనా [illegible] ? విశాలుఁడు కావచ్చునా ?

సరో : మనలో నెవ్వరును గారు. త్రేతాయుగమునందుండిన జనకమహారాజుకూఁతురే సీత. మనము యథాప్రకారముగ రామనాథ విశాలసరోజినులమే.

ఆ మాటలను విని రామనాథుఁడు విశాలునివైపు పక్కున నవ్వెను. ఆమె విశాలుని యానతి కీయకొని "అన్నా ! నమస్కారము. ఈతనితో మనకు మాటలేల ? ఈతఁడు క్రూరుఁడు. మమ్ము నొప్పించును

తలుపులు వేయఁబడి బీగములు బిగింపఁబడి యుండుటచే నీవు ప్రాయశః నీభ్రాతగృహమునకు వచ్చియుండు వని యూహించి యప్పుడే నేనీవీథి ననుసరించి వచ్చుచుంటిని. మార్గమధ్యమున నాకుఁ గష్టము లేకుండఁ గుశాలవుఁ డంతలోఁ గాన్పించి సంగతిని దెల్పి యచ్చటికిఁ బిలుచుకొనివచ్చెను. బాబూ! రామనాథా! నీవింతటిశక్తిమన్వితుఁడ వని తెలియకపోయెను. నీవింకను బాలుఁడ వనియు, యుక్తిపరుఁడవు కావనియు నెంచి యుంటిని కాని యింతటి ప్రబలమేధావి వనినమ్మనైతిని. ఇంతటి గొప్పసహాయము ముసపరతను నాచేత నుండియు దానిని దెలిసికొన నేరనైతిని. నిజముగ నీవు నాయంతటివాఁడవు. కాదు—కాదు—ఇంకను గొప్పవాఁడవు సుమా.

రామ: బావా! ఏమి యీయాగడము! నేనేమి చేసితిని? నా యింతటిపనులకు నీ బాలికామణియే కారణము. ఈమె లేకుండ నుండిన నీసరికి నేనేమైయుందునో నాకే తెలియకున్నది. ఈ కన్యకా రత్నము మాపాలిటిభాగ్యదేవత. మీరు చెప్పిన విశేషవాక్యము లన్నియు నీమెకే తగును కాని నాకుఁ గాదు.

రవీంద్రుఁడు సరోజినివైపు దిరిగి చూచెను. ఆరూపమాధుర్యము—ఆ సరళభావము—ఆ లావణ్యమయముఖతేజము—అతని నొక మోహినీ మంత్రముగ్ధుని గావించివేసెను. ఇంతలో నాతనిచూపులు విశాలునివైపు దిరిగెను. తోడనే యాతఁడు వానిని జేరి "అన్నా! ఇదిగో పోయిన విశాలుఁడు దొరికినాఁడే! ఎంతమంచిదినము!" అని యుచ్చరించుచుఁ బల్కెను. రామనాథుఁడు నాఁటిదినమున జరిగిన యుదంతముల నన్నిటిని దెలిపి "బావా! మీరు భరతపురమునం దెంతవఱకుఁ గార్యసిద్ధి నొంది వచ్చితిరి?" అనెను. రవీంద్రుఁడు "ఆవిషయముల నింటిలో చెప్పెదను, ఒక్కమాట. పాపము నారీరత్నమగు నమలమ్మాత్రము నిన్నదినమున

గతించిపోయినది. ఆ దృశ్యమును గాంచినప్పటినుండి నాకు మిగుల సంతాప మొదవినది" అనెను.

ఇదివఱకే తెలివొంది నిశ్చేష్టుఁడై వారిసంభాషణ నాలకించుచుండిన ప్రవాళునికర్ణకుహరమున నీదారుణవాక్యములు దూఱెను. తోడనే వాఁడు విస్మయాచరితుఁడై లేవఁబోయి క్రిందపడి డగ్గుత్తికతో "రవీంద్రా! రవీంద్రా! ఏమనుచుంటివి? నాయమల గతించిపోయెనా? ఎట్లు?" అనెను. రవీంద్రుఁడు వానివైపు తిరిగి చూచెను. వాఁడింకను జీవించియే యున్నాఁడు. రవీంద్రుని యాశ్చర్యము మేరదాఁటి పోయినది. మాటామంటకైన వీలు లేక దారుప్రతిమవలె యూరక వానివైపు జూచుచుండెను. ప్రవాళుని యాతురత యతిశయించుచుండెను. పాపమాతనిగండభాగములపై నశ్రుబిందువులు గారుచున్నవి. అప్పుడాతఁడు మరల "ఏమట్లు చూచెదవు? రవీంద్రా! నామాట వినఁబడుటలేదా? అమల యెట్లు గతించి పోయినదో చెప్పుము" అనెను.

రవీం : శత్రువు లామెను పొడిచి చంపిరఁట.

ప్రవా : శత్రువు లెవ్వరు ?

రవీం : తారసింహుఁడు.

ప్రవా : వాఁడెట్లు శత్రు వయ్యెను ?

రవీంద్రుఁ డమలమరణకారణమును దెలిపివైచెను. అది విని ప్రవాళుఁ డశ్రుపూరితలోచనుఁడై నిట్టూర్పు పుచ్చి "హా! దురాత్మా! మిత్రద్రోహీ! క్రూరరాక్షసా! తారసింహా! ఎంతపనిని గావించితివి?" అని యార్చుచుఁ గొంతవడి మాటలు దక్కి మందచేష్టుఁడై పోయెను.

రవీం : ప్రవాళా! నీవు చావలేదా? నీవు మరణించితివని తలఁచి యుంటిమి. మరల నెట్లు బ్రతికితివో చెప్పుము.

ప్రవా : ఇందాశ్చర్య మేమియును లేదు. రవీంద్రా! నీవానాఁడారీతి నాతో విభీతమందిరమునఁ బోరాడి తలపై బలముగు వ్రేటును వేసినది నీకు జ్ఞాపకమున్నదా! ఆ దెబ్బ యొట్టిస్థలమునఁ దగిలెనో కాని నే నామఱుదినమంతయుఁ దెలివి లేక మృతప్రాయుఁడనై పడియుంటిని. నేను గతించి పోయితినని యుందఱును దలంచిరి కాఁబోలు. నా సహచరులుకూడ నట్లే యెంచి నన్నీగృహమునందలి భూగృహమునఁ బాఱవైచియుండిరి. కాని నాఁటివేకువజామున నాకు తెలివివచ్చి చూచుసరికంతయు బోధపడినది. తోడనే నేనందుండి లేచి గుప్తమార్గముగుండ నీవలకు వచ్చి మాఱువేషమున నూరిలోనికిఁ బోయి నాభోజనాదికంబులఁ దీర్చుకొని వచ్చి ముందు కావలసినపనులను నెఱవేర్ప యత్నించితిని. కాని, రవీంద్రా! నాయత్న మొకటియును సఫలము గాదయ్యె. నాపను లన్నియు భస్మాహుతిసదృశము లయ్యెను. నాసతి గతించెను, మిత్రులు శత్రులైరి. పగతురు విజయ మొందుచున్నారు. సర్వము నా చేయి దాఁటిపోయినది. ఇఁక నేనేమిచేయుదును? పోయినప్రాణములే వడలిపోక మరల నేల యీ దేహాభిమానము నుంచుకొని వచ్చెనో తెలియకున్నది.

రవీం : ప్రవాళా! దుర్మార్గుల కెప్పటికైనను బరిణామము గాన్పింపకపోదు. వారియాట లెన్నిదినములైనను సాగుట లేదు. అయిన నీ వెంతటి యొండ్రప్రాణమో తెలియకున్నది. నీవు నిజముగ మరణించితివని యెంచితిమి కాని యీ తీరున మరలలేచివత్తువని యొక నాఁటికిని దలఁపలేదు. అయిన నిప్పుడు నీ హస్తము తెగిపోయినది. కదా. నీవిప్పుడు చాల బాధ ననుభవించుచుందువు——

ప్రవా : చాలబాధ యని వేఁడుఁగ జెప్పవలయునా! నా ప్రాణము లీకారణముననే చల్లఁబడునని యెంచెదను. రవీంద్రా! నీవు నన్నిప్పుడు కారాగృహమున బంధింతువని తెలియును. దానికి నేఁజింతింపను. నేఁటిక రెండుదినములమీఁదట జీవింపను. అప్పుడు ఖండితముగ మరణింతును. నిక్కముగ గతింతును. అప్పు డీప్రపంచముతో నాకు సంబంధము లేకుండఁబోవును. కాన, నీవు రేపటిదినము సాయంకాల సమయమున నొంటరిగ నాగదికి రమ్ము. అంతయును జెప్పెదను. ఇప్పుడు నామాటలకుఁ గొన్నిటికి సదుత్తరముల నిచ్చినఁ జాలును. నిన్ను మఱేమియు వేఁడను. అమల గతించిపోయిన మాట వాస్తవమా? దారసింహుఁ డిపు డెచ్చట నున్నాఁడు?

ప్రవాళా! నే నబద్ధములాడుచుంటి ననుకొంటివా? నా కన్నుల యెదుటనే యామె నిన్నటిరాత్రి తీరిపోయినది. నే నామె చెప్పినదాని నంతటిని వ్రాసికొంటిని. నా కింకను దారసింహుఁ డెచ్చట నుండునది తెలియదు. ఇఁక ముందు వానికై వెదకవలయును.

ప్రవాళుఁ డిఁక మాటాడలేక ముకుళిత నేత్రుఁడై నిట్టూర్పులు పుచ్చుచు నటునిటు పొర్లుచు "అమలా! హా! ప్రియా!" యని దుఃఖించెను. అప్పుడు రవీంద్రుఁడు రామనాథుని గాంచి "అన్నా! ఈ బాలికయేనా నిన్ను సోమనాథుని యింట రక్షించిన దేవీమూర్తి!?" యనెను.

రామ : అవును. ఈమె తన తండ్రితో నచ్చట బంధింపఁబడి యుండెను.

రవీం : మంచిది. ఇఁకఁ దడయకుఁడు. నీవు వీరినందఱిని మన యింటికిఁ గొనిపొమ్ము. ఈ ప్రవాళుని సోమనాథునివలె బందీ చేసినారమని రక్షకోద్యోగులకుఁ జెప్పి కారాగారమున నొకచో సుఖముగ నుంపుమని చెప్పుము. వెలుపల మీకై రెండు బండ్లు కాచుకొని యున్నవి. పొండు.

రామ : మీరీయర్ధరాత్రమున మరల నెచ్చట కేగుదురు ?

రహీం : ఆ విషయము నిపుడు సరిగఁ జెప్పఁజాలను. నాకింకను బనియున్నది. ఈ ఘోరకార్యము లన్నియు సఫలీకృతములగువఱకు మనకు నిద్రాహారము లెక్కడివి ?

రామనాథుఁడు మఱేమియు మాటాడక కుశాలవుని సహాయముతోఁ బ్రవాళుని గొనిపోయి వెలుపల బండిలోఁ బరుండఁబెట్టెను. పిదపఁ దనబావయొద్ద సెలవు గైకొని మిగిలినవారితో రెండవబండిలోఁ గూర్చుండి యూరిలోనికి వెడలిపోయెను.

# పండ్రెండవ ప్రకరణము

## సూత్రభవనము

రామనాథాదులు వెడలి పోయినపిదప రవీంద్రుఁ డంతదేకాకియై యుండి చాలవఱకు నేదియో యోజించుకొనెను. ఆగది నంతటిని నొకమాఱు పరిశోధించి వచ్చెను. కాని, యందేమియు విశేషములు తెలియరాలేదు. ఇదివఱకప్పుడే యొక్కమారా స్థలపరిశోధన యైయుండెను. అంతటను మొదటివింతలే— మొదటిగబ్బిలముల రావములే— యెప్పటిదుర్వాసనలే.

అంత నాతఁడు తిన్నగ మేడ దిగి వచ్చి వెలుపలిద్వారమును బంధించి గొళ్లెముంచెను. అచ్చటిస్థలముసహిత మెప్పటివలెనే విరాజిల్లుచుండెను. త్రిభాగములందున్న గదితలుపులు తెఱవఁబడియున్నను నాతఁ డందుఁ బోలేదు. ఆతని కొక్కకోరిక. ఏమన, మూఁడుదినముల క్రిందట నాతఁ డీమందిరమున వృద్ధకాలివేషముతోఁ బ్రవేశించినప్పుడు దానిని సంపూర్తిగ శోధించి యుండలేదు. అంతలోనే యాతఁడు వృశ్చికవిషప్రభావమున వివశుఁడై పడిపోయెను. కాని, పిదప నొకమాఱా యింటికి వచ్చుటకుఁ దీరిక కాలేదు. ఇంతలోఁ దనకు భరతపుర ప్రయాణ మొకటి పడుటచే నది మఱింతయసాధ్యమయ్యెను. రామనాథుఁడైన నీపనిని నెఱవేర్చియుండలేదు. కాన, దాని నీదినము సంపూర్తిగఁ బరిశోధించి పోవలయు నని యెంచినవాఁడై రవీంద్రుఁడు రామనాథు ననుసరించి యింటికిఁ బోలేదు. ఆతఁడంత తిన్నగ నచ్చటి

యుపవనమునఁ బ్రవేశించెను. వృక్షములకుఁ గొలఁది దినములనుండి నీరు
లేనందున శుష్కించి పోవుచుండెను. అమల యచట కాపురముండినన్ని
దినములవఱకు నవి యెంతో శోభలములుగఁ బెఱిగెను. ఇప్పుడు
వానిని గాపాడువారు లేకపోయిరి. పోషకులు దిక్కులు తెలియక పాఱి
పోయిరి. రవీంద్రుఁడు కొంతసేపటి వఱకు నచట నుండిన మల్లికాలత
క్రిందఁ గూర్చుండి యా నలుభాగములందలి ప్రదేశమును బరికించి
చూచెను. తన్నాదినము మోసగించిన కృత్రిమశిల వ్రక్కలై భూమార్గ
సమీపమునఁ బడి యుండెను.

రవీంద్రుఁ డిప్పు డెదుట నుండిన నూత్నమందిరములోనికిఁ బోవు
టకు యత్నించుచుండెను. కాని దాని తలుపు లెప్పటివలెనే మూయఁ
బడి యుండుటచే నది సులభసాధ్యము కాకపోయినది. ఆ గృహము
తప్ప నా స్థలమునం దితరభాగముల నన్నిటిని పరికించి వచ్చియుండెను.
కావున నా స్థలములను మరలఁ జుట్టి వచ్చుటవలనఁ బ్రయోజనము లేదని
యాతనికిఁ దెలిసెను. భూతమందిరమునకు నా నూత్న మందిరమునకు
నేదియో సంబంధ ముండునని యాతఁ డూహించెనే కాని యది యేమై
యుండునది, యం దేమి యుండునది తెలిసికొన నేరక పోయెను. ఎంత
పరికించి చూచినను లోపలికి మార్గము గోచరింపలేదు. ఇంతలో
రవీంద్రుఁడు "భూగర్భములలో నుండు గదులలో నెందైన నీ యింటికి
మార్గ ముండునా?" యని సందేహింప మొదలిడెను. దుద కా శంక
చేతనే యాతఁడు తిన్నగ నచటనుండిన మెట్ల ననుసరించి క్రిందికి దిగి
పోయెను. అచ్చట సహిత మంతయు యథారీతిగనే యున్నది.

అందుండిన గదు లన్నియు మూయఁబడి యుండెను. చుట్టును
గాఢాంధకారము. తన కరదీపికను వెలిఁగించి దాని మూలమున
రవీంద్రుఁ డా కవాటముల నన్నిటిఁ దెఱచెను. మొదటిదుర్గంధ మింకను

విశేషముగ నుండెను. దానికారణము నూహించి యాతఁడతికష్టముపై దానిని సహించుచు నచ్చటిగదిలోఁ బ్రవేశించెను. అంతనతని పాదములు భూమిలోనికి దిగఁబడిపోవుచుండుటచే నడచుటే మిక్కిలిఁ గష్టముగ నుండెను. కొంతసేపటికిఁ బూర్వపుగదుల నన్నిటిని దాటిపోయెను. మునుపుండినట్లే యాయనాథుఁజేతను త్రొట్టియుండఁబడి మిగుల నసహ్యకరముగ నుండెను. కాని, యాతని కెందును సుశీలదేహము కాన్పింపలేదు. అప్పు డది పడియున్నచోట నిప్పుడు లేదు. దానినాతార సింహాకరాళుఁడో నెవరో యొక రెత్తుకొనిపోయి యెందో పాఱవైచి యుందురని రవీంద్రుఁ డెంచెను.

ఇప్పు డాతఁ డెప్పటిగదులలో లేఁడు. ఒకగొప్పగదియందుఁ దిరుగాడుచు నందుండిన ప్రతివస్తువును బరీక్షించుచుండెను. అది క్రొత్తది, ఇదివఱ కాతఁ డందు సంచరించి యుండలేదు. దానియందుండిన సామగ్రి యంతయు నొకప్రాతబట్టలమూట—కొన్ని ఖడ్గములు—ఒక ప్రాఁతమంచము, అందెందుఁజూచినను భూమి చెదపట్టి నడచుటకు మిగుల బాధాకరముగ నుండెను. ఇంతలో రవీంద్రుఁడు దీపపువెలుతురునఁ దన కెట్టయెదుట కొంతదూరమున నేదియో ప్రేలాడుచుండుటను గాంచి యచ్చటి కేఁగెను—అది యొకదృఢమగుపాశము! అతఁడు తలనెత్తి చూచుసరికి పైకప్పున నొకనరదేహము పట్టజాలినంతబిలమొకటి చేయఁబడియుండెను. అందుండి యాపగ్గము క్రిందిభాగమువఱకు ప్రేలాడుచుండెను, రవీంద్రుఁడు దానినీడ్చిచూడఁ బైభాగమున దేనికో భద్రముగఁ గట్టఁబడినట్లు తెలిసిపోయెను. తోడనే యాతఁడు "ఆహా! తెలిసినది. నేనూహించిన ట్లాపై మందిరమున కిది మార్గమై యుండవచ్చును. దీని ననుసరించిపోయిన నందుఁ జేరఁగలము" అని యనుకొనెను. అంత నాతఁడు తనదీపమును దనమొలయందు దృఢముగ

బంధించుకొని యార్జునవృక్షసహాయమున మీఁదికిఁ బ్రాఁకిపోసాగెను. అది మిగుల నెత్తుగ నుండుటచే నాతని కించుక యాయాసముకూడఁ గలుగుచుండెను. తుద కాతఁడతిప్రయత్నముతో నాపైభాగమునకు వచ్చి యా సందునుండి దాఁటి యచ్చటిస్థలమునంతను నొకమాఱు తిలకించి చూచెను.

ఆగది నొకకటికవానివలె జుగుప్సాకరముగ లేక యించుక శుభ్రముగ నుండెను. సంస్కారశూన్యమై యుండుటచే నందందు దుమ్ము పడియుండుట తప్ప నచట చెడువాసనలు లేవు. రవీంద్రుఁడు దాని నంతను జూచుచుండు తఱి నాతనికంటి కాకస్మికముగ నచటిగోడ పైభాగమున నొకచిన్నబొఱియ కాన్పించెను. అందుండి దీపకణమును వెలువడుచుండుటను గాంచినంతనే యాతనిరిచ్చపాటుసహస్రాధికమయ్యెను. కాని, యాతావున కేఁగి లోపలనుండు చిత్రములను బరికించి చూచుట కావంతయైన నవకాశము లేదు, గూడుమిగుల నెత్తున నుండుటచే నాతఁడు దాని నందుకొననేరఁడయ్యెను. ఎందు చూచినను దగినవస్తువొకటియు గోచరింపమి కడ కాతఁడు విసిఁగికొని యొకమాఱెలుగెత్తి "లోపలనుండువారెవరు!" అని బిగ్గఱగఁ గూసెను. కాని యెట్టి ప్రత్యుత్తరమును రాలేదు. అంతయు నిశ్శబ్దయుతము—రవీంద్రుఁడు మరల నొకమాఱు పిలిచెను—అదియు నిష్ఫలమయ్యెను. అతఁడంత ననన్యగతికుఁడై మిగుల నాయాసముఁ జెంది మీఁదనుండినయుత్తరీయము నాతావునఁ బఱచుకొని పరుండెను—అంతలో నాతని కించుక నిద్దుర యుబ్బినది—ఆహా! భూతిగృహమున మరల నొకమాఱు రవీంద్రుఁడు ప్రమత్తతతో నిదురించెను! వెనుకటియనుభవమును మఱచిపోయెనుగాఁబోలు !!

ఆతని ప్రస్తుతావస్థకొక యంతరాయము సంఘటిల్లెను. అప్పుడు రవీంద్రుఁడు తటాలున లేచి చూచుసరికిఁ బార్శ్వమున నొకపురుషుఁడు కూర్చుండియుండెను. పత్తేదారుఁ డిదివఱ కాతని నెన్నఁడును గాంచియుండ లేదు. రూపమతిగంభీరయుతమై యున్నను సదాహారములు సరిగ లేమి మిగులబడలి సన్నగిలి యుండెను. దేహమునందు సువర్ణాభరణములు మిలమిల మెఱసిపోవుచుండెను. ధరించినవస్త్రము లమూల్యములైయున్నను నపరిశుభ్రములై యుండెను. రవీంద్రుని కాశ్చర్యముగలుగ లేచి యీవలికి వచ్చి యా వ్యక్తియాపాదమస్తకమును బరీక్షింపసాగెను. అది క్రౌర్యమిశ్రితవికారముఖము కాదు ! అతి సౌమ్యము !! కేవల దయారసపూరితము !!!

పురుషుఁడు తిన్ననియెలుఁగెత్తి యిట్లనెను. "అయ్యా ! మీరెవరు ? ఈ నిగూఢసంకేతప్రాంత్యమును మీరెట్లు చేరఁగలిగితిరి ?"

రవీం : నేనొకయపరాధపరిశోధకోద్యోగిని. నాకించుక యీ గృహమందు పనియుండి యిటు వచ్చియుంటిని. మీరీరహస్యస్థలమున నుండుట కేమి హేతువు ? మీ పేరేమి ?

పురు : నన్నుఁ గేశవపాలుఁ డందురు. మీరు పత్తేదారు లని తెలియఁగనే నాకేటికో మిగుల నానందముగ నున్నది. ఈ చంద్రనగరే నా వాసస్థానము.

రవీంద్రుఁడామాటల నాలకించి యాశ్చర్యచకితుఁ డయ్యెను. "నన్నుఁ గేశవపాలుఁడందురు. ఈ చంద్రనగరే నా వాసస్థానము" అనుమాట లాతనికర్ణకుహరములందు ప్రతిధ్వనించుచుండెను. "ఏమి, యీతఁడు కేశవపాలుఁడా ! ఏ కేశవపాలుఁడు" అని యాలోచించుకొని యిట్లనెను. "అయ్యా ! మీకీచంద్రనగరున బంధువులున్నారా ?"

కేశ : లేకేమి. నా తనయయు, నల్లుఁడు నున్నారు.

రవీం : వారిపేరేమి ?

కేశ : అల్లుఁ డానందసాగరుఁడు, ఒకబ్యారిష్టరు, తనయ సరళ.

రవీంద్రుఁడు విస్మయసంభ్రమాధిక్యముచే నున్మత్తుఁడగుచుండెను.

"ఎంతటి వింతవార్త ! ఆనందసాగరుని శ్యాలకుఁడగు కేశవపాలుఁడా యీతఁడు ! ఈతఁడు మరణించెనని కదా మేమింత శ్రమ నొందుచుంటిమి. ఇంకను జీవించియున్నాఁడే. ఆహా ! అపుడు చెప్పినమాటలిప్పుడు బోధపడుచున్నవి. ఆమె ప్రమీళను, కేశవపాలునిహత్యాపరాధ విషయమై యడిగిన వారు నగుచు నేమియు చెప్పకుండుట లేదట. బ్రతికియున్నవాఁడు చచ్చెనని ఆమె తలంచుటచే వారట్లు నగుచుండిరి కాఁబోలు. ఔరా ! ఎంతటిప్రమాదము !" అని యాతఁడు నిశ్చల దృష్టితో నిలుచుండి చూచుచుండెను. ఉట్టిపాటున నీసత్యము తెలియుటచే రవీంద్రునిమనోవీథియందసంఖ్యాకంబులగునూహాశకటములు తరలిపోవుచుండెను——వర్ణింపఁజాలము ! రవీంద్రునిప్రస్తుతావస్థ యిట్టిదని చెప్పనేరము ! మాభాష యంతటిశక్తిసమన్వితము కాదు ! ఊహింపుఁడు——అది యనూనభావస్ఫూర్జితము ! ప్రావృట్కాలశంపావేగమున దాటిపోవుచున్నది ! ప్రతిపన్నవిదూరితము ! విలేఖనాతీతము ! అవాచ్యము !! అమేయము !! విస్ఫారము !!!

ఇంకేమున్నది ? అంతయు విశదమైనది. ఎవఁడు గతించెనని తలఁచి రవీంద్రాదు లహరహంబు నిద్రాహారంబులఁ గానక చింతించి కష్టముల నొందిరో, ఎవ్వనిని సంహరించిరని ప్రమీళాదులు హంతకులుగ సందేహింపఁబడిరో, యెవ్వనియపసారణము నిజమగుచావుగ సందేహింపఁబడి యింతటిచరిత్రములుద్భవిల్లుటకుఁ గారణ మయ్యెనో, యెవ్వనియనుమానితమరణవ్యాజంబున శాంతనాథసరోజినీమోహనచంద్రాదిదురదృష్టవంతులచరిత్రములు తెలియనయ్యెనో, యెవ్వఁడు కీర్తిచంద్రనగరమున ధవళచంద్రికాప్రాయముగ విలసిల్లియుండెనో——

యట్టి కేశవపాలుఁడు— చంద్రనగరపు కేశవపాలుఁడు—సరళజనకుఁడు కేశవపాలుఁడు—నేఁడాకస్మికముగ రవీంద్రుని యెదుట సాక్షాత్కరించెను.

రవీంద్రుఁడు నాలుగైదునిముసములవఱకు ఈ పాంచభౌతికప్రపంచమును మఱచి నిశ్చలభావమున నొకచోటనుండి పరవశుఁడై యుండెను. కేశవపాలుఁ డనుచున్నమాట లాతనికి వినఁబడవయ్యెను. ఏమి యీయాశ్చర్యకము ! రవీంద్రుఁడు తన యన్నగారి [illegible] ప్రాయమున నొక నాఁటికైన నింతటిప్రమాణమును బొందియుండ లేదు—ఇంతటిచోద్యమును కనివిని యెఱుఁగఁడు. ఆతఁడు నాలుగైదునిముసములవఱకు మాటాడక యేదియో యోచించుకొనుచుండెను. అంతలోఁ గేశవపాలుఁ డిట్లు పలుకరించెను “అయ్యా ! ఏమి యోచించుకొనుచుంటిరి ? మీబోటిపత్తేదారుల కీయింట నేమిపని యుండెను. చాలచింతనొందుచున్నా రేల! ” రవీంద్రున కేమి చెప్పుటకును దోఁచకుండెను. ఆతనికిఁ గేశవపాలునిపలుకు సరిగ వినఁబడనైన లేదు. ఈతఁడు జీవించి యుండిన నిఁక నాఁడు తాను గంగాప్రవాహమునఁ జూచిన ప్రేతమెవరిది ? అచ్చటనుండిన యుంగరపు చక్రి యను నక్షరమునర్థమేమి ! ఆనందుఁ డెంత మోసపడెను. ఇందు కేదైనఁ బ్రబలకారణ ముండవలయును. చంపఁబడినయాతఁ డెవ్వఁడు ! శవమునకుఁ దా నారంభించిన యపరాధపరిశోధకకార్యముల కణుమాత్రమైన సంబంధము లేకపోయినది. దీని కేది యోచన ! ఈ యూహాసమితియందు మునిఁగి యుండు రవీంద్రుఁ డింకను దెలివొంద లేదు. మఱలఁ గేశవపాలుఁ డదేప్రశ్నము వైచి “అయ్యా ! మాటాడ వేమి ! ఇంతటిచింత యెందుకు ?” అనెను.

పత్తేదారున కించుక మెలఁకువ గలిగినది. కేశవపాలుఁడు తన్నేదియో యడుగుచుండె నని యప్పుడు బోధపడినది. అప్పుడాతఁ డిట్లనెను ” మీరు గతించి పోయితిరనియూరివారెల్లఁ దలఁచియున్నారు. కాని దైవకృపచే నట్లు జరిగినది కాదు. ”

కేశ : అయ్యా ! ఆ యానందమేల ? నేఁడు నేను చావకున్నను నింకఁగొలఁదిదినములకే మరణించిపోదును.

రహీం : ( విస్మితుఁడై ) ఎట్లు !

కేశ : నాశత్రువులు నన్నుఁ దుదముట్టింతురు.

రహీం : మీశత్రువు లెవరు ? ఎందున్నారు ?

కేశ : వారప్పుడప్పు డిచ్చటికి వచ్చి పోవుచుందురు. అయ్యా ! నేనొకవేళ వారిపేరులఁ జెప్పినను మీరు గ్రహింపఁజాలరు. నామిత్రులే నాశత్రువు లన్నఁ జాలును.

రహీం : పేరులను జెప్పుఁడు. ఎఱిఁగినవారైన గ్రహింపఁగలను.

కేశ : ప్రవాళుఁడనువాఁడు.

రహీం : వానిని నేనెఱుఁగుదును. ఒకగంటకాలముక్రిందనే వానినిబట్టి చెఱసాల కనిపివచ్చితిని.

కేశ : ( ఆశ్చర్యమున )—వల ?

రహీం : హంతకుఁ డని భావించి.

కేశ : ఎవరినిహత్యఁ గావించెను.

రహీం : మిమ్ములను సంహరించె నని తలఁచి.

కేశ : అయ్యా ! వాఁడు నన్నుఁ జంపవలయునని యే యెత్తుకొని వచ్చి యుండుంచెను.

రహీం : ఎన్నిదినములక్రిందట నీకార్యమును గావించెను.

కేశ : సుమారొకనెల కావచ్చినది. ఒకనాఁటిరాత్రి వాఁడు నాకొకమోసపులేఖను బంపి నన్నచ్చటికి రమ్మని వేడుకొనెను. నేను వానిని నాప్రాణస్నేహితునిగ నెంచియుండుటచే మఱుమాటాడలేక పోతిని. అప్పుడే వాఁడు మీఁదఁబడి బంధించివైచి ఈచోటికిఁ దెచ్చెను.

రవీంద్రుఁ డావిషయముల నాలకించి యాశ్చర్యపడుచు జరిగిన యుదంతము నంతటిని బూసగ్రుచ్చినట్లు చెప్పివేసెను. అదివిని కేశవపాలుఁడు కూడ వెఱఁగుపడెను. అంతయుఁ బ్రమాదవశము ! కేశవపాలుఁడు చావలేదు. చోరులచే నపహరింపఁబడి యీగుప్తస్థానమున నునుపఁబడెను. ప్రవాళుఁడు హంతకుఁడు కాఁడు. అంతకన్న నధికుఁ డగు తస్కరుఁడు—ద్రోహి. బ్రతికియున్న కేశవపాలుఁడు గతించిపోయె నని యందఱు ననుమానించియుండిరి. నేఁడు రహస్యము వెలువడెను. నిబిడాంధకారము నిర్మూలము గావింపఁబడినది. దాని చోటునఁ బ్రబల తేజోన్వితంబగు జ్యోతి వెలుఁగుచున్నది. అంతయు విశదమైనది ! కేశవపాలుఁడు చావలేదు !! జీవించియున్నాఁడు !!!

# పదుమూఁడవ ప్రకరణము

## పిశాచము

రహీం : ఆర్యా! మీరిఁక నిట నుండఁదగదు. శీఘ్రముగ నూరికిఁబోయి కేఁగి యీశుభవార్త నానంద సాగరునకుఁ దెలియఁజేతము లెండు. ఏమైన నేమి, యీ దుర్వ్యాఖ్యానంబు నాధారంబుగఁగొని నిరాశులై పడియున్న సరోజినీమోహనచందవిశాలుల నుద్ధరించితిమి. ఇఁక శాంతినాథు నొక్కనిని గాపాడవలయును. అదియును సర్వేశ్వరునికృపాతిరేకమున త్వరలో నెరవేరఁగలదు. పాప మిన్నిదినములీనిర్బంధవాసమున — ఈ నరకమున — నేగతి గాలము గడపితిరో కదా.

కేశ : ఆర్యా! పూర్వార్జితకర్మఫల మవశ్యానుభోగ్యము కాదా? దానిని దప్పించువా రెవ్వరు? అయిన నాదారుణకారాదుర్మరణము నుండి దేవుఁడు నన్ను మీరూపునఁ గాపాడుచున్నాఁడు. మీసాహసాధిక్యమును, దయాగుణమును, ఆర్తపరిపాలనాధురంధరతయు ఎంతని పొగడుదును. నాసర్వస్వంబు నర్పించినను ఋణవిముక్తుఁడను గానేరను. ఆపాపి ప్రవాళుఁడు మొదటినుండియుఁ బ్రాణమిత్రునివలెఁ జరించుచుండి కడ కింతటిఘోరకార్యమును జేసెను. ఎందుకిట్లు చేసెనో నాకుఁ దెలియకున్నది. వాఁడు పాపమునకుఁ దగినశిక్ష నొందెను. ఈశ్వరుఁడు నిష్పక్షపాతి — సర్వజనసంఘంబునకుఁ దత్తత్కార్యానుగుణ్యంబగుశిక్ష విధింపకపోఁడు.

రవీం : ఇది యెట్టి పొగడ్తలకుఁ దాఁపు కాదు. మన మీ కోటినుండి శీఘ్రముగ దాఁటిపోవుట మంచిది. ఇఁక నేనిక [illegible] శేషోపదంతముల గుఱించి యోచింతము.

కేశ : అయ్యా! రవీంద్రా! ఈకోట దాఁటినను కూడ యెట్టి సంకటములు రావు కదా!

రవీం : ఇంకేమియు భయము లేదు లెండు. ఒకవేళ నట్టివి కలిగినను యోజించుకొనుటకు నేనుంటిని గాదా?

కేశవపాలుఁ డాతనిమాటల కానందించుచు నచ్చటినుండి లేచెను. రవీంద్రుఁ డాతనిని వెంటఁబెట్టుకొని యావాసమునందు బిలము నొద్ద కరుదెంచెను. ఇంతలో నేదియో తలంచుకొని పత్తేదారు "అయ్యా! మఱచితిని. మీరుండినగది నొక్కమాఱు పరీక్షించి రావలయును" అని యనెను. కేశవపాలుఁ డందుల కెట్టియభ్యంతరమును జెప్పక "రండు, చూచి వత్తురుగాక. నేనచ్చట నొకనిఁ గాపు వైచినాను" అని చెప్పుచు నాతని మరల నాగూటిదాపునకుఁ దెచ్చెను. అప్పుడు రవీంద్రుఁ డాతని గాంచి "అయ్యా! మీరిందే నిలిచియుండుఁడు. మరల నింతమీఁది కెక్క రావలయునన్న మీకు మిగుల శ్రమగ నుండును. నేనొకఁడనే లోపలికిఁ బోయి వచ్చెదను" అనెను. కేశవపాలుఁడు వల్లెయని యందే యొకచోఁ గూర్చుండెను. పత్తేదారు తనదీపికను చేతియందు ధరించి యానిచ్చెన నెక్కిపోయి యువ్వలిగదిలోఁ దిగెను. అది కడు గొప్పది. కుడ్యమున కందంద దగిలింపఁబడినఖడ్గపంక్తులు తళతళ మెఱయుచుండెను. ఒకచో నొక పెద్దమునుపెట్టెయు, మఱి యొకచో నొకపురాతనఖట్వామును, వేఱొకచో దారునిర్మితంబగునొక తొట్టియు, నింకొకచోఁ గాగితములఁ గాల్చిన బూడిదెకుప్పయుఁ దప్ప నింకేమియు లేవు.

అతఁ డందు చేరినతత్క్షణమే పోయి యాపెట్టెతలుపులను దీసెను. అందేమియుఁ గానిపింపలేదు. చిరకాలమునుండి మూఁతమూయఁబడి యుండుటచే లోపల నంతయును నసహ్యాకరమగుగాలిచేరి యుండెను. అతఁడు దాని నంతటితో మూసివైచి యాకట్టెతొట్టెని, కాగితముల బూడిదెను బరీక్షించెను. వానిమూలమునఁగూడ నెట్టిరహస్యమును తెలియరాలేదు. ఇఁక నుండున దొక్క-కంకటియే. రవీంద్రుఁడు దానిని సమీపించెను. దానిపై నొకప్రాతనశయ్య పఱుపఁబడియుండ దాని నుండి దుర్వాసన గుబులుకొని వచ్చుచుండెను. అది చిరకాలము నుండి సంస్కారశూన్యమై యుండెను. అంత నాతఁడు దానిని జుట్టి క్రిందనుంపగనే యచ్చట లకోటా వైవఁబడినయొక కాగిత మాతనికిఁ గోచరించెను. కాని యందేమియు వ్రాఁత కాన్పింపలేదు. అంతయు వట్టిశూన్యమగు కాగితము. దానినిగాంచి రవీంద్రుఁ డాశ్చర్యపడి "వట్టితెల్లకాగితము నేల యింతభద్రముగ నుంచి యుంచురు! ఇందేట్టి విశేషమైన నుండును. ఈపనిని జేసినవాఁడు బహుశః కేశవపాలుఁడే యైయుండును. అతని నడిగి విచారింతము" అని దానిని తనచొక్కా జేబునం దుంచుకొనెను.

ఇంతలో నాతనిచేతియందలిదీపమునకుఁ దైలము లేకపోవుటచే నది యాఁగిపోయెను. అతఁ డంత చేయునది లేక యామబ్బుగదియందు మంచముపై జేయివైచి ప్రాఁకులాడెను. ఆ సమయమున నాకస్మికముగ వెలుపలిగదియందు బిగ్గఱగ నొకకేక వినఁబడి యంతటితో నాఁగిపోయెను—అది కేశవపాలునిధ్వనియే! ఇదియేమి విపరీతము! రవీంద్రుఁడు దాని నాలకించి నిర్విణ్ణుఁడై నిలుచుండెను. ఆ సమయమున నేమిచేయుటకును దోఁపక దాను సహితము గట్టిగ "అయ్యా! కేశవపాలా!" యని యఱచెను. కాని, ప్రయోజనము లేకపోయినది. అతఁ డంత నత్యాతురతతో నాతమఃపూరితమందిరమున దడవాడుచు

కుడ్యద్వారమును సమీపించెను. అతని కిప్పుడు సరిగఁ గన్నులు గాన్పించకుండెను. చతుర్భాగంబులందు నవిచ్ఛిన్నంబగు నంధకారము నుండి భీతిని గొలుపుచుండెను. నిశ్చేష్టహృదయుఁడైన నాతఁడు పైకి నెక్కి చూచెను. ఎదుట నతిమాత్రము దిమ్మచీకటి సూచికాభేద్యమై యున్నది. అతఁ డెంతపిలిచినను కేశవపాలుని నుండి ప్రత్యుత్తరము రాలేదు. రవీంద్రుని కిప్పుడు చాల భయము గలుగుచుండెను. హంతకులలో నెవరో యచ్చటికివచ్చి అతని నెత్తుకొనిపోయి యుందురని తలఁచెను. ఇంకేది దిక్కు, ఇంత శ్రమపడి, సాహసించి కనుఁగొన్న రహస్య మిట్లే యంతరించి పోవలయునా? కేశవపాలుఁడు దొరికెనని యిఁక నానంద మెక్కడిది! అతని నెవరెత్తుకొనిపోయి యుందురు! ఒకయరగంట క్రింద నిచటనుండినవాఁ డిప్పు డెచ్చటి కేఁగెను. బిలమార్గముగుండ దిగిపోయియుండునా? రవీంద్రుఁ డాస్థలము నంతటిని పరీక్షించి చూచెను. అప్పు డాతని కాలి కేదియో యొకవస్తువు తగిలినది. అతఁడు దానిని శోధించిచూడ నది యొక యినుపక్రోవియని తెలిసిపోయినది. అయినఁ గేశవపాలుని గతి యేమి! అతఁ డరగంటక్రింద గాన్పించి యంతలో నంతర్ధానము చెందెనే. అతఁడు నిజముగఁ గేశవపాలుఁ డేనా! లేక యిదియొక మోసమా! రవీంద్రుని కిప్పు డీవిషయమై యనుమాన మొదవసాగెను. అతఁడు కొంతసేపటివఱకు నేమిచేయను దోఁచక విభ్రాంతుఁడై యా చీకటిగదియందు నిలుచుండెను.

అరగంట గడచినది—ఏమూలనుండియో యతిభయంకరమగు పరిహాస మొకటి వినవచ్చెను. అదివిని రవీంద్రుఁడు తడబడెను. అతని హృదయము గుభిల్లుమనెను. చుట్టును దిరిగిచూడ నాసమయమున నాపాళము గట్టియుండినద్వారమునుండి యేదియో యొకవికార మగు రూపము పైగదిలోనికి లేచి వచ్చుచుండెను!!!

ఆహా ! ఏమి యాభీభత్సాకారము ! శిరస్సునకుఁ దగినశరీరము లేదు. ముఖమున కనుపగు నేత్రములు లేవు. హస్తపాదము లతిహ్రస్వములై వికారముగ మిణుఁగురుపురుగులువోలెఁ బ్రకాశించుచుండెను ! నేత్రము లుల్కలువోలె చలించుచున్నవి ! హస్తమునందలి దీర్ఘకరవాల మాయంధకారమున సహితము తటిల్లతవోలె మెఱయుచుండెను. రవీంద్రుఁ డావికృతాకారము గాంచి విభీతుఁడయ్యెను. తనజీవితకాలమున నెప్పుడు నింతటి భయంకర రూపసందర్శనముఁ జేసియుండలేదు. భూతమో — పిశాచమో — మఱేమియో యతనికి బోధపడలేదు. అట్టివానినైన నాతఁ డిదివఱ కెన్నఁడును జూచియుండలేదు. వ్యక్తి యెవరై యుండును ? అది నరరూపము కాదు — దేవతాకారము గాదు — కేవల పిశాచస్వరూపము. విశేషముగు భయము జనించుటచే రవీంద్రుని శరీరమునం దంతటను ముచ్చెమట లొదవెను. మేను చలించుచుండెను. నోట మాట వెడలుట లేదు. గుండె దడదడ మని మీఱిపోయినది. వ్యక్తి సరిగ నచ్చి యాతనిమ్రోల నిలుచుండి పైకప్పెగిరిపోవురీతి నట్టహాసమును గావించెను. అప్పు డాతఁ డేమి చేయుటకును దోఁపక, మిగులఁ జడిసియున్నను నించుక ధైర్యముతో రుద్ధకంఠుఁడై "ఎవరునీవు" అనెను. వ్యక్తి యుత్తర మిచ్చుటకు మారుగ నశనిపాతమువోలె కర్ణకుహరములు వ్రీలురీతి గేకలవైచి పరిహాసమును జేసెను.

రవీంద్రునకు భూతములందు సంపూర్ణమగు నమ్మకము లేకున్నను వానిపేరన్న నించుక భయపడుచునే యుండును. ఆ సమయమున ధైర్యము జనించినను నది క్షణభంగురమే. అతఁ డాసమయమున నతికష్టముమీఁదఁ గొంతవఱకు ధైర్యమును బ్రోగుచేసికొనెను. పిశాచముల నాతఁ డిదివఱ కెన్నఁడును జూచియుండలేదు. పలువురు పలువిధములుగ వానివిషయమై మాటాడుకొనుచుండుట నాలకించి యుండెను.

అందుచే నేడాతని హృదయాంతరాళభాగమున భయము జనించి పూర్వము తానువినిన భూతచర్యల నన్నిటిని కలఁచుకొనెను, అవి మోసకారిజీవులఁట! విచిత్రకార్యముల జరుపునఁట! రవీంద్రుని కింకొకయనుమానము జనించినది. చచ్చిపోయిన కేశవపాలుఁ డేమైన నిపుడు తనపై పగవహించి యెదుట నట్టిసామ్యాకారముతో గోచరించి యిప్పుడిట్లు వచ్చియుండఁడా యని భయము జనించి అయిన నొకగంట క్రిందట నేను కేశవపాలుని జూడలేదా! ఆతని భూతమును చూచియుంటినా! ప్రతిదానికొకవో ప్రబలమగు సందేహము జనించినది. తుదకది యథార్థమని మాతఁడు నిశ్చయించెను. గతించిన కేశవపాలుఁడేమి! నేను నాకుఁ గాన్పించి బ్రతికియున్నానని చెప్పుటేమి. అంతయు భూతచర్యలు. ఆహా! ఇంకేది గతి! రవీంద్రుఁ డీరీతిగఁ దలపోయుచు ననేకపర్యాయము లావ్యక్తిని మాటాడించెను. ప్రయోజనము లేకపోయినది. వ్యక్తి యూరక ఆతని వైపు తన ప్రజ్వలిత ఘృణాప్రకాశవృశములకు నేత్రములఁద్రిప్పి తత్ప్రదేశ సంజనిత శిఖస్ఫులింగజాలముచే రవీంద్రుని హృదయావిర్భూత ధైర్యకార్పాసరాశిని దహించుచుండెను. ఎట్టకేల కాతఁడేమిచేయను దోఁపక యచటదొరకిన పిస్తోలునెత్తి యా వ్యక్తి హృదయభాగమునకు సరిగ గుఱినుంచి "మాటాడక నిలుచున్న నీవెవ్వరు? నాబారి నుండి తప్పించుకొని పోఁజాలవు. చచ్చితివి" అని బెదరించుచు ధాంమని పేల్చెను, వ్యక్తి చావలేదు! పూర్వపుభీషణాట్టహాసముచే రవీంద్రునిభయ మతీతమై పోయెను!!

ఎంతటివింత! రవీంద్రుఁడు తుపాకిని పేల్చినధ్వని యాహర్మ్యమునఁ గడుభయంకరముగఁ బ్రతిధ్వనించెను, కాని, వ్యక్తి యింకను ఆతనిమ్రోల నిలుచుండి "రవీంద్రా! నే నెవ్వరో తెలియదా! కేశవపాలుఁడను! పిశాచమును!" అని యనుచుండెను. ఆమాట నిజము

మరణించె నని నమ్మితివి. ఆతఁడే నేను రవీంద్రా! ఏమట్లు వణఁకెదవు. నేనే కేశవపాలుఁడను. నీకు మొదటఁ గాన్పించిన రూపమున నిక్కము లేదని కాదా నీ సంశయము? మూర్ఖా! పిశాచము లిష్టము వచ్చిన రూపముల ధరించును. వాని కొక యాకారమా? రవీంద్రుఁడు ఆశ్చర్యపాటున నేమి చేయుటకును దోఁచక నిలుచుండి యుండెను. అతని కది భూతమను నమ్మకము జనించుచుండెను. కేశవపాలుఁడు వచ్చి యేరీతి దర్శన మొసఁగుచున్నాఁడట? ఇందుకుఁ గారణమేమి? ఏమిచెప్పుటకును దోఁచకున్నది. ఎనుకటి సంవత్సరము, తాను చూచిన మొదటి కేశవపాలుని రూప మంతె శీఘ్రముగ నంతర్ధాన మొందుట చూడ నా వ్యక్తి యనుమాటలు నిజము లని తోఁచుచున్నది. "నే నిదివఱకు దయ్యములను జూచియుండకపోయినను నేఁ డొకదానిని జూచుచున్నాను" అని యాతఁ డనుకొనెను. భూతము లతిక్రూరములగు పనులఁ జేయు నఁట, అది తలఁచుకొని రవీంద్రుఁడు మిగుల భీతిల్లిపోయెను. అతని ప్రాణము లప్పుడే పైకెగసిన ట్లుండెను. దేహ మాద్యంతము ఝంఝానిల తాడిత శుష్కవృక్షమురీతి సంచలిత మగుచుండెను. చేతియందుండిన యినుపక్రోవి తనంతటనే జాఱి క్రిందికి పడిపోయినది. నేత్రములు తేజశ్శూన్యములై మబ్బులు గ్రమ్ముచుండెను. ఆహా! రవీంద్రా! ఇం కేదిగతి! ఎంతటి విషమసంకటము!! ఎట్లు తప్పించుకొందువు !!!

వ్యక్తి—కాదు—పిశాచము రవీంద్రునివీఁపుపై నతికఠినముగఁ జఱచి "ఏమట్లు చేసెదవు మూర్ఖా" యని గర్జించెను. ఆ దెబ్బకు మిగుల నొచ్చి రవీంద్రుఁ డున్నతావుననే కూలఁబడిపోయెను. అది సామాన్యమా! వజ్రఘాతము! ఆ పిశాచముతో నేమి మాటాడవలయునో యాతనికిఁ దోఁచినది కాదు. ఆ స్థితి—ఆ భయము—ఆ విస్మయము వర్ణనాతీతము! ఎవ్వరు వర్ణింతురు!

ఉన్నదున్నట్లు పిశాచరూప మతిభయంకరముగ బొబ్బరించుచు "రవీంద్రా ! రవీంద్రా ! నిను మింగెదను. నీవు మాటాడక యూరకుంటి వేల ?" యని నోరు తెఱచుకొని యాతనిపైబడ వచ్చుచుండెను, చూచుచుండఁగనే పత్తేదారుని నొకబాలకునివలె పైకెత్తుకొని "రవీంద్రా ! మహాత్మా ! చెప్పుము ! బ్రతుకుదువా ?" యనెను. పాపమాతని దురవస్థ నేమని వ్రాయఁగలము? అది యూహాయోగ్యమే కాని విలేఖనాతీతము. మాటాడఁబోవ కంఠము పట్టినట్లుండెను. నాలుక పిడఁచబడు చుండెను. భయాతిరేకమున హృదయము వ్రీలుచుండెను. శరీరము పులకరించి సంచలిత మగుచున్నది. తుదకు రవీంద్రుఁ డావికారరూపసందర్శనముఁ జేయఁజాలక కెవ్వునఁ గేకవైచి మూర్ఛిల్లెను ! ఔరా ! కాలమహిమ ! సింహ మెంత జడిసిపోయెను ! పిశాచము వెంటనే యాతనిని క్రిందికి దింపి "మూర్ఖా ! పిఱికిపందా ! ఇఁక నీ ప్రతాపముసాగనీమాతము "అని చెప్పుచు నాబిలమార్గముగుండ క్రిందికి జాఱిపోయెను.

# పదునాలుగవ ప్రకరణము

ప్రలంభవ్యక్తి

రాత్రి చాలభాగముగడచి పోయినది. వెలుపల ప్రపంచమునందంతటను విహంగమకులంబులు గూయుచు దిక్కులు పిక్కటిల్లఁజేయుచుండెను. సూర్యభగవానుని కరద్వయము మేమూలనుండియో వచ్చి రవీంద్రుఁడు పడియున్న గదియందు ప్రవేశించుచుండెను. అతని కింకను స్మృతి కలుగలేదు. పాపము! చాల భీతిలిపోయినాఁడు. ఇంతలో క్రింద నెవరో "అయ్యో! బావా" యని యఱచినట్లు శబ్దమయ్యెను. మరల వినఁబడలేదు. రవీంద్రునకుఁ గొంత సేపటికి తెలివి రాఁగ నాతఁడు చటాలున లేచి చూచెను. తా నిప్పుడు పిశాచహస్తములలో లేఁడు, భూమిపైఁ బడియుండెను. ఎంతపనిజరిగినది! భీతిచే నాతనియొడలెల్ల నింకను వడఁకుచుండెను. అంతయు స్వప్న ప్రాయమై యున్నది. ఎన్నఁటికిని దలంపరాని పిశాచదర్శనము తన కవుటకుఁ గారణమేమి? అతనికి బోధపడలేదు. ఎంతయో చిత్ర మొకరాత్రియందు జరిగిపోయినది. ఉదయ మగుసరి కంతయు సందేహా స్పదమైనది. రవీంద్రుఁ డటనుండి లేచి తొట్రుపడుచు "ఏమిది! నే నెందుంటిని? ఎంత చిత్ర స్వప్నము!" అనెను. అంతలో నాతఁడు మరల నిదానించిచూచి "కాదు. కలకాదు. నిక్కము. నేను రాత్రి చూచిన దంతయు నీ ప్రపంచమున నొకనిశీథమున జరిగిన చిత్రోదంతము! అయిన నాభీతిమేది? అది కేశవపాలుని యాత్మయఁట! అతని నయనయుగళముల యెదుట నింకను దాను రాత్రి చూచిన పిశాచ దేహము — ఆ యుచ్చాట్టహాసంబులు — ఆ దారుణాలాపములు—

కాన్పించి చెవులందు ప్రతిధ్వనించుచుండెను. అతని కింకను భయము కలుగుచున్నది. ఎదుట తనకు రాత్రి దొరికిన పిస్తోలు పడియుండెను. రాత్రి దానిని పేల్చినను ఆపిశాచము చావలేదు. కారణ మేమి? యని యాతఁడు యోజించి దానిని నెత్తి చూచెను. ఆహా! తెలిసినది! తెలిసినది! దానియందు పట్టి శబ్దోత్పత్తికిఁగాను కొంతమందు నుంచి యున్నారే కాని మొట్టిరవలును లేవు. ఇంక ప్రాణాపహరణమార్గ మెద్ది! ఆశ్చర్యముపై నాశ్చర్యము! చిత్రముపై చిత్రము! అంతయు భయంకరము! ఏది యుండు నిజము? రవీంద్రున కేమియు తోఁచలేదు. దాని నెవ్వ రాచోట పాఱవైచిరి? ఎవ్వరు చెప్పఁగలరు? పత్తేదారునకుఁ దెలియరాలేదు.

రవీంద్రుఁ డొకమాఱు కౌతుకపరీక్షణాపరుఁడై నాగదిచుట్టును పరికించి చూచెను. అప్పుడు హఠాత్కారముగ నాతని కెదుట కుడ్యముపై నొక పెద్ద కాగిత మంటింపఁబడి యుండుట గాన్పించెను. అందేదియో లిఖింపఁబడినది. రవీంద్రుఁడు తచ్చొకవందుము తిన్నగ నచటికి వచ్చి యావ్రాత నిట్లు చదివెను.

జాగ్రత్త! రవీంద్రా! జాగ్రత్త!! ముమ్మాటికి జాగ్రత్త!!!

ఈ భూతము నిన్ను వదలదు. అది ప్రతిదినమును—ప్రతిగంట యందును—ప్రతినిమేషమందును నీ వెన్నంటి తిరుగుచు నీ యనుక్షణ ధ్యానపరంపరల నెఱుంగుచుండును. నీ చేష్టలఁగని పెట్టి నీ ఛాయయం దకాలమృత్యువువోలె వేచియుండును. నీవు నాతో సరితూఁగ నేరవు. పిశాచములతో మనుజులు పోరాడలేరు. తుచ్ఛకీటసమూహము ప్రథమోద్దీపిత విక్రమోగ్ర పరిదీప్త మగు పర్వతము నెదిరింపలేదు—నీచకురంగనికురుంబ పస్తారము భీషణమ్ముగ విదారితరౌద్రసంస్ఫూర్తిత దుర్లోక్యకంఠీరవ చండిమమును పరిహసింపలేదు—నిరర్థక ద్రాఘిష్ఠ

పటాటోపపక్షిప్త ప్రభాశితఖద్యోతసంతతి యామక్షికీర్ష్య చండప్రచండ పతంగబింబమును నిరసింపఁజాలదు. అది పట్టిమరాశియును—నిష్ఫల ప్రతిష్ఠ—యథమాఘోషము. పిశాచములు సర్వశక్తిసమన్వితములు, ఈ కేశవపాలుఁడు నిన్నూరికె వదలఁడు. నీ ప్రాణాసిలయముల హరింప వేచి యున్నాఁడు. ఇంక నొకటి—రెండు—దినములలో ఆపని నెఱవేఱును. స్వర్గమర్త్యపాతాళలోకములందు దాఁగినను వదలను. నాకు చొరరాని తావులు లేవు.

కేశవపాలుని

పిశాచము.

పత్రపఠనాంతరము రవీంద్రుఁ డత్యంతాశ్చర్యసంభ్రమముఁడై నిర్విణ్ణుఁడైపోయెను. రాత్రి తనకుఁ గాన్పించిన కేశవపాలుని పిశాచమే యిట్లు వ్రాసినది, అందంతట నెంతటి భయోత్పన్న స్వబలోత్ప్రేక్షా సూచకవాక్యసరళి విలసిల్లుచున్నది! పత్తేదారుని మానవస్థితి యేమియు బాగుగ లేదు. పిశాచముయొక్క రూపవిషయమై యిప్పుడేలకో యాతనిహృదయమున గొప్పసందేహముకూడఁ గలిగినది. అది నిజమగు రూపమా? లేక యొకకృత్రిమరూపమా? హృదయాంతరాళమున సత్యాసత్యములకు బలమగు పోరాటమారంభమైనది. ధైర్యాధైర్యములకు గొప్పవివాదము కలిగినది—తుద కాతఁ డది భూతమనియే మరల స్థిరపఱచుకొనెను.

ఇట్లు చింతాడోలాందోళనమానసుఁడై యున్న రవీంద్రున కున్నదున్నట్లు క్రిందిభాగమునం దొకమూల్గుధ్వని విన నయ్యెను. ఆతఁ డదరిపాటున వెనుదిరిగి చూచెను. అధోమందిరమున "హా! దైవమా! ఎంతపనిని జేసితివి?" అని యొకయార్తనాదము విన నయ్యెను. పత్తేదారు ప్రప్రథమమున నాకంఠనాదము నానవాలిడనేరక

"ఎచ్చటి దీయేడ్పు ! ఎట్టిదీను లిందు పడి కష్టముల నొందుచున్నారు! రాత్రిదయ్యమేమైన నీరీతి నన్ను మోసగించుచున్నదా ?" యని తలంచుచుండ నా శబ్దము మఱియొకమాఱు వినవచ్చెను. అందులో వ్యక్తితన్ను సంబోధించి పిలుచుచుండుట నాలకించి రవీంద్రుఁడు చటాలున నాద్వారమునొద్ద కేఁగి తొంగిచూచెను. ఎదుట నొకచీకటి మూలలో నొకవ్యక్తి బంధితకరపాదములతో మూల్గుచుఁ బడియుండెను. ఆ స్థలమున నా ప్రాణి వాఁడు గుర్తిపనేరఁ డయ్యెను. తోడనే యాతఁ డా పాశము ననుసరించి క్రిందికి దిగవచ్చి చూచెను.

వ్యక్తి మఱి యెవ్వరును గాదు — మన రామనాథుఁడే! రవీంద్రుఁ డాతనిని గాంచి విస్మయవిస్ఫారితుఁడై "అన్నా ! ఏమిది ! రామనాథా! ఇక్కడికి కేల వచ్చితివి ?" అని యాతనిని తిన్నగ లేవనెత్తి కట్లను వదలించెను. రామనాథుఁడు మిగుల బడలియుండెను. ఎంతకాలమునుండి యాతఁడా గతియుందుండెనో రవీంద్రునకుఁ దెలియ లేదు. అందుచే "బాబూ ! ఏమిది ? ఇచ్చటికి నీవెట్లువచ్చితివి ! ఈ యనర్థకమేమి ?" యని ప్రశ్నించెను. అప్పుడు మఱింది యతికష్టముపై నిట్లు చెప్పెను. "బావా ! నే నేమిఁ జెప్పుదును ? రాత్రి ప్రవాళుని బందీగా గొని యింటికేఁ బోతిని. కాని, మీరీగృహమున నొంటిగ నిలిచిపోవుటచే నాకు హృదయస్థిమితత లేకపోయినది. అందుచే నింటఁజేయవలసిన కార్యములను శీఘ్రముగ నెఱవేర్చి ప్రవాళునిఁ బోలీసువారి కప్పగించి మీకుబాసటగ నుందునని యిచ్చటికి వచ్చితిని. అప్పటి కీమందిర ద్వారము బంధింపఁబడి లోపల గొళ్లెము తగిలింపఁబడి యుండెను. అది మీపని యనియే భావించి మిమ్ము నెన్నిరో మాఱులు పిలిచితిని. కాని మీరు రాకైతిరి. నే నంత చేయునది లేక యీయింటిచుట్టును తిరిగి చూచితిని. అప్పటికే

నా కొక చిన్న సంకుమార్గము కాన్పింప నది లోపలికిఁ ద్రోవయై యుండునని భావించి దాని కడ్డముగ నుండిన గుంపు నావల కీడ్చి లోపలఁ బ్రవేశించితిని. నే నెంచినట్లది యొక గుప్తమార్గము. అతికష్టుఁడనై నింటిలోనికి వచ్చి యున్నభాగములను పరిశీలించి చూచితిని. అందొకచో నా కొకశిథిలమానవ కళేబరముకూడఁ గాన్పించినది. ఇది నిక్కముగ నా హంతకకారణ్యభూమియై యుండునని నా కప్పు డనుమానము జనించినది. ఎంత వెదకినను మీరు మాత్రము కాన్పింపరైరి. తుదకు నేనిగదిలోనకి వచ్చి యిచ్చటివస్తువులను చూచుచుంటిని. ఇంతలో నాకు వెనుక నొకభయంకరమగు శబ్ద మగుటయు నేను వెనుదిరిగి చూచునప్పటి కట్టయెదుట ప్రళయాకారస్ఫులింగ దేహముతో నొకభయంకరవ్యక్తి నిలువబడి నన్నుఁ గాంచి యట్ట హాసముచు గావించుచుండెను. అది యొకపిశాచ మని ప్రథమదర్శన మున నే భావించి యించుక భీతిలితిని. దాని రెండుచేతులందు నొక మానవుఁడు మూర్ఛాగతుఁడై పడియుండుటను గాంచినంతనే నాభయ మతిశయించెను—

రహీం : ఆ మానవుఁడు జీవించియుండెనా ?

రామ : నా కట్లే తోఁచినది. అతఁడు పాప మా భీషణాకార మును గాంచి వివశుఁడై యుండెను.

రహీం : అతని యాకార మెట్లుండెను ?

రామ : చూచుట కొక పెద్దమనుష్యునివలె నుండెను. దిగుల బడలినట్లు కన్పట్టుచుండెను.

రహీం , నీ పిదపవృత్తాంత మేమి ?

రామ : చెప్పనేమి, బావా ! ఆ వ్యక్తి నన్ను బెదరించుచు తోడనే నా మీఁదఁబడి కాలుసేతులు గట్టివైచి యాబిలమార్గముగుండ పాఱిపోయెను. కాని, యింతలో నది పొరల వచ్చినది. అప్పుడు దాని

చేతిలో నానిర్భాగ్యుఁ డగుమానవుఁ డుండలేదు. అది సరిగ నీపాళ మును బట్టుకొని పైగదిలోనికి వచ్చినది. ఒక యరగంటవఱకు మీఁద నాకు మాటలు వినఁబడినవి. పిదప నంతయు నాఁగిపోవుచు నొక కేక వినఁబడెను. అప్పుడే యాపిశాచము మరల క్రిందికి దిగి వచ్చుటను కూడ జూచితిని. అట్లు వచ్చి యది త్వరగ నాబిలద్వారముగుండ వెలుపలికి పాఱిపోయెను.

రవీంద్రున కిప్పుడు బోధపడినది. తానుచూచిన దయ్యమే రామనాథునికూడ నీగతికి తెచ్చినది. అయిన నది మోసికొనిపోయిన మానవుఁ డెవ్వఁడు. రామనాథుఁడు చెప్పినదాని నాలకింప నది కేశవ పాలునిరూపమై యున్నది. అయిన నాదయ్యము నిజముగుభూతము కాదా ? ఇది యేమన్నది ? తాను కేశవపాలునియాత్మ యఁట ? ఇది నిజమా? రవీంద్రునకు విశేషముగ ననుమానము మరల జనించెను. అతఁ డంత జరిగినదాని నంతటిని మఱఁదితోఁ జెప్పివైచెను. రామనాథుఁ డాతఁడు చెప్పినదాని నంతను విని కొంతకాలమువఱకు యోజించు కొనెను. అతనికిఁగూడ మొదటఁ దాముచూచినది నిక్కముగు భూత మనియే నిశ్చయము జనించి యున్నను అది క్రమక్రమముగ నదృశ్యత నొంది కైలాట యని తోఁచుచుండెను. తుద కాతఁడు రవీంద్రునిఁ గాంచి " బావా ! నాకొకటి తోఁచుచున్నది. రాత్రి మనముచూచినది భూతము కాదని తోఁచుచున్నది. హంతకులలో నెవ్వఁడో యొకఁడు మనలను బెదరించునిమిత్తమై యారీతిగఁ గుటిలాకారమును ధరించి వచ్చియుండవచ్చును. నాకిదివఱకు ననుమానము జనించుచుండెను. కాని, యిప్పుడు విశదమైనది. మీరు మొదట కేశవపాలుని గాంచినది నిజము, ఆమర్జాతి యెవఁడో మీరవ్వలిగదిలోనికిఁ బోయినపిదప నీ రూపమున వచ్చి నన్ను బెదరించి యాతని నెత్తుకొని పోయియుండును.

వారేవిధముగ మనచర్యలను గనుఁగొనిరో తెలియకున్నది. ఏది యెట్లున్నను, కేశవపాలుఁడు జీవించియున్నాఁడని నిజము. ఆహా! ఇది యెంతటిచిత్రము! ఇన్నిదినములవఱకు మన మింతమూఢులుగఁ బని చేసితిమి. బ్రతికినవాఁడు చచ్చెనని తలఁచి హంతకునిఁ బట్టఁబోయితిమి. మరుమరీచికలఁ గాంచి నీకు ద్రాగఁబోయినట్లయ్యె మనకార్యములు. కేశవపాలుఁడు మరల తస్కరింపఁబడినాఁడు. అతని నిఁక జాగుసేయక వదలించుట యుక్తము. రాత్రి కాన్పించినయావికారరూపుఁడు నిక్కముగ నెవఁడో హంతకుఁడు. ప్రాయశః తారసింహుఁడై యుండును". అనెను.

రహీం : మొదట నేనది నిక్కముగుపిశాచ మని యెంచి భీతిలి కార్యసరణిని బాడుచేసితిని. కాని, నాకుఁగూడ నిప్పు డది మోసమని తోఁచుచున్నది. మన మతిభయంకరముగ వంచింపఁబడితిమి. మమ్ము సంపూర్ణముగ నంధులఁజేసి యెవఁడో కడు సులువుగఁ దనకార్యసిద్ధి నొందిపోయెను.

రామ : ఎవఁడో యన నేల, బావా! వాఁడు తారసింహుఁడే యైయుండు నని నాయనుమానము. లేకున్న నితరుల కీరీతిఁ జేయుట సాధ్యము కాదు. వాఁడేవిధముగనో మనము కేశవపాలుని నిజస్థితిని తెలిసికొన్నవార్త నెఱింగి దానినిఁక వెల్లడింతుమనుభయమున నారీతి మనమనముల భయమును గలిగించి మనము చూచిన కేశవపాలుఁడు నిక్కముగుమానవుఁడు కాఁడని తలంచురీతి లేనిపోనిభీతివాక్యములఁ జెప్పెను. ఇది నిక్కము. ఇఁక నొక్కమాఱు వాఁడారీతి గాన్పించిన బాగుగనుండును. అప్పుడే వానిని బట్టి బంధింపఁగలుగుదుము.

రహీం : పైగదియం దా దుర్మార్గుఁడు వెడలిపోవునపుడే కాగితము నంటించి పోయినాఁడు చూడుము.

అని చొక్కాజేబునందుండు కొన్ని కాగితములను దీసి రామనాథునకుఁ జూపించెను. అతఁడు వానినన్నిటిని జదివి "ఇంకేమున్నది. బావా! వాఁడు నిజముగ సుబ్బారావు కొలిపిన యొకహంతకుఁడే. భూతము కాదు, అంతయుఁ గృత్రిమరూపము. కాన కేశవపాలునిరూపమంట సర్వదాబద్ధము. [illegible] జీవములతో నున్నాఁడు, మన మిఁకేఁ ద్వరగ వానిని ఈ వ్యాఘ్రముఖసమూహమునుండి విముక్తుని జేయవలయును" అనెను.

కపిం : అన్నా! నీవు నిజముగ బుద్ధిమంతుఁడవు. నీ సాహాయ్యము లభించుట నాకమోఘములై ఫలించినవి. ఈ నేరమునఁ జూపినంతటి సాహసమును నీ వెంతమును జూపియుండలేవు. అందుకే నేనిదివఱకు నీ వింతవాఁడ వని యెంచఁజాలనైతిని. ముందేతిరకంకణమున కద్దమును గోరుచుంటిని. నాకీవిషయమున నింతదూర మాలోచన యేఁగినది కాదు. నీవింకను బాలుఁడవు. అయినను నాతో సరిగ నిద్రాహారముల వదలి పాటుపడితివి. దీని కనువగుపారితోషకమును దేవుఁడు నీకియ్యక మానఁడుసుమా!

రామ : బావా! మీరీరీతి నన్ను మాటిమాటికిఁ బొగడుచుండుటఁ జూడ మిగుల నాశ్చర్యము మొదవుచున్నది. నేనిదివఱకు మీ యొద్ద నీ క్రొత్తవిద్యను జూచియుండలేదు, కార్యక్రమమున నీ విపరీతపాండిత్య మలవడుచున్నది. ఇంతకు నేఁజేసినదేమి? నేను మీతో సరితూఁగఁ జాలుదునా! ఇదియేటిమాట? అదృష్టవశమున నెప్పుడో యొకమాఱు కాకినోటఁ గోయిలమృదుకుహూనినాదము వెలువడిన మాత్రమున నది వసంతసమాశ్రితపల్లవభక్షణకోమలకంఠంబగు కోకిల యగునా! ఎన్నఁడో యొకనాఁడు మీ పాదసరోజరజస్స్పర్శలాభకారణమున నొకవింతకార్యము నాచరింప నప్పుడే యింత యుగ్గడింపులా!

రవీం : బాబూ! [illegible] నీకు కోపము వచ్చును. నీకభీష్ట మయినది [illegible] [illegible] దాచియుంచుటకుఁ దగి [illegible] మైనముల కొంతయు విజ్ఞప్తి [illegible]

రామ : అదిపోనిండు [illegible] [illegible] [illegible] తిన్నగ నింటికిఁ బోదమా!

రవీం : అంతకం[illegible] [illegible] యేమియు లేదు. అయిన, రామనాథా! ఊరిలో [illegible] కేశవపాలుఁ డింకను జీవించియుండె ననువార్తను వెల్లడించరాదు. [illegible] మనల నొకమాఱు క్రైస్తవుల్లఁ గనుగొన్న వాఁ [illegible] నిరాఘాటముగ లోకమున జాటింప వచ్చును. మన మీరాత్రి విభీతమందిరమున కేఁగి యావ్యక్తి గుట్టు మట్టు నరయవలయును. ప్రాయశః కేశవపాలుఁ డందే దాఁచఁబడి యుండునని తోఁచుచున్నది. రాత్రి మనలను మోసగించినవాఁడు నీవన్నరీతి తారసింహుఁడే యైయుండును. కంఠధ్వనిని దలంచిన నట్లే యనుమాన మగుచున్నది.

రామ : మన మింక నింటికి పోయి భావికార్యముల గుఱించి యోచింతము రండు, బావా! నాకొకటి దోఁచుచున్నది. ఇంక నొకటి రెండుదినములతో మనకష్టములెల్ల సఫలీకృతములు కాఁగ నీ భయంకర నాటకాంతమున భరతవాక్యమును జెప్పవచ్చునని తోఁచుచున్నది.

రవీం : అట్లే యగును గాక.

వారిరువురు మఱేమియు మాటాడక యచటినుండి వెడలి పోయిరి.

# పదునైదవ ప్రకరణము

## మరణాపన్నుఁడు

మఱునాఁ డుదయకాలమునఁ ప్రవాళుఁడు కారాగారబద్ధుఁడై వ్రణబాధ యతీతమగుటచే మిగుల వంతపడుచుండెను. అతఁడుండినగది కడు చిన్నది. దుర్గంధవాయుసంపూరితము, దురాలోకము, కీటకబాధ విశేషముగ నుండెను. భూమియంతయుఁ జెదవట్టి జుగుప్సాకరముగ నుండెను. ప్రత్యక్షనరకము. దురాలోచనాదందహ్యమానసులును, దుర్భరకలుష సమాశ్రితహృదయకుహరులును, అనిర్వాచనీయ ఘోరకార్యాచరణధురీణరాక్షసులును నగువారాహంతకాధమునకు — చోరశిఖామణికి — భయంకరదానవునకు నేఁటినుండియే నరలోకావాస మబ్బినట్లుండెను. దానినుండి వాఁడిఁక విముక్తుఁడు కానేరఁడు.

ప్రవాళుఁడు నిన్నటిరేయి రవీంద్రునితోఁ దానింకను రెండుదినములు జీవించియుండెద నని తెలిపియుండెను. కాని, యట్లు జరుగునట్లగపడ లేదు. తొమ్మిదిఘంటలగువేళకు వాఁడా వ్రణబాధ కోర్వలేక యొకమాఱు మూర్ఛిల్లెను. అంతలో దాపుననుండిన పరిచారకుఁడు శైత్యోపచారములచే మేల్కొలిపి యించుక యాహారము నొసఁగెను. కాని, యందుచేనెట్టి యాశయుఁ గలుగ లేదు. క్షణక్షణమునను వాని హృదయావేగము తగ్గిపోవుచుండెను. ప్రేతముఖ మట్లు మోమంతయు వెలవెలఁబాఱిపోయెను. ఉద్యోగస్థులు తమశక్తిసామర్థ్యముల లన్నిటిని వెచ్చించి వాఁడు మరణింపకుండునటులు పాటుపడుచుండిరి. వైద్యుఁడొకఁ డప్పుడప్పుడు వచ్చి తత్కాలోచితమగుచికిత్సలను జేసి

పోవుచుండెను. అయినను వాఁడింక జీవించియుండఁగలఁడనునాశ యెవరికిని బొడమలేదు. పదిఘంటలకుసరికి వానిస్థితి వ్యత్యస్తమగుచుండెను. అవయవములు క్రమక్రమముగ నవసన్నము లగుచుండుటను గాంచి చికిత్సకుఁడు శస్త్రచికిత్సఁ జేసెను. అందుచే రోగి యించుక దెప్పిఱిల్లి యొకమాఱు కనుదెఱచి చుట్టును జూచి "రవీంద్రబాబు రాలేదా?" యని గద్గదికుఁడై పలికెను. తోడనే పత్తేదారును తోడ్తెచ్చుటకై యొకసేవకుఁ డంపఁబడెను.

ప్రవాళునకు శరీరబల మబ్బుటకై కారాగృహాధికారి పడిన పాట్లు వృథాయైనవి. వాఁడింక రెండుగంటలకన్న విశేషముగ జీవములతో నుండుట కల్ల యని యందఱికిఁ దెలిసిపోయెను. రోగి తనమంచముపై బడి గాయము నొప్పికిఁ దాళలేక గట్టిగ బొబ్బరించుచు నఱచుచుండెను. ఇంతలోఁ బిలువఁబోయినసేవకుఁడు రవీంద్రుని వెంటఁ బెట్టుకొని వచ్చెను. రవీంద్రుఁడు మరణాపన్నుఁ డగుహంతకునిస్థితిని గాంచి యిఁకఁ దామసించుట సరిగాదని తలఁచి వానితో నిట్లనెను. "ప్రవాళా! నీకు దేహమున నెట్లున్నది?" అని యడిగెను. వాఁడించుకఁ గనుదెఱచి రవీంద్రుని జూచి తిన్ననియెలుఁగుతో "రవీంద్రా! వచ్చితివా? ఇఁక రెండుగంటలుమాత్రమే నాజీవితావధి. అవల నేను చచ్చిపోదును. మరల లేవను" అనెను. అప్పటిప్రవాళునిదుస్థితి గాంచి రవీంద్రుఁడుకూడ జాలినొందెను. అతఁడు మఱింత పాలను వానికిఁ ద్రాగనిచ్చి "నీవు నన్నిచ్చటికి రప్పించుటకుఁ గారణ మేమి?" అనెను. "కూర్చుండుము. చెప్పెదను. నేను మరణించి పోవుచున్నాను. నేనిది వఱకుఁ గావించిన పాపసంఘమును నీయెదుట విప్పి చెప్పెదను. ఇందొక భయంకరరహస్య మిమిడి యున్నది. రవీంద్రా! అది నీకు తెలియదు. నీకవనేల, పరు లెవ్వరికిని దెలియదు. చెప్పెదను. కూర్చుండుము"

అని ప్రవాళుఁడు తిన్నగ శయ్యనుండి లేచి కూర్చుండి యెదుట గోడకు చేరగిలఁబడెను. రవీంద్రుఁడు దాపుననే యొకయాసనముపై కూర్చుండి యాతఁడు చెప్పుదాని నంతటిని వినసిద్ధుఁడై యుండెను. అచ్చట రక్షకోద్యోగి యొకఁడును, మఱియొక సేవకుఁడును దప్ప పరు లెవ్వరును నుండలేదు.

అప్పుడు రవీంద్రుఁడు ప్రవాళుని గాంచి యిట్లనెను. "ప్రవాళా! నీ వింకను రెండుదినముల వఱకు జీవించియుండఁగలనని నిన్నటిరేయి చెప్పితివి కాదా! అయిన నింతశీఘ్రముగ నీ యంత్యకాలము దాపు రించుట కేమికారణము?"

ప్రవా : రవీంద్రా! నేనింకను రెండుదినము లుండఁగలనని నిన్నటిదినమునఁ దలఁచితిని కాని యట్లు జరుగునట్లు లేదు. ఇఁక రెండు ఘంటలు మాత్రమే. పిదప నన్ను నీవీలోకములోఁ జూడగలవా! లేదు. నిక్కముగ లేదు.

రవీం : నీవు నాతో నేవియో రహస్యములను జెప్పఁదలఁచు కొన్నట్లు తెలిపియుంటివి. వానిని త్వరగఁ జెప్పివేయుము. నీవు చేసిన పాపమునంతను ప్రపంచమున్మోల నెలుఁగెత్తి తెలిపికొని దాని నించే వదలివైచి పరితాపము నొందుము. నీ యాత్మ శాంతించును. పాపబాధ యుపశమిల్లును. ఒక్కటియును దాఁచుటవలనఁ బ్రయోజనముండదు.

ప్రవా : రవీంద్రా! అట్లని యెంచియే కదా నిన్నిచ్చటికి రమ్మన్నది. నా జీవితకాలమునందు నేనెంత ఘోరప్రవర్తనమును గావించిననేమి! అవసానకాలమునఁ జేసికొన్న పాపముల నొరులతోఁ దెలిసి శాంతినొందెద ననుసద్బుద్ధి పొడమినందులకు నాకే యెంతో యానంద మగుచున్నది. అయ్యో! నరలోకవాసులగు మానవ

మాత్రులలో సర్వసద్గుణసంపన్నుఁ డెవఁడు? ఎవనిచరిత్రను దెలుపఁ బూనుకొన్నను కొలఁదిగనో గొప్పగనో యందు దుర్గుణసద్గుణ సమ్మిళిత ముండకపోదు కదా. అయిన నా యాత్మోదంతమన్ననో కసు చిత్రముగ నున్నది. ఇందు పుణ్యాతీతమగు పాపపంకిలము తాండవించుచున్నది. దుర్గుణ ధూమ మీ జీవితాగారమున నిండి నిబిడీకృతమై సద్గుణసంతతికి వాసయోగ్యము కాకపోయినది. హృదయమందిరమున నొక్కమాత్రైన నీ జీవితావధియందు పుణ్యదీపకళిక వెలిఁగియుండలేదు. సర్వదా — అనుక్షణమును — అవిచ్ఛిన్నమై — పాపాంధకారము క్రమ్ముకొని తన్మధ్యనివాసియగు మనోగృహమేధికిఁ గన్నులు గానరాకుండఁ జేసినది. తత్కారణమున నా మనము పాపకదంబజంబాలకూపమున విచ్చలవిడిగ సంచరించి యందుమూలమున దరించితి ననుకొనెను. కాని, యున్నదున్నట్టుగ నిన్నటిరాత్రి — నా దక్షిణబాహుఖండన సమయమున — నా కానిబిడ నిశీథమధ్యభాగమున జ్ఞానజ్యోతిర్లత వెలిఁగినట్లయినది. అందు మూలముననే, రవీంద్రా! నా జీవితకళంకములను దెలిపికొందమని నిన్న రాత్రి రమ్మని చెప్పితిని. నీ వారంభించిన ఈ హత్యాపరాధమున నొక భయంకర రహస్య మిమిడియున్నది. అది తెలియకున్న నీవిఁకముందు చాలశ్రమలకుఁ బాల్పడుదువు. కడ కపరాధిని సరిగ నిర్ణయింపనేరవు. దానిని నీకుఁ జెప్పెదను. వినుమా, రవీంద్రా!

రవీం: వినవలయుననికదా నేనింతదూరము వచ్చుట. నీవు చెప్పుదాని నంతటిని సావకాశముగఁ జెప్పుము. విందును.

ప్రవా: ఒకవేళ నేనీరహస్యమును విప్పి తెలుపకున్న నీగతి యేమగునో యూహించుకొనుము, రవీంద్రా! నేను నీకు మహోపకారిని గాని శత్రువను కాను. ఇఁకముందు—అనఁగా రెండుగంటల వఱకు—నాపై నుండువిరుద్ధాభిప్రాయమును బాఱఁద్రోలి నన్ను

విశ్వసించి నాకొకయుపకారమును మాత్రము చేయుము. చేసితి వని వాగ్దానము చేయుము. లేకున్న నీకీరహస్యసమాచారమున నొకయక్షరమునైనఁ జెప్పుట లేదు. అంతయు నిట్లే మనఃపేటికయందు భద్రపఱచుకొని చత్తును.

పత్తేదారు కొంతసేపటివఱకు యోజించుకొనెను. ప్రవాళుఁ డెట్టివాగ్దత్తమును గోరుచున్నాఁడు! తా నొకపక్షమున దానికి సమ్మతించినఁ బర్యవసాన మెట్లు పరిణమించును! భయంకరమా—నిరపాయమా! రవీంద్రుఁ డెంతతలపోసినను వానిమాటకు సమ్మతించుటకన్న వేఱుమార్గమును జూడనేరఁడయ్యెను. వానిమనోభీష్టమును నెఱవేర్పకున్నఁ దానువినదగినరహస్యేదంత మట్లే యాదురాత్ముని యాత్మతోఁ గాంతితో నంతరించి పోవును. అది తనకత్యంతోపకారకరమఁట. ఇఁకనట్టి దానిని వివేకపూర్వకముగఁ బొసఁగుకొనువాఁ డెంతటిమూఢుఁడు! కడకు రవీంద్రుఁడు "ప్రవాళా! నీకుపకారమొనరింతును. ప్రమాణపూర్వకముగ నొనరింతును. చెప్పుము. ఏమితలఁచుకొంటివో చెప్పుము" అనెను.

ప్రవా: (హాసమ్ముఖుఁడై) నన్నిప్పుడు నీవు సమ్మతి వని తెలిసిపోయినది. నాకుఁ గావలసినయుపకృతి కడు సులభమైనది. ఏమన, నేను నీకీయుదంతములను విప్పి చెప్పినపిదప దాని నొరులతోఁ జెప్పరాదు. నీహృదయస్థలమును వీడి యుంకలో నొక్కయక్షరమైనను చలిచీమకైనను తెలియఁగూడదు. కాన, నారహస్యప్రకటిన సమయాంతమువఱకు నీయుద్యోగి కాని, యాసేవకుఁడు కాని యిందుండఁ జనదు. వీరిని వెలుపలకుఁ బంపి నీవొక్కఁడవే యుందుండుము.

రవీంద్రున కాతనికోరిక ప్రథమమున నతిమాత్రముగ గోచరించెను. కాని, పిదప తన్మూలమున నెట్టిసంకటములు కలుగునో యని మిగుల భీతిల్లెను. అయిన నిప్పు డేమిచేయగలఁడు? ప్రవాళునివాక్యాను,

సారముగఁ బ్రవర్తించినఁగాని వాఁడు చెప్పవలసినసంగతులను జెప్పఁడు. అప్పు డాతఁ డనన్యమార్గుఁడై వాఁడు కోరినచొప్పున వర్తింపక తప్పదయ్యెను. ఆతనిమానస మెఱిఁగి యచటనుండినరక్షకోద్యోగి, భటుఁడు తిన్నగ నాగదిని వదలి చనిరి. అప్పుడు ప్రవాళుఁడు మరల నిట్లు మాటాడనారంభించెను. "రవీంద్రా! ప్రవాళుని నీ వెఱుఁగుదువు కదా?" యనెను ఇది యేమిప్రశ్న! దానిని విని పత్తేదారులికిపడి నగుచు "ప్రవాళుని నెఱుఁగనా? అతనితో నాకు మిగుల పరిచయము కలదు. పలుమాఱు చూచియుంటిని. మాటాడి యుంటిని. నేఁడును ఈక్షణమున నాతని యెదుట కారాగారమునఁ గూర్చుండి మాటాడుచునే యున్నాను" అనెను. బంధితుఁ డతికష్టముపై తన శుష్కముఖమండలమును హాసముచే వికసింపఁజేసెను. ఇప్పు డాయట్టహాసములు లేవు. ఆ భీకరవాక్ప్రవాహ మంతరించినది. ఆ వికృతదానవాగ్ని మడుగంటినది. కేవలశాంతిరూపకము — నిర్భయతేజోవిశ్రాంతి— అనుతాపరసరంజితము — అపరాధి నవ్వుచు "రవీంద్రా! నీవందేపొరపడుచుంటి వని చెప్పినది, ఇందే రహస్య మడఁగియున్నది" అనెను, వానిమాట లర్థము కాకున్నవి. రవీంద్రుఁ డులికిపడుచుండెను, ఆతఁడు పొరపడుచున్నాఁడఁట, ఏటిమాట! ప్రవాళుని ప్రవాళుఁ డనుట పొరపాటా? దీనితత్త్వ మేమి. విస్మయమూఢమనస్కుఁడై మరలనుద్యోగి "నీమాటలు నాకర్థముకాకున్నవి" యనెను. నిందితుఁడు మరల నొకమాఱు హసన్ముఖుఁడై "అయ్యా! నేను ప్రవాళుఁడను కాను, నాపేరది కాదు" అనెను.

రవీంద్రుని మ్రోల నిప్పుడొక యగాధరహస్యరూప మపారవక్త్రముఖ తెఱచుకొని నిలుచుండియున్నట్టుండెను. అందుండి యెట్టిచిత్రోదంతము వెడలునో తెలియరాకున్నది. హంతకుఁ డేమనుచున్నాఁడు!

తాను ప్రవాళుఁడు కాఁడఁట! అది తనపేరు కాదఁట! అయిన వాని నిజమగునామ మెద్ది? అమల రవీంద్రునితో వీరబలుఁడే చంద్రనగరునఁ బ్రవాళుఁడను కుహనాభిధానమునఁ దిరుగాడుచున్నాఁడని తెలిపి యుండెను కాదా? నిరంతరప్రవాళపార్శ్వవాసిని యగువానిసతికూడ పొరఁబడియుండదుకదా? ఇందేదియో విశేష ముండకపోదు. అని రవీంద్రుఁడు చాలసేపటివఱకు తలంచుకొనెను. ఆతని తిచ్ఛపాటును గాంచి యపరాధి మరల "రవీంద్రా! ఏమి యోచించెదవు. నేను ప్రవాళుఁడను కాను. ఆతఁడు వేఱొకఁడు, నా పేరు ప్రశాంతుఁడు" అనెను. అపరాధపరిశోధకోద్యోగికి దిక్కు తెలియకుండఁ బోవు చున్నది. ఆతఁడు క్రమక్రమముగ నప్రతిహతజవగతిని వచ్చి యపార సముద్రమునఁ బడిపోవుచున్నాఁడు. ఎన్నఁటికిని దెలియనివింత నేఁడాతఁడు వినుచున్నాఁడు. అది కలగాదు. అంతయుఁ బ్రత్యక్షపూర్వకముగ జరిగిపోవుచున్నది. మరణాపన్నుఁ డగునానిందితుఁ డింకను జెప్పుచునే యున్నాఁడు. ఏమని తాను ప్రవాళుఁడు కాఁడఁట! తనపేరు ప్రశాంతుఁ డఁట! ప్రవాళుఁడు మఱియొకపురుషుఁ డఁట! ఇది యెట్టిచిత్రరహస్యము! రవీంద్రుఁడు తాను వినుచుండుదానిని నమ్మనేరఁడయ్యెను. ఏలయన, తానిదివఱకు ప్రవాళనామధేయమునఁ దిరుగాడుచుండిన యేవ్యక్తిని బ్రవాళుఁడని నమ్మి యుండెనో, యాతని నే— లేక యట్టివాని నే— నేఁడుసహితము దనకనులార గాంచు చుండెను. ఇఁక నది యెట్లు మిథ్యయగును. పురుషుఁడు తన్ను మోసగించుచున్నాఁడా? అందులో వాని కేమిప్రయోజనము? ఆతఁడు తొట్రుపాటు నందకుండ కించుక ధైర్యమును వహించి "అయిన నా ప్రవాళుఁడు నీకేమి కావలయును? నేను నీ యాకారమును జూచిన నీ మాటలు సర్వదా యబద్ధమని తలంచుచున్నాను" అనెను. అపరాధి యిట్లనెను;

"నేనును బ్రవాళుఁడును స్నేహితులము. ప్రాణస్నేహితులము. మాయాకారము లొకటి—అణుమాత్రమైన భేదము గాన్పింపదు. ఇందుమూలముననే నీవింత వింత నొందెదవు, రవీంద్రా!"

పాఠకమహాశయా! నీవును విస్మితుఁడ వగుచుంటివా? నీవును ప్రథమమున నింతటి నిగూఢప్రవర్తనలను దెలిసికొనఁజాలనైతివి కాఁబోలు. ఎట్లు తెలిసికొననగును! అంతయుఁ బ్రశాంతలహరివలె దాఁటి వచ్చినది. అంతెట్టివిచ్ఛిన్నమును—కల్లోలమును లేకుండఁ బోయెను. అనుమానాస్పదము కాకుండెను. నేఁడొక్క పెట్టున నా శాంతధానిలో బడబాగ్ని జనించి మహాగందరగోళము నుద్భవింపఁ జేయుచున్నది—ఇరువురపరాధులు — ఒకరు కాదు — ఇరువురు నేకాకారులు—సంశయనివారరూప సంసిక్తులు—ఒకఁడు ప్రవాళుఁడు! రెండవవాఁడు ప్రశాంతుఁడు! వీరిరువురు నెయ్యులు. ఒకయాత్మ గలవారు, యేకరూపవిరాజితులు. ఈ రహస్య మిదివఱ కగమ్యగోచరమై యగాధహృదయమధ్యమున దాఁగియుండెను. నేఁడది యదృచ్ఛాగతి బయలు మెఱసి వచ్చుచున్నది, రవీంద్రుఁ డొకఁడన నేల? అందఱును—అమలసహితము మోసపోయినది. ఈ విధముగ జగమున ప్రవాళప్రశాంతులను నేకాకారులు మిత్రులుగ నున్నారని యెవరికిని దెలియదు. అంతట నందునదొక్కఁడే—ప్రవాళుఁడే యని చంద్రనగరున నందఱు దలఁచుచుండిరి. అమల పలుమాఱులు మోసగింపఁబడినది—కేశవపాలుఁ డనేకపర్యాయములు తబ్బిబ్బుపడి పోయెను — తారసింహాకరాళ సోమనాథులు వివిధగతుల వచింపఁ బడిరి—రవీంద్రరామనాథులు సహితము పెక్కుమాఱులు పొరఁబడిరి—వారు వీరన నేల—భరతపుర చంద్రనగరులందందఱు నంధకారమున మునిఁగియుండిరి. నీవును నంధుఁడవై యుంటివి. ఇప్పుడీనిబిడాంధకారమున మధ్యమున సుధాంశుకాంతి వెదచల్లఁబడుచున్నది. సర్వమును

నయునగోచరముగానున్నది. నిందితుఁడు—మరణాపన్నుఁడు—ప్రవాళుఁడు కాఁడు—ప్రశాంతుఁడు ! ప్రవాళుని ప్రాణమిత్రుఁడు !!!

రవీంద్రుఁ డిప్పు డేమిచేయుచున్నాఁడు ? విస్మయవిస్ఫారితుఁడై యనంతయోచనాపాశబద్ధుఁడై యూహాప్రపంచమధ్యమునఁ బడివందురుచున్నాఁడు. ప్రశాంతుఁ డిట్లనుచుండెను. "రవీంద్రా ! ఇంతగ యోచింపనేల. ఇదియేనిగూఢరహస్యోదంత మని నేనిదివఱకు హెచ్చరించుచుండునది. దీనిని దీసికొననేరక మూఢుఁడ వగుచుంటివి. ప్రవాళుఁడు నామిత్రుఁడు. నేనాతని నెచ్చెలి, ప్రశాంతుఁడను. మమ్మొర్రులానవాలిడఁజాలకపోవుటచేతినే యింతటివింతలు జరుగ నారంభించెను. నీవును, నీమఱఁదియు చీకటికొట్టునఁ బడియుంటిరి. నేఁటినుండి వెలుఁగునఁ దిరుగుచుండుఁడు."

రవీం : అయినఁ బ్రవాళుఁ డిపు డెచ్చట నున్నాఁడు ?

ప్రశా : పరలోకమున. ఆనాఁడు నీచే విభీతమందిరమున జంపబడలేదా !

రవీం : మరల బ్రతికె నని వింటిని. అది యొక మూర్ఛావస్థయఁట.

ప్రశా : అది పెనుమూర్ఛ—శాశ్వతమూర్ఛ. రవీంద్రా ! అతఁడు మరలజీవించె నని చెప్పినది నేనేకదా ! అదియబద్ధము. అతని మృతకళేబర మింకను భూతమందిరమునఁ బడియున్నది. నేను నామిత్రుని మరణవార్త నాలకించి నీపై పగసాధింపనెంచి యీరీతిగఁ బ్రవాళుఁడు జీవించె నని చెప్పితి నంతియే కాని యది యసత్యము. నేనే ప్రవాళుఁడని చెప్పుట మిమ్ముమోసగించుటకే. కాని, నేనెంత యత్నించినను నా కార్యములు సఫలీకృతములు గాక యొక్కక్షణకాలములో సందిగ్ధఫలప్రదాయకములై కడకు ప్రాణాపాయదశను దెచ్చిపెట్టెను.

రవీం : అయిన నీవిన్నిదినములనుండి యెచ్చటనుంటివి ?

ప్రశాం : నా యిష్టమువచ్చినచోట్లనెల్లఁ దిరుగుచుంటిని, అట్లయినను నీవ్యాపారవిషయములైన నీవు చేయుచుండిన సాహసకార్యముల నన్నిటిని క్షణక్షణమునందును దెలిసికొనఁ గలిగియుంటిని.

రవీం : నీకీశుభియోగమున నేమిసంబంధ మున్నది ! నిష్కారణముగాఁ బ్రవాళుఁడు గతించిపోయెనని తెలిసియు నేల యిందు చేయి గలిపికొంటివి ?

ప్రశాం : రవీంద్రా ! నీకింతయును దెల్పెదను. ఈఘోరనాటక ప్రారంభమున నాందిపద్యము పఠించినసూత్రధారుఁడను నేనుసుమా. తక్కినవారు నాటకపాత్రములు. నేను నీకంటికి యీనాట్యరంగమునఁ గనఁబడకుండినను పటభిత్తికనేపథ్యభాగమునుండి సూత్రము నాడించుచుంటిని. గంగాప్రవాహమున దొరకినశిరశ్ఛిన్నవ్యక్తిని సంహరించినవాఁడను నేను, శాంతినాథాదుల దొంగిలించుకొనివచ్చినది నేను, కేశవపాలుని మోసగించి వచ్చినది నేను, కాళీసింహకరాళులఁ దెచ్చినది నేను, సర్వమునకు కర్త నేను, ప్రవాళుఁడు నాకుఁ గొంతవఱకు సాయపడెను. అంతియే కాని ప్రవాళుఁడే నేననియు, చచ్చిననామిత్రుఁడు మరల జీవించి వచ్చెననియు, నమ్మితివా ! రవీంద్రా ! యోచింపుము. రెండుదినములవఱకు నెట్టిమానవుఁడైన దోస్సామర్థ్యప్రమత్తుఁడై మూర్ఛిల్లి మరల జీవించునా ? ఎంతటియసంభవము ! ఇంతియు మోసమని నీ వెఱుఁగ నేరవైతివా ?

రవీం : అయిన నిన్నటిరేయి నీవు పరస్త్రీయగునమలమరణము నాలకింప నేలయింతగఁ బరితపించితివి ?

ప్రశాం : ఆమెపరస్త్రీ యెట్లగును ! నాయర్ధాంగి.

రవీం : (వెఱఁగుపడి)—ఏమి, ఆమె ప్రవాళునియర్ధాంగి కాదా

ప్రశాం : ఆతనికిఁగూడ నర్ధాంగియే.

రవీం : అయిన నామె కిరువురు భర్తలా?

ప్రశాం : ఆమె బుద్ధిపూర్వకముగ నిరువురఁ గైకొనలేదు. అదియు నా మోసమే. ప్రవాళుఁడు నేను నొకరూపున నుండుటచేతనే యింతయనర్థకము గలిగినది. ఆమె మాత్రము సద్బుద్ధికలిగి తాను ప్రవాళుని మాత్రమే ప్రేమించినది. నన్నును నా మిత్రుని నొక్క మానవునిగనే భావించియుండెను. అందుచే నామె ముగ్ధ—సదయహృదయ—నిరపరాధిని—

రవీం : ప్రశాంతా! అయిన నీవీరీతిగఁ బ్రపంచమును మోసగించుటకుఁ గారణ మేమి? నీ చరిత్ర కడు నద్భుతముగ నున్నదే?

ప్రశాం : అవును. నీవు తలచినదానికన్న విశేషచిత్రముగ నున్నది. రవీంద్రా! చెప్పెదను వినుము. నేనిఁక నొకయరఘుంట మాత్రమే జీవింతును. నా ప్రాణానిలములు చల్లఁబడుచున్నవి. పిదప నా నుండి యొకయక్షరమునైన నీవు వినఁజాలవు. వినుము. అంతయుఁ జెప్పెదను. నాది కలకత్తావాసస్థానము. కారణాంతరములపై భరతపురమునుండి ప్రవాళుఁ డొకమాఱు మాయూరికి వచ్చెను. అప్పటి కప్పుడే యాతఁడు శాంతినాథుని గృహమును వీడి గృహాంతరమున వాసము చేయుచుండెను.

ఆ సమయమున దైవమాయాబలమున నాకు నా వీరబలున కన్యోన్యమైత్రి కుదిరినది. ఆతఁడాపురమున నున్నన్నిదినములు నాయింటనే భుజించి వాసము చేసెను. అట్టిదినములందు మా ప్రేమపాశ మతిదృఢమై కడకు స్థిరపడిపోయెను. అప్పుడొకనాఁడు ప్రవాళుఁడు నాతో రహస్యముగ శాంతినాథుని తనయయగునమల తన్నుఁ బ్రేమించుచున్నట్లుగఁ దెలిపియుండుటకు సంభవింపఁబోవు నాటంకములను

కూడ దెలిపెను. నేనంత నామెను గైకొని వచ్చి చంద్రనగరున వాసము చేయుమని చెప్పితిని. ఆతఁడందులకు మనఃపూర్వకముగ సమ్మతించెను. కాని, యప్పుడే తన భావిజీవనాధారమును గుఱించి ప్రవాళున కొకప్రబలసంశయ ముదయించెను. నేనంత శాంతినాథుని నేరీతిగనైన మోసగించి యాతని యాస్తి నంతటిని నీకైవసము గావించుకొనుమని చెప్పితిని. ఆతఁడద్దానికిఁగూడ నియ్యకొనెను కాని, తగిన వెరవు గానక వంపురుచుండెను. ఇదియుఁగాక, యప్పటికే శాంతినాథుఁడు తన యాస్తివిషయమై తగిన యేర్పాటులను గావించి తన భార్యకును, ఆమె పిల్లలకును, కేశవపాలునకును భాగించి తనమరణానంతర మారీతిగ జరుగవలయునని సర్కారులో రిజిష్టరు చేయించి యుండెను. కాన, నయోక్తులతో నింకఁ బ్రవాళున కాధనము స్వాధీనము కాదని తలఁచి దౌర్జన్యమునకుఁ గడంగవలసివచ్చెను. నేనప్పటికి కడుబీదదశయం దుండుటచే ప్రవాళునివంటివానిని లోఁబఱచుకొని యుండుచే నేవిధముగనైన ధనార్జన గావింపవలయునని దలఁచుచుంటిని. వీరబలుఁడు నే చెప్పినదాని కంతటికి సమ్మతించి భరతపురమునకు వెడలిపోవుచు "ప్రశాంతా! నేనిఁక గొలఁదిదినములలో సమలసహితముగఁ జంద్రనగరునకుఁ బాఱిపోదును. పిదప కార్యములను నీవు సరిచూడవలయును" అని చెప్పెను. నేనందుల కొప్పుకొని యీ వ్యాపారమున ధనాశాపీడితుఁడనై దిగి పనిచేయ నారంభించితిని.

పిదప నొకనాఁడు నాకుఁ బ్రవాళుఁడమలసహితముగఁ జంద్రనగరునకు వచ్చినట్లు తెలిసెను. ఇంతలో నాప్రవాళుఁడు తనకార్యములందు చేదోడువాదోడుగ నుండుటకై తనమిత్రులగు తారసింహాకరాళులనుగూడ రప్పించుకొని వారికి తనగుప్తవర్తనమును, తనభావికార్యక్రమమును దెలిపి తనకు సాయపడుఁడని చెప్పి యుండుచే విశేషధనము

నొసంగెద నని యాశపెట్టెను. వారును నానలె ద్రవ్యాకాంక్షులై ప్రవాళునియెడ సేవకులై వాఁడు చెప్పినపాని నంతటిని చేయుసాగిరి. కడకొకరేయి వారిరువురు ప్రవాళుని ప్రోద్బలమున శాంతినాథుని నాతని బిడ్డలను దొంగిలించుకొని వచ్చి విభీతమందిరమున దాఁచిరి. ప్రవాళుఁడు కడుక్రూరుఁడై ప్రతిదినము శాంతినాథుని బీడించుచు తనయాస్తి నంతటిని దనపేరిట రిజిష్టరు చేయింపు మని బెదరించుచుండెను. కాని, యావృద్ధుఁడు వానిమాటలకు సమ్మతింపకుండెను. ఇంతజరుగుటకు రెండుమూఁడు వత్సరములకుఁ బూర్వమే వీరబలుఁడు చంద్రనగరునకు వచ్చి కేశవపాలునితో నేస్తమును సలుపుకొని కడకాతనికిఁ బ్రాణమిత్రుఁడై యుండెను. ఆనడుమ వీరబలుఁడు కడుదుర్మార్గుఁడై, దుర్వ్యసనములఁ దగిలి, కడ కపులతో కలహించి యామెను భూతమందిరమున దాఁచి యుంచెను. ఆమె పతిహితైకప్రాణి కావున నేమియు మాటాడక యాతఁడు కలిగించుచుండిన దుఃఖములనన్నిటిని నోర్చుకొని యుండెను. అట్టి సాధ్వీమణిని మోసగించి నేను దురాత్ముఁడ నైతిని. పాపము ప్రవాళుని యాకారచేష్టలును, నా యాకారచేష్టలును గేవలమొకటిగ నుండుటచే నామె మోసము గనిపెట్టదయ్యెను. తుదకు ప్రవాళునకైన నీరహస్యము తెలిసియుండ లేదు. చచ్చువప్పుడు పాపభయమునఁ గుంది పరితాపముతో దీనిని నీకుఁ జెప్పుచుంటి నంతియేకాని, యిది మానవమాత్రుల కిలలో తెలిసియుండదు. ఇట్లు జరిగినపిదప నొకనాఁడు—నెలదినములక్రిందట కేశవపాలునకుఁ బ్రవాళుఁడు నా ప్రోద్బలమున, నాయూహాపోహాలవిచక్షణలమూలమున నొకకృత్రిమలేఖను పంపి యాతనిని దనయింటికి రప్పించుకొనెను. అప్పుడు నేను ప్రవాళుఁడు నిరువురుగలసి. వానిని బట్టి బంధించి తెచ్చి భూతమందిరమున నమలకుఁ దెలియనీకుండ నొకగొప్పగదియందు బంధించితిమి. ఇంతలో నాతని

వెంట వచ్చియుండిన నంబుఁడను సేవకుఁడు గంగరగోళమును జేయుటను గాంచి నేనే వానిని స్వహస్తములతోఁ జంపి యీ యమాలయింట భూగృహమునఁ బాఱవైచితిని. ప్రవాళుఁ డంతటిసాహసకార్యములను గావించుట నా మూలముననే, లేకున్న వాఁడొక్కఁడు నేమియుఁ జేయుటకుఁ జేఁతకాఁడు, అంతకును నేనే కారణభూతుఁడను. అందు మూలముననే యీ కార్యముల నన్నిటిని నేఁజేసితి నని యెవ్వఁడెఱుఁగఁడు. తారసింహకరాళులు గాని, మఱి యెవ్వరు గాని నన్నాకస్మికముగఁ గాంచినప్పుడు ప్రవాళుఁ డనియే భ్రమించుచుండిరి. నేను వారికి మఱింత నమ్మకము గలుగురీతి నటించుచుంటిని. లోకుల కెట్టియనుమానమును గలుగకుండు నటులు చేసివైచితిని.

శాంతినాథుఁడు సామవచనములకు లొంగకుండిన నాతనిని, బిడ్డలను, తమ్ముని నొక్కపెట్టున సంహారింపవలయు నని నేను నిశ్చయించియుంటిని. అట్లనియే నేను పలుమాఱు తారసింహకరాళులకుఁ దెలిపియుంటిని. ప్రవాళుఁడుకూడ నాతో నేకీభవించి యుండెను. తుదకు సుశీల హత్య జరుగుట కిదియే కారణము. పిదప విశాలుని పదపడి శాంతినాథుని, ఆ పిమ్మట గేశవపాలుని సంహారింపవలయు నని నిశ్చయించియుంటిని—"

ఆ సమయమున రవీంద్రుఁడు విస్మయవిలోచనుఁడై చటాలున తూలిపడి "ప్రశాంతా! ప్రశాంతా! ఏమనుచుంటివి! ఇంకను గేశవపాలుఁడు చంపఁబడలేదా!" యనెను. ప్రశాంతుఁడు "లేదు. లేదు. ఆతఁడు చచ్చెననుట కల్ల. ఇంకను భూమందిరమున నావిశాలమగు గదియందు దాఁచఁబడియున్నాఁడు" అనెను.

రవీం : అయిన గంగాప్రవాహమున దొరకినప్రేత మెవనిదో నీకు తెలియునా?

ప్రభా : అవును, తెలియును. [illegible] కేశవపాలుని యింగ్లీషుకత్తె యున్నదిగదా ప్రేమచంద్రునిది. [illegible] వాడినవాఁడను నేనే.

రవీం : ఏల ?

ప్రభా : ప్రేమచంద్రునకు ప్రబాళునిపై నే కారణముననో కోపము కలిగి యుండి నానాటి కభివృద్ధి నొందిన తుదకొకనాటి కతని చంపుకొనవలయునని కూడ యత్నించెనట. ఈ విషయమును నాకుఁ బ్రబాళుఁడు చెప్పియుండెను. ఒకనాఁడు నాకస్మికముగ రాత్రిసమయమునఁ బండ్రెండు ఘంటలవేళ వానిని బాగాబజారు తోటయందు నేఁ జూచితిని. నన్ను వాఁడు గాంచి నేను ప్రబాళుఁడనను కోపముచేఁ దనపూర్వ వైరమును సాధించుకొనుటకై తోడనే నాపై దనఖడ్గమును విసరివైచెను. నేనంతయు నూహించుకొని వానిని జెనకరాదనుకొని తిన్నగ నా దారినుండి తొలఁగిపోవ యత్నించితిని. కాని వాఁడు నన్నుఁ బోనివ్వక మరలఁ దనకత్తితోఁ గొట్టవచ్చెను. నేనప్పుడు చేయునది లేక యాత్మసంరక్షణార్థమై వాని హస్తమందలి యాయుధమును బలవంతముగ దీసి పాఱవైచి వానిని క్రిందబడవైచి యతిప్రయత్నముపై నా జేబునందుండిన విషద్రావకమును దీసి వానినోటఁ బోసితిని. వాఁడు దానిని ద్రాగి కొంతసేపటికే మరణించెను. నేనంత యాశవమును ప్రబాళుని మందిరమునకుఁ గొనివచ్చి యాతనితో జరిగిన యుదంతమునంతయును దెలిపితిని. అతఁడు మందుల కానందించి యిప్పుడా విషయము పోలీసువారికిఁ దెలియఁగాకుండ నటుల చేయవలయునని యెంచి యొక యుక్తిఁ బన్నెను. దానిపై నా కళేబరము నొకజాజికాయ పెట్టెయందుంచి యతిభద్రముగ మూసి యుంచితిమి. పిదప ప్రబాళుఁడు మాధవలాలను కృతకవేషమున [illegible] కప్పుడే వెడలి నీవు చూచిన తాళమును దెచ్చి యా పేటికను వైచెను. అప్పుడే

మేమిరువుర[illegible] దాని [illegible] గంగాప్రవాహమునకు బాలి వైచితిమి. ఏవాలు[illegible] చెట్టుపయింబడి [illegible] నా శవము క్రుళ్లి రూపు[illegible] దానికే నప్పుడు [illegible]ను గలిసి కేశవపాలు[illegible] నుల నా[illegible]త్రి.

రహస్య[illegible] [illegible]మని [illegible] మతీత మగుచుండెను. ఈ [illegible] తెలియ[illegible]నవి! ఆతఁ డారీతిగఁ బ్రశాంతుఁడు [illegible] చయింపటికి రాకుండిన నిట్టి ప్రబల [illegible]ము [illegible]హాంతి[illegible] మధ్యమున నే వాని ప్రాణవాయువులతో [illegible] నంతరించి యుండును. అప్పుడీక నవి లోకమునకుఁ దెలియుట చాల కష్టమగును. రవీంద్రుని పాలంతము భస్మీభూతప్రాయమై, యాధారశూన్యమై యుండును. కాని, భగవంతుఁ డట్టియనర్థకమును దప్పించి సర్వమును గరతలామలకముఁ జేసివైచెను.

రవీం : ప్రశాంతా! మేము మొదట ప్రేతము నంగుళీయకము నందుండిన "చ—కే" యను నక్షరములను గాంచి యింతిగఁ బొరపడితిమి. నీవు చెప్పుమాటల నాలకింప నానికివేరేదియో సంకేతార్థ మున్నదని తోఁచుచున్నది. అదేది యో నీకుఁ దెలియునా ?

ప్రశాం : వేరింకెట్టి యర్థమును లేదు. "చ—కే" యన చంద్రనగరు— కేశవపాలుఁడని యే భావము.

రవీం : అయినఁ గేశవపాలుని యుంగరము ప్రేమచంద్రుని చేతిలోని కెట్లువచ్చెను.

ప్రశాం : అయ్యా! ఒక [illegible] ప్రవాళుఁడు నాతో నన్నసంగతిని దెలిపినను వినుఁడు. కేశవపాలునకు విలాసినియను నుంపుడుకత్తె యొకతె కలదఁట. ఆమె నాతఁడు విశేషముగఁ బ్రేమించుచుఁ బలుమారు తానామెయింటికిఁ బోవుచు నా సంగతిని ప్రవాళునకుఁగూడ

జెప్పెనట. ఒకదినమునఁ గేశవపాలుఁ డొక్కవిధముగనే యుండు రెండు వజ్రపుటుంగరములను జేయించి వానిపై నాయక్షరముల జెక్కించి యొకదానిని తానుంచుకొని మఱియొకదానిని తన ప్రియురాలికి తన జ్ఞాపకార్థమొసగి యుండెనట. దాని నావిలాసిని ధరించియుండ నామె సహోదరుఁ డేరీతిగనో తానుగైకొని తన వ్రేలియందుంచుకొనియుండ వచ్చును.

రవీంద్రుఁ డూహించుకొనెను. హంతకుఁ డన్నది సమంజసముగనే యున్నది. తామిదివఱ కెట్టిసూత్రముపై తిరుగాడుచుండునదియాతనికి బాగుగఁ దెలిసిపోయెను. అప్పు డాతఁడు మనమున నిట్లనుకొనెను. "అయినఁ గేశవపాలుని నిన్నటిరేయి చూచినది నిజము. తారసింహుఁడో, మఱెవ్వఁడో నన్ను మోసగించి యాతనిని మరల నెత్తుకొని పోయినారు. ఆతనిని త్వరలో విడిపింపకున్న నాకార్యము లన్నియు భస్మాహుతిప్రాయము లగును."

ఇంతలో ప్రశాంతునిమరణకాల మాసన్నమైనట్లుతోఁచుచుండెను. క్రమక్రమముగ వానివాక్ప్రవాహ మాఁగిపోవుచుండెను. కంఠనాళములు బిగఁదన్నుకొనిపోవుచున్నవి. శరీరము సగమువఱకుఁ జల్లపడెను. ముఖమునం దప్పుడే మృత్యుభయంకరపాదచ్ఛాయారావములు వినఁబడుచుండెను. పత్తేదారు వీనిని గాంచి యాతఁ డికచాలసేపటివఱకు జీవింపఁడని నిశ్చయించుకొనెను. ఆతనికిఁ దెలియవలసినవిషయము లన్నియుఁ దెలిసిపోయినవి. ఇఁక నొకటి—రెండు. అందుచే నిట్లనెను

రవీం : ప్రశాంతా ! విలాసిని యిప్పు డెచ్చటనున్నది ?

ప్రశాం : ఊరలేదు. కేశవపాలుఁడు దొంగిలింపఁబడినరాత్రినే యెందో పరుగిడి పోయినది. ఎచ్చట నుండునది తెలియదు.

రవీం : అయిన సోమనాథునకు మీ కెట్లు పరిచయము కలిగెను. ఆతనిచరిత్ర మేమి !

ప్రశాం : ఆతనిచరిత్ర నాకంత బాగుగఁ దెలియదు. ప్రవాహుఁడై వానికిఁ గూడ ధనాశనుగల్పించి తనకార్యములందు సహాయముగ నుండునట్లు చేసికొనెను. సోమనాథుఁ డొరులకుఁ దనగుప్తప్రవర్తనమును గుఱించియొకనాఁడును సరిగఁ దెలుపలేదు. మేమడుగను లేదు.

ఇఁక నడుగవలసిన విషయములు లేవు. అడిగినను బ్రశాంతుఁడు చెప్పునంతస్థితిలో లేఁడు. వాని యవయవములు చేతనాశూన్యములై పోయినవి. నోట మాట వెడలుటలేదు. ఉన్నదున్నట్టుగనే శయ్యపై వ్రాలెను. రవీంద్రుఁడు చటాలునఁ బోయి సేవకుని బిలిచెను. ఇరువురును గలసి కొంతవఱ కుపచరించిరి. కాని యందున ఫలము లేకపోయెను. ఆతఁడు గతించుట నిజము. ఎంతప్రయత్నించినను నిఁక జీవింపనేరఁడు. పత్తేదారావిషయము నెఱింగి యొకనిట్టూర్పు పుచ్చెను. ఆ సమయముననే చూచుచుండఁగనే ప్రశాంతుని జీవనజ్యోతి శాంతించినది—ఆతఁ డిఁక నిహమున మేల్కొనలేఁడు. శాశ్వతనిద్రావస్థ యబ్బినది.

రవీంద్రుఁ డిప్పుడు ప్రబలవిషమావస్థలోనై త్రొక్కులాడుచుండెను. ఆతని కిన్నిరహస్యములు తెలిసియు తెలియనట్లైనది. ఏల? వానిని బరులతోఁ జెప్పుట లేదని యాతఁ డంతరించుచున్న ప్రశాంతుని యాత్మముందర ప్రతినచేసెను. అట్లయిన వానితో నిఁకఁ బ్రయోజన మేమి? తెలిసియు తెలియనట్లే. రవీంద్రున కిప్పటికష్టములు తప్పవయ్యెను. ఇతఁడు చాలసేపటివఱకు నీవిషయమై యోచించుకొని పిదప నాగదిని వదలిపోయెను.

# పదునాఱవ ప్రకరణము

ప్రే మై క హృ ద యు లు

మధ్యాహ్నము భోజనానంతరము రవీంద్రుఁడు ప్రవాళునిఁజూడ కారాగారమునకుఁ బోయెను. రామనాథుఁడు మాత్రము తనగదిలో నొంటరిగఁ గూర్చుండి వార్తాపత్రిక నొకదానిని దిలకించుచుండెను. దాని నాతఁ డామూలాగ్రముగఁ జదువక పూర్వమే యువ్వలఁ బాఱవైచి చెంతనుండినకలము నందుకొని తన పూర్వస్నేహితుని కొకని కొక లేఖను లిఖింప నుద్యమించెను. దాని సగమువఱకు వ్రాసెను. అదియు నాతని కింపుగ నుండ లేదు. వ్రాసినదాని నొకమాఱు చదువుకొని పదపడి వ్రాయక దానిని చించి పాఱవేసి యెదుట నతిగంభీరముగ నప్పుడే యొంటిగంటను గొట్టుచుండిన పెద్దగడియారమువంక దృష్టులు నిగిడ్చి చూచుచుఁ గూర్చుండెను. అతనికి హృదయస్థిమితత లేకుండెను. కారణమేమి చెపుమా?

ఇంతలో ద్వారమువద్ద నెవ్వరివో యడుగులచప్పుడు వినవచ్చుచుండుటచే రామనాథుఁ డావైపునకుఁ దిరిగి చూచెను. నవమంజుల విశాసమోహనలావణ్య సంపన్నముఖపంకజమున నెలనగ వంకురింప మందగమన విలాసవిభ్రమమున సరోజిని వచ్చుచుండెను. రామనాథుఁ డామెను గాంచి ప్రత్యుత్థానంబుఁ జేసి నగుచు "రాణీ! ఏమి చాల దూరము విచ్చేసితివి? నీవు భోజనానంతరము పండుకొనలేదా?" అనెను.

సరో : లేదు.

రామ : ఏల ?

సరో : పగటిపూట నిదురించుట నాకలవాటు లేదు. అది యనారోగ్యకర మని నేను పాఠశాలయందు చదువులయ్య యొకవ్వఁడు చెప్పఁగా వినియుంటిని.

రామ : మీతండ్రి నెందు విడిచి వచ్చితివి ?

సరో : ఎండైన విడుచుటేల ? లోపల పడకపైఁ బవ్వళింపఁ జేసి నిద్రపుచ్చి వచ్చితిని. నేనొకతె నటఁ గూర్చుండఁజాలనైతిని. మీయొద్ద కూర్చున్నకాలము కడుసులువుగ దాఁటిపోఁగలదని నా నమ్మకము.

రామ : అట్లైన రమ్ము. ఈ కుర్చీపై కూర్చుండుము. నీయెదుట కాల మెంతవేగముగ దాఁటిపోవునో చూడఁగలవు.

అని చెప్పుచు రామనాథుఁడు సరోజిని నొకయాసనముపైఁ గూర్చుండఁబెట్టి తాను పూర్వస్థానమున నాసీనుఁడయ్యెను. ఆమె యాతనితో మాటాడక బల్లపైనుండిన యొకపత్త్రమును దీసికొని పత్రములఁ దిరుగవైవ మొదలిడెను. అది గాంచి రామనాథుఁడు " సరోజినీ ! నీవు బాగుగా చదువఁగలవా ? " అనెను.

సరో : నేనైదేండ్ల బాలికనై యుండినప్పటినుండి చదువను వ్రాయ నభ్యసించితిని. కాన నించుక యా విషయమున పరిచయ మబ్బినది. ఇదియుఁగాక మా తండ్రి నాకప్పుడప్పు డాంధ్రభాషా పరిశ్రమనుకూడ నించుక గలిగించుచుండెను.

రామ : ఏమి, మీతండ్రి నీకు చదువు చెప్పుచుండెనా ? సరోజినీ ! నీవాడుమాటలు వింతగ నున్నవే ! పుట్టుకతోడనే మూగ దైన యాతఁ డెట్లు నీకు గురువయ్యెను !

సరో : అయ్యో ! ఆతఁడు జన్మముతో మూగ యని మీ కెవ్వరు చెప్పిరి ?

రామ : అయిన నది యిటీవల చేకూరినదా ? మొదట నాతఁడు మనవలె మాటాడుచుండెనా ?

సరో : అవును. ఆతని కీదురదృష్టము పట్టువడి యొకవత్సర మైనది.

రామ : అందులకుఁ గారణమేమి !

సరో : అది నేను సరిగఁ జెప్పఁజాలను. మాతల్లి గతించిన మఱునాఁటినుండి యాతఁ డీదుస్స్థితియం దున్నాఁడు. ఆ దినమునుండి యాకస్మికముగ నాతనికి మాట లాఁగిపోయినవి. వైద్యు లనేకులువచ్చి యాతనికిఁగల్గినయీనూత్న వ్యాధిని బోఁగొట్ట యత్నించుచుండిరి. కాని యింతలో మేము కృష్ణనగరము వీడి సోమనాథునిగృహమున బందీలమై యుండవలసివచ్చెను.

రామ : మఱచియుంటిని. అబలా ! మీ రేల యాసోమనాథుని యింటికై దీలై యుంటిరో యావిషయము నీకుఁ గొంతవఱకుఁ దెలియు నని చెప్పియుంటివి కాదా ? మరల నా విషయమై ప్రశ్నించుటకు నా కవకాశము దొరకినది కాదు. ఇప్పుడైనఁ జెప్పుము. ఆతఁ డెవరు ? మిమ్మేల బంధించి తెచ్చెను ?

సరో : రామనాథబాబూ ! మీ కావిషయమునంతను చెప్పుటకు నాకు వలనుగాకున్నది. అందుకు మూలకారణమేదియో నాకు తెలి యదు. ఒక్కటిమాత్రము చెప్పెదను. సోమనాథుఁడు మాపినతండ్రి. మాతండ్రిసోదరుఁడు.

రామ : ఏమి, యాతఁడు నీపినతండ్రియా ! సరోజినీ ! ఇదివఱ కీసంగతి నాకు తెలిసియుండలేదు. ఈవింతవార్తను నేఁడు నోటినుండి వినుచుంటిని సుమా. అయిన మీపినతండ్రి కారాగారమున బంధించి మీ కెగ్గుగావించితిమి కాఁబోలు.

సరో : మా కెట్టియొగ్గును గావింపలేము. ఆతఁడు తనపాపాచరణమున కనువగుశిక్ష నొందెను. దేవుఁడు నిష్పక్షపాతబుద్ధిచే ప్రాణులకు తత్కర్మానుకూలంబుగ దండనల విధించుచుండును కదా ?

రామ : అయిన, బాలా ! మీపినతండ్రి మిమ్మింతకఠినశిక్షకు పాల్పఱచుటకు మీయం దేమైన తప్పిద ముండ వచ్చును.

సరో : తనదుర్మార్గప్రవర్తనయందు సన్మార్గుఁడగు మాతండ్రి యొకయంతరాయముగ నిలిచియుండుటే మాతనితప్పు. అతనికూఁతురనై యుండుట నాతప్పు.

రామ : మీతండ్రికి నీవొక్కతెవేనా కూఁతురవు ? వేఱుసంతానము లేదా ?

సరో : నాకగ్రజుఁడు విఠోభా రామప్రసాదుఁ డొకఁడున్నాఁడు.

రామ : అతఁ డిపు డెందున్నాఁడు ? కృష్ణనగరున లేఁడా ?

సరో : లేఁడు. మమ్ము సోమనాథుఁడు పట్టి తెచ్చినరాత్రియే యాతఁ డెరికిని చెప్పకుండ నెందో వెడలిపోయెను. నేఁటివఱ కాతని యాగడయే తెలియరాకున్నది.

రామ : సోమనాథుఁడు మిమ్ము పట్టి తెచ్చుటకు ముం దేగ్రామమున కాపురముండెను ?

సరో : ఎందును లేఁడు, బాబు, మాయింటియందే చిరకాలమునుండి యుండి మమ్ము చాల ప్రేమించుచుండెను. మాతల్లిపై నాతని కెంతో ప్రీతి. ఆమెయు నాతని కెట్టిలోపమును చేయకుండ నాదరించుచుండెను. కొన్నియేం డ్లీరీతిగఁ గడువగనే యొకనాఁడు మాతల్లి గతించిపోయెను. మా తండ్రి యందులకు విశేషముగ దుఃఖించి తమ్ముని నెంతో ప్రేమతో నాదరించుచుండెను. కాని యొకనాఁటినిశీథమున

మా యింటిలో బందిపోటుదొంగలు పడిరి. అదేమివింతయో కాని వారు ధనమును తస్కరించుకొనిపోక నన్నును మా తండ్రిని బంధించి యెత్తుకొనివచ్చిరి. వారు మా యన్ననుసహితము పట్టుకొనవలయునని యత్నించిరి. కాని యాతఁడు పిక్కబలమును జూపి పాఱిపోవుటచే నది యసాధ్యమయ్యెను. పిదప వారు మమ్మిరువురను దెచ్చి సోమనాథుని యింట నీ యఱిలో బంధించి పోయిరి. ఆతఁడైన మాపైఁగరుణించి మమ్ము వదలింపఁడయ్యెను. మేము మా దుస్థితివిషయమై యెంత దెలిపికొన్నను వినక మాకు మిగుల శ్రమను కలిగించుచుండెను. ఆహార పానీయములను సరిగ నివ్వక మమ్ము బాధించెను. కాలక్రమమున నాతని మూలముననే యింతయు జరిగినట్లు తెలిసికొని కారణమూహింపఁజాలక మాఱుమాటాడక పడియుంటిమి. సుమారీవిధముగ మేమేడెనిమిది నెలలకాలమును గడపి చిక్కిశుక్కి ప్రాణములపై నాశ వదలుకొని దైవముపై భారమును వైచియుంటిమి. కాని యింతలో కరుణామయుఁడగు భగవంతుఁడు మాపై దయతలఁచి మీమూలమున మా దురంతదుస్థితి కంతమును గల్పించెను.

రాము : సరోజినీ! సోమనాథుఁడు దుర్మార్గుఁడని నీవెట్లు భావించితివి!

సరో : ఆతఁడు మాయింట నుండుతఱి నెప్పుడు మద్యపానమును చేయుచు స్త్రీలోలుఁడై దొంగతనమును చేయుచుండెను. అందుకై విశేషధనమును పాడుచేయుచుండెను. ఇంతచేసినను మా తండ్రి కినియక తమ్మున కెన్నియోతడవులు బుద్ధిగఱపెను. కాని యందున నెట్టిలాభమును లేకపోయినది. ఆతనిదుర్మార్గము దినదినాభివృద్ధినొంది మాకందఱికి మిగుల వ్యసనమును కలిగించెను. తనకు పంచియిచ్చియుండినధనము నంతటిని దుర్వ్యసనములందు తగిలి పాడుచేసి యించు

కంతయైన లజ్జలేక వచ్చి మాతండ్రిప్రాపున పడెను. భ్రాతృవాత్సల్య ప్రేరితుఁడై మా జనకుఁడు వలదనక యాతని కెక్కువ చనవొసంగి యింటనే యుంచుకొనెను. చిన్నయింటివాసము లెంచురీతి తుదకు మాజనని మరణానంతరము పంజుపంటి మా సంసారము నీగతి పాడు చేసెను. మాతండ్రి మూగయగుట కతఁడే కారకుఁడై యుండునని నాకుఁ దోఁచుచున్నది.

రామ : మీతండ్రి యంతటి ధనవంతుఁడా ?

సరో : అవును, కృష్ణనగరున నాతనితో సరితూఁగుభాగ్యవంతులు లేరు బాబూ ! ఆతని యాస్తి సుమారు పదిలక్షలై యుండును. మిగుల వాసికెక్కినపురుషుఁడు.

రామనాథుఁ డత్యంతాదరముతో నా లావణ్యాలపననిష్యంద నోల్లసితవాక్సుధాధారల నాస్వాదించుచు హాసన్ముఖుఁడై యుండెను. ఆమె నోటినుండి కొన్నిరహస్యములు తెలిసినవి. వాని నాతఁ డతి భద్రముగ హృదయపేటికయందు డాఁచుకొని మరల నిట్లు ప్రసంగమును సాగించెను.

రామ : సుందరీ ! నీకు మీతండ్రి యింకను వివాహప్రయత్నములు చేసియుండలేదా ?

సరో : లేదు. ఆతఁ డప్పుడప్పుడు మావిరోభాగామప్రసాదునితో నామాట ననుచుండెనే కాని యెట్టిప్రయత్నమును చేయలేదు.

రామ : నీవప్పుడే వివాహోచితంబగు వయస్సున తేజరిల్లుచున్నావు. మీ రెల్లరు మరల సుఖముగ కృష్ణనగరున కలసినపు డానందముతో పెండ్లిచేసికొనవచ్చును. సరోజినీ ! నీకు వివాహమై నీ ప్రియునితో నీవు సుఖముగఁ గాలము గడపుతఱి మేము జ్ఞాపకమున కెన్నఁటికిని రాముసుమా !

సరోజిని మాటాడక మోమున నెలనగ వంకురింప రామనాథునిపై నతితీక్ష్ణదృష్టుల సారించెను. అతఁ డది గని నగుచు "రాణీ! నేనన్నది యబద్ధమా?" అనెను. "అవును. సర్వాబద్ధము. మీకు సందర్భోచితముగ మాటాడుట రాదు. ఎదుటివారిహృదయభావముల మీరు గ్రహింపఁజాలరు" అని యనుచు నామె చటాలున లేచివచ్చి రామనాథునిపార్శ్వమున నిలుచుండెను. అతఁడు జంకినవానివలె తూలిపడుచు "ఇదేమి రాణీ! ఈరీతి దాసునిపై కోపగించుకొంటివి? నీముఖమును చూచుటకే నాకు భయమగుచున్నది. నేనన్నమాటల కలిగి నన్ను శిక్షించెదవా?" అనెను. ఆమె యతిగభీరభావాడంబరముఖాటోపమున నధరసంచాలనముఁ గావించుచు "అవును. మీకతికఠినతరమగుదండన విధింపవలసినట్లు తలంచెదను. మీరు నృశంసులు. నామనము నొవ్వనాడెదరు" అనెను. "ఎట్టిశిక్షను విధింతువో చెపుమా!" అని యాతఁడు లేచి నిలుచుండెను. "ఇదిగో! ఇట్టిది" అని చెప్పుచు సరోజిని తటాలున పోయి రామనాథుని గాఢముగ నాలింగించుకొనెను. ఆ యుత్తరక్షణముననే యాప్రేమైనబాలికాయువకులు సముజ్వలానిర లోపగూహా నానంద జలధి నిమగ్నులై తేలియాడుచుండిరి !!

అసదృశస్మితోజ్జ్వలదురంత ప్రమోదసాగర మవలంబితభావతరంగకదంబశూన్యమై వెలయుచున్నది. స్పర్శసుఖాబ్జారిసందర్శనమాత్రమున క్షణక్షణమున నప్పుడప్పుడానిశ్చలసముద్రాంతరాళభాగమున ననూనప్రేమైకవిలసితచంచలాందోళన ముప్పతిల్లుచున్నది. ప్రేమసాగరయుగళసమ్మేళనపర్యవసాన మప్రతిహత భావస్ఫురితము—అసదృశభయోపపాదకము—వర్ణనాతీతము !!!

# పదునేడవ ప్రకరణము

### చిత్రలేఖ

సరోజినీ మోహనసౌందర్య పారావారనిమగ్నుఁడై రామనాథుఁ డిహలోకమునే మఱచిపోయెను. చాలసేపటివఱ కాతని కీబాహ్యప్రపంచమున తెలివి రాదయ్యెను. ఆ బ్రహ్మానందరాజ్యసర్వస్వంబున కధీశ్వరుఁడై తన్మయత్వమున నప్రతిహతస్వాతంత్ర్యసంచాలనమున నెందుచూచినను దానే యైయుండెను. ఆ యానందస్థితికి మేర లేదు—అడ్డు లేదు—వివేకము లేదు. కొన్ని నిమిషములు గడచినవి. రామనాథుని ప్రస్తుతసంతోషావస్థ కాకస్మికముగ నంతరాయముగ ద్వారము వెనుక నెవ్వరో దగ్గిరి. ఆతఁ డదరిపడి చూచి భయవిహ్వలసంభ్రముఁడై సరోజినిని వెనుకకుఁ బంపి తిన్నగ వెలుపలికి వచ్చిచూచెను. కవాటనేపథ్యమునుండి రవీంద్రుఁ డీవలకు వచ్చి బావమఱఁదిహస్తమును గీలించి నవ్వుచు "బాబూ! ఎండవేడిమి మిక్కుటముగ నున్నది. ఏమి చేయుటకును తోఁపకున్నది" అనెను. ఇదివఱకుఁ దాను చేయుచుండినకార్యము నాతఁ డుపేక్షించుచుండె నని తలఁచి రామనాథుఁడు లజ్జావనతశిరస్కుఁడై మాఱుమాటాడకుండెను. రవీంద్రుఁ డేమియుఁ దెలియనివానివలె నటించుచు "అన్నా! రామనాథా! మఱచి యుంటిని. నీకొకసంగతిని దెలుపవలసినదిగ నున్నది" అనెను. రామనాథుఁడు మోమెత్తి యేదియో చెప్పనుంకించెను. కాని, నోరాడకపోవుటచే మరల సిగ్గుచే తలవంచుకొనెను. రవీంద్రుఁ డాతనిహృదయ భావము నంతను గ్రహించెను. ఆతఁడు చాలసేపటి

నుండి సరోజిని చెప్పుచుండిన యుదంతము నాలకించెను. వారిచేష్టల గమనించియే యుండెను, కాని తనభావమును వెలిబుచ్చిన తనమఱఁదికి హృదయ సంకట మగునని తలఁచి దాని నడుగఁడయ్యెను. యుక్తి యుక్తముగ ప్రసంగమును మార్చి యాతఁడు మరల నిట్లనెను. "బాబూ! నీవిప్పుడు వెలుపలికి వచ్చినప్పుడే నేనానందసాగరుని యింటినుండి యిట కరుదెంచితిని. అచ్చట నొకచిత్రోదంతము తెలిసినది. రమ్ము చెప్పెదను." అని యాతనిచేయి పట్టుకొని వేఱొక గదిలోనికిఁ దీసికొనిపోయెను. రామనాథున కించుక హృదయము స్తిమితము కలిగిన ట్లయ్యెను. రవీంద్రుఁడు చెప్పిన తన యాగమనకాలమును బట్టి చూడ నాతఁడు తమ చర్యలను బరికింపలేదని యించుక ధైర్యము కలుగుటచే నాతఁడు మాఱుపలుకక యటనుండి వెడలిపోయెను.

రవీంద్రుఁ డాగదియం దొకచోఁ గూర్చుండి జేబునుండి యొక కాగితమును దీసి రామనాథుని చేతి కిచ్చి "బాబూ! ఈ లేఖను చదువుము." అనెను. అతఁడు దాని నందుకొని యటునిటు ద్రిప్పి నవ్వుచు "బావా! ఇదేమిహాస్యము. వట్టికాగితమును నేనెట్లు చదువఁగలను? ఇందెట్టి వ్రాతయును లేదే?" అనెను.

రవీం: వ్రాతగలకాగితముల నందఱు చదువఁగలరు. అది యంత కష్టముకాదు. లిఖితశూన్యపత్రపఠనమే విస్తారప్రతిభా సూచకము. అది మనబోటిపత్తేదారుల కలవాటు కాఁదగినదిసుమా.

రామ: ఈ విద్యను నేనిదివఱకు నేర్వలేదు. ఇట్టివిద్య ప్రపంచమున నున్నదనికూడ నాకుఁ దెలియదు.

రవీం: దానిని నీవు నేర్వవలయును. అది నీ కత్యంతోపకారి యగును.

రామ : దానిని నేర్పఁదగినవా రెవ్వరు! దేవతలు స్వర్గము నుండి దిగి రావలసినదే యింక.

రవీం : అవును. నీకై యీవిద్య నేర్పుటకై—స్వర్గమునుండి యమరుఁడొకఁ డిటకు దెంచినాఁడు.

రామ : ఏఁడీ? అతఁ డెందున్నాఁడో చూతము రండు.

రవీం : చాలదూరమున లేఁడు బాబూ! నేనే యాతఁడు.

రామ : అయిన మీకీశూన్యలేఖలఁ జదువువిద్య వచ్చునా?

రవీం : ఆ. ధారాళముగ తెలిసినది. నేను దాని నొకగంట క్రిందనే నేర్చుకొంటిని.

రామనాథుఁ డాశ్చర్యసంభ్రమముఁ జెందెను. తనబావ చెప్పుచుండున దేదియు నాతనికి బోధపడలేదు. లేనిద్రాతను కల్పించి చదువుటయనఁగా నెంతటివింత! దాని నిదివఱ కాతఁడు చూచియుండ లేదు. ఇది యొకగొప్పచిత్రము. దానిని గాంచఁగోరి యాతురతతో నిట్లనెను. "బావా! మీరు చదువుఁడు చూతము. పిదప నాకుఁ గూడ దానిని నేర్పుదురఁట" రవీంద్రుఁడు నవ్వి యా కాగితమును దీసికొని "ఇదిగో, చూడుము. చదివెదను" అనుచు నటనుండి లేచి లోపలికి పోయెను.

రామనాథున కేమి చెప్పుటకును దోఁచకుండెను. అతఁడు తనతోఁ బరిహాసము లాడుచుండెనని మాత్రము గ్రహించెను. కాని యందలి నిగూఢతను దెలియఁజాలఁడయ్యెను. తదేకవీక్షణములతో నా కాగితమును మరల నొకమాఱు పరీక్షించెను. అది వట్టితెల్లని కాగితము. దానిని రవీంద్రుఁడు చదువునఁట!! ఎంతటివింత!!!

ఇంతలో రవీంద్రుఁడు లోపలినుండి యీవల కొకకాచపాత్రముతో నీటిని గైకొనివచ్చెను. రామనాథుఁ డాతని గాంచి "బావా! మీరు చదువుట కాదు. నాకా వ్రాఁతను చూపింపవలయునుసుమా. లేకున్న మిమ్ము నమ్మను" అనెను. "అట్లే కానిమ్ము"నుచు రవీంద్రుఁడు తనపనిని ప్రారంభించెను. అతఁ డాకాగితము నెత్తి యీజలపాత్రమున సంపూర్ణముగ ముంచివైచెను. తోడనే యీలేఖాద్యంతములందు ముత్యములవంటియక్షరమాలలఁ గాంచి రామనాథుఁ డాశ్చర్యచకితుండై లేచి చీత్కారము జేసెను. రవీంద్రుఁడు నగుచు "అన్నా! కంటివా నావిద్యను" అనెను.

రామ : మీకించుక యక్షిణీవిద్య తెలిసినట్లున్నది. ఈనీటియందేదియో ప్రభావ మున్నది.

రవీం : లేదు, బాబూ, నాకట్టి దేమియుఁ దెలియదు. ఈయుదకము మనకు నిరంతరము పానయోగ్యమగు బావినీరు. ఎప్పటిరుచి రంగులే యున్నవి చూడుమా. నేనట్టిమంత్రమును బ్రయోగింపలేదు. కావలయునన్న నీనీటిని త్రాగుము. ఎప్పటిజలమువలె నున్నదో లేదో చూడుము;

అని చెప్పుచు నాపాత్ర నాతని కందిచ్చెను. రామనాథుఁ డానీటిని ద్రాగెను. ఎప్పటినీరే. అనుదినము తాను త్రాగుచుండినదానికిని నేఁటిదానికి నెట్టిభేదమును లేదు. అతఁడు వింతముఖముతో రవీంద్రుని గాంచెను. రవీంద్రుఁడు మరల నాతనిని గాంచి హసించుచు "ఇదిగో, యిపుడైన నీకాగితమును చదువుము" అనెను. రామనాథుఁడా లేఖనందుకొని యుందలి వ్రాఁత నంతను జదువసాగెను.

ప్రియమిత్రమా! కేశవపాలా!

నిన్న నీవింట లేసలెతి నటకు వచ్చితిని. కాని
న్నుఁడనై వెడలిపోయితిని. కారణ మిది. నీబావ సయ్యా
చంపుఁడు నన్నానందసాగరునియాజ్ఞచే "నీవిటకు రావలదు.
పిలువనిపేరంట మేల? వెడలిపో" అని నన్ను వెలుపలికి గెంటెను.
నయనముల నశ్రువులు రాలఁ జేయునది లేక "కాని, వానిన్ని
నేనేమియు ననరాను" అని యప్పటి కిట్టికి వచ్చి వేచియున్నా
ను. నీవి త్వరలో నాయింటికి వచ్చి యొకము ఖ్యాంశమును గూర్చి
సుష్టు వ్యవస్థకుఁ బూర్వమే మాటాడి పొమ్ము. దేవుఁడు కాచుఁగాత!

"పింశవిలాప"
ప్రవాళుఁడు.

రవీంద్రుఁడైన నిదివఱ కీలేఖను చదివి యుండ లేదు. అందలి విషయము లాతనికిఁ దెలియవు. ఇప్పుడు రామనాథుఁ డాతనియెదుట వట్టు చదువఁగనే యించుక మందహాసము చేసి "రామనాథా! ఏమి తెలిసినది" అనెను. రామనాథుఁ డాశ్చర్యముతో దానిని మరలమరల చదువుచు "ఇది మీకెచ్చట దొరకినది?" అనెను. నేను నిన్నటిరాత్రి భూతగృహమున కేశవపాలుని గని యాతనిగది నంతను పరిశీలించి వచ్చితిని. అచ్చట నాతనిశయ్యక్రింద నొకలకోటావై చినకవరులో నీ కాగిత ముండెను. నేనప్పుడు దీనిని గాంచి నీవలెనే యాశ్చర్యచకితుఁడనై "ఈవట్టికాగితము నేల యీతఁడు దాఁచియుంచుకొనెను" అని యనుకొంటిని. కాని యప్పుడు నాకేమియు బోధపడదయ్యెను. పిదప నేను దీనిని భద్రముగ దాఁచుకొని యింటికిఁ దీసికొనివచ్చి యోచింప నాకొకయుపాయమువల్ల దీనిని చదువవచ్చు నని తోఁచినది. దానినే యిపుడు నీకు చూపించినది. నా ప్రయత్నము సఫల మైనది.

అయిన నీ లేఖ నీ రీతి కేశవపాలునకు వ్రాయుటలో ప్రవాళుని యుద్దేశమేమి" అని రవీంద్రుఁడు చెప్పుచుండ నూరక యాతని ముఖమును గాంచుచు, రామనాథుఁడు కూర్చుండి యుండెను. ఆతఁ డేమియుఁ జెప్పక చాల సేపటివఱకే మో యోజించుకొనుచుండెను.

రవీం : దీనిని జూడ నాకొకటి తోఁచుచున్నది. ప్రవాళుఁ డేవిధముగనో కేశవపాలుని దనయింటికి రప్పించుకొని తన స్నేహితులతో సహాఁడే యా సాధుశిఖామణిని బంధించి యీరీతి దాఁచి యుండవచ్చును. ఆనందసాగరున కిది తెలియుక తనమాట గతించి పోయెనని తలంచెను. మేము సహితము నిన్నటిదినమువఱ కట్లనియే భావించి యుంటిమి. కాని కరుణామయుఁడగు భగవంతుఁడు మనకా రహస్యమును విప్పి కన్నులయెదుట నుండునీగాఢాంధకార మార్గమున చంద్రకాంతిని బఱపెను. లేకున్న మన మింకను నెంతమూఢుల మగుదుమో.

రామ : మీరీవిషయము నానందసాగరునితోఁ జెప్పితిరా?

రవీం : లేదు. లేదు. అంతయు సిద్ధించి హంతకుల బంధించిన పిదప నాతని కీయుదంతమును దెల్పెదను.

రామ : ఈ కాగితమును జదువ ప్రవాళుఁడు పింశవిలాప మందిరమునఁ దన కాపుర మేర్పఱచుకొని యున్నట్లు తెలియుచున్నది.

రవీం : అవును. ఆనాఁడు మనము వానియింటి కేఁగియుంటిమి కాదా? దానిపేరే పింశవిలాప మైయుండును. అందుండియే వాఁడీ కాగితమును వ్రాసియుండును.

ఇంతలో రామనాథుఁ డాలేఖయం దొకచిత్రమును కనిపెట్టి దానిని రవీంద్రునకుఁ జూపించెను. లేఖలో ప్రతిపంక్తియందు నాద్యంతాక్షరము లన్నియుఁ గ్రింద గీతలు గీయఁబడియుండెను.

ఇందుల కేమి కారణము! రవీంద్ర రామనాథులు చాల సేపటివఱకు యోజించి చూచిరి. వానిని మరలమరల చదివిరి. లేఖ నంతను త్రిప్పిరి. ఎంత యోజించినను రహస్యము తెలియఁబడదయ్యెను. ఇంతలో రవీంద్రుఁ డత్యంతాశ్చర్యానందములతో నొకకేక వైచి లేచి "రామనాథా! బాబూ! ఇప్పుడు తెలిసినది మర్మము. ఎంతటి మోసము! ఎంతటి మోసాలమారితనము! ఈ పంక్తుల మొదలి ప్రథమాక్షరము లన్నిటిని వరుసగఁ జదివి పిదప నంత్యాక్షరపంక్తిని గలిపి చదివిన రహస్యము తెలియును. ప్రవాళుని కుద్దేశ మందు బట్టబైలైనది,'' యనెను. రామనాథుఁడు సహితము విస్మితుఁడై చదివి "ఆహా! ఎంతటివింత బావా! ప్రవాళుఁడు బహిరంగముగఁ దనభావమును తెలియుపఱుప నొక కృతకపత్రమును వ్రాసి యందులో తనభావము నెంతచాకచక్యముతో నిమిడ్చి యున్నాఁడు! అంతటిని గలిపి చదువగ "నిన్ను చంపిన నేను సుఖియౌదును. నిన్నాశ్చ తపింప" అని యగుచున్నది. పాపము కేశవపాలుఁ డీమర్మమును తెలిసికొనలేదు కాఁబోలు." అనెను.

రవీం : కేశవపాలుఁ డీలేఖను గాంచి మనవలెనే పొరపడి యిది వట్టికాగిత మని తలఁచి యూరక పారవైచియుండును. ఆతని కీయుపాయము తోఁచియుండిన దీనిని నీటిచే కడిగి యందలివిషయములఁ దెలిసికొని యుండును.

రామ : బావా! ఈ యక్షరము లీరీతి కనఁబడక యుండుటకుఁ గారణమేమి? వీనిని జలమునందేల ముంచి తీయవలయును?

రవీం : ఇంకను తెలియలేదా? ఇది యొకద్రావకముతో వ్రాయఁబడినది. ఆ ద్రావకముచే వ్రాయఁబడిన యక్షరము లెప్పుడును కన్నులకుఁ గానరావు. ప్రేక్షకుల నతిశీఘ్రముగ మోసగించును. అందు వ్రాఁత యున్నట్లే తోఁచుట లేదు. జలస్పర్శచేగాని యాదిక్కువదలదు.

పత్తేదారులగు మనకిట్టిలేఖ లెన్నియో దొరకుచుండును. అప్పుడంతయు నీవిధానమే శరణ్యము.

రామనాథుఁడు చాలసేపటివఱకు మాటాడక యూరకుండెను. ఈసందర్భమున నాతఁడు తనబావను కారాగారవిషయములను, ప్రవాళునిసంగతులను నడుగుట బొత్తిగ మఱచిపోయెను. రవీంద్రుఁడైనను వానిని జ్ఞాపకపఱచి చెప్పలేదు. ఇంతలో నెదుటిగడియారమున నైదు గంటలు కొట్టుటచే రవీంద్రుఁడు రామనాథునితో నిట్లనెను. "బాబూ! రామనాథా! నేను కొంచెముపనిమీఁద నూరిలోనికిఁ బోయివచ్చెదను. నేను మరలివచ్చువఱకు నీవిందే యుండుము" అనెను. మఱేది యందు లకు వల్లెయనెను. రవీంద్రుఁ డప్పుడే యెందో వెడలిపోయెను.

# పదునెనిమిదవ ప్రకరణము

## భ యం క ర రా త్రి

రవీంద్రుఁడు మరల నింటికిఁ ప్రయాణమై మరలుసరికి రాత్రి యొనిమిదిగంటలై యుండెను. అది కృష్ణపక్షరాత్రి—అంతేకాక యమవస—ఆకాశగోళమున తారకానిచయము లేదు.—అంతయు ప్రబలకాదంబినీమాలచే చుట్టుకొని యుండెను. గాఢాంధకారము నల్దిశలందు సూచికాభేద్యమై విలసిల్లుచుండెను. అప్పటికే చాలప్రొద్దు పోయి యుండుటచే రవీంద్రుఁడు దారిలో నెందును నిలువక చకచక నడచిపోవుచుండెను. అతఁ డిప్పుడు నడచుచుండిన దొక చిన్నసందుత్రోవ. అది కడు దీర్ఘమైనది—నిర్మానుష్యము. అందు పురపాలకసంఘమువా రేకారణముననో దీపము లుంచి యుండలేదు. చిమ్మచీకటి పెనుభూతమువలె విస్తారముగ నా త్రోవయందంతట నాక్రమించుకొని యుండుటచే పథికులకు నడచుట మిగుల భయానకముగ నుండెను. రవీంద్రుఁడు త్వరగ మరలి యింటికి వత్తుననుకొని తనచేతిలాంతరు నానాఁడు తీసికొనిపోయి యుండలేదు. దారిలో నప్పుడప్పుడు జీర్ణగృహమధ్యములనుండి కీచురావములఁ జేయుచు మూషికాదు లటునిటు పరుగులిడుచుండెను. అందు వాసయోగ్య మగు మందిర మొకటియు లేదు. అన్నియుశిథిలములే. బహుకాలమునుండి జను లేకారణముననో యావీథియందు వాసము చేయుట మానుకొని ప్రొద్దు క్రుంకినవెంటనే యా తెరువును ద్రొక్కుటకూడ విడిచిరి. దానివిషయమై యనేకు లనేకచిత్రగాథలఁ జెప్పుచుందురు. అందు భూతసంచారము

మెండుగఁ గలదఁట. కాని, రవీంద్రున కొక్కటియును దెలియదు. తక్కినవీథులువోలె నదియు మిగుల సురక్షితమనియే భావించి ముందు వెనుకలఁ జూడక నడచి పోవుచుండెను. ఆతని కెట్టిభయమును కలుగ లేదు. ఇంతలో నాకస్మికముగ వెనుకభాగమున చప్పటలు చఱచుచు "రవీంద్రా! రవీంద్రా! ఆఁగుము" అని యొక కేక వినఁబడెను. రవీంద్రుఁడు చటాలున వెనుదిరిగి చూచెను. ఏమియుఁ గాన్పింపలేదు. సాంద్రతరంబగు తమఃపుంజమావారితంబుగ నొప్పుచు భయ మేయుచుండెను. జనసంచారమే గోచరింపలేదు. రవీంద్రుఁ డది యేమై యుండునని చాలసేపటివఱకట నిలుచుండి యోజించెను. కాని, యేమియుఁ దోఁచినదికాదు. తన్నాసమయమున నానవాలిడినవా రెవ్వరై యుందురని మిగుల విస్మయ విస్ఫారితుఁ డయ్యెను. తుద కతఁ డది తనమనోజనితమని భావించి ముందుకు నడువసాగెను.

ఆతఁ డొకటిరెండడుగులు పోకపూర్వమే మరల యథారీతిగ నా ధ్వని వినఁబడెను. రవీంద్రుఁ డీసారి యతిగంభీరముగ నండే నిలుచుండి "ఎవరు వారు!" అని ప్రశ్నించెను. ప్రత్యుత్తరము రాలేదు. ఆ ధ్వని కందుంచిన యెలుకలు కీచుకీచుమని బదులుపల్కెను. ఆ నిబిడాంధకార నిశ్శబ్దసమయమున నాకంఠనాదము చాలదూరము వఱకు వినఁబడెను. రవీంద్రుఁడు భీతిలక యించుక వెనుకకుజరిగి నిలుచుండి యా తావు నంతటిని కడుతీక్ష్ణదృష్టులతోఁ బరిశీలించెను. అదియు నిష్ఫల మయ్యెను. ఇంతలో నాతని కనతిదూరము నుండిన యొకజీర్ణమందిరమునుండి యతిగంభీరం బగునినాద మొకటి వెలువడి హృదయము నించుక చలింపఁజేసెను. రవీంద్రుఁ డదేమైయుండునా యని యా తావువైపు దిరిగి చూచుసరి కత్యంతప్రకాశమానంబు లగునయనయుగళములతో నొక వికృతాకార మా గృహోపరిభాగమునఁ

జిందులం ద్రొక్కుచు భయంకరముగ బొబ్బరించుచుండెను, రవీంద్రుఁడు జపియుక నిదానించి దానిని బరీక్షించి చూచెను. వెనుకటిదినమున భూతగృహమునఁ గాంచినదయ్యమే యది !!!

పూర్వరాత్రి జరిగినయంశము లన్నియు నొక్కక్షణకాలములో రవీంద్రుని మస్తిష్కభాగమున చలించిపోయెను. అతఁడు ప్రథమమున నించుక భీతిలినను పడఁపడి ధైర్యమును విడువఁడయ్యెను. మొగటి యనుభవమును మఱవలేదు. అది దయ్యమో, లేక కృత్రకరూపమో యనుసందియ మిదివఱకే యాతనిని బీడించుచుండెను. అది కేశవపాలునియొక్క పిశాచమఁట, రవీంద్రున కది యంతవిశ్వసనీయముగఁ దోఁచదయ్యెను. ఏలయన ! ప్రవాళుని లేఖమూలమున కేశవపాలుఁడు జీవించియుండుట నిజమని తెలిసినది. ఇఁక భూత మెచ్చటిది ? బ్రతికినవారిభూతమా ? మూఢుఁడై రాత్రి భీతిలి మూర్ఛనొంది కార్యమును భగ్నము గావించుకొనెను. నేఁడట్లు చేయలేదు. అతిసాహసబుద్ధితో జేబునందుండిన చిన్నతుపాకిని ( Pistol ) బయటికిఁ దీసి చేత ధరించి యా స్థలమునకు నడచెను.

భూతాకారమున నున్న యా వ్యక్తి యింకను యథాస్థితియందే కదలుచుండెను, మాటిమాటికి " రవీంద్రా ! మూర్ఖుఁడా ! నన్ను మఱచితివా ! తులువా ! ఈవాఁడు కడతేరెదవు." అని యార్భటించుచుండెను, రవీంద్రుఁ డందుల కెంతమాత్రమును భీతిలక తన యినుపగ్రోవి నా వ్యక్తిహృదయమునకు సూటిగ నుంచి " ఓరీ ! నీవెవఁడవో నిక్కమును చెప్పుము. నీ మోసము నాకుఁ దెల్లమై పోయినది. నీ భూతరూపమును దీసివైచి నీ నిజరూపమును జూపుము. లేకున్న నీవిఁక నాబారిను ః సురిగిపోనేరవు. ఒకత్రుటికాలములో నీ తుపాకిగుండు

నీహృదయమున దూసికొనిపోవును చూడుము" అని బెదరించెను. వ్యక్తి పరిహాసముల చేయు నాపాడిండ్లలో నంతటను ప్రతిధ్వనించుచుండెను. రవీంద్రుఁ డది నిక్కముగు భూతము కాదని నమ్ముచుండెను. హంతకుఁ డెవ్వఁడో యారీతిగఁ దన్ను బెదరించుచుఁ దనకార్యమునందు తనున్ విముక్తుని జేయ యత్నించుచున్నాఁడని గ్రహించెను. ఎన్నఁడు లేని ధీరత్వము నేఁ డాతనిహృదయకుహరమునఁ బ్రవేశించెను. తోడనే యాతఁడు శీఘ్రముగ నా వ్యక్తిహస్తమును దృఢముగఁ బట్టుకొని "దురాత్మా! చెప్పుము. నీవెవ్వరవు? లేకున్న నిదిగో! కడతేరితివి" అనెను.

వ్యక్తి : ఏమి నీకింతగర్వమా? పాపీ! భూతములశక్తి నీకింకను తెలియదు కాఁబోలు. అవి నీతల కొరికి తినును.

రవీం : నీవాపనిని చేయుటకుఁ బూర్వము నేనే నీతలకొరికెదను చూడుము. తారసింహా! దురాత్మా! నన్ను మోసగించుచుంటివా? నీబోటితుచ్ఛు లిదివఱ కసంఖ్యాకముగ నావాత పడిపోయినారు. నిన్నటిదినమున నాకన్నులలో దుమ్ము కొట్టితి నని ధైర్యముతో నేఁడిట్లు మరల కాన్పించితివి కాఁబోలు. ఇఁక నీవు పారిపోనేరవు. నీ చేష్టకు నాకుఁ దెల్లమైపోయినవి. నీరూపమును తీసివైతువా లేదా? ఇదివఱకు నాతో నీవు సరిగ మాటాడి యెఱుఁగవు. నాశక్తిసామర్థ్యములు నీకుఁ దెలియవు కాఁబోలు. నీపాపము ఫలించుటచే నీరీతి నాయెదుటఁ గాన్పించితివి. మ్రొక్కఁబోయిన దేవర యెదురైనట్లు నాకించుకైన శ్రమనొసంగక నీవే యీదీపజ్యోతిని పడిపోతివి. దురాత్మా! నీవిషయము నాకంతయుఁ దెలియును.

అని రవీంద్రుఁ డనేకవిధములుగ బెదరించి మాటాడెను. వ్యక్తి మాటాడలేదు. కన్నులనుండి యగ్నిస్ఫులింగము లెగయుచుండెను. [illegible] దున్నట్టుగ నాప్రాకారమునుండి గుభాలున క్రిందికి దుమికె

యుచ్చటి శిథిలమందిరమున దూరిపోయెను. రవీంద్రుఁడు కొంతసేపటి వఱకు ఱిచ్చపాటున నుండి కడకు తానుసహిత మాకుడ్యమునుండి క్రిందికి దూకి "దురాత్మా! తప్పించుకొని పోదువా?" అని లోపలికి దూరెను. ఆయిల్లందందు పడిపోయియున్నను మిగుల విశాలముగ నుండెను. అందనేకములగు గదు లుండెను. చిరకాలము నుండి యది నిర్మానుష్యముగ నుండుటచే నేలయంతయు గుల్లలేగి మిగుల దుర్గంధపూరితమై యుండెను. రవీంద్రుఁ డావ్యక్తిని తఱుముచుఁ బోయి యొక విశాలమైన గదిద్వారమున కలిసికొని చేయి పట్టుకొనిలాగెను. వ్యక్తి భయంకరముగ నాతని నావలకు నూకి "ఛీ—పందా! దయ్యములతో నిట్టి చెఱలాటమా?" అని తనఖడ్గమును గిరగిరఁ ద్రిప్పుచు నాతనిపైఁ బడెను.

రవీంద్రుఁడు శీఘ్రముగ లేచి "ఈభూతమునెదుట నీయాటలు సాగుట లేదు. ఇది నీకన్న గొప్పభూతము" అని చెప్పుచు నాఖడ్గమును పిస్తోలుగుండుప్రేటుచే ఖండించి పారవైచెను. వ్యక్తి రోషకషాయితలోచనయుగళములతో భూతాడనముఁ గావించి తనదుస్తులలో నున్నతుపాకిని బైకి తీసి "ఔరా! నీవింకను చావకుండువా! నేనెవ్వరని తలఁచితివి!" అని యాయంధకారగృహమున రవీంద్రునిశిరమునకు సరిగ గుఱినుంచి ఢాంమని పేల్చెను. కాని రవీంద్రుఁ డతిలాఘవముగ నాప్రేటునుండి తప్పించుకొని వచ్చి యావ్యక్తికంఠము నొడిసి పట్టుకొనఁబోయెను. ఆపని సాగలేదు. తోడనే యాతఁడు చేతనుండిన యాక్రోవిని పెఱికికొని దూరముగ పారవైచెను. అంత నాపెను చీకటిలో వారిరువుర కతిభయంకరముగ దొమ్మియుద్ధ మారంభమయ్యెను.

ఇరువురు నతిసాహసముతో పెనగులాడుచు నొండొరులను పొడుచుకొనుచు, నొడిసి పట్టుకొని క్రిందికి బడవైచుచు నతిఘోరముగ గర్జించుచుండిరి. వారి పాదములక్రిందనుండి ధూళి విశేషముగ రేగి యా యిల్లంతయు నాక్రమించుకొనెను. ఆబోతులువోలె బీభత్సంబు లగు కంఠీరవయుగళంబుభాతి — ఘోరసర్పద్వయముభంగి — యా యిరువురు బలవంతులు తమ యుద్ధమును జరుపుచుండిరి అంతలో రవీంద్రుఁడు పూర్వము ప్రవాళుని మోదినట్లు తన చిన్నతుపాకితో నా వ్యక్తితలపై బలముగ నొకతన్ను తన్నెను. తోడనే యా ప్రాణి హాహాకారముఁ జేయుచు క్రిందికి పడిపోయెను.

రవీంద్రున కిప్పుడు తెల్లమైపోయినది. అది భూతము కాదు. తన్నదలింప వైచుకొన్న మోసపురూపు. కంఠధ్వనిని తారసింహుఁడే యా రూపున నుండెనని యాతఁడు వెంటనే గ్రహించెను. అది నిజము. తారసింహుఁడే యీరీతి పిశాచరూపమును వైచుకొని రవీంద్రాదుల బెదరింపయత్నించెను. నిన్నటిదినమునఁ గృతార్థుఁడయ్యెను. ఆ ధైర్యముచే నేఁడుసహిత మాతని నింకను భయపెట్టఁదలఁచి సాయం సమయమున నాతనిపోకడ నేగతినో తెలిసికొని యాతఁడు మరల నింటికిఁ బోవునప్పుడాసందుబడియే పోవునని భావించి యా యాకారమును వైచుకొని వచ్చి యందు దాఁగుకొనియుండెను. కాని, సూక్ష్మగ్రాహియగు రవీంద్రుఁడు వెనుకటివలె నధీరుఁడు కాక యతిసాహసముతో తారసింహునిగుట్టు బట్టబయలుచేసి తెలిసికొనెను. వాఁడది గని చేయునది లేక యేవిధముగనైన నీఁక పారిపోదమని యత్నించెను. కాని యా పని సాగలేదు. అసాధారణుఁడైన రవీంద్రు నాతఁడు మోసగింపఁజాలఁడయ్యెను.

తారసింహుఁ డాగతి భూపతితుఁడు కాగనే రవీంద్రుఁడు పరుగిడి పోక వానిదుస్తుల నన్నిటిని పరికించి చూచెను. అందేమియుఁ

గానిపించలేదు. ఒకచో మాత్ర మొక చిన్నకరదీపికయు నొక చిట్టి కాగితమును గానిపించెను. అతఁ డాదీపిక నివాఁకుఁ దీసి వెలిఁగించి యా వెలుతురునం దాకాగితమును పరీక్షించి చూచెను. అందు కొంత వ్రాఁత యుండుటచే రవీంద్రుఁడు దాని చదువఁబూనెను. కాని యది యాతని పని కంతయు నుపయుక్తముగ నుండలేదు. తారసింహుఁ డింకను పరవశుఁడై పడియుండెను. రవీంద్రున కప్పు డేమిచేయుటకును దోఁచ లేదు. చేత దొరికిన దొంగను విడిచిపోవుటకైన నాతనికి బుద్ధిపోడమ దయ్యెను. తనపై నున్నయుత్తరీయముచే వాని కాలుసేతులు బంధించి త్వరలో నింటికిఁ బోయి పోలీసువారిని బిల్చుకొని వత్తమని కడ కాతఁడు నిర్ధరించెను. కాని యంతలో తారసింహునకు హెచ్చరిక వచ్చెను. వాఁడు తటాలున లేచి యేమరుపాటున కాగితమును చూచు చుండిన రవీంద్రుని కాలితో నేలపైఁ బొర్లఁ దన్ని పిక్కబలముఁ జూపి పలాయితుఁడై పోయెను. రవీంద్రుఁ డాలసింపక చటాలున లేచి వాని వెన్నంటిపోవ యత్నించెను కాని యా జంఘాలుని బట్టనేరఁ డయ్యెను.

ఇంతయు నొక్కక్షణకాలములో జరిగిపోయెను. రవీంద్రుఁడు నివ్వెరపడి నిలుచుండెను. పక్షి యెగిరిపోయినది. ఆతనికి విస్మయ భావమున నేమిచేయను దోఁపకపోయెను. తారసింహుఁ డీతీరునఁ దప్పించుకొని పారిపోవునని యాతఁడు తలంపఁడయ్యెను. వానిని బట్టుట కైన నాతని కవకాశము దొరకదయ్యెను. చేతికి చిక్కిన హంతకుఁ డవలీలగఁ దనకన్నులు మూసి పోవుటచే రవీంద్రునిమానస మొకించుక రోషలజ్జాన్వితమై సంభ్రమించెను. ఆ సమయమున వానిజాడలే తెలియరాకుండెను నేఁడు తారసింహుని బంధించియుండిన రవీంద్రుని యత్నము లన్నియు సఫలములై యుండును. కాని, యది యసాధ్యమై పోయెను. ఇఁక నాతఁ డందేమియుఁ జేయనేరక తిన్నగ నాయిలు పీడి యూనల కరుదెంచి నిజనివాసమున కరుదెంచెను.

రవీంద్రుఁ డిలుసేరునప్పటికి చాల ప్రొద్దుమీరి యుండెను. ఇంటితలుపులు బంధింపఁబడి యుండెను. అతఁడు వానినిచఱచి రామనాథుని బిలిచెను. అంతలో కవాటము తెఱచుకొని సరోజిని యీవల కరుదెంచి "బాబూ! రామనాథుఁ డింట లేఁడు. ఒకగంటకాలము క్రింద నాతఁడు కుశాలవునితో నెందో వెడలిపోయెను" అని చెప్పెను. రవీంద్రుఁ డాశ్చర్యవిలోలుఁడై "వా రెచ్చటికి పోయిరి సరోజినీ?" అనెను.

సరో: అది నాకంత బాగుగ తెలియదు. వారింటిలో కూర్చుండి యేదియో మాటాడుకొనుచుండఁగ నొకస్త్రీ యచ్చటికి వచ్చి యొకకాగితము నిచ్చి పోయెను. వారు దానిని చదువుకొని చూడఁగ మీహస్తాక్షరములతో మీరు గొప్పసంకటమునకు లోనై యున్నట్లు తెలిసెను. అంత నాతఁ డాలసింపక యాతత్త్వ మెఱుంగఁగోరి కుశాలవునితో వెడలిపోయెను.

రవీం: ఆస్త్రీని రామనాథుఁడు మఱేమియు నడుగలేదా? ఆమె యెవ్వరని చెప్పినది?

సరో: ఆమె యీదారిని బోవుచుండ నొకదుర్మార్గుఁ డాలేఖ నీయింటివారి కిమ్మని చెప్పి పోయెనఁట. ఆమె మఱేమియుఁ జెప్పక తిన్నగ వెడలిపోయెను.

రవీంద్రున కేమిచేయుటకును దోఁపక స్తబ్ధుఁడై నిలుచుండెను. అపరిచిత యగు నొకయబల తెచ్చియిచ్చిన కాగితమును నమ్మి యీరీతి సాహసించి పోవుటకు రామనాథుఁ డంతటిమూఢుఁడా! ఏమో, యాతనియుద్దేశ మేమో యని యతఁడు చాలసేపటివఱకు వితర్కించుకొనెను. అప్పుడు సరోజిని మరల నిట్లు చెప్పెను.

సరో : అయ్యా! వారిముఖవైఖరి నాసమయమున నుపలక్షించి చూడ నాలేఖను వారు నమ్మినట్లు లేదు.

రవీం : అది నీవెట్లు గ్రహించితివి !

సరో : పోవునపుడు వారొండొరులఁగాంచుకొని నవ్వుకొనుచు నాయుధముల ధరించి యుల్లాసముగ వెడలిపోయిరి. మీకు సంకటము నిజముగ కలిగియున్నదని వారు విశ్వసించి యుండిన వారిహృదయ భావమే వేరై యుండును కాదా ? అది యుండనీ. మీకెట్టియాపదయైన కలిగినది వాస్తవమా !

రవీం : నాకెట్టివిపత్తును గలుగలేదు. అది యంతయు మోసమే. హంతకులలో నెవరో యీకృత్రిమ వ్యాపారమును జరిపి యుందురు. ఏమైన నేమి, రామనాథుఁడు నమ్మకుండుట మేలైనది. సరోజినీ ! వారేదిశ కేఁగిరో నీకు తెలియునా ?

సరో : ఈయూరి కుత్తరదిశగా పోయిరి బాబూ !

రవీంద్రున కిప్పుడేదియో జ్ఞాపకమునకు వచ్చుటచే నాతఁడు సరోజినితో నిట్లనియెను. “ అమ్మా ! నీవింటికడనే భద్రముగ నెవరు వచ్చి పిలిచినను తలుపు దీయక పరుండి యుండుము. నేనూరిలోనికి పోయి వత్తును. వచ్చుటకు బహుశః చాలకాలము పట్టును ” అనెను. అప్పుడామె “ మీరు భోజనము చేయుట లేదా ? ” అనెను. రవీంద్రుఁడు నగుచు “ నాకిపుడవకాశము లేదు. నేను వేగముగ పోవలయును. ఒకపూట భుజింపకున్ననే చావను తల్లీ ! ఇంటివద్దమాత్రము భద్రము ” అని చెప్పుచు నాతఁ డీవలకు వచ్చెను.

ఇంతలో నెవరో వచ్చి యాతనిభుజముపై చేయివైచి “ అయ్యా! ఈయుపరరాత్రిమం దెచ్చటికి ప్రయాణము ? ” అనిరి. రవీంద్రుఁడు వెనుదిరిగి చూచెను. అతఁ డానందసాగరుఁడు. రవీంద్రుఁ

దచ్చెరుపాటున "ఆనందసాగరా! ఏమిది? ఇప్పు డేల వచ్చితివి?" అనెను.

ఆనం: నీతో కొంచెము పని యుండి వచ్చితిని. కాని. యిప్పుడు నీకు తీరిక యున్నట్లు లేదు.

రవీం: ఆ తీరిక కేమి లెమ్ము. ఆ పని యేదో చెప్పుము.

ఆనం: ఒకగంట క్రిందట నాకీలేఖ నొక బాలకుడు తెచ్చి యిచ్చెను. దీనియర్థ మేమో విశదీకరింపుము.

రవీంద్రుడు దాని నందుకొని యానందునితో దీపియొద్ద కేగెను. దానియం దిట్లున్నది.

అయ్యా! ఆనందసాగరా!

ఇన్నిదినములుగ మీ యుప్పు తిని, మీకై పాటుపడుచుండు పత్తేదారు లందఱు శుద్ధమూఢులు. ప్రపంచజ్ఞానాభావులు. నిరర్థకులు. మీ మామగారగు కేశవపాలుడుగారు గతించిపోయిరని వారు తలచి పట్టియంధకారమున నల్లాడుచున్నారు. నిక్కముగ నాతడు హత్య గావింపబడలేదు. ఈ యూరిలో నొక రహస్యస్థానమున దాచబడి యున్నాడు. నీవిక నా పత్తేదారుల కొకసలాము పెట్టి వారి ప్రతిభాతిరేకమును కొనియాడి ముఖమునకు నల్లమసిని బూసి పంపి యీ రాత్రియే జయసాగరోద్యానమునకు సమీపమున నుండు నాటకశాల యొద్దకురమ్ము. అచ్చట కేశవపాలుడు జీవములతో నుండుట గాంచగలవు. ఇది నిక్కము.

ఇట్లు

ప్రాణసఖుడా,

సర్వమంగళుడు.

రవీంద్రుఁడు లేఖను చదివి కొంతసేపటివఱకు నేదియో యోచించి తుద కిట్లనెను.

రవీం : అయ్యా! ఈ విషయమున నీ యభిప్రాయమేమి! ఈ లేఖను వ్రాసినయాతఁ డెవ్వఁడో నీకు తెలియునా?

ఆనం : ఈతఁడు నా బాల్యమిత్రుఁ డగునొక ధనికుఁడు. ఈ యూరనే కాపుర ముండును.

రవీం : దీని నాతఁడే వ్రాసెనని నీకు నమ్మకము కలదా?

ఆనం : అది నాకించుక యనుమానాస్పదముగ నున్నది. హస్తాక్షరము లాతని వౌనో కాదో యనుసందియ మగుచున్నది. చాలకాలమునుండి యాతని వ్రాఁతను చూచియుండలేదు.

రవీం : ఈ లేఖయందలి విషయములను నీవు నమ్మితివా?

ఆనం : నమ్మియుండిన నింతదూర మేల వచ్చియుందును! నాకిది కృత్రిమలేఖ యని తోఁచుచున్నది. మామగారింకను జీవించి యున్నారఁట, ఇదియే చాలదా యిందలిమోసమును నిరూపించుటకు. నీ సలహా యీ సమయమున నత్యంతావశ్యకము.

రవీం : ఆనందా! ఇది నీవు తలఁచినట్లు పట్టిమోసము. దీని నెవరో నీ శత్రువులు వ్రాసి యుందురు. ప్రథమముననే నీవు దీనిని నమ్మి యీ నాటకశాలయొద్ద కేగకుండుట మంచిదైనది.

ఆనం : అయిన మన మిప్పు డేమి చేయవలయును? దీనిని ఆ హంతకులలో నెవరైన వ్రాసియుండకూడదా?

రవీం : ఆ మాట నిజము. వారిలో నెవ్వఁడో యీ పనిని గావించి నిన్నచ్చటికి రప్పించుకొని యేదైన యనర్థమును జరుపఁ దలఁచి యుండును. మన మిరువుర మిపు డచటి కేఁగుదము. అచ్చట జరుగు వింతల నన్నిటిని పరికింతము.

ఆనం : రవీంద్రా! మన మిపు డాకమాజీసర్వమంగళుని గృహమున కేగి యాతఁ డేమైన దీనిని వ్రాసెనేమో తెలిసికొనుట బాగుకాదా ?

రవీంద్రుఁ డించుక యోచించి యట్లేకానిమ్మని చెప్పి సరోజినిని మరల హెచ్చరించి యానందునితో నాతావు వదలి చనెను. వారిరువురు సర్వమంగళునిమందిరమున కేగి యాసంగతిని విచారించిరి. ఆతఁడు విస్మితుఁడై తనకావిషయమై యేమియు తెలియదనియు, తానాకాగితమును వ్రాయలేదనియు, నదితనవ్రాఁత కాదనియు తెలిపెను.

రవీంద్రానందులయనుమానములు స్థిరపడెను. తోడనే వారిరువురు జయసాగరోద్యాన సమీపమున నుండు నర్తనశాలాభిముఖులై చనిరి.

# పందొమ్మిదవ ప్రకరణము

## తృ తీ యాం క ము

జయసాగరోద్యానము చంద్రనగరమునకు దక్షిణదిశయందున్నది. దానినలుదెసల చాలదూరము వఱకు గృహములు లేవు, జనసమ్మర్దము లేదు. అదియొక విశాలమగు బహిరంగప్రదేశమున నిర్మింపఁబడి యత్యంత రామణీయకముగ నుండును. అందు రాత్రిసమయమున నొక తోఁటకాపరి తప్ప నన్యు లెవరును నుండరు. ఆ పుష్పోద్యానమున కానుకొనియే యొకనృత్యమండపము కలదు. అదికూడ నిర్మానుష్యమై చిరకాలమునుండి సంస్కారశూన్యమై యుండందు జీర్ణమై యుండెను. అది బాహుపురాతనమగు కట్టడము. కతిపయవత్సరముల క్రింద నా మండపాధికారి గతించుటచే నానాటకమండలివా రాభవనమున నటించుటను మానుకొని యావైపు తిరిగి చూడకుండిరి. అందులకుఁ దగిన యుత్తరాధికారు లెవ్వరును నేఁటివఱకు బయలు వెడలి రాకుండుటచే సర్కారువారు దానిని తమస్వాధీనమున నుంచుకొనిరి. పూర్వకాలమున మహోన్నతదశయందు వెలసిన యాకట్టడము మన ప్రసంగము నాఁటి కతినికృష్టస్థితియందు పడి చూచువారు లేక నశించుచుండెను. ఆదినమున నచ్చట తోఁటకాపరి యుండలేదు. ఏకారణముననో వాఁడచటికి రాలేదు. అట్టి సమయమున నాయుపవన లతామంటపమున నెవరో యిరువురుపురుషులు గూర్చుండి దేనినో ఘాంచుండి చూచుచుండిరి. వారొండొరులతో మాటాడుట లేదు. వారిదృష్టి యంతయు నా మైదానమున చాలదూరమువఱకు పరుగు

లిడుచుండెను. ఆ కటికచీకటియందు వానికందేమియుఁ గాన్పించుట లేదు. చుట్టును భయంకరముగ నిశ్శబ్దము ప్రబలియుండెను. చాల దూరమునఁ గాన్పించు పురసౌధోపరిభాగము లానిశీథసమయమున నాకాశమండపమున నక్షత్రదీపముల వలెఁ బ్రకాశించుచు నించుక కాంతిని రోదసీగహ్వరమున ప్రసరింపఁజేసెను. సూక్ష్మమైన వృక్షసమూహమునం ద్దాడుకొనుచున్న ఝుంఝూనిలముయొక్క గంభీరధ్వని దూర యిరువురు వ్యక్తులకు బాగుగ వినఁబడుచుండెను. అందుచే హాయిగ నిదురించు చుండిన పతంగసంతాన మూపవనశాఖోపశాఖల చలించుచు కాతరస్వరములను నల్దిశలఁ బఱపుచుండెను. ఉద్యానవనమున నందందు మిగుల నెత్తున పెరిగియుండిన నారికేళ తాళవృక్షము లావాయువేగంబును తగులుటకై చిటపట చప్పుటలు సలుపుచుండెను. ఎందుచూచినను ప్రకృతిమాత నేఁడు దుర్నిరీక్ష్యంబగు వికారాకారంబును ధరించి మిగుల భయంకరముగ తాండవమాడుచుండెను.

పురుషు లిరువురును చాలసేపటినుండి మౌనవ్రతులై కూర్చుండి యుండిరి. వారి నిరీక్షితవస్తు వేదియో యింకను గోచరింపలేదు. కొంత సేపటికి వారిరువురలో నొకఁడీరీతిఁ దిన్నగ మాటాడెను.

1 పురు : వీరింకను రాకుండుటకు కారణమేమి ? మనము విన్న దబద్ధమై యుండునా ?

2 పురు : అట్లనకుము. వారు ఖండితముగ రాఁగలరు. రెండు గంటలవేళకుఁగదా వత్తుమని చెప్పియుండిరి ?

1 పురు : ఏమో, వారు మనను మోసగింపఁదలఁచి మనల నానవాలిడి యారీతి మాటాడుకొని యుండకూడదా ?

2 పురు : అట్లున్నటికిని జరిగియుండదు. వారు మమ్ము చూడ లేదు. ఇదియుఁ గాక మన మీ సమయమున గుర్తింపఁజాలనంతటి ఛద్మవేషముల నుంటిమి కాదా ! మఱుగున నుండినమనల చూడలేదు.

1 పురు : ఈ మా సరససాగరుఁడైన నేల మా కాగితమును గాంచి రాకుండును! వచ్చునో రాఁడో!

2 పురు : అట్లనకుము. అతఁడు నిక్కముగ రాఁగలఁడు. ఆ కాగితము కడుచిత్రముగ నుండుటచే నాతఁడు ఆశాపీడితుఁడై వచ్చుటకు సందియము లేదు.

అని యిట్లు మాటాడుకొనుచుండ నేపథ్యమున మనుజుల యలుకుడు విననయ్యెను. తోడనే వారు తమ సంభాషణ నాపివైచి యా వైపునకు ముఖములఁ ద్రిప్పి పరీక్షింపసాగిరి. ఇరువురు పురుషవ్యక్తు లాదారిని వచ్చుచుండిరి. వారిరువురు మెల్లగ నేదియో మాటాడుచు నాటకభవన ప్రాంగణములోని కరుదెంచిరి. వారిమాట లంతస్ఫుటముగ వినఁబడుచుండ లేదు. ఇరువురు చాలనే అతిరహస్యముగ మాటాడిరి. అందులో నొకదీర్ఘకాయుఁ డొకమా ఆతావు నంతటిని పరికించి చూచి మొదటివాని నందే కూర్చుండఁబెట్టి తానావనమునఁ బ్రవేశించెను.

లతాభవనమున దాగియుండినవ్యక్తు లిరువు రాయాగంతుకుని బరిశీలించి చూచుచు "వాఁడు కాదు. వేఱొకఁడు, పెఱవాఁడు." అని తమగుప్తస్థానమునుండి లేచి యీవల కరుదెంచి యా దీర్ఘదేహుని గలిసికొనిరి. ఇంతలో నా మొదటివాఁడు వారిని గాంచి విభ్రాంతుఁడై "బాబూ! రామనాథా!" అనెను. మొదటివా రిరువురుసహిత మబ్బురమందుచు నిలుచుండిరి. అందులో నొకఁ డాతనిదాపునకు వచ్చి "బావా! ఏమిది! ఇంతరాత్రివేళ మీరేల యీ స్థలమునకు వచ్చితిరి! ఈ నిగూఢరూపమున నుండువన్నట్లు మీరు గుర్తిడఁజాలితిరి!" అనెను. రవీంద్రుఁడు నవ్వెను.

రవీం : నాయెదుట నీమాటలు సాగుటలేదు. నీ వెంతరూపమును మార్చుకొన్నను నేనానవాలిడఁదగుదును సుమా. అది యుండనీ, నీవీనిశీథకాలమున నిచ్చట నీ కుశాలవునితో నేమిచేయుచుంటివి !

రామ : హంతకులజాడ నెఱుఁగఁదలఁచి వచ్చితిమి.

రవీం : అది యెట్లు సాధ్యమగును ?

రామ : ఆ ప్రముచ్చులు తమలో తాము మాటాడుకొనుదానిని బట్టి వారీరాత్రి యీస్థలమునకు వత్తురని మేమూహించితిమి. వారు తప్పక యిటకు రాఁగలరు.

రవీం : వా రేమి మాటాడుకొనిరి ?

రామ : తా మానందసాగరుని కొకకృత్రిమలేఖను లిఖించి యాతని నిటకు రప్పించి తామునహిత మిచ్చటి కేతెంచి యాతఁ డిచ్చటికి వచ్చినతోడనే తుదముట్టింపవలయు నని యనుకొని నిర్ధరించుకొని పోయిరి.

రవీం : అట్లు మాటాడుకొన్నవా రెవ్వరు ?

రామ : అందులో నొకఁడు కరాళుఁడు. రెండవవాఁ డొక నూతనుఁడు. మే మిదివఱకు వానినిగాంచియుండలేదు. ఆకారాదులఁ బట్టి చూడ ఘూర్జరదేశస్థునివలెఁ గాన్పించుచుండెను.

రవీం : అచట తారసింహుఁ డుండలేడా ?

రామ : లేడు. వాఁడుసహితము వారితో కలిసివచ్చునని వారే యనుకొనుచుండిరి.

రవీం : అయిన నేఁటిరాత్రి యిచటికి మువ్వురు రాఁగలరు. రామనాథా ! వా రానందసాగరుని కాకాగితమును వ్రాసినది. నిక్కము. అతఁ డద్దానిని తెచ్చి యొకఘంటకాలముక్రింద నాకు చూపెను. నేనప్పుడే దానితత్త్వ మూహించి యాదురాత్ములనుబట్టుటకుఁ

దగినసంధానములఁ గావించి యానందసాగరునితో నచటి కరుదెంచితిని. అతని నందే కూర్చుండఁబెట్టి మనము కడు జాగరూకతతో జరుగువానినిఁ గాంచుచు నాతని కెట్టియపాయమును వాటిల్లకుండుటకుఁ బూర్వమే వారిని బంధింపవలయును. ఈ రహస్యభేదననాటకమున నేఁటికే తుది యంకము ప్రారంభమైనది. ఈ రాత్రియే యీనాటకభవనమున మన మిఁక భరతవాక్యము నుచ్చరించి యీ భయంకరప్రదర్శనముల కన్నిటికి నంత మేర్పఱుపవలయును.

కుశా : మృగయుఁ డొకఁడు మువ్వన్నె మెకమును చంప బోను నొడ్డి యుండొక హరిణశాబకమును బంధించినట్లు పాప మాయానంద సాగరునం దుంచితిరా బాబూ! అహో! మీ ప్రతిభ వర్ణనాతీతము.

రహీం : అట్లు చేయకున్న వేఱువిధానము లేదు. అయిన నాతని కెట్టిసంకటము సంభవించుటకుఁ బూర్వమే మనము కార్యసిద్ధి నొందవలయును. మఱచితిని. రామనాథా! నేను సాయంకాల మిలు వెడలి పోయినపుడు నీ కొక లేఖ వచ్చిన దని సరోజిని చెప్పెను. దాని నెవ్వరంపిరి ?

రామ : బావా! అది మోసపుఁ గాగితము. అందు మీ కెట్టి సంకటమో కలిగినదనియు, మమ్మక్కడకు రమ్మనియు వ్రాయఁబడి యుండెను. వ్రాఁత యించుకయు ననుమానమున కెడమిచ్చి యాపమయ మున నది మాయ యని నమ్మఁబఱిచెను. అదియుఁ గాక నా కాగిత మున మేము భూతగృహమునకు వచ్చునట్లు వ్రాయఁబడియుండెను. మే మది హంతకులలో నెవ్వనిచేతనో వ్రాయఁబడె నని నిశ్చయించి యేమైనఁ గాని మ్మని కడుజాగరూకతతో నిలు వెడలి యాతావున కేఁగి రహస్యముగ నొక్కచో దాఁగియుండి చూచుచుంటిమి. ఇంతలో నచ టికి కరాళుఁడు ఆ ఘూర్జరుఁడు వచ్చి తమగుట్టు బట్టబయ లగునట్లు

మాటాడుకొని మే మందుంటి మనుసంగతిని తెలిసికొననేరక వెడలి పోయిరి. వారిసంభాషణలలో మాకు వ్రాయఁబడిన కాగితముసహితము మోస మని తెల్లమయ్యెను. పిదప మే మానందసాగరునిఁ గావాఁడ మని యిచ్చోటికరుదెంచి జరుగఁబోవుదానికై వేచియుంటిమి. ఇంతలో మీరును విచ్చేసితిరి. బావా! ఇన్నిదినములకన్న నేఁడు మన మతి జాగరూకులమై యుండవలయును. ఒకగొప్పప్రాణము ననంతంబగు దుస్థితికి గుఱికావించి మనము కార్యసాఫల్యము నొంద నుంటిమి. మన మా శార్దూలముల కీమృగశాబకము నాహుతిగ విడువరాదు. వారాతనిపైఁ బడుటకుఁ బూర్వమే మన మచటికిఁ బోవలయును. ఏమాత్రము అప్రమత్తులమైయున్నను, మరణాంతమువఱకు మన మప్రతిష్ఠలపాలై లోకమున నిందితుల మగుదుము.

రహీం : అన్నా! అది నేను బాగుగ యోచించియున్నాను. నేఁ డెంతటి కష్టతరంబగు కార్యము మనపై తాండవ మాడుచున్నదో నే నెఱుఁగుదును. దైవము మనపాల నుండువఱకు నెట్టిసంకటము వాటిల్లదు. ఆతఁడు దురాత్ముల కీరేయి దండిగ దండనములను విధింప వేచియున్నాఁడు. మనకు సాయముగ నుండును. "కట్టెనువిఱువక పామును జంపవలయు" నన్నట్లు మనపని నతిజాగరూకతతో నెఱవేర్ప వలయును. మన మిరువుర మాదాపున నుండు లతానికుంజమున దాఁగి యుందము. కుశాలవుఁడు నాటకభవనపార్శ్వమున నుండు వృక్షముపై పొంచుండి యుండవలయును. కార్యము ప్రతికూలింప నున్న సమయమున మీరు మీ తుపాకిగుండ్లను ప్రయోగించుటకేమాత్రమును జంకకుఁడు. నే నొకఁడనే యింతపనిని చేయవలసియుండునని మొదటఁ దలఁచి యుంటిని కాని భగవంతుఁ డమూల్య మగు మీసాహాయ్యమును సహితము నిచ్చెను. మనము సఫలీకృతుల మగుదు మని నాకు

నిందు నమ్మకము గలదు. మీ రిఁక పొండు. మీమీగు ప్రస్థానముల నుండుఁడు. నే నొకమాఱీస్థలమును పరిశీలించి వచ్చెదను. కుశాలవా! ఇందున నీ కెక్కువ చెప్పనక్కఱలేదు. మన ప్రాణములను తృణప్రాయముగ నెంచవలసియుండును. కార్య మతిభీషణముగ నుండును.

కుశా : జియ్యా ! మీ రింతదూరము చెప్పవలయునా ! ఈ సేవకుని శక్తిసామర్థ్యములను నేఁడు చూడఁగలరు లెండు.

రవీం : మీరిఁకపొండు. వారు వచ్చువేళ యగుచున్నది.

రామనాథకుశాలుఁ డిరువురు తమగు ప్రస్థానముల కేఁగి డాఁగుకొనిరి. రవీంద్రుఁడు కొంతసేపటివఱకు కావనమునంతటిని పరికించి చూచి పిదప వచ్చి రామనాథునియొద్ద కూర్చుండెను. వా రొకరితో నొకరు మాటాడలేదు. కాళరాత్రి నిశ్శబ్దయుతముగ తారకాక్షులఁ దెఱచి ప్రకృతిమాతను తిలకించుచుండెను. వాయువేగము మందగిలెను. అంధకారరాక్షసికి జడిసి యాతఁ డేభూధరముననో, యేమహాసముద్రముననో, దూఱుకొనెను. కాలపురుషుఁడు జగముపై నొక్కమాఱుగ సమ్మోహనాస్త్రమును బ్రయోగించి స్తబ్ధయుతముగఁ జేసివైచెను. వృక్షపత్రములైన చలించుటలేదు. ఆ యపరరాత్రిసమయమున నాసృష్టి భయానకరూపము విలేఖనాతీతమై తరలిపోవుచుండెను.

పురమునందలి పెద్దగంట యొంటిగంటను కొట్టినది. హంతకులు రెండుఘంటలకట కరుదెంతు మని మాటాడుకొనుచుండి రఁట. వారు వచ్చుట కింకను చాలకాల మాలస్యముగ నుండెను. ఆనందసాగరుఁడు రవీంద్రుఁడు వెడలిపోయిన పిదప నూరక యచ్చటియరుగుపై కూర్చుండియుండెను. అతనిహృదయ మంతయు భయాతిరేకమున చలించి పోవుచుండెను. హంతకులతోఁ దా నేగతి మాటాడవలయునో, వారేరీతిఁ దన్నుఁ జెనకుదురో, రవీంద్రుఁడు సకాలమునఁ దనరక్షణార్థ

మరుదెంచునో లేదో యని యాతనికి మిగుల భయమగుచుండెను. తానిక ముందెంతటి ఘోరకార్యమును చేయవలసియుండెనో యానందునకు బాగుగ తెలిసిపోయెను. తనజీవితకాలమందు తానిదివఱ కెన్నఁడు నింతటి సంగిగ్ధావస్థకు లోనై యుండలేదు. అయిన నాతనికి రవీంద్రునిశక్తి విషయమై దృఢమగు నమ్మకముండెను. “ధైర్యం సర్వత్ర సాధయేత్” అనునార్యోక్తిని దలఁచుకొని యాఁతఁడు తన్నుఁ దానే యుత్సాహవచనాళిచే బ్రోత్సాహపఱచుకొనుచు భయమును దూరముగ గెంటివైవ యత్నించుచుండెను. ఆత్మసంరక్షణార్థ మాతఁ డొక దీర్ఘ కరవాలమును, చేతితుపాకిని భద్రముగ మొలయందు బంధించుకొనియుండెను. కొంతసేపటివఱకు కారీతి మౌనభావముతో నుండి పిదప నొకమాఱెలుఁగెత్తి తిన్నగ తనకుఁ దానే యిట్లనుకొనెను, “ఏమిది, నామిత్రుఁడు సర్వమంగళుఁ డెంతసేపటికి వచ్చును! మామాయ నెప్పుడు చూపించునో కదా?” ఆకస్మికముగ వెనుకనుండి “ఇప్పుడే వచ్చి చూపఁగలఁడు. త్వరపడకుము. మిత్రమా!” యని ప్రత్యుత్తరము వచ్చెను. ఆనందుఁ డులికిపడి యాదిశకుతిరిగి చూచెను. శరీరమాద్యంత మవకుంఠనముతో నున్న పురుషుఁ డొకఁడు నిశ్శబ్దముగ నా భవనకుడ్యపార్శ్వముననే ప్రాఁకికొని వచ్చుచుండెను. వానిని గాంచినతోడనే యానందునిహృదయకుహరము గభిల్లుమనెను. ఆతని కేమి చెప్పుటకును దోఁచలేదు. తొట్రుపాటుచే పాదములు గడగడ వణఁకుచుండెను. చిత్రప్రతిమవోలె నావ్యక్తిని చూచుచు నాతఁడు మందచేష్టితుఁడై నిలుచుండెను.

ఆపురుషుఁడు తిన్నగ వచ్చి యాతనిపార్శ్వమున నిలుచుండెను. వాని ముఖ మావలోకించుట కసాధ్యముగనుండెను. కడు వింతయగు ముఖవర్మ మొకటి యాసహజాకారమును మాఱుపఱచెను. అది చూచుట

కెంతయో భయంకరముగ నుండెను. చిత్రితములై యుండు నావిశాల నేత్రము లతివికారముగ నుండి మిగుల భయమును కలిగించుచుండెను. నిశాతోత్కటదంష్ట్రలు రాక్షసరూపమును ధిక్కరించుచుండెను. ఆనందుఁ డదియొక వేష మని నిశ్చయించి యాభీషణసందర్శనముచే నధైర్యుఁడు కాలేదు. వాని నెగాదిగ చూచుచు "ఓరీ! నీవెవ్వఁడవు?" అనెను.

పురు : సర్వమంగళుని సేవకుఁడను.

ఆనం : నీకిచ్చట నేపని యున్నది?

పురు : నీకాతనిరాక నెఱింగింపవలయు నని వచ్చితిని.

ఆనం : నీవికారరూప మేమి? ఈరీతి వచ్చుటలో నీయభిప్రాయ మేమి?

పురుషుఁడు మాటాడలేదు. కను బింతగ గర్జించెను. తోడనే యాదాపుననుండి యిరువురు మనుష్యు లొక్కపరుగున వచ్చి యానందుని మ్రోల నిలుచుండిరి. అందులో నొకఁడు కరాళుఁడు. రెండవ వాఁడు మన కపరిచితుఁడు. ప్రాయశః రామనాథుఁడన్నట్లు ఘూర్జర దేశవాసి కావచ్చును. వారిహస్తములందు నిశితకృపాణము లాతారక ప్రభయందు మిలమిల మెఱసిపోవుచుండెను. నేత్రము లుల్కలువోలె మెఱయుచు ధైర్యమును నశింపఁజేయుచుండెను. ఆనందుఁ డీభయంకర దృశ్యములఁ గాంచి చీత్కారముఁ గావించి వెనుకకుఁ దూలినిలుచుం డెను. కాని, ధైర్యము వీడలేదు. అతఁ డామొదటి వానిని గాంచి "ఓరీ! సర్వమంగళుఁ డెచ్చట? నాకు వ్రాసియుండినకాగితమున కర్థమేమి?" యనెను.

పురు : ఇదిగో, ఈతఁడే సర్వమంగళుఁడు. ఈతఁడు మేము నీకు మీమామను చూపించెదము" అని చెప్పుచు కరాళుని జూపించెను.

ఆనందునకు వానిపరిచయము లేదు. ఆ హాస్యోక్తులఁ గాంచి యాతఁడు సహింపనేరఁడయ్యెను. రవీంద్రుఁడు చెప్పినట్లని మోసగనియు, వారే హంతకు లనియు నాతనికి బాగుగ తెలిసిపోయెను. తోడనే యానందుఁ డాగ్రహాపూరితమానసుఁడై "పాపులారా! మీ రెవ్వరో ద్రోహులవలెఁ గాన్పించుచున్నారు. ఇప్పటికి రప్పించుటలో మీ యుద్దేశమేమి చెప్పుదురా లేదా?" అని గర్జించి మాటాడెను. వికృతాకారమున నున్నవాఁ డట్టహాసము గావించుచు ముఖభద్రమును తీసివైచెను. వాఁడు తారసింహుఁడే!! మున్నతయు మొక్కచో చేరి నేఁ డానందు నేమి చేయనెంచిరో దైవమున కెఱుక. వారు మువ్వు రొక్కమొగిని వచ్చి యానందుని పరివేష్టించి నిలుచుండిరి. వారికరములందలి కరవాలము లతిభయంకర కాంతు లీనుచుండెను. ఆనందుఁ డది యంతయుఁ గాంచి భ్రమించి భయాతిరేకమున నివ్వెఱ పడి నిలుచుండెను.

తార: ఆనందా! మమ్ము నీవిదివఱ కెఱిఁగియుండలేదు కాఁబోలు, మీ మామను పొట్టయుం దుంచుకొనఁబోవు క్రూరమృగములని తెలిసికొనఁజాలవైతివి కాఁబోలు.

ఆనం: ఏమి! ఏమనుచుంటివి! నా మామను పొట్టయుం దుంచుకొనఁ బోయెదవా! ఆతఁ డింకను మరణింపలేదా?

తార: లేదు. ఇంకను లేదు. అయిన నేమి ప్రయోజనము! నీవిపుడు ముందుగ స్వర్గమున కేగి బస చేసి యుండినపిదప నాతఁడును వచ్చును.

ఆనందునకు వానిమాట లర్థము కాకుండెను. హంతకుఁ డారీతి తన మామఁ గూడ కేశవచంద్రుఁడు కాఁడని చెప్పుచుండుటచే నప్పు డాతని హృదయరంగమున సత్యాసత్యములకు బలమగు పోరాటము కలిగెను. తారసింహుఁ డనుమాటలు నిజమగునా! కేశవుఁ డింకను

జీవములలో నుండు ... తుద కెటు ... యెను.
వారేకారణమునో ... పుండెనని ... తలంచెను.
మరల తారసింహుండ ... ఇట్లనియె

తార : ఆనంద ... వెంబడైన మూ ... లేవా ?

ఆనం : లేరు ... వ్వరో ... తెలియదు. అది యుండనీ. నన్నీరీతి ... లకు రప్పించుట ... కారణమేమి ?

కరా : కారణ ... యుంటివా ? ... బయట లేదా యీ ఖడ్గము ? నీ రక్త ... తన తృష్ణను దీర్చుకొనం దలంచినది.

ఆనం : అయిన నన్ను సంహరింతురా ? ఏల ?

తార : కారణము మాకు తెలియదు. చంపవలసివచ్చినది కావున చంపెదము. నీకిప్పుడు దిక్కెవ్వరో చెప్పుము. నీ రవీంద్రుండు డెచ్చట నున్నాడు ? నీపని ముగిసినపిదప వానిపనిపట్టెదను.

ఆనందున కేమి చెప్పుటకు నోరాడకుండెను. తారసింహుండొకవైపునను, కరాళుండొకప్రక్కను ఖడ్గముల ఝళిపించుచుండిరి. ఆతనిని నొక్కవేటున శకలరూపముగ మార్చవలయునని యుండిరి. ఇంతలో నాకస్మికముగ నా నాటకభవన పరోక్షభాగమునుండి యా నిశ్శబ్దవాయుతరంగములందొక శ్రావ్యగీతాలాపన బయలుదేరి వారి నెల్లరిని స్తంభీభూతులఁ గావించెను. హంతకులకది బోధపడదయ్యెను. ఆ నిర్జన నిశీథకాలమున నారీతి పాడువా రెవ్వరని యోచించుచుండిరి. ఆనందుఁడు మాత్రము గ్రహించెను అది రవీంద్రుని కంఠస్వనాదమే. తక్కిన వారివలె నాతఁడు చిత్తభ్రమ నొందలేదు.

అంతలో గాన మాగిపోయెను. నల్దిశలందు నెప్పటిగాఢతరంబగు నిశ్శబ్దము చిందులు ద్రొక్క మొదలిడెను. తారసింహాదిహంతక వర్గమున కేది బోధపడకుండెను. తోడనే యాతఁడు కరాళుని దాపునకుఁ

జేరఁబిలిచి యది యేమో యెఱిఁగిరమ్మని రహస్యముగఁ జెప్పి పంపెను. కరాళుఁడు మార్జాలమురీతి భూతముపై నక్కుచు తిన్నగ నాదిశ కేఁగెను. ఆమందిరము వెనుక భాగమునకు వాఁడు పోవుచుండుటనుగాంచి తారసింహుఁడు తదేకదృష్టితో నాదిశను వీక్షించుచుండెను. అందెవఁడో ఒక్క ముచ్చుఁడుండునని వానిభావన. కొన్నినిముషములుగడచెను. కరాళుఁ డింకను రాఁడయ్యెను. అంతకాల మాతఁ డందేమి చేయుచుండెను ! ఏదియో దబ్బున సద్దు వినఁబడుటచే తారసింహుఁడు విభ్రాంతుఁడై యూరక చూడ మొదలిడెను ఆతనికిప్పు డనుమానము జనించుచుండెను. రవీంద్రాదు లిదివఱ కందుండి రని వాఁడు దలంచి యుండలేదు. వారేమైన నిప్పు డచట దాఁగి యున్నారేమో యని సందియమగుటచే నాసమయమున నూహాపరంపరలు వానిమనోవీథియందు పరుగిడిపోయెను. చాలకాల మాయెను. కరాళుఁడు రాలేదు.

శ్రావ్యగీతామాధుర్యము మరల వినఁబడుచున్నది. అది యిప్పుడు నాటకశాలనుండియే వినవచ్చుచుండెను. ఆ మొదటిరాగమే—మొదటికంఠమే. తారసింహున కేమిచేయుటకును దోఁపదయ్యెను. ఆతనియనుమానము బలపడిపోవుచుండెను. ఒకమాఱించుక రోషసంచలుఁడై యతిగభీరముగ "ఎవరాపంద పాటపాడునది ?" అని కేకవైచెను. సంగీతము నిలిచిపోయెను. అంతియే తారసింహునిప్రశ్నకుత్తరము, మఱెట్టిమాటలును వెలువడలేదు. తోడనే తారసింహుఁడు దండతాడితభుజంగమురీతి రోఁజుచు నాఘూర్జరుని గాంచి "ఓరీ ! మండలా ! తిన్నగ నాగోడ దూఁకి పోయి లోపల నుండువా రెవ్వరో కనుఁగొని రమ్ము" అనెను.

మండ : అయ్యా ! కరాళుఁ డింకను రాలేదు. అదేమో తెలియకున్నది.

తార : వానితల, నీవ్రు పొమ్ము. ఆదురాత్ము లెవరో చూచి రమ్ము.

మండలుఁడు కత్తిని సవరించుకొనుచు దొక్కుచుచుటున నా భవనద్వారమును దాసి చూచెను. అది తాళము వైవఁబడి యుండెను. అప్పుడు వాఁడు చుట్టును పరికించి చూచి యెందును మార్గమును గానక యామందిరము వెనుకకు పోయెను వాఁడు చేయుచుండిన చేష్టల నన్నిటిని తారసింహుఁ డున్నతావునుండియే గమనించుచుండెను. మరల నేదియో శబ్దము—కొన్నినిముషములు దాఁటిపోయినను మండలుఁడు మరలి రాఁడయ్యెను. ఎట్టిమాటలును వినఁబడలేదు. వాఁడుమాత్ర మెందేఁగియుండును ? తారసింహుఁ డెలుఁగెత్తి యొకమాఱు "మండలా ! కరాళా !" అని పిలిచెను. వారు మాటాడలేదు. నిరుత్తరుఁడైన తారసింహునిహృదయము మిప్పు డతివేగముగ కొట్టుకొనుచుండెను. ప్రబల మగుననుమానముచే వాఁ డొకమాఱు తీక్ష్ణముగ నానందుని ముఖమువైపు చూచి "దురాత్మా ! నీవెంట నెవరిని తెచ్చుకొని యుంటివి ?" అనెను.

ఆనం : కాగితమున నీవు నాకొరులను దెచ్చుకొనునట్లు వ్రాసి యుండలేదు. నీనమ్మకముపై నాధారపడి యొంటిగ వచ్చితిని. కాని నీవీరీతి మోసగింతు వని తెలిసియుండిన తగినజాగరూకతతో నుండి యుందును. ఈసమయమున దైవమే నాకుఁ దోడు.

తారసింహుఁడు మాటాడక యేమిచేయుటకును దోఁపక య్యాప్పడి యుండెను. అప్పు డానిశ్శబ్దవాయుగోళమున ఛేదించుకొని యానృత్యమండపమధ్యభాగమునుండి యీరీతిగ నొకగంభీరధ్వని వినవచ్చెను. "దిక్కులేనివారికి దేవుఁడే దిక్కు—పాపమునకు శిక్ష." తారసింహుని కిప్పుడు చాలవఱకుఁ దెల్లమైపోయెను. అది రవీంద్రుని కంఠస్వర మని

గుర్తించెను. తోడనే వానిగుండె ప్రీలినట్లయ్యెను. భయోత్పాతమున నా పాదమస్తకము చలించిపోయెను. శరీరమున రోమాంచలము లెగసి కన్నుల మబ్బులు కలుగఁజేసెను. వాని కాసమయమున నేమి చేయుటకును దోఁపదయ్యెను. కరాళమండలుల నేదియోవిధముగ మోసగించి రవీంద్రుఁడు వానిని పట్టియుండునని నిశ్చయించెను. ఇప్పు డాతఁ డొంటిగ వచ్చియుండఁడు. తగినపరివారము వెంట నుండును. ఎదురు చిక్కి నురిగిపోవుటకు వీలుండదు. తారసింహుఁ డింతయు నొక్కక్షణకాలమున యోజించుకొని పలాయితుఁడై పోవ నిశ్చయించి కాలు కదిపెను. ఆ క్షణముననే పిడుగులరీతి రామనాథుఁ డొక వైపునుండి, కుశాలవుఁ డొకదిక్కునుండి యెగిరి వచ్చి వానిహస్త ద్వయము గట్టిగ పట్టుకొనిరి. రవీంద్రుఁ డొక్కయుదుటున పరుగిడి వచ్చి తారసింహుని చేతినుండి తరవారి నూడఁదీసి పాఱవైచి భయంకరముగ నొకయట్టహాసమును చేసెను. ఇంతయుఁ గాంచుటచే తారసింహుని హృదయపుటభేదనము గావించుకొని ప్రాణవాయువు లెగసిపోయినట్లయ్యెను !!!

తారసింహునిస్థితి యవాచ్యము. వానిముఖము వివర్ణమై పోయెను. కాలుసేతులు గడగడ వడఁకెను. అప్రయత్నముగ వాఁ డొక మాట " ర—వీం—ద్రా ! " అనెను. రవీంద్రుని పరిహాస మానిశ్చల ప్రపంచమున దిగంతరాళములవఱకు వినఁబడుచుండెను.

రవీం : తారసింహా ! భూతనాథులను బంధించు నీ పిశాచమును కన్నారఁ గాంచితివా ! పాపకార్యము లెన్నిదినములో రహస్యముగ నుండవు. సర్వజీవదయాంతఃకరణుఁ డగుపరమేశ్వరుఁ డెప్పుడో యొక రూపమున దుష్టశిక్షణ శిష్టపరిపాలనములఁ జేయుచుండును.

తారసింహున కేమిచెప్పుటకును దోఁచలేదు. తన కిఁక కాలు సేతులాడకుండునటుల తను బంధించి న్యాయస్థానమునకుఁ గొంపోదు రని తెలిసికొనెను తనకు నాఁటితో నిహఋణము తీరినదని గ్రహించి భీతిలిన నిఁక ప్రయోజనము లేదని తుదకు గద్గదికుఁడై యిట్లు చెప్పఁ దొడఁగెను.

"రవీంద్రా! దైవము ప్రతికూలించినపుడు జను లేమిచేయఁ గలరు? ఈ పాప ప్రపంచమున మానవసంతతి యనేకదురాశలకు లోనై యవాచ్యము లగు హేయకార్యము లెన్నియోని చేయుచుందురు. తుద కందు కనువగుశాస్తి నొందును. వారికి పాపమునకుఁ బరిణామ ముండునని తెలియును. తెలిసియు గోతిలోఁబడుదురు. జరిగినన్నిదినము లద్వితీయులమని విఱ్ఱవీఁగి తుదకధఃపతితులై — నిరాశాపూరితులై — ఇహపరదూషితులై పోదురు. ఇది సర్వజనసమ్మతంబగు ధర్మము. ఇందుకు నేను తార్కాణము. గొప్పధనాశకు పాలై యీరీతి వాసస్థల మగుకాశిని వదలివచ్చి ప్రవాహుని దుష్కార్యములకు బాసటగ మెలఁగి తుదకీగతికిఁ జిక్కితిని. నేను హంతకుఁడను — చోరుఁడను — మహా పాతకిని. నన్నిఁక మననీయువని నాకుఁ దెలియును. అయినను చింతింపను. ఇది నా పాపఫలము — పరిణామము — శిక్ష — అవస్థితి.

రవీం: తారసింహా! నీవన్నట్లిఁక మీఁద నీ పాపమునకుఁ బరిణామమును గాంతువు. అది దైవనిర్దిష్టము. నీవు కాశిని వదలివచ్చి ప్రవాహునికి బాసటగ నుండుటకుఁ గారణ మేమి? ఇఁక నీవెట్టును తప్పించుకొని పోనేరవు. మాచేఁజిక్కితివి. ఇప్పుడైన బొంకక నీపూర్వ చర్యలఁ దలంచి పశ్చాత్తాప మొంది నిజమును చెప్పుము.

తార: నేనిఁక ననృతమాడి యెవరి నుద్ధరింపవలయును! నా స్నేహితు లెల్లను నావలెనే బంధింపఁబడిరి కాదా!

రవీం : అవును. కరాళుని, మండలుని, బంధించి యట నుంచి వచ్చినాను. నేను పాట పాడుసమయమున నీవు వారి నంపుటయు వారు వచ్చుటయు, నేనచ్చటనుండి గమనించుచుంటిని. వారచటికి వచ్చిన తోడనే యేమఱుపాటున నొక్కొక్కని గిక్కురుమనకుండఁ దలపై మోఁది క్రిందికిగెడపి మూర్ఛిలఁజేసితిని. అప్పుడే నోట గుడ్డలఁ గ్రుక్కి కాలుసేతులు బంధించివైచితిని.

తార : రవీంద్రా! నీవు సాధారణపత్తేదారుఁడవు గావు. నేనిది వఱకు నాయూర నున్నపు డిట్టినేరములలో నీయట్టియుద్యోగుల నొక రిద్దఱిని పొట్టనుంచుకొన్న రాక్షసుఁడను. నిన్నుందఱివలెఁ దలఁచి యుంటిని. కాని, నేఁటికి నా పరిణామము నీమూలముననే గాన్పించినది. నా చరిత్రను రెండుమాటలలోఁ జెప్పెదను. ప్రవాళుఁడు శాంతినాథుని యాస్తినంతటిని నపహరింపదలఁచి యందుకుఁ గలయుత్తరాధికారు లందఱిని సంహరింప నెంచియుండుటచే నాకావార్తను తెలియబఱచి నాసాహాయ్యమును కోరెను. నేనును కరాళుఁడును వచ్చి పానిపనులలోఁ జాలవఱకుఁ బనిచేసితిమి. ఏమిచేసి యేమిప్రయోజనము. మా ప్రయత్నము లొక్కటియును సాగలేదు. మాదురదృష్టవశమున నీమూలమున సర్వనాశన మైపోయెను.

రవీం : తారసింహా! నీవు, ప్రవాళుఁడు గతించిపోయినపిదపనైన నేల యీఘోరకార్యములను వదలి యుండవైతివి ? పట్టుదలతో నింతదూరము పనిచేయుటకుఁ గారణమేమి ?

తార : ప్రవాళుఁడు నేఁటిమధ్యాహ్నమునకదా చనిపోయెను. నిన్నటివఱకు జీవించియే యుండెను. రవీంద్రా! నాకొక్కటియుఁ దెలియదని నీవు భావించినను సర్వము నాకుఁ దెలియును. నీవు క్షణక్షణము నం దెచ్చటెచ్చట నుండునది, యెట్టియనుసంధానకార్యములఁ గావించు చుండునది నాకు బాగుగఁ దెలియును. కాని, నేఁడుమాత్ర మించు

కప్రమత్తుఁడనై యుంటిని. అందుచే నీకొఱకు పట్టినది తలఁచుకున్న నీవెంతటి యద్వితీయుఁడవైన నేమి నన్ను పట్టియుంచ వేసినవు నా మృత్యువును నేను చేరఁబిలిచికొన్నట్లీయూనందున కారీతి వాఁగ్మము వ్రాయుట తప్పు.

రవీం : అది యుండని. మొన్నటిదినమున నీవారీతి భూతరూపమున వచ్చి యంతపని చేసిపోవుటలో నీయుద్దేశమేమి ?

తార : మిమ్ము జడిపించుటకు.

రవీం : ఆరాత్రి కేశవపాలు నెందు దాచితివి ?

తార : విభీతమందిరమున—

రవీం : అతఁడు జీవముతో నున్నాఁడా ?

తార : రవీంద్రా ! అతఁడు, శాంతినాథుఁడు ఇరువురును జీవించియే యున్నారు. కేశవపాలుని యనంతర మాతని యాస్తివిషయమై యీయానందుఁ డేమైన చర్య పుట్టుకొనునేమో యనిభీతిచే మొదట వీనిని ఖండింతమని యీదివరకు మీకారీతి చెప్పించితిమి. ఈతనిని హత్యగావించినపిదప నింటికిఁ బోయి వారిరువురకుసహితము మీగతినే పట్టింతమని యెంచియుంటిమి. కాని యాపని యొక్కటియు సాగలేదు. నీవు సమయమున కడ్డుగాకుండ నుండిన యీరాత్రి మీయుప్రాణము లవలీలగ నంతకునిపట్టణమున కేఁగియుండును.

వీరిసంభాషణ నాలకించుచు నానందుఁ డబ్బుర మొంది నిలుచుండెను. వారు కేశవపాలుఁ డింకను బ్రాణములతో నున్నట్లు మాటాడుకొనుచుండిరి. అతని కామాట లర్థము కాకుండెను. ఇదివఱలోఁ జనిపోయినమామగా రేరీతి పునర్జీవితు లైరని యోజించుచుండెను అతఁడు గతించెననికదా రవీంద్రాదు లింతటి సాహసకార్యములఁ జేసిరి !

ఆనందుఁ డాశ్చర్యచకితుండై "అయ్యా! రవీంద్రా! మామామ జీవించి యున్నాఁడా! నిక్కముగ చెప్పుము," అనెను. రవీంద్రుఁడు "ఇప్పు డామాట నడుగవలదు. సమయోచితముగ సంగతుల నెఱింగింతును." అనెను. ఆనందున కేమిచెప్పుటకుఁ దోఁచకుండెను. మునుపటివలెనే యా మనోవీథియం దసంఖ్యాకంబులగు భావశకటములు పరుగులిడుచుండెను.

# ఇరువదియవ ప్రకరణము

పరిణామము

రవీం: తారసింహా!
నిన్నిపుడొక హత్యాపరాధముపై బంధించెదము.

తార: హత్యాపరాధమా! నే నెవ్వరిని గడతేర్చితిని?

రవీం: నీకుఁ దెలియదా? ఈ మరణకాలమున నసత్యమాడి యింకను నెక్కువగఁ బాపోపార్జనఁ గావింపకుము.

తార: నేను హంతకుఁడనని నీకెవరు చెప్పిరి?

రవీం: చంపఁబడినవ్యక్తి.

తార: ఆ వ్యక్తి యెవరు?

రవీం: అమల.

తారసింహుఁడు నిరుత్తరుఁడై కన్నులు మూసికొనెను. తన రహస్యమంతయు బయలుపడిపోయినది. రవీంద్రుఁ డంతటిని తెలిసికొనియే యున్నాఁడు. అతనికిఁ దెలియని దొక్కటియును లేదు. ఇఁక దాచుటవలనఁ బ్రయోజనము లేదు. అప్పుడు తారసింహు డిట్లనెను.

తార: రవీంద్రా! నేనిఁక నొక్కటియును దాఁచియుంచుటచే నుపయోగ ముండదు. నేను హంతకుఁడ నగుట యథార్థము. అమల నాచే భయితపురమునఁ జంపఁబడెను.

రవీం : ఏల ? ఆమె నారీతి కడతేర్చుటవలన నీకేమి ప్రయోజనము ?

తార : ఆమె నీకాకారణమును జెప్పలేదా ?

రవీం : నీవామెను బెండ్లిచేసికొన యత్నించినందు కాసాధ్వి నిరసించి మాటాడుటచే కినిసి చంపితివఁట.

తార : అంతయుఁ దెలిసినది కాదా ? ఇఁక నన్నడుగుటేల ?

రవీం : కరాళుఁడుసహిత మొకహంతకుఁడే కదా ?

తార : వాఁ డెవ్వరిని సంహరించె నని తెలిసికొంటివి ?

రవీం : సుశీలను.

తార : అవును. ఆమాట నిజము. ఈసంగతి యంతయు నమల చెప్పెను కాఁబోలు. ఆరాకాసి యమ్మ మోసగించెను. ఆనము యమున నాపిశాచిప్రాణములను సంపూర్తిగఁ దీసివేయకుండుట నా తప్పు.

రవీం : అయిన నీయుండలుఁ డెవఁడు ?

తార : నేఁ డానందుని చంపయత్నించుటచేఁ మాకుఁ జేదోడుగా నుండుటకు వానిని బిలుచుకొని వచ్చియుంటిమి. వాని దీయూరు. ఈరాత్రియే వానిపరిచయము మాకబ్బినది.

రవీం : తారసింహా ! మఱియొక మాట. భూతగృహమున దారుపేటికలో నుంపఁబడినశిథిలశవ మెవ్వరిదో నీకుఁ దెలియునా ?

తార : రవీంద్రా ! నానోటినుండి యన్నిరహస్యములను విన వలయు నని ప్రయత్నించుచున్నావు. అట్లని నేనేమియు దాఁచుట లేదు. నాయువసానసమయమున నిక్కముగ నీకలుషహృదయ మాద్యంతము పరితాపపూరితమై దహింపఁబడుచున్నది. అందుచే నొక్కరహస్యమునైన నేదాఁచుచుండుట లేదు. అడుగుము. అంతయు

గొనిపోవుచున్నాఁడని గ్రహించిరి. వారికరపాదములు దృఢముగ బంధింపఁబడి నోట గుడ్డలు క్రుక్కఁబడి యుండుటచే లేచుటకుఁగాని, మాటాడుటకుఁ గాని యవకాశము లేకుండెను. వారు నంతట తాముత్త యమలోకయాత్రకు తగినసన్నాహములఁ జేసికొన సిద్ధమైరి. ఇంతలో రవీంద్రాదులు శూరసింహుని బంధించి తీసికొని ఆ తావునకు వచ్చిరి. వారిని గాంచినతోడనే కరాళుని ప్రాణములు మీఁది కెగిరి పోయినట్లయ్యెను. మండలుఁడు నిశ్చేష్టితుఁడై పోయెను.

తామిఁక కెట్టును తప్పి బ్రదికిపోఁజాలమని యధైర్య మొదవఁగనే కరాళమండలులు తమతమ నేరముల నొప్పుకొనిరి. సుశీలను చంపిన నేరముపై కరాళుఁడు బంధింపఁబడెను. దురాత్ములకు —కాదుకాదు— హంతకులకు— కించిద్ద్రవ్యాభిలాషచే సాయ మొనరింపవచ్చియుండిన మండలుఁడుకూడ నొకబందీగఁ జేకొనఁబడెను. రవీంద్రుఁడు డప్పు డానందుని గాంచి "అయ్యా! ఆనందా! చూచితివికదా నేఁటికి మా కష్టములు ఫలించిపోయినవి. హంతకులు పట్టువడిరి, కొలఁదికాలము నుండి విశేషశ్రమ కోర్చిన మా మానసములు నేఁటికి స్వస్థత నొంది స్వకార్య జయమును గాంచి పరమోత్సాహము నొందుచున్నవి. అయిన నేను ప్రయత్నించినయత్న మంతయు నాకుఁదెలియక వేఱొకవిధముగ సఫలీకృత మయ్యెను. మొదట కలకత్తాయందు నేఁగాంచినశవము మీ మామగారిదని నీవు నమ్మఁబలుకుటచే నేనది విశ్వసించి యా హత్యాపరాధకులకై యనుసంధానము గావించితిని. కాని, మీశ్వశురుఁ డింకను జీవములతో నున్నాఁడు. అతఁడు చంపఁ బడలేదు. నృశంసుల చేతఁ బడి గుప్తముగ దాఁచఁబడియుండెను. అందులకుఁ గారణము రేపటిదినము న్యాయస్థానమున వెల్లడి యగును. అయిన న్యాపేత మెవ్వరిదో నాకింకను తెలియరాదయ్యెను. నేఁటినుండి

మరల నా రహస్యాన్వేషణకార్యార్థినై పాటుపడవలసియుందును. నేను ప్రథమమున కలకత్తానగరమునందు గావించినప్రతిన నెఱవేఱదయ్యెను. ఏమైన నేమి, నా కష్టము పలుముఖములుగ ఫలించి పలువురకమందానంద మొసగుటచే నేను ధన్యుఁడనైతిని" అనెను. కేశవపాలుఁడింకను ప్రాణములతో నుండెనని రవీంద్రుఁ డారీతి చెప్ప విని యానందసాగరుఁ డనంతాశ్చర్యానందసాగరనిమగ్నుఁడై పోయెను. తన్ను తానే మఱచిపోయి వివశుఁ డగుచుండెను. ఇంతటి యపారసమ్మదసందేశము తెలియవచ్చునని యాతఁడు స్వప్నమందైన తలంచియుండలేదు. ఆకస్మికముగ చచ్చిన వారు బ్రతికి మొదట ప్రాణములతో లేచి వచ్చిన ట్లైనది. ఆతని హృదయభావము నా సమయమున నెవ్వరు వర్ణింపఁగలరు ! నోట మాటలు వెలువడనంతటి యాశ్చర్యము ! హృదయకుహరము ప్రేలునంతటి ప్రమోదాతిశయము !! దేహమును మఱపించునంతటికృతజ్ఞత !!!

రామ : అయ్యా ! ఆనందా ! నీవు ధన్యాత్ముఁడవు. పోయిన మామ బ్రతికివచ్చినట్లయినది.

ఆనం : నేనేమని మాటాడవలయునో నాకుఁ దోఁచకున్నది. అయ్యలారా ! నాయందకారణప్రేమచే నీరీతి చనుదెంచి యపార దుస్స్థితులకు పాలై, కేవల కీర్తిప్రతిష్ఠలకై పాటుపడు మీమహాను భావత్వము నేమని కొనియాడుదును ! నా హృదయగతభావజాలము సరిగ విప్పి చెప్పఁజాల. మీరీరీతి వెదకి కనుఁగొనకున్న నిక్కముగ నీ నీచులు మా మయ్యను చంపి మా వంశము నార్పుచుండిరి. అయిన భగవంతుఁడు సకాలమున భద్రరూపములతో చనుదెంచి మాగండముఁ బాపదోలెను. నేనామరణాంతము మీకుఁ గృతజ్ఞుఁడ— మీ యాజ్ఞానుసార వర్తనుఁడను.

అని యానందముతో బ్రమదాశ్రువుల గాల్చుచు తనయానందమును పలుతెఱంగుల వెలిబుచ్చెను. రవీంద్రుఁడు నాతనిసద్గుణపుంజమును శ్లాఘించి రామనాథునితో నిట్లనెను. "అన్నా! రామనాథా! నేను నీవు సమయమునకీకుశాలవునితో నిటకరుదెంచుటచే నాకు వీరిని బంధించుట కవ సులభమయ్యెను. లేకున్న నేనొకఁడ నింతపనిని చేసి యుండనోప. మీసాహసములు నాకమోఘముగ నుపకరించినవి. మన కష్టము లీదినమునకే యంతరించెనని నే దలంచుట లేదు. ఇఁక ముందు చేయుట కెన్నియో కార్యములు కలవు. వానిగుఱించి సావకాశముగ నింటఁ గూర్చుండి మాటాడుదము. ఈదుష్టత్రయమును మొదట చెఱసాల కీయానందకుశాలవులసాయముతోఁ గొనిపొమ్ము. నేను విభీతమందిరమున కేఁగి శాంతినాథకేశవపాలులను దోడ్కొనివచ్చెదను. జాగ్రత్తగ వీరిని కారాగృహమున బంధింపుము. నేనిప్పుడే వచ్చెదను" రామనాథుఁడు "సరి" యనుచు వెంటనే యాబంధీలను మువ్వురను నీవలకుఁ దోడ్కొనిపోయెను. రవీంద్రుఁడు వారిని జాగ్రత్తకై హెచ్చరించి విభీతమందిరాభిముఖుఁడై వెడలిపోయెను. అపరాధులు మువ్వురును తోడనే యాచెఱలోనికిఁ గొంపోఁబడిరి.

మఱునాఁటి ప్రభాతసమయమున రవీంద్రుఁడు సోమనాథునితో మాటాడుటకై చెఱసాల కరుదెంచెను. ఆమందభాగ్యున కప్పుడే తారసింహాదుల దుస్స్థితివిషయమై తెలిసియుండుటచే రవీంద్రునిదర్శనమాత్రమునఁ దనభావ్యదవస్థ యంతయు గన్నులకుఁ గట్టినట్లు గోచరించెను. తనకిష్టమగు బొంకుటకైన నవకాశము లేదనియు సరోజినీమోహనచంద్రులను బంధించుటకు కారణ మేమని యడిగిన తనయుదంతంబు నంతటిని చెప్పవలసివచ్చు ననియు నది విన్న సర్కారువారు తనకు కఠినశిక్షలను విధింపక మానరనియు తలఁచి భయభ్రాంతుఁ డయ్యెను. తనబోఁటిపాతకులెల్ల తుద కీవిధముగనే పాపపరిణామము గాన్పింప

నశించిపోదురని యాతని కన్నులు మిగుల పశ్చాత్తాప మొందెను. ఇంతలో రవీంద్రుఁ డాతని మోల నిలుచుండి "సోమనాథా! నీవు సరోజినీ మోహనచంద్రులను నీయింటఁ బంధములకుఁ గారణ మేమి?" యని యడిగెను. సోమనాథున కేమి చెప్పుటకును దోఁచలేదు. అధర స్పందన గావించి యేదియో చెప్పఁబోయెను. కాని నోరాడకుండెను. రామనాథుఁ డొకవైపునను సరోజిని యొకవైపునను నిలుచుండి యుండుటను గాంచఁగనే యాతని ప్రాణానిల మధఃపతితమైపోయినట్లు తోఁచుచుండెను. ముఖము కళావిహీనత నొంది శవాకారము నొందెను. శరీర మాద్యంతము ప్రకంపితమై నేల కొఱగునట్లుండెను. ఆసమయమున నాకస్మికముగ నాగదిలోని కొకయౌవనపురుషుఁడు శరవేగమున వచ్చి నిలుచుండెను. ఆతనిని రవీంద్రరామనాథు లెన్నఁడును గాంచియుండ లేదు. ఆవ్యక్తిముఖము సుందరచ్ఛాయ లీనుచున్నను కమలిపోయి యుండెను. గంభీరవదనమున శోకకోపసంతోషచ్ఛాయ లలముకొనెను. ధరించినవస్త్రములు మలినములై చుంగులు జీర్ణములై యుండెను. ఆతనిని గాంచిన యుత్తరక్షణముననే సరోజిని యున్మత్తహృదయముతో "అన్నా! శిరోభా! యని పరుగిడి వచ్చి కౌఁగిలించుకొనెను— అతఁడే శిరోభానామ్ప్రసాదుఁడు! మోహనచంద్రపుత్రుఁడు!!

పత్తేహాసన కిష్టుఁ డాతనివిషయము నంతయు బోధపడిపోయెను. నిన్నటిదినమున నామె రామనాథునితో తనకుటుంబవార్తలను దెలుపు నపుడు తనసహోదరునివిషయము చెప్పియుండెను. అతఁడే యామె యగ్రజుఁ డని నిశ్చయించి యాతని నిర్నిక్షితదర్శనమున కచ్చెరువొం దెను. సకాలమున నాతఁడు విచ్చేయుటచే రవీంద్రునకు మిగుల నుప యోగకరముగ నుండెను. సోమనాథున కిఁక బొంకుటకవకాశము లేక పోయినది. ఉన్నస్వల్పధీరతయు నశించిపోయెను. అప్పుడు రవీంద్రుఁడు

వినోదునిఁగాంచి యిట్లనెను. "అయ్యా! మీ విషయమంతయు మాకుఁ దెలిసినది. ఈ సరోజినిని మీ జనకుని ఈ దురాత్ముఁడగు సోమనాథుఁడు బంధించి యుండఁగ నీవు కొన్నిదినములక్రింద విడిపించి మా యింటనే యుంచుకొని యున్నావు. ఈతఁడే కారణమున నీరీతి దుష్కార్యమును గావించెనో మాకు తెలియకున్నది. సమయోచితంబగు మీ యాగమన మెంతయు నుపకారకమై యున్నది."

వినో: అయ్యా! ఇంతటి నిష్కారణ ప్రేమాపలంబులై యింతటి మహోపకారకారమును గావించిన మీ రెవ్వరై యున్నది నాకు నేఁడానందసాగరుని మూలమున తెలిసిపోయినది. మేము బాల్యమిత్రులము. ఈ దుర్జాతి యగు సోమనాథుఁడు మా పితృవ్యుఁడని తెలిపికొనుటకు నాకెంతయు సిగ్గు వొడముచున్నది. ఈతఁడు మాయింట నేడెనిమిది మాసములక్రింద చౌర్యమును గావించి నా సోదరీజనకులను చెఱగొనివచ్చుట నాకు తెలిసినవిషయమే. నేనప్పుడాయుపద్రవమునుండి తప్పించుకొని పోయిన నాఁటినుండి యీతనిపై పగబూని తిరుగుచు యుక్తసమయమునకై వేచియుంటిని. నా దేశాటనములో నీదుష్కాలమున నేననేకులను వీరివిషయమై విచారించి తుదకు వీరియాగడ గానక హతాశుఁడనై పోయియుంటిని. కాని నిన్నటిరేయి నేనాకస్మికముగ నీయూరి కరుదెంచి యానందసాగరుని జూచుట తటస్థింప నాతఁడు సంభాషణ సందర్భమున మీ విషయమును చెప్పి మీ యెడ నొకమూగయు బాలికయు నుండునట్లు చెప్పెను. వెంటనే నే నీస్థలమున కరుదెంచి చూడ నానేత్రానందకరములగు ప్రదర్శనములఁ గాంచి కృతార్థుఁడనైతిని. మీ యుపకారములను వేయిజన్మములెత్తినను దీర్పనేరము. మీరు మాపాలిటి భాగ్యదేవతలని నమ్ముచుంటిని.

రవీం : శిరోభాగా [illegible] ప్రభూ! ఇట్టి యాగ్రహింపు మాటలు [illegible] వింపుము ఈ భాగ్యశాలి [illegible] నిట్టి [illegible] [illegible] జరిగిపోవు [illegible] కారు [illegible]. కాని [illegible] ప్రస్తుత మీరా సోమనాథుడను వారిచే బంధింపబడి [illegible] నిర్దేశింపఁ బడినారు. ఈ [illegible] ప్రస్తుతము మాకు తెలియఁ బరచిన బాగుండును.

సోమ : అయ్యా! రవీంద్రా! నా విషయమై యిఁక నావిరోబు నేమి ప్రశ్నించెదవు? నా పాపము ఫలించినది. ఆ ఫలమును నేననుభ వింపక తీరదు. నాకిఁ కొట్టను నీ మూలముగ కఠినశిక్ష తప్పినది కాదు. ఆ సంగతిని నేనే తెలిపికొందును. అటుగుటు, ఏమి కావలెనో తెల్పెదను. నే నొక్కటియు దాచుట లేదు. సర్వమును నివేదించెదను.

రవీం : అయిన చెప్పుము. సరోజినీ మోహానచందులు నీ కేమి కావలయును?

సోమ : మోహానచందు నాకగ్రజుఁడు. సరోజిని యాతని తనయ.

రవీం : నీ ప్రియబంధుల నారీతి చెఱయుం దుంచి కారించుటలో నీ యుద్దేశ మేమి?

సోమ : రవీంద్రా! వినుము, చెప్పెదను, నా చరిత్రను సంపూర్ణముగ వినిపింతును. నేనును మోహానచందును సోదరులము. విరోబుఁడు సరోజిని మా యన్న బిడ్డలు. నాకాదినుండియు వివాహము కాలేదు. అందుచే నా భాగమునకు వచ్చిన మైదానములక్షలరూప్యము లను గొని కొంతకాలమువఱకు వ్యాపారార్థము తత్పహింగదూస్థానమున కేఁగితిని. పదిసంవత్సరము లగుసరికి నాకు విశేషనష్టము కలుగుటే గాక నా యాస్తి యంతయు నొకచిల్లిగవ్వయైనను లేకుంత

వెచ్చింపఁబడెను. ఇందులకుఁ గారణము నేను దుర్వ్యసనలోలుఁడనై తిరుగాడుచుంటయే. కడకు నేనా పాపపుపనుల మానుకొని కృష్ణనగరమున నున్నమా యన్నయగు మోహనచంద్రునియొద్దకు వెడలి యాతనితో నాస్థితినంతటిని దెలిపికొంటిని. కరుణామయుఁడును, భ్రాతృవాత్సల్యపూరితుఁడు నగునాతఁడు నాగతి నాలకించి శోకించి నాఁటినుండి నన్నుఁ దనయింటనే యుంచుకొని మఱియొకచోటికిఁ బోవలదని చెప్పెను. నేనందులకు సమ్మతించి యాతనివ్యాపారమునందు నేనును గలసి పని చేయుచుఁ గొంతకాలము గడపితిని. కాని, యగ్ని యెంతయు మూల్యవసనమున దాఁగియున్నను దానిగుణము వదలఁ జాలదు. నేను మహాపాతకిని— ఘోరవృశ్చికుఁడను. నాయంతర్గతగుణాదులు దెలిసియుండియు మా మోహనుఁడు నాకు తనయొద్ద తావొసంగెను. ఈకాలసర్పము నోడియుం దుంచుకొని పాలు పోయసాగెను. ఈవేమును కల్పతరువుగఁ జేయఁగోరి యమృతముంచి పెంచెను. కాని, అట్లు సిద్ధించునా? నేను దురాత్ముఁడనై నాయన్న చేయుచుండినసత్కార్యము నించుకైనఁ దలంపక కడకాతని యాస్తినంతటిని నేనే యపహరించి యనుభవింపవలయు నని యెంచితిని. ఇంటివా రందఱు నన్నుఁ బ్రేమించి గారవించుచున్నను నేనొకరినైనఁ బ్రేమించి యెఱుఁగ. నాది కఠినశిలాహృదయము. కడ కొకనాఁడు నాదురుద్దేశ మతీతమైపోవ మాతృశ్రీయగుమావదినెగారికి పాషాణ ప్రయోగము జేసి పరలోకయాత్ర కనిపితిని."

శోభనాథుఁ డీమాట లనుచుండఁగనే దాపుననుండినసరోజిని "హా! జననీ" యని యొక్కయార్తనాదమును గావించి శోభనునిహస్తములందు మూర్ఛిల్లిపోయెను. అప్పుడాతఁ డామెను రవీంద్రునియును మతిపై తనయంగవస్త్రమును బఱచి దానిపైఁ బరుండఁబెట్టి రామనాథునిసహాయముతో శైత్యోపచారములఁ జేయ నారంభించెను. పిదప దాసు మరల తనచరిత్ర నీరీతిఁ బ్రారంభించెను.

"పిదప నొకనాఁ డొకమూలికాప్రయోగమున మాయగ్రజునకు మాటలు పోవునట్లు చేసితిని. కడ కొకదినమున నేను కొందఱు హంతకులసహాయముతో నాయన్నను ఈసరోజినిని దెచ్చి చంద్రనగరున నొకయింటి నద్దెకుఁగొని యందు బంధించి యుంచితిని. విశోభుని నాదినమే పట్టవలయునని యత్నింప వాఁడు చిక్కక పరుగిడి పోయెను. నేను చంద్రనగరున నున్నన్నిదినములవఱకు నన్నెవ్వరు ననుమానింపలేదు. నేనొక పెద్దమనుష్యుఁడననియే యందఱు భావించియుండిరి. రవీంద్రా! మఱియొకసంగతిని జెప్ప మఱచితిని. నేనీయూరిలో కాపురమును జేయసమకట్టి రెండుమూఁడుసంవత్సరములు గావచ్చినవి. అప్పుడప్పుడు మాయన్నయొద్ద కేఁగుచు నాతనితో నేస్తము కలిగినవానివలె మెలఁగుచు దగినసమయమునకై వేచియుంటిని. కాని, యది యంతయు నేఁడెనిమిదిమాసములక్రిందట ననుకూలించెను. నేనాతని యాస్తినంతటిని గైకొన యత్నించుచుంటిని. మాయన్న కానిపింపకపోవుటవల్లను, ఆతనిబిడ్డలుసహిత మాతనివలెనే యదృశ్యులై పోవుటవల్లను సర్కారువా రనుమానించి వారికై యనేకస్థలములందు వెదకించిరి. కడకు వారీవిశోభారామప్రసాదుని కనుఁగొని యాతని కాయాస్తి సంతతి నిచ్చివేసినటుల వింటిని. ఇట్టిఘోరాచరణల గావించి యింతపాపములఁ జేసినను కడకునాకొకకాసైన దొరకలేదు. అందుచే నేఁగోపించి యేరీతిగనైన విశోభునిగూడ సంహరించిన బాగుండునని తలఁచి యొకమాఱు కరాళతారసింహుల కీయుదంతము నెఱింగించి యాతనిని గడతేర్చి రండని చెప్పి కృష్ణనగరున కనిపితిని. వారు ధనలోభులు కావున నేనిచ్చెదనన్నద్రవ్యమున కాశనొంది యచ్చటికే పోయి విచారింప నచట విశోభుఁడు లేనట్లు తెలియవచ్చినది. కాలక్రమమున వాఁడు తనతండ్రిని

సోదరిని వెదకుచు దేశ దేశములఁ ద్రిమ్మరుచు నున్నాఁడనియు, వారు కానిపించువఱకు నింటికి రాఁడనియు నొకవదంతి తెలియవచ్చెను. వాఁడు బ్రతికియున్నంతవఱకు నాకోరిక సఫలము గాదని బాగుగ తెలిసికొని యుండుటచే నేననేకపర్యాయములు కరాళుని చుట్టుపట్ల ప్రదేశముల కనిపి వీనికై వెదకించితిని. కాని, నా ప్రయత్నము లన్నియు విఫలములై పోయెను. కడకు నాయత్నము లన్నియు నీటఁగలసిపోయెను. నేను మహాపాపుఁడ నైతిని. నేను ఋమార్గుఁడను గాను. అయ్యా! రవీంద్రా! ఇది నా చరిత్ర. ఇఁక నీయిష్టమువచ్చినట్లు చేసికొనుము."

అని యిట్లు సోమనాథుఁ డతిధైర్యముతో, నిర్లజ్జతో, నిస్సంశయముగ, నిష్కారుణ్యుఁడై తనజీవితచరిత్ర నంతటిని జెప్పివేసినందులకు వాని కఠినభావమును గాంచి రవీంద్రాదులు కొంతవడి నేమియు మాటాడక ఆశ్చర్యపడి నిలుచుండిరి. వీఁడు సహిత మొకహంతకుఁడు—భయంకరచోరుఁడు. ప్రవాళునివలె వీఁడును నికృష్టధనార్జనకై యవాచ్య పాపకార్యములఁ గావించెను. తానొప్పుకొన్నట్లు సోమనాథుఁడు ఋమార్గుఁడు గాఁడు. సద్యోదండార్హుఁడు. వాఁడు చెప్పుచున్నదాని నాలకించుకొలఁది విఠోభునిహృదయము శోకకోపానల దగ్ధమై పోవుచుండెను. మానవమాత్రులలో నింతటిక్రూరదానవులు జనింతురని యాతనికి నమ్మిక మొదవుచుండలేదు. దురాత్ముఁడు ద్రవ్యాకాంక్షచే తనబంధువుల నంతలేసియు నుమలపాలు చేసెను. ఆహా! ఇది యెట్టి కఠినకర్ముఁడు చేయసాహసించెడు గర్హితాచరణము! ఛీ—ఛీ—సోమనాథుఁడు పాషండుఁడు! కులకళంకుఁడు క్రూరపలాశనుఁడు! దుర్జాతి! విఠోభుఁడు వానిముఖావలోకనముఁ జేయజాలక, పట్టరానికోపముచే "ఓరీ! నిన్ను నా పినతండ్రి యని సంబోధించుటకు

సిగ్గు వొడముచున్నది. నీచేత లెంతదురూహ్యములో యోజించుకొని యింకను హృదయముపగిలి చావకుంటివేల! ఛీ—నీ ముఖదర్శనము మహాపాపహేతువు. నీ గాలిసోకుట మహాభయంకరము ” అని చెప్పుచు సరోజిని నెత్తుకొని యీవలకు వచ్చెను. ఆతని ననుసరించి రామనాథుఁడును వచ్చెను. పిదప రవీంద్రుఁడొకకాగితముపై సోమనాథుఁడు చెప్పిన దానినంతటిని వ్రాసికొని యందు వాని చేవ్రాలుంచుకొనెను.

# ఇరువదియొకటవ ప్రకరణము

ప్ర మో ద ము

రవీంద్రున కిప్పుడు తీరిక లేనంతిపని. అది యేమి! ప్రమదాశ్రువులతోఁ బోరాటము! ఆతఁడు తన జీవితకాలమున నొక్కనాఁటికి నింతటి ప్రమోదమును, శాంతిభావమును, బ్రహ్మానందమును బొంది యుండ లేదు. ఒక్కవారముదినములలో నమానుషములగు కార్యములఁ గావించి, దురూహ్యాకష్టపరంపరలందుఁ దగుల్కొని, యనన్యదుర్లభ సహానసముద్రని స్తరణముంగావించి, కడకు తనహృదయకంటకు లగు దుష్టచతుష్టయమును బట్టి బంధించి సఫలీకృతమనోరథుఁ డయ్యెను. అప్పటి యాతని స్వేచ్ఛానందలహరి యప్రతిహతముగఁ జెలరేగి హృదయభాగమున ఘూర్ణిల్లిపోవుచుండెను. ఆతఁడు తనయానందమును వేయివిధముల రామనాథకుశాలవుల్ప్రోల్కఁ గాన్పించెను. బావనుఁ జెంది నెన్ని యోమాఱు లెత్తి ముద్దాడి నుతించెను. ఆహా! ఆ నిశ్చల ప్రేమ ప్రవాహము—ఆ దుర్నిరోధ సమ్మోద నిర్ఝర ఘాటి—ఆహా! ఆశాంతి నిధానము! అవేద్యము! వర్ణనాతీతము!

ఆ దినము నాలుగుగంటల వేళ న్యాయస్థానమున సోమనాథ, తారసింహ, కరాళులు, తమతమ నేరముల నొప్పుకొనిరి. రవీంద్రుఁడు, అమల జీవితచరిత్రను కోర్టువారి యెదుట చదివి వినిపించెను. కాని ప్రశాంతునివిషయమై యొక్కమాటనైన నాడ లేదు. దుర్జాతి ప్రవాళుని చరిత్ర నాలకించినవారెల్ల మిగుల కటకటఁబడి వానిని దూషించి యనేకవిధములుగ శపించిరి. ఇఁక నమల కెట్టిగౌరవము! ఆమె యుదంత ము

నాలకించి ప్రేక్షకులు కంటఁ దడిపెట్టుకొని. యసురభిళమల్లికాసుమము కాలక్రమమున కంటకలతపైఁ బడి నశించెనని చింతించి, యామె సద్గుణములను భూషించిరి ! ఆమెనివయమున శాంతినాథుఁడు చాలఁ దప్పిగావించెనఁట. తాను కోరినవరున కేల యామె నంటఁగట్టి శాంతినాథుఁడు సుఖింపఁడాయెను. వృద్ధుఁడగునాతఁడు నిశ్చలప్రేమావలంబులహృదయభాగముల సరిగఁ జదువనేరఁడాయెఁగాఁబోలు. ఆతఁడామెయిష్టానుసారముగ జరిగించియుండినఁ దనకిట్టివిపత్తులు సంభవింపక పోయియుండునేమో! సర్కారువారింకేవిధముగను బ్రవాళుని మాటాడింపలేదు. వారు విధింపవలసినమరణశిక్షను రవీంద్రుఁ డాత్మసంరక్షణ వేళయందే విధించి వానియాత్మను పరలోకమునకు గెంటివైచెను. వాఁడు మిగుల సంపన్నుఁ డని మూఢభావమును వహించియుండిన చంద్రనగరవాసులకు నేఁడు సిజస్థితులు తెల్లమైపోయెను. నేఁడు పురివారెల్లరు మహాశ్చర్యనిమగ్నులైపోయిరి. ఆనందలహరియందు కొట్టుకొని పోవుచున్నారు. కేశవపాలుఁ డింకను జీవించి యున్నాఁడఁట. ఆతని సోదరుఁ డగుశాంతినాథుఁడు, ఆతనికుమారుఁ డగువిశాలుఁడు, తమ యూరియందే బంధింపఁబడియుండిరఁట. కృష్ణనగరనివాసు లగు సరోజినీ మోహనచంద్రులనిజవార్త తెలియవచ్చినది. ఆమందభాగ్యులు నేఁడు రవీంద్రరామనాథులమూలమున పూర్వసుఖమును బొందిరి ఎంతటి చిత్రోదంతములు ! పరమాద్భుతములు ! అనంతప్రమోద దాయకములు ! వీనినాలకించి యెవ్వరు సంతసింపరు ! ఎవ్వరు వింతనొందరు ?

అమలకు మరణకారకుఁడు తారసింహుఁడు, సుశీలను జంపినకరాళుఁడు, మోహనచంద్రునిధర్మపత్నిని విషప్రయోగమున సంహరించిన సోమనాథుఁడు, కోర్టువారితీర్పుమూలమున మరణశిక్షకుఁ బాల్పడిరి. దురాత్మకులగు హంతకులకు సాయపడవచ్చినందుల కాఘూర్జరుఁడగు

మండలున కైదువత్సరములు కారాగారవాసము తప్పదయ్యెను. రవీంద్రుఁడీవార్తలను మోహనచంద్రునకు, సరోజినికిఁ దెలిపినపుడు వారు మిగుల దుఃఖించి యేవిధముగనైన సోమనాథుని ప్రాణములతో గాపాడుమని వేడుకొనిరి. మోహనుఁడు తనదుఃఖము ననేకవిధముల వెల్లడించి తనసోదరుని గాపాడుమని రవీంద్రుని హస్తములఁ బట్టుకొని యాక్రందనసూచకముగ మూల్గెను, కాని యందుచే నట్టి ప్రయోజనము లేక పోయినది. ఏలయన, రవీంద్రుఁడు వారిదుఃఖము నాలకించి యించుక కనికరించిన హృదయముతో సోమనాథునకు నతికఠినముగు శిక్ష విధింపఁబడునట్లు చేయవలయునని నిశ్చయించుకొని మరల న్యాయస్థానమును జేరసరి కంతయు చేయిజాఱిపోయి యుండెను. సోమనాథకరాళు లప్పుడే యురితీయఁబడి యుండిరి. తారసింహునకుఁ గూడఁ గొంతకాలమున కదియేశిక్ష విధింపఁబడెను. ఆ దుష్టత్రయ మేకకాలమునఁ దమప్రాణవాయువులఁ బాసి దుర్భరమగు పాపభార మును మోసికొని నరకలోక యాత్రకు వెడలిపోయిరి.

ఈ వార్త నాలకించి సరోజిని తండ్రియొడిలో కూర్చుండి మిగుల దుఃఖించెను. మోహనుఁడు తమ్మునిచావునకై వగచుచున్నను, విఠోబునిదర్శనముచే సుమ్మలికము గొంతవఱ కుపశమించుకొనెను. ఎట్టికంటకులైననేమి—ఎట్టిదురాత్ములైననేమి? వారు మరణానంతరము లోకముచే నంతగ దూషింపఁబడరు, ఇదియేకదా లోకచర్య! వారి పాపాచరణములు మఱవఁబడును. పిదప వారి నందఱు దలఁచి కనికరము నొందువారే.

నాఁటిరాత్రి రవీంద్రుని గృహమునందును, వెలుపలిభాగము నందును మహాకల్లోలము కలుగుచున్నది. జనులసందడి విశేషముగ నుండెను, వారి సంభాషణలగుజగుజలు, కేకలు, చాల దూరమువఱకు

వినఁబడుచుండెను. నేఁటి సభాగోష్ఠి వింత యొకటి జరుగును. చిర కాలమునుండి కారాబద్ధులై ... తలఁపఁబడియున్న కేశవపాల, శాంతిబాధాకారులకు ... త్తమై వారెల్ల నుత్కంఠులై వేచియుండిరి. గృహాంగణమున నొకవిశాలమగు హాలునందు మధ్య భాగమున నొకచిత్రితమగు బల్ల నుంచి దాని కెదురుగ నొకకుర్చీ యుంచఁబడియుండెను. దానికిరుప్రక్కలయందు వరుసగ చిత్రాసనము లుంచఁబడియుండెను. వానియందు ... ప్రతి నానందసాగర రామనాథ విశోభా రామప్రసాద మోహనచంద్రులు, అదితరు లగు నూరిపెద్దలు నలంకరించి యుండిరి. అగ్రాసనాధిపత్యము నా యందతి యిష్టానుసారము రవీంద్రుఁడు స్వీకరించి యుండెను. ప్రేక్షకు లసంఖ్యాకముగ వచ్చి యా సమావేశమున గుమిగూడి కూర్చుండి యుండిరి. వారిసందడి రోదసీగహ్వరమున నిండిపోవుచుండెను. శాంతిస్థాపనకై పాటుపడుచున్న రక్షకభటుల ప్రయత్నములు విఫలములై పోవుచుండెను. సోత్కంఠులై యెల్లరు రవీంద్రుని నోటినుండి వెడలు నొక్కొక్క యక్షరమును దాఁటి పోనివ్వక సావకాశముగ వినుచుండిరి. అతఁ డిట్లు చెప్పఁచుండెను.

"నేను సుమారు ఇరువదివత్సరములనుండి యీ యపరాధపరిశోధ కోద్యోగమునఁ బాటుపడితిని గాని, యీ నేరమునఁ జూపినంత సాహసమును, ఇంత నేఁ బొందఁబడిన్న మాపదలను, ఇంత జటిలవిచిత్రములను, భయంకరసంఘటనములను మఱియెందును జూచి యుండ లేదు. ఇది కేవలము ఘోరనాటక మని చెప్పుట కెంతమాత్రము ననుమానము లేదు. నెలక్రిందట నేను కలకత్తానగరమున గంగానదీ ప్రవాహమునఁ గాంచిన ప్రేతము నాధారముగఁ గొని యీ యభియోగములను విచారణకై చేకొంటిని. అది కేవలము తెలియక యే ప్రక్కకుఁబోయిన దేవుఁ డదృశ్యాభావృత్తిగ దృశ్యుఁడై ముదమును

ఘూర్చెను. ఎలుకను లాగఁబోయిన శ్వానమునకు కప్పకూడ దొరకి నట్లయ్యెను. "ఏకక్రియాద్వ్యర్థకరీ" యను లోకోక్తి నేఁడు నాయెడ సార్థకముగఁ బరిణమించినది. ఈవిధముగఁ గేశవపాలుఁడుగారి విషయమై కష్టించుచుంటి సుందభాగ్యులైనట్టి శాంతినాథాదిదీనులను దరిజేర్పఁ జాలుదు నని యొక్కనాఁటికిని దలఁచియుండ లేదు. వీరివిపత్తులవిషయమై నేనొక్కచోటను వినియుండ లేదు. ఉన్నదున్నట్టుగ నన్నియు వచ్చి నాపాలఁ బడుటచే వానిని సాధించువఱకు నిద్రాహారములఁ గోరనని ప్రతినఁ గొంటిని. అయిన నేకారణమున నేనీరీతి చంద్రనగరునకు రాఁదటస్థించెనో యెవ్వరిమిథ్యామరణవ్యాజమున నీరీతి కష్టపడఁ గలిగితినో, యట్టికారణభూతుఁడగు కేశవపాలుఁ డింకను జీవించియున్నాఁ డని చెప్పుటకు నేనెంతయు నానందమునఁ బొంగిపోవుచున్నాను. ఏడెనిమిది నెలలక్రిందట భరతపురమునఁ బ్రవాశాదులచే తస్కరింపఁబడిన శాంతినాథుఁడు, ఆతనితనయుఁడగువిశాలుఁడు కూడ బ్రతికియున్నారు. వారినిఁక యానందసాగరున కప్పగించి నేధన్యుఁడ నయ్యెద" నని యాతఁ డనుచుండఁగనే సభామధ్యమున జయనినాదములు, మంగళశ్లోకోచ్చారణలు, ఆశీర్వాదములు, కరతాళధ్వనులు చెలరేఁగిపోయెను. చాలసేపటివఱకు నాసందడి యణఁగలేదు. ఈలోపల రవీంద్రపురస్కృతముగఁ గేశవపాల, శాంతినాథవిశాలురు ప్రక్కగదిలోనుండి వచ్చి యాజన సమావేశమధ్యమున నిలుచుండిరి—ఆహా! ఏమనివర్ణింతుము! ఆనంద బాష్పపూరితలోచనములు! ప్రేమాలింగనములు! మూర్ఛావస్థలు! ప్రమదప్రలాపములు! అన్యోన్యకరగ్రహణములు! కృతజ్ఞతావందనములు! నిర్భరానందసల్లాపములు! హరినామస్తుతి!—ఈవిధముగ నొక్కగంటకాలము దాఁటిపోయినది.

# ఇరువదిరెండవ ప్రకరణము

## పరిశిష్టము

రవీంద్రుని కాసమయమున నొకహృదయశల్యము మిగుల బాధింపసాగెను. ఏమన, ప్రశాంతుఁడు తనతో మరణకాలమునఁ జెప్పిన సత్యవార్తను సరిగఁ బ్రపంచమున వెల్లడించుటకు వీలు లేకపోయినది. ఇందుల కాతనివాగ్దత్తమే ప్రబలప్రతిబంధకము. ఇంతటిసాహసకార్యములఁ గావించియు కడకు పత్తేదారులు ముఖ్యాంశములఁ గనుఁగొన నేరకున్నారనునపవాదము తమ్ముఁ బొందునని రవీంద్రరామనాథు లిరువురు చాల చింతించిరి. కాని, కడకా భయంకర మగు ప్రతిజ్ఞ కేశవపాలునిమూలమునఁ దీఱిపోయినది. అతఁ డిట్లు చెప్పెను. "నేను ప్రవాళుని నాత్మమిత్రునిగ నమ్మియుంటిని. వానికి వానివలెనే యణుమాత్రమైనను రూపభేదము లేకయుండు ప్రశాంతుఁ డను స్నేహితుఁడుండెనని మొదట గ్రహింపనైతిని. వారిరువురు దురాత్ములే. ఏవిధముగనో కుట్రలు పన్ని నాసహోదరుని, అతని శిశువులను దెచ్చి బంధించి పిదప నాపని పట్టిరి. నెలదినముల క్రిందట నొకరాత్రి నేను భోజనానంతరము నావిలాసమందిరమునఁ గూర్చుండి యుండగ నచ్చటి కొక సేవకుఁడు లకోటా వైచినయొక యుత్తరమును దెచ్చియిచ్చెను. నేనా వార్తాహరుని నడుగ నది ప్రవాళుఁ డిచ్చినట్లు చెప్పెను. తోడనే దానిని విప్పి చూడ నా కందొక తెల్లకాగితము మాత్రము కాన్పించినది. కాని, యెట్టివ్రాఁతయు గోచరింపలేదు.

దానిని గాంచి నేనత్యంతాశ్చర్యముతో నాచిత్ర మేమని యాసేవకుని బ్రశ్నించితిని. వాఁడు దానిని తనయజమానుఁ డగుప్రవాళుఁడు నాకిమ్మని చెప్పినట్లు తెలిపి, నామిత్రుఁ డేదియో రోగమున చాల బాధ నొందుచున్నాఁడని చెప్పెను. పట్టికాగితమును బంపుటలోఁ బ్రవాళుఁడు పొరపాటుపడి యుండునని యెంచి వానివిషమావస్థ నాలకించి నేను వెంటనే పింఛవిలాప యను వానియింటికి బయలుదేఱితిని. ఆ సమయమున నాగదియొద్ద కావలియుండిన నంబుఁ డను సేవకుని వెంటఁ గొనిపోయితిని. నే నారీతిగ వానియిలు సేరఁగనే లోపలినుండి ప్రవాళుఁడు వచ్చి సంభాషణవశమున దానాకాగితమును పొరపాటునఁ బంపిన ట్లొప్పుకొనెను. నే నందులకు విశ్వసించి యచటనే కొంతసేపు కూర్చుంటిని. అప్పుడు ప్రవాళుని ప్రవర్తన మించుక యనుమానాస్పదముగనే యుండెను. కాని, యింతటియనర్థకములు జరుగునని . నే ననుకొనలేదు. కొంతసేపటి కాకస్మికముగఁ బ్రవాళుఁడు నాకంఠమును బలముగ నొక్కి పట్టుకొనెను. తత్క్షణమే ప్రవాళునిబోలిన ప్రశాంతుఁడు వచ్చి నాకాలుసేతులు గట్టివైచి నోట గుడ్డలఁ గ్రుక్కెను. నేనప్పుడు నిక్కముగ వారియేకాకారములఁ గాంచి మిగుల వెఱఁగుపడితిని. ఆపాపి ప్రశాంతుఁ డెన్నియోతడవులు నాయొద్ద కరుదెంచి తాను ప్రవాళుఁడనని లోకులనుకొనురీతి నటించి విశేషధనమును గొనిపోయెను. ఆనాఁటి రాత్రి వానినిజవృత్తాంతమును విని చాల దిగు లొందితిని. ఇంతలో నంబుఁడు నా యవస్థనుగాంచి భయపడి యల్లరిచేయ యత్నింప నా కృతఘ్నుఁ డగుప్రవాళుఁడు వెంటనే వానిని గత్తితోఁ బొడిచి చంపెను. అప్పుడు వా రేల నన్ను బంధించినది నాకుఁ దెలియలేదు. కాని, క్రమముగ సంగతుల నన్నిటి నొకనాఁడు తారసింహుని మూలమున వింటిని. నే నప్పుడు చేయునది లేక నాయంత్యకాలమునకై

యెదురుచూచుచు దుఃఖించుచు నుండ నంతలో నా పాలిటిభాగ్యదేవత
వోలె నీ రవీంద్రుఁడు వచ్చి నన్నుఁ గనుఁగొని కడ కుద్ధరించెను." అని
చెప్పుచు నాతఁడు సందర్భోచితముగఁ బ్రేమచంద్రుని విషయమును,
తన యుంపుడుకత్తె యగు విలాసిని చరిత్రమును, ఉంగరమును
గుఱించిన వార్తను, ప్రశాంత ప్రవాళుల రూపవిశేషములను విశద
పఱిచెను. ఈ చిత్రముల నన్నిటి నాలకించి యొక్క-రవీంద్రుఁడు తప్ప
తక్కిన వారెల్లఁ గొంతకాలమువఱకు ఆశ్చర్యపాటుచే నిర్విణ్ణులైపోయిరి.

రవీంద్రుని శిరముపై నుండిన ప్రమాణపర్వతభార మవలీలఁగ
దిగిపోయినది. కేశవపాలుని మూలమునఁ దనచిక్కును భగవంతుఁ
డింతసులభముగఁ బాపుననుధైర్య మాతనికిఁ గలిగియుండలేదు. మిగుల
భయపడి యుండెను. కడ కంతయు యదృచ్ఛాప్రవృత్తిగ లోకమునకు
వెల్లడియైపోయెను. ఇఁక పత్తేదారున కావిషయ మగుచింత లేక
పోయినది. కాన, నాతఁడును తోడనే లేచి కేశవపాలుఁడు చెప్పిన
దానినే మరల నొక్క-వక్కాణించి ప్రేమచంద్రుని విషయమును
బాగుగ విశదపఱిచి కడకు గంగాప్రవాహమునందు దొరికిన శవసంశయ
మును పిశదీకరించెను. రవీంద్రుఁ డీవిషయముల నెప్పుడు తెలిసికొనెనో
రామనాథున కెప్పుడు తెలిసిపోయినది. అంతవఱ కాతఁడుకూడ తక్కిన
వారివోలె విశేషముగ విస్మయములపాలై యుండెను. ప్రేక్షకు లెల్ల
నీ యుదంతము నంతటి నాలకించి ప్రమోదాశ్చర్యచకితులై పోయిరి.

ఇఁక మా కలము విశ్రాంతిని గోరుచున్నది. తక్కిన యంశము
లను స్థాలీపులాకన్యాయముగ విశదీకరించి శాంతితో నిద్రించునఁట.
దానికోర్కెను మేమేల తీర్పరాదు.

అంతయు ముగిసినది. రవీంద్రరామనాథుల కీర్తి చంద్రనగర
భరతపురము లననేల—చాలదూరమువఱకుఁ బూర్వముకన్న ద్విగుణిత

మగు సంస్తుతిపాత్రముగఁ బ్రాఁకిపోయినది. భరతపురమున కాం
నాథుఁడు భార్యను బంధుమిత్రులను గాంచి పరమానందభరిత
డయ్యెను. శ్యామల తనప్రియుని దర్శనలాభమునఁ దనయుమ్మలికము
మఱచి, సుశీలకై యిఁక దుఃఖింపక విశాలునిఁ గాంచి సుఖము
గాలమును గడప నారంభించెను. కేశవపాలుఁ డల్లునితోను, తన
తోను, తక్కిన బంధువులతోను అనుపమానంద ప్రవాహమునఁ
రెండుమూఁడుదినములు ప్రపంచమును మఱచిపోయెను. మన యద్వితీయ
ప్రతిభాపూర్ణులగు పత్తేదారుల కుభయపక్షములవారు నిచ్చి
గౌరవము, కానుకలు అపారములు—విలేఖనాతీతములు!

సరోజిని రామనాథుని మఱవలేదు. ఆమె ముఖచంద్రుని జూడకుండ రామనాథుఁ డొక్కనిముసమైనఁ గాలమును గడపుట లేను. వారి కున్న ప్రేమ క్రమక్రమముగ నందఱికిఁ దెలిసిపోయెను. విశోభా రామప్రసాద మోహనచందు లందుల కపారమునము నొందిరి. ఇదియుఁ గాక, సరోజిని ప్రాణసంరక్షణార్థము పాటుపడినవాఁడు రామనాథుఁడు కాని రవీంద్రుఁడు కాఁడు. ఇఁక నట్టివాని నెట్లు గౌరవింప వలయును? సభారంగమున నిలుచుండి రామప్రసాదు పత్తేదారులయెడఁ దమకృతజ్ఞతను వెల్లడించుచు పారితోషిక పూర్వకముగఁ దన సోదరి యగు సరోజినీదేవిని రామనాథుని కర్ధాంగిగా నొసంగెను. రామనాథున కింకేమి కావలయును—ప్రపంచపట్టాభిషేక మబ్బినట్లయ్యెను.

ద్వితీయభాగము—సంపూర్ణము.

శ్రీ రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి.—1956